# తిరుపతి వేంకటకవుల
# కావ్య సమీక్ష

రచన :
జి. వి. సుబ్రహ్మణ్యం

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
షష్టిపూర్తి ప్రచురణలు
హైదరాబాదు - 500 044

# TIRUPATI VENKATAKAVULA KAVYA SAMEEKSHA

(A critical appreciation of the literary works of Tirupati Venkata Kavulu) by

**G.V. Subrahmanyam,** Professor of Telugu
University of Hyderabad, Hyderabad.

A Shashtipurti Publication.





First Edition : December 1995.
Copies : 1000

**Price : Rs. 100**

Cover Design : **Sri Seela Veerraju**




Copies Available with :

1. Convenor,
   Prof. **G. V. Subrahmanyam Shashtipurti Publications.**
   Srivani 1-8-702/105, Nallakunta,
   Hyderabad - 500 044. Phone : [illegible]

2. **Visalandhra Book House,**
   4-1-435 Vigyana Bhavan, Bank Street.
   Hyderabad - 500 001, and other Branches.

3. **Navodaya Book Sellers,**
   in Front of Arya Samaj, Kothi, Hyderabad.

Printed at :

**Padmavathi Art Printers,**
1-1-517/B/1, New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380; Phone : 7611413.

Cover Page Printed at :

**Vipla Printers Private Limited,**
Near Shankar Math, Nallakunta,
Hyderabad . 500 044. Phones : 636242; 667476.

కవితాకల్పక కావ్యకళా స్రష్ట

ఉండేల విజ్ఞాన కళా పీఠం మేనేజింగ్ ట్రస్టీ

చైతన్య భారతి సాంకేతిక విద్యా సంస్థ కార్యదర్శి

మెడి సిటి మేనేజింగ్ డైరెక్టరు

స్నేహ రస సింధువు, సాహిత్య బంధువు

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారికి

వారి సతీమణి

శ్రీమతి ఉండేల సరస్వతిగారికి

సగౌరవంగా

అంకితం

కృతి స్వీకర్తలు



డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు

శ్రీమతి ఉండేల సరస్వతిగారు

# కృతి సమర్పణము

ఒక సౌహార్దము మూర్తి గొన్న యటులై, యుత్సాహ చైతన్య దీ
పక మైనట్టివి తేజ మొక్కఁడు భువిన్ సంపన్నమై పొల్చి, భా
వుక సత్కావ్యకళా ప్రపంచమునఁ దావుల్ నింపఁగాఁ బుట్టె క
ల్పక భూజమ్ము తెలుంగు బిడ్డయయి నిల్వన్ మాలకొండాఖ్యమై.

దొడ్డ గుణముల కీర్తికి రెడ్డి యయ్యెఁ
ఇంజనీరయి వృత్తికే రంజు నేర్పె
విద్యలందున కళలందు వేత్త యతఁడు
కవిత కీనాఁడు - అభినవ కల్పకంబు.

నీతి మూలము, శీలము నిడివి బోదె
విద్య శాఖలు, వైద్యము విరుల సిరుఃలు
మానవతమీది మమతవే మధురఫలము
అహహ! నీ పెర్మి నందనవనము! నిజము!

పుట్టిన తోటకు తావులు
దిట్టుగ వెదజల్లు పూల బిత్తరి వోలెన్
నెట్టిన తెలుగున కవితలు
గుట్టుగ గుప్పించు మాలకొండారెడ్డీ!

పాలబుగ్గలనాడె పద్యాల చరణాలు
పాటలై నీ నోట పరిమళించె
కందుక క్రీడలో కదలాడు బెందు నీ
చేతిలో ప్రాసల చిత్ర మెఱిగె
లెక్కల గుణియించు లేత వయస్సులో
యతి మైత్రి గణతంత్ర గీతిపాడె
శతకాలు చదివెడి సాధన దశలలో
ఆపపు నీ వాక్కు నంచగించె
నీవు కవితకు బిడ్డవై నెగడినావొ
కవిత నెచ్చెలిగా నిన్ను గాంచె నేమొ
అతుల చతురార్థ వాక్య విన్యాస కళ కు
ధార కవితకు నవ్య పితామహుఁడవు.

కలము పట్టిననాడె కవికోకిలలు నిన్ను
వాసంతశోభకు వారసుఁడనె;
గళము విప్పిననాడె కవిలోక సమ్రాట్టు
పద్యవిద్యకు స్వర్ణపతక మిచ్చె
చదువ నేర్చిననాడె సహజకవి గానంబు
మల్లెమాలల నల్లి మనసు నిచ్చె
నడక సాగిననాడె న్యాయాధిపతులు నీ
నేర్పులఁ జర్చించి తీర్పు నిడిరి

ఒక్క 'నేతాజి' చాలు నీ వాక్కు నెన్న
'కాంతిచక్రాలు' నీ కళాక్రాంతి పథము
'మొగలిరేకులు' కవితకు సొగసునగలు
'ఒడిసెరాళ్ళ'వి రసికత గడుసుహాయులు.

ఆనందంబున పాడుకొందురు మహాంధ్రౌన్నత్య గర్వంబుతో
సానందాశ్రుకణాలు రాల కనులన్ సాహిత్యరాగాత్ము, లే
కోసం గాంచిన నీదు పద్యరచనాగోష్ఠుల్, వినన్ నీ 'వివే
కానందా'ఖ్య రసాఢ్యరమ్యకృతి ఆరాధ్యంబ ఆంధ్రాళికిన్.

శ్రవణానందము నిచ్చు తెల్గు కవితల్ సమ్మోదమందించు మీ
నవరమ్యార్థ రసార్ద్ర భవ్యరచనా నైసర్గిక ప్రౌఢికిన్
ఇవిగో గైకొను మాంధ్ర నవ్యయుగ పద్యేందీవర శ్రేణులన్
కవలౌ తిర్పతి వేంకటేశ్వరుల సత్కావ్యంపు వైభోగముల్

కవిని కాను నేను కవితలో కావ్యమ్ము
లల్లలేను సుధలు చల్లలేను
స్నేహ మొకటియున్న చెల్లు నీధరలోన
అమృతమైన నెందు అటుకులైన.

నన్ను చూచిన, నా పేరు విన్న, మీకు
కారణములేని స్నేహమ్ము కంపళించు
దాని నక్షరరూపాన తలఁచికొనుచు
నిచ్చుచున్నాడ నీ కృతి పుచ్చుకొనుఁడు!

# కృతిస్వీకారము

1. ఆంధ్ర వాణికి శ్రవణానందముగ తమ
   గళము విప్పిన యుగ కవులు వారు
   ధారలో, అసమాన ధారణలో మహా
   ప్రజ్ఞ చూపిన కవీశ్వరులు వారు
   సుకవిత్వమధుపు ఆశుకవిత్వ పాత్రలో
   నింపగల్గిన కళానిధులు వారు
   సంస్కృతాంధ్ర కవిత్వ సమరాన, జోడుగు
   ర్రాలు పూన్చిన మనోరథులు వారు
   తమ అనన్య సామాన్య వధానపటిమ
   సకల దిశల మ్రోగించిన చతుర కవులు
   వారి చరితమ్ము నవ్యాంధ్ర వాఙ్మయమున
   స్వర్ణఘట్టమై భాసిలు శాశ్వతముగ.

2. అట్టి చరితమ్ము వ్రాసి, నా కంకితముగ
   ఈయబూనితి వియ్యది నా యదృష్ట
   మనుచు భావించి, ప్రీతితో నందుకొందు
   పుణ్య జీ. వి. సుబ్రహ్మణ్య బుధవరేణ్య!

3. సద్విమర్శయందు సదసద్వివేచన
   శక్తియందు నీకు సాటి లేదు
   సఫల మగుత మనదు సాహితీ బాంధవ్య
   మాంధ్ర రసికలోక మభినుతింప!

డా॥ ఉండేల మాలకొండారెడ్డి
కృతిస్వీకర్త.

29-12-1995

# మేలిమాట

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారు
ప్రధాన కార్యదర్శి
సిద్ధార్థ కళాపీఠము
విజయవాడ - 10

1961 వ సంవత్సరము డిసెంబరు నెలలో "భారతి" సంపాదకులు శివలెంక శంభుప్రసాదుగారు తాను వ్రాసిన లేఖతోపాటు "వీరరసము" అను గ్రంథమును బంపి సమీక్షచేయుడని కోరిరి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ బహుమానము పొందిన ఆ గ్రంథమును జి.వి. సుబ్రహ్మణ్యముగారు రచించిరి. వారు వీరరస తత్త్వమును కూలంకషముగా దర్శించిన ఆ గ్రంథము నన్ను ఆనందింపజేసెను. వారి సాహిత్య శాస్త్ర పాండిత్యము, సహేతుకమయిన చర్చలు దానిలో మిన్నులు దాకినవి. ఆనాటికి నేను జి.వి. సుబ్రహ్మణ్యముగారి పేరు వినియుండలేదు. వారితో పరిచయములేదని వేటే చెప్పనక్కఱలేదు. నా సమీక్ష 1962 వ సంవత్సరము ఫిబ్రవరి నెల "భారతి"లో అచ్చునకెక్కినది. దానిని జదివి మెచ్చుకొని జి.వి. సుబ్రహ్మణ్యముగారు నా కొక లేఖ వ్రాసిరి. ఈ ఘట్టము వారితోడి సాహితీ బాంధవ్యమునకు ప్రథమకారణ మయినది. ఐనను మొన్నమొన్నటి దాక వారుగాని నేనుగాని యొకరినొకరు చూచినవారము గాము.

జి.వి. సుబ్రహ్మణ్యముగారు ప్రథమాంధ్ర మహాపురాణమయిన మార్కండేయ పురాణమును గూర్చి సిద్ధాంత ప్రబంధము రచించి, పిహెచ్.డి పట్టము పొంది ప్రకటించిరి. పరిశోధన మెట్లు చేయవలయునో దానిని జదివినవారు తప్పక గ్రహింపగలరు. కాలము గడచిన కొలది ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యముగారు విలువ గలిగిన విమర్శ గ్రంథములను వెల్లడించిరి. కేంద్ర సాహిత్య అకాదమీ పురస్కారమును ఇతర సమ్మానములను పొందిరి. సాహిత్య సమీక్షా స్వరూపములయిన వ్యాససంపుటములకు సంపాదకులయిరి.ఆంధ్ర దినపత్రికలలో పుంఖానుపుంఖముగా సాహిత్య వ్యాసములు ప్రచురించిరి. గ్రంథపరిష్కరణము

గావించిరి. నవ్య విమర్శ సంప్రదాయ ప్రవర్తకులలో మున్ముందట నెన్నదగిన వారయిరి.

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారి విమర్శలో వారి విశేషమయిన అధ్యయనబలము, వివేచన శక్తి విశ్వరూపముతో గోచరింపును. అరటిపండు వొలిచి చేతిలో బెట్టినరీతిగా వారు సాహిత్య వ్యాసములు రచింపగలరు. సాహిత్య ప్రసంగములు చేయగలరు. భారతీయ సాహిత్య శాస్త్రమును లోతుగా చదివి అంతటితో వారు తృప్తిపొందలేదు. పాశ్చాత్య సాహిత్యశాస్త్ర సిద్ధాంతములను జీర్ణము చేసికొనిరి. భారతీయుల పాశ్చాత్యుల అలంకార శాస్త్రముల భేదాభేదము లను గుర్తించిరి. ఈ కారణములవలన వారి విమర్శ బాధ్యతతోకూడి పరిపుష్ట ముగా రూపొందును.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యముగారు సంఘమునకు సాహిత్యమునకు గల నిరంతర సంబంధమును గుర్తించిన మనీషి. సాహిత్యమును లోచూపుతో పరిశీ లించి పరిణామమును పసిగట్టగల ప్రౌఢుడు. శాస్త్రము, అనుభూతి యీ రెంటింటి సమ్యక్సమ్మేళనము గావింపగల దిట్ట. అనుభూతిని అణచివయిచి, కేవలము శాస్త్రమును సార్వభౌమముగా సమాదరించుట గాని అనుభూతి పేర అనుచిత మయిన అవిచారరమణీయమయిన ఆలాపములు చేయుట గాని వారి వ్రాతలలో కనబడవు. వానియందు సమన్వయ పద్ధతి ప్రధానము.

ఈ శతాబ్దిలో ఆంధ్రసాహిత్య ప్రపంచమున విమర్శ వివిధ ప్రకారముల విస్తరిల్లినది. సాహిత్య ప్రక్రియలను అలంకారశాస్త్రకారుల చూపుతో చూచినవా రున్నారు. పాశ్చాత్య సాహిత్య దర్శనమువలన అలంకారశాస్త్ర సిద్ధాంతములను త్రోసిరాజని అనుభూతిని-వీరు కావ్యమునకు రసము ఆత్మ అని అంగీకరింతురు- ప్రామాణికముగా భావించినవారున్నారు. వీరి పల్లవిని అందుకొని అలంకారశాస్త్ర మెట్టిదో తెలియక, తెలిసికొనుటకు ఓర్పు, నేర్పు చాలక పాచిపట్టినదాక అప స్వరములు పాడినవారున్నారు. ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యశాస్త్ర సిద్ధాంతము లను సమన్వయించినవా రున్నారు. విమర్శ వ్యాఖ్యాతృమేధాశక్తి ననుసరించి యుండునని విపరీతపు వెఱ్ఱివెఱ్ఱి అర్థములు లాగినతెగవా రున్నారు. ఇక సామా జిక శాస్త్రములను, రాజకీయార్థిక సిద్ధాంతములను ప్రపత్తితో భజించి సాహిత్య మీమాంసకు లయినవా రున్నారు. వీరికి భారతీయ సంస్కృతి, ప్రాచీన సాహిత్య

ముళ్ళు వెగటుపుట్టించగా విమర్శన శస్త్రాస్త్రములు ధరించి మూలచ్ఛేదనము చేయుటకు కంకణము కట్టుకొన్నారు. దేశస్థితినిబట్టి సాహిత్యతత్త్వమును సంహరించి తత్స్థానమున కల్పితములను నిలిపి కవితా సిద్ధాంతములను టముకు వేయువారున్నారు. పరిచయ ప్రాబల్యమువలన అయినవారిని అందలమెక్కించి కానివారిని కాలదన్నినవారు నున్నారు.

నాకు తెలిసినంతవరకు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారు పైవారి పోకడలు పోలేదు. సాహిత్య ప్రక్రియకు సంబంధించిన సమయమును గుర్తించి దాని అంతస్తత్త్వమును వశము చేసికొని, సహేతుకముగా దాని లక్షణములను, గుణాగుణములను జల్లెడపట్టుటయే వారి విమర్శన విధానమని నేననుకొను చున్నాను. వారు ప్రాచీన కావ్యములను గూర్చి నవీన కావ్యములను గూర్చి వ్రాసిన విమర్శలు శ్రద్ధగా చదివినవారికి నా మాటలలోని నిజము తెలియును. అంతమాత్రమున వారు చేసిన తీర్పులు నూటికి నూఱుపాళ్లు అంగీకారయోగ్యములని అతిశయోక్తులు పలుకను. లోకములో విభిన్న మనస్తత్త్వములు గలిగిన మానవుల నందఱను అంగీకరింపజేయగల దివ్యజ్ఞాని యింతవఱకు జనింపలేదు. ధ్వని సిద్ధాంతమును "ఇంత లింతలు తునియ"లుగా చేసిన, కాళిదాసు కవిత్వమునకే వంకలు దిద్దిన ప్రాచీనాలంకారికు లుండుట అందఱకు తెలిసిన మాటయే. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారి విమర్శ విధానము ప్రశంసింపదగినదని నా యభిప్రాయము.

ఆ విధానము పండవాఱిన యనుభవమునుండి ఆవిర్భవించినదిగాదు. మఱి అజానజముగా అబ్బినట్టిది. అబ్బినట్టిదని ఈ నాలుగు వందల పుటల "తిరుపతి వేంకటకవుల కావ్యసమీక్ష" తార్కాణించు చున్నది. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారు 1957 వ సం॥లో యం. ఏ. పట్టము పొంది మూడేండ్లు అధ్యాపక వృత్తి నవలంబించిరి. ఈ సమీక్షా గ్రంథమును 1962 వ సంవత్సరములో రచించి యిప్పటివఱకు దాని నొకమూల బడవైచిరి. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యముగారి విమర్శ ప్రస్థానము ప్రారంభమయిన రోజులలో "తిరుపతి వేంకట కవుల కావ్య సమీక్ష" రచితమయిన దన్నమాట మనము మఱచిపోరాదు. మొగ్గ పూర్తిగా విచ్చి పిదప నెత్తావులు విరజిమ్ముట సహజము.

తిరుపతి వేంకట కవులుగా పేరు పొందిన దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తెలుగు కవిత్వము తేజస్సు గోల్పోయిన సమయమున ఆంధ్ర సాహిత్య ప్రపంచమున అవతరించిరి. ఆంధ్రదేశములో సాంస్కృతిక పునరుజ్జీవనము మొదలయిన దినములవి. ఆంగ్లభాష మీది క్రొత్త వలపుతో విద్యావంతులయిన తెలుగువారు తెలుగు పేరెత్తిన పెదవి విఱుచుచుండిరి. ఇక సంస్కృత పండితులు తరతరములనుండి కొనసాగుచున్న మైల పాటించుచుండిరి. ఈ దౌర్భాగ్య దశలో తిరుపతి వేంకట కవులు తెలుగు కోపు వేసికొని అవధానములు చేసి, వివిధ కావ్యములు రచించి, వివాదములలో జగజెట్టులై-పట్టనములవారిని, పల్లెపట్టులవారిని పండితులను పామరులను తెలుగు కవిత్వమును వదలి బ్రదుకలేమనునంత దూరము తీసికొనివెళ్ళిరి. అర్థము, భావము, భాష అను మూడింటిలో అపూర్వమయిన మార్పులు కొనితెచ్చిరి. కావుననే "....ఈ మహాకవుల వాక్కు ప్రాచీన సరణికి భరతవాక్యము, నవీన సరణికి నాందీవాక్యము...." అయినదని మొట్టమొదటిసారి పింగళి లక్ష్మీకాంతం గారు పేర్కొనిరి. మఱియు తిరుపతి వేంకటకవులు "అర్వాచీనాంధ్రకవి ప్రపంచ నిర్మాత"లను మాట కాదనలేము.

ఇట్టి కవి పీఠముల సకల కావ్యసమీక్షకు జి. వి. సుబ్రహ్మణ్యముగారు ముప్పదిమూడేండ్ల క్రిందట పూనుకొనిరి. సమీక్ష యను తత్సమపదమునకు పరిశోధన, అవగాహన, విమర్శ, సారభూతమయిన సిద్ధాంతము అనునవి యర్థములు. సర్వతోముఖముగా సాగిన "తిరుపతి వేంకటకవుల కావ్యసమీక్ష" పట్ల ఈ యర్థములన్నియు చెల్లును.

ఈ గ్రంథమున ఎనిమిది అధ్యాయములు గలవు. 1977వ సంవత్సరములో "యువభారతి" ప్రచురించిన స్వకీయ సుదీర్ఘ వ్యాసమును ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారు అనుబంధముగా చేర్చిరి. తిరుపతి వేంకటకవులు బహుముఖీనముగా సాహితీ వ్యాసంగమును గావించిరి. అది కొన్ని వేల పుటల మిట్టమునకు చేరినట్టిది. ఈ "కింకవీంద్ర ఘటాపంచానను"లు స్వతంత్ర కావ్యములు, వివాద గ్రంథములు, అనువాదములు, అవధాన నానా రాజ సందర్శన గ్రంథములు రచించిరి. అపూర్వ సాహిత్య ప్రక్రియలు సృష్టించిరి. జి.వి. సుబ్రహ్మణ్యము గారు ప్రాధాన్యమును బట్టి ఈ మహా సాహిత్యమును సమీక్షించిరి. స్వతంత్ర కావ్యములు, స్వతంత్ర రూపకములు. అను వాని సమీక్ష నాలుగు వందల పుటలలో. రెండు వందల యిరువది యెనిమిది పుటల పరిధికి సాగినది.

ఆశుకవిత్వము సమీక్ష ముప్పది రెండు పుటలు. అధిక్షేప కావ్యముల సమీక్ష యిరువదారు పుటలు. వచన రచనలు, అనువాదములు అనువాని సమీక్ష డెబ్బది నాలుగు పుటలు. చిత్రబంధ ప్రక్రమము సమీక్ష విపులము. ఉపసంహారము నాలుగు పుటలు. అనుబంధము ముప్పదారు పుటలు. ప్రతి ప్రక్రియను వస్తు రచనా తత్త్వములననుసరించి వివిధ విభాగములుగా విభజించి జి.వి. సుబ్రహ్మణ్యము గారు తనకే కాక సహృదయులకు సైతము విమర్శ మార్గమును సుగమము గావించిరి.

"తిరుపతి వేంకట కవులు నవ్యాంధ్ర కవితా పితామహులు" (పుట 70) అనియు, "ప్రాతపునాదులపై క్రొత్త భవనము కట్టిన రీజంటకవులు" (పుట 14) అనియు, "ఇట్లు స్వాతంత్ర్యము ప్రకటించియు దేశీయ భాషా మర్యాదకు విరోధములైన ప్రయోగములను గాని, ఎరువు సొమ్ముల వంటి భావములను గాని, తెలుగు వారి ప్రవృత్తికి పొందని కవిత్వ ప్రక్రియలను గాని వారు సమర్థింపలేదు. అనగా తాత్కాలికావేశముతో ప్రాతను విడిచి త్రొక్కి ముందు కనాలోచితముగా దూసుకొనిపోయినవారు కారనియు, శాస్త్రసమ్మతములును, ఔచితీ సహితములును, విశ్వశ్రేయోరూపములును, సమకాలీన సాంఘికావసరానుగుణములు నైన నవ్యమార్గములనే వీ రనుసరించి రనియు, ఒక సాహిత్య పరిణామ విప్లవమునకు వీరు మూలకారకులై రనియు ఈ చర్చవలన తాత్పర్యము" (పుట 16) అనియు, "ప్రాచీన ఆశుకవులుండిరి కాని తి. వేం. కవుల వలె జాతినంతయు కవిత్వావేశములో నుఱ్ఱూతలూగించి కళామయ మొనర్చిన కవులు 'నభూతో నభవిష్యతి' (పుట 231) అనియు, "కవితకు ప్రజాశక్తిని గల్పించిన కళ వీరి యవధానవిద్య" (పుట 233) అనియు జి.వి. సుబ్రహ్మణ్యము గారి అభిప్రాయము. వారి యీ నిర్ణయములు తిరుగులేనివి.

తిరుపతి వెంకటకవుల కవిత్వము ప్రాచీన కవితకు భరతవాక్యము, నవీన కవితకు నాందీ వాక్య మంచురు గదా! దీని తాత్పర్యము వివరించిన వారిని నే నెఱుగను. ఆ పనికి జి. వి. సుబ్రహ్మణ్యము గారు చేయివైచిరి. భరత వాక్యము, నాందీవాక్యము నొకటి కావు గదా? యను ప్రశ్నము వేసికొని, ఆ అభిప్రాయ మర్మమును గూర్చి చర్చ చేసి, వారు "ఈ జంటకవుల కవిత్వమునందు ప్రాచీన ప్రసిద్ధ కవిత్వ మర్యాద లన్నియు నొక విశిష్ట సమన్వయము పొంది, యిం దొదిగి నిలిచిన వనియు, భావికాలకవితామర్యాదలు ఇందు బీజప్రాయముగా నాటబడియుండి నవ్యంగప్రారంభమును సూచించుచున్న వనియు తాత్పర్యము కావలె"నని (పుట: 361) నిర్ణయించిరి. ఈ నిర్ణయమున

కనుగుణముగా భావకవిత "అంతరాకృతు లన్నియు తి. వేం. కవుల విశిష్ట కవిత్వ ప్రసాద వ్యక్తిత్వము నందగించుకొని అవతరించినవే" (పుట 363) అని చెప్పిరి.

జి. వి. సుబ్రహ్మణ్యముగారు కావ్యతత్త్వమును, కావ్యసౌందర్యమును వివేచించి వివరింపగల నేర్పరి. ఉదాహరణముగా వారు వింగడించి వివరించిన శ్రవణానంద శిల్పమును (33-44) గుర్తించిన "అనంత గాథ మనస్తత్వ శాస్త్ర విభాగ వైశారద్యము మూలసూత్రముగా కల్గిన" "పాణి గృహీత" తత్త్వమును పేర్కొనవచ్చును. ఈ కావ్యము "మనస్తత్త్వ ప్రధాన రూపకము" అని వారు నిగ్గుతేల్చిరి. లక్షణాపరిణామమునందలి "రమ్మనుమీ!" మొదలయిన పద్యముల వ్యాఖ్యానము (పుట. 57) మనోహరము. తిరుపతి వేంకట కవుల రూపకముల మీమాంస యంతయు చక్కగా చిక్కగా సాగినది, బుద్ధచరిత్రమందలి యను వాద విధానమును వారు సమ్యగ్దృష్టితో సమీక్షించిరి.

ఈ గ్రంథములో జి.వి. సుబ్రహ్మణ్యముగారు కేవలము గుణములనేకాక దోషములనుసైతము నిష్పక్షపాతముగా వెల్లడించిరి. ఈతీరు గ్రంథగౌరవమును పెంచెను. "ఎవ్వర్ధ పట్టాభిషేకము"లో సార్వకాలీనత లుప్తమయినదనియు (పుట. 198) "ప్రభావతీ ప్రద్యుమ్నము"లోని విదూషక పాత్ర స్వల్ప ప్రయోజనమును సాధించుటమేకాకుండ శుచిముఖి పాత్రను రాణింపకుండజేసినదనియు (పుట. 212) వారు స్పష్టముగా చెప్పిరి. అదేవిధముగా ఎడ్విన్ ఆర్నాల్డ్ రచించిన "లైట్ ఆఫ్ ఏషియా" కావ్యమునందలి "భావౌన్నత్యము, అలంకార శోభ, శిల్ప విన్యాసము, రమణీయ దర్శనము, రసావేశము తెలుగు కావ్యమున" ఏ విధముగా అదృశ్యములయినవో (పుట 352), మాతృకయందలి రసవత్తర ఘట్టము ఎట్లు "తెలుగున నిస్సారమయిన యొక పద్యమై నిలిచిన"దో వారు ఉపపత్తి పూర్వకముగా నిరూపించిరి. ఈ విధముగా ఎన్నో యుదాహరణములను వారి సమచిత్తము చాటువానిని చూపవచ్చును.

మరుగునబడిన తన రచనము వెలికితీసి వెల్లడించిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యముగారు తెలుగుజాతి మరచిపోయిన తిరుపతి వేంకట కవుల కావ్యముల విశేషములను మరొకసారి గుర్తునకు తెచ్చి సహృదయుల కృతజ్ఞతకు పాత్రులయిరి. సాహిత్య జగత్తులో విమర్శకమౌళిగా విశిష్ట విఖ్యాతి గడించిన వారి రచనమును పరిచయము చేయుటకు కష్టపడనక్కరలేదు. కావున నేను 'మేలి మాట' పలికితినేకాని అర్హతయుండిగాదు. నా కర్హత లంటగట్టిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యముగారికి గిడిగిన్నెవెట్టుట నా విధి.

# నివేదనము

తెలుఁగు వారికి దైవముగా తిరుపతి వేంకటేశ్వరుఁ డెంతో - కవులుగా తిరుపతి వేంకటకవు లంత! ఒకరికి భక్తిపుష్పమంజరులను, మఱియొకరికి కవితాప్రసూనాంజలులను వారు సతతము సమర్పించుచున్నారు.

ఇరువదవ శతాబ్ద్యుత్తరార్ధములోఁగూడ తెలుఁగు పద్యము లాతిఛంద స్సుల కన్న హెచ్చు గౌరవము పొందుచున్నదనఁగా నది తిరుపతి వేంకట కవుల ప్రసాదమే. వీరి కవిత్వ ప్రసాద గుణమే నాఁటికిని, నేటికిని తెలుఁగు కవులకు జీవనాదమై, జీవనది వలె కవితాక్షేత్రమున ప్రవహించుచున్నది. అందువలన కవులకు, సాహిత్య విద్యార్థులకు ఈ జంటకవులు నిత్యవందనీయు లగుచున్నారు.

తిరుపతి వేంకటకవుల శిష్యులు దేశ మంతటను ఉన్నారు. వారిలోఁ జాలమందికి గొప్ప ప్రసిద్ధి కూడ వచ్చినది. వారి కార్యము తలపెట్టి చేయుట యొక యెత్తు. సమకాలీనుల అభిప్రాయములు తి. వేం. కవుల సాన్నిహిత్యము వలనఁ గలిగిన అనుభవ విశేషములచే సారవంతములుగా నుండుననుటలో విప్రతిపత్తి లేదు. కాని, సమకాలీనులతోపాటు భావితరముల వారికిఁ గూడ ఉత్తేజము గల్పించుచున్న వీరి కవిత్వశ్రీ వృద్ధులతోపాటు యువకులను ఊరకఁ గూర్చుండనిచ్చుట లేదు. అట్లయినప్పుడు, ఎవరి భక్తి వారిదిగా ఈ మహా కవులను కీర్తించుట జరుగుచున్నది! వీరితోఁ బ్రత్యక్ష పరిచయము లేని మావంటివారిచే వీరి సాహిత్యమూర్తులే ఉపాస్యమానములగుచున్నవి. కావున మా వన్నియు శక్తిచాలని భక్తి వచనములు!

నేడు భారతీయ భాషలలోని సాహిత్య ప్రక్రియ లన్నిటియందును అధిక పంక్తిపావనమును చూరగొనుచున్నది విమర్శన ప్రక్రియ. శాస్త్ర విజ్ఞాన మనుదినము శరవేగముతో పురోగమించుచున్న నేటి ప్రపంచ పరిస్థితులలో పాశ్చాత్య భాషలు ఈ శాఖకు ఎన్నడో పట్టాభిషేక మొనర్చియున్నవి. కాఁగా

మన దేశములో కూడ హిందీ వంటి ప్రాంతీయ భాషలలో ప్రాచీన కవులనుండి అత్యంత నవీన కవి వఱకు వెలసిన సాహిత్యముపై సమీక్షాగ్రంథములు కుప్పలు తిప్పలుగా వెలువడుచున్నవి. ఆంధ్రములో నింకను అంత చైతన్యము కలుగలేదు. ఇది నిజముగా విచారింపదగిన విషయము. దానికి ముఖ్యకారణము ప్రస్తుతము ఆంధ్రదేశములో నధికముగా నున్న విమర్శన పద్ధతియే అని నా తలంపు. దోషజ్ఞులే కాక గుణజ్ఞులునయి, వైయక్తిక స్పర్ధలను, కులాచార భేదాలను, అసూయాదులను వదలికొని నిర్మల సహృదయ తత్త్వము వెలయునట్లు నిష్పాక్షిక సాహిత్య విమర్శన చేయువారు దేశమున తరుగైనారు. విమర్శకుని పక్షపాతము మీఁద తెలుఁగు సాహిత్య విమర్శనము యొక్క చావు బ్రతుకులు ఆధారపడియున్న గడ్డు పరిస్థితులలో దేశము చాల రోజుల నుండి బ్రతుకీడ్చుచున్నది. ఒక విధముగా తిరుపతి వేంకటకవుల జీవిత కాలములోనే విమర్శలో వ్యక్తిగతములైన దూషణ భూషణలు ప్రవేశించి ఆ కళకు కొంత కళంక మాపాదించినవి. ఈ జంటకవులు విమర్శనమును సన్మార్గమునఁ బెట్టుటకొఱకై సాహిత్యోపాసకులను ప్రబోధించి తమ సాయశక్తుల ప్రయత్నించిరి. కాని, ఆ కళంకము పూర్తిగా క్షాళితము కాలేదు. ఒక జాడ్యముగా సాహిత్య జగత్తు నది పట్టి బాధించుచునే వచ్చినది. తెలుఁగువారు ఈ సత్యము నిప్పుడిప్పుడే గుర్తించి క్రొత్త పోకడలతో నిష్పాక్షికమైన విమర్శన వాఙ్మయమును తెలుఁగున వెలయింప నుపక్రమించుచున్నారు. ఆంధ్ర దేశములోని విశ్వవిద్యాలయములు, ఆంధ్ర సాహిత్య సంస్థలు, ఉన్నత సాహిత్య వ్యవస్థలు, పోషికమైన విమర్శలపైని యేవగింపుతో తటస్థులైయున్న మహాకవులు, పండితులు - ప్రాచ్యపాశ్చాత్య పద్ధతుల మేలికలయికతో సాహిత్యవిమర్శ చేయుచు, యువకుల ప్రసరించు నవ్యాలోకమును తమ దివ్యాలోకముతో నాశీర్వదించి, ప్రోత్సహించుచున్నారు. వీరెల్లరు నేఁడు లక్షించుచున్నది నిష్పాక్షికము, శాస్త్ర సమ్మతము, చైతన్యవంతము, సర్వకళాప్రపూర్ణము నయిన సారస్వత విమర్శనము యొక్క సంపూర్ణావిష్కారము! అట్టి మహదాశయ సంసిద్ధికొఱకై జాతి సమాయత్తమగుచున్న యీ సమయమున నా యీ చిన్న ప్రయత్నము "చంద్రుని కొక నూలుపోగు" వంటిది కాఁగలదని నా నమ్మిక!

తిరుపతి వేంకట కవు లన్నచో నాకు ప్రత్యేకమైన అభినివేశము కలదు. దానికి కారణము - కవిత్వవీరమును, పాండిత్య వీరమును, మానయశోవీరము

లను కలిపి 'బ్రహ్మ' రూపొందించిన రసమూర్తులుగా వీరు నాకు సాక్షాత్కరించుటయే. వీరియం దితర రసము లెన్నియున్నను తదంగములుగా నిల్చి అంగి కలంకార ప్రాయములగుచున్నవని నా తలంపు. "సాధ్యో హి రసో యథా తథం కవిభిః" అన్న నన్నయభట్టారకుని వచనమును బట్టి ధర్మ ప్రధానమైన ఇట్టి ఉన్నత రసస్థితివఱకు పురోగమించిన వీరియందు విక్రాంత్యర్థమున వీరము విశిష్టముగాఁ బ్రకాశించు చున్నది. తద్విశిష్ట రసానుభూతియే వీరి కవిత్వము నుపాసించు ప్రతి సహృదయుని భావవశ్యమున ముంచెత్తును!

ఈ గ్రంథ రచనా ప్రయత్నములో కొన్ని క్లేశములను నేను గురికావలసి వచ్చినది. అవి: కవుల గ్రంథములన్నియు ముద్రితములై లభ్యములు కాకుండుట మొదటిది. ముద్రితములైన వానిలో కొన్ని యిప్పు డుపలభ్యములు కాక పోవుట రెండవది. నాకు లభ్యములుగాని గ్రంథముల గూర్చి శ్రీ చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రిగారికి వ్రాయగా నవి అద్యతనభావిలో ముద్రితములగుట దుర్లభ మని వ్రాసియుండిరి. కాని అట్టి గ్రంథములు సంఖ్యకు చాలతక్కువ. అవియును అప్రధాన గ్రంథములు. అదృష్టమేమన- తి. వేం. కవుల ప్రసిద్ధ గ్రంథము లన్నియు ముద్రితములై నేఁడు లభించుచున్నవి. నేను వానినన్నింటిని గూర్చి విపులముగా సమీక్షించి మిగిలినవానినిగూడ నెంచు పేర్కొని సంగ్రహముగా వానిని పఠితృలోకమునకుఁ బరిచయము చేసియుంటిని. విజ్ఞు లీయంశమును సానుభూతితో గమనింపఁ బ్రార్థన!

ఈ గ్రంథమున ఉచ్చారణాది సౌలభ్యముల నుద్దేశించి విసంధిని విరివిగాఁ బాటించుచు, క్రమముగా నంతరించుచున్న 'ఱ'ల భేదగణనాదులందును, అరసున్నల నియమములందును పట్టుదల వహింపక, శైలి సర్వజన సులభముగా నుండుటకై శిష్టవ్యావహారికమునకు దగ్గఱగానున్న సరళ సలక్షణ భాషను గైకొని రచించితిని. కవుల సాహిత్యమునందు వినూత్న సాహిత్య మర్యాదలకు వ్యాఖ్యానము చేయుపట్ల శాస్త్ర విరుద్ధముగాని నవ్యదృష్టితో కవిహృదయము నావిష్కరింప యత్నించినాను; సహృదయ దృష్టితో తి.వేం. కవుల సాహిత్యమును సామశస్త్రల సమీక్షించినాను. కాని, సమీక్షలతో నాగక దీనిపై సమగ్ర విమర్శ గ్రంథము లింకను ఎన్నియో వచ్చుట కవకాశమున్నది. అట్టివాని కివి పూర్వరంగము సిద్ధము చేయుచో నా యత్నము ఫలించినట్లే!

o o o

తిరుపతి వేంకటేశ్వరుల దివ్యపదమ్ముల నేను మ్రొక్కి తత్తిరుపతి వేంకటేశ కవిధీరుల సత్కవితావిమర్శ ని
ర్ఝరిని దరించిలిన్ గడపు సారమనీషఁ బదీయ గౌరవ
స్ఫురణ దలిర్ప దీని గుణముం గొనుఁడయ్య విమర్శకాగ్రణుల్!

o o o

పై మాటలు 1962 లో వ్రాసికొనినవి. మూడు దశాబ్దులు దాటి మూడేళ్ళు కడచినవి. అప్పుడు ఆం.ప్ర. సాహిత్య అకాడమీ పోటీకొఱకే గ్రంథమును రచించినాను. ఆ యేడు బహుమతి రాలేదు. 1959 - 60 సంవత్సరము పోటీలో వీరరస గ్రంధమునకు ప్రథమ బహుమతి పొందిన నేను, వెంటనే ఈ గ్రంథమును పోటీకి పంపియుండకపోయినచో బాగుండియుండెడిది. అప్పటి యుత్సాహమప్పటిది. నా విమర్శ జీవితమునందలి ప్రారంభ ఘట్టములోని ఒక మహర్దశ 1960వ సంవత్సరము. అప్పుడు మొదలైన నా సాహిత్య విమర్శ వ్యవసాయము ఇప్పటికిని మూడుపూవు లారుకాయలుగా సాగుచున్నది. భగవంతుని దయయున్నచో చివరిక్షణమువఱకు నా కలము ముందుకు సాగగలదని దృఢవిశ్వాసము.

ఒక యుద్ధములో ఓడిన వీరుడు అజ్ఞాత జీవితమును గడపి మూడు దశాబ్దముల తరువాత తిరిగి వచ్చినట్లున్నది ఈ రచన. నా 27 వ యేట సాగిన రచన. చారిత్రికముగా నా రచనా పరిణామమును పరిశీలించువారికి తోడ్పడునట్లు అప్పటి రచనను ఎట్టి మార్పును చేయక అట్లే ప్రచురించుచున్నాను. అర్ధ షష్టిపూర్తి కూడ కాకుండ పుట్టిన ఈ రచన షష్టిపూర్తి తరువాత వెలువడుచున్నది. పఠిత లీ వాస్తవస్థితిని సహృదయముతో గ్రహింప ప్రార్థన.

సాహితీ బంధువులు, మహాకవులు, వదాన్యులు, నాయందు అవ్యాజ వాత్సల్యమును ప్రసరించు మానవతామూర్తులు అయిన డాక్టర్ ఉందేల మాల కొండారెడ్డిగారు సకుటుంబముగా ఈ కృతిని స్నేహచిహ్నముగా అంకితము తీసికొనుటకు అంగీకరించుట నా అదృష్టము. నిరాడంబరులైన వారి నిండు మనసుకు ఈ కృతిస్వీకృతి ఒక అక్షరోదాహరణము. భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు వారికి చిరాయురారోగ్యైశ్వర్యములను సాహితీ రచన పోషణశక్తులను ప్రసాదింప మనసార ప్రార్థించుచున్నాను. వారికి నా కృతజ్ఞతాభివందనములు.

నా గ్రంథమునకు 'మేలిమాట' నందించి ఆశీర్వదించినవారు సహృదయ విద్వద్విమర్శకులు, సాహితీతత్త్వ కుంభసంభవులు, మాన్యులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు. సిద్ధార్థ కళాపీఠ కార్యదర్శులుగా, ఉపన్యాసకులుగా, పండితులుగా. ప్రసిద్ధికెందిన శ్రీ నాగళ్ళవారు అటు ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రమాణములను ఇటు నవ్యాంధ్ర సాహిత్య ప్రయోగములను ప్రామాణికముగా విమర్శించి వివేచింపగల విజ్ఞులు. వారు నాయందలి దయతో ముందుమాట వ్రాసినారు. వారికి నా ధన్యవాదములు.

ఈ గ్రంథము నా షష్టిపూర్తి ప్రచురణగా వెలువడుచున్నది. ముఖ చిత్రము నలంకరించిన సాహితీకళామూర్తులు శ్రీ శీలా వీర్రాజుగారికి, ఈ గ్రంథ మును ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి శ్రీ పండాల శ్రీనివాస్ గౌడ్‌గారికి, విష్ణా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్ అధిపతులకు, ప్రూఫులను సరి చూచి సహకరించిన నా ఆప్తమిత్రులు డా॥ బి. జయరాములుగారికి - ఈ ప్రచుర ణకు తోడ్పడిన మరెందరో మిత్రులకు, నా కుటుంబ సభ్యులకు - అందరికీ నా కృతజ్ఞతలు.

హైదరాబాదు
29-12-1995

జి.వి. సుబ్రహ్మణ్యం

---

**ముఖచిత్రము :** తిరుపతి వేంకట కవుల రేఖాచిత్రము : చిత్రకారుడు - శ్రీ శీలా వీర్రాజుగారు.
దివాకర్ల తిరుపతి శాస్త్రి (క్రీ.శ. 1871 - 1919)
చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (క్రీ.శ. 1870 - 1950)

**వెనుక కవరు :** శ్రీ సత్యసాయి సేవా సంస్థల - ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్య యన మండలుల కన్వీనరుగా - 'వెలుగుబాట' (ఆధ్యాత్మిక విభాగములో చర్చింపబడు అంశముల వివరణాత్మక వ్యాస సంకలన గ్రంథము)ను భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి బెంగుళూరులోని త్రయీ బృందావన ప్రాంగణములో సమర్పించుచున్న తరుణమున స్వామి ఆశీస్సులతో అనుగ్ర హించుచున్న అపూర్వ దృశ్యం.

# విషయసూచిక

ఓమ్

# జంట కవులు

మ. "కవనార్థంబుదయించితిన్ సుకవితా కావ్యంబె నా వృత్తి యీ
భవ మద్దానఁ దరింతుఁ దద్భవమె మద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువు నే దాన జయించితెన్ రుజ జయింతున్ దానిచేపట్టి, నా
కవనమ్మే భవదీయ తేజమని వక్కాణింతు విశ్వాత్మకా!"

తెలుఁగున జంటకవు లెవరన్నచో కనిష్ఠికాధిష్ఠితు లయ్యేదువారు తిరుపతి వేంకటకవులు. వారికి యగ్రతాంబూల మిచ్చుట పూర్వాపరములందు జంటకవులు లేకకాదు; వారుత్తమ సాహిత్య సృష్టి చేసియుండకకాదు. తిరుపతి వేంకటకవులు నిద్రాణమైయున్న తెలుఁగు జాతిని మేల్కొల్పి నవ్య దీధితులతో నలరారు బహుముఖ కావ్యజగత్తును దర్శింపఁగల నవ్యాలోకము నందించి పండసీయు లైనారు. అందులకే వారికి కవికుల గురుస్థానము!

ఆంధ్ర సాహిత్య చరిత్రలో జంటకవుల మాట మొదటిసారి పదునేనవ శతాబ్ది ఉత్తరార్ధమున వినఁబడినది. నందిమల్లయ, ఘంటసింగయ అనువారలు ప్రబోధ చంద్రోదయమును, వరాహ పురాణమును ఆంధ్రీకరించి శ్రీనాథకావ్య యుగమున కలంకార ప్రాయులైనారు. ఆ జంటకవులు సరస శ్రవ్యకావ్య నిర్మాణ చతురులు, శాంతరసమూర్తులు. కృష్ణమిశ్రుని దృశ్యకావ్యము వారి చేతులలో శ్రవ్యకావ్యమై అవతరించినది. విష్ణు పారమ్యబోధకమగు వరాహ పురాణ మాశివారాధకులయం దద్వైత రసామృత సిద్ధి నొందినది. ముముక్షు జన సేవ్యమగు శాంతరసము వారి కావ్యము లందందగించి యుండుటచే నవి సరళ సహృదయ లోకమున కందని మ్రానిపండ్లైనవి. అందువలననే వారిని గుఱించి చెప్పుకొనునప్పుడు తిరుపతి వేంకటకవులవలె వారు జంటకవులని యిప్పటి తెలుఁగువాడు పరిచయము చేసికొందురు. వారికన్న వీరికున్న వ్యాప్తి కీర్తు లటువంటివి!

జంటకవులకు యోగ్యమైన సర్వలక్షణములు సమముగా సమకూరినవి తిరుపతివేంకట కవులయందు. నంది మల్లయ, ఘంట సింగయల తరువాత తెలుగునఁ బ్రాచుర్యముగా వినఁబడినవి వీరి పేర్లే. క్రీ శ. 1892 లో కాకినాడలో విశాఖనక్షత్రద్వయమువలె దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు జంట కవులై ప్రకాశించి శతఘంటకవన సరస్వతిని సాక్షాత్కరింపఁ జేయుటతో జాతి కొక కనువిప్పైనది. నాఁడు మొదలీ కవకవులు శ్రీకాకుళము మొదలు చెన్నపట్టణము వఱకుఁ గల తెలుఁగుదేశమున నవధాన కవితాయాత్రలు చేసి ఆంధ్రభారతికి బంగారుపల్లకి సేవలు జరిపించుటతో తెలుఁగుబిడ్డల రసహృదయములు సారస్వత భక్తి భావముతో పులకించి, పొంగులువారినవి.వారి పేర్లుచ్చరించినంత మాత్రముననే తెలుఁగువారి నాలుకలపై ఛందస్సు లాస్యమాడినది; వారిని దర్శించినంత మాత్రముననే తెలుఁగుకవులకు జంట కవిత్వము నాళువుగా నల్లవలెననెడి కోరిక లీరికలెత్తినవి. వారి తరువాత తలలెత్తిన జంటకవులకు తిరుపతివేంకటకవులే ఆదర్శప్రాయులు. ఒక్క అర్ధ శతాబ్దము వఱకు జంటకవులనెడి భావము సారస్వతలోకమును ముచ్చట ముఱిపెములతో ముంచెత్తినది.

తిరుపతి వేంకటకవులన్న పేరునకున్న కుదిరిక తెలుఁగున మఱి యే జంటకవుల పేర్లకును లేదు. దివాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి అను పేర్లలోని ప్రధాన నామములకు విశిష్టమైన కలయిక రమణీయార్థదాయకముగా నీరక్షీరములవలె ఏకరూపముగా భాసించినది. అది సాక్షాద్బ్రహ్మ (చెర్ల బ్రహ్మయ శాస్త్రిగారు) కలిపిన జంట! ఇఁక ఇతర జంటకవుల పేర్లు తిలతండుల న్యాయముననే వహించినవి కాని, నీరక్షీరన్యాయమును పొందఁజాలకపోయినవి. కొందఱి జంటకవుల పేర్లు రెండు రెండుగనే ఉండిన అందముగా నుండునుగాని కలిపెదమన్నను అతుకవు కొందఱివి ప్రధాన నామము లతుకక మొదళ్ళఁ చిగుళ్ళు కలిపి ముడివేసినట్లుండును కొందఱివి "సోదరుల"న్న పదముతో కాని పొత్తు కుదిరెడివి కావు అట్లైనను ఇరువురి పేర్లకు అందులో అవకాశము ముండెడిది కాదు. ఎట్లైనను అతుకులు వెట్టికొని జంటకవులైనవారేకాని 'త్వమేవాహ' మ్మనుసమైక్య మేయితర జంటకవుల నామముల కేర్పడినది కాదు. తెలుఁగువారి కలిమాన దైవమైన తిరుపతి వేంకటేశ్వరస్వామి నామము వ్యంజకమగునట్లు కుదురుట ఈ కవుల యదృష్టము! వేంకటశాస్త్రిగారు జాతక చర్యలో నాస్వామితోఁ దమను పోల్చుకొనుచు శ్లేషాలంకారమున నిట్లు చమత్కరించినారు:

సీ॥ శ్రీ మహాలక్ష్మి విశిష్టుఁ డా నయశాలి
శ్రీ మహాలక్ష్మి విశిష్టుఁ డితఁడు;
నీలాచలాదరాన్వితుఁ డా చమత్కారి
నీలాచలాదరాన్వితుఁ డితండు;
విబుధ రాజస్తవ్య విభవుఁ డా మహితుండు
విబుధ రాజస్తవ్య విభవుఁ డితఁడు;
బ్రహ్మగురుత్వ వైభవుఁ డాయశోరాశి
బ్రహ్మగురుత్వ వైభవుఁ డితండు;

తే.గీ. నిరత తిరుపతి విరచితాదరుఁ డతండు
నిరత తిరుపతి విరచితాదరుఁ డితండు
వేంకటేశ్వరుఁ డాతండు; వేంకటేశ్వ
రుం డితం డన నప్పండితుండు తనరె. - జాత. పూ. 389.

పారలౌకికమైన పరమాత్మ తత్త్వము పరివేషముగా భాసించిన తిరుపతి వేంకట కవుల నామధేయము తెలుఁగువారి భక్తి పుష్పాంజలులకు పాత్రమై విలసిల్లినది!

"అడవి యుసిరికాయయు నుప్పును" కలియురీతి తిరుపతి వేంకట కవులకు నేస్తము కడు విచిత్రముగా సంఘటితమైనది. తిరుపతిశాస్త్రిగారు వెల్నాటివారు; వేంకటశాస్త్రిగారు ఆరామద్రావిడులు; ఒకరు యెండగండి గ్రామస్థులు. మఱియొకరు యానాము వాస్తవ్యులు. ఒకరు దివాకరాన్వయ శీతరోచి, మఱియొకరు చెళ్ళపిళ్ళ విఖ్యాత వంశ్యులు. వారిరువురు కుల రూప గుణములందు సములై చెర్ల బ్రహ్మగురునొద్ద సహాధ్యాయులై మైత్రి కలిసి జంటకవులైరి. వారి స్నేహము అమలము, నిత్యము, సత్యము, ఆదర్శప్రాయము!

శా. "నీరక్షీరములట్టు లెల్లపుడు నీ నేస్తంబు గైకొంటి మ
క్రూరంబైన మనంబుతో నిదియ మాకుం దెచ్చెఁ గీర్త్యాదికం
బేరే నైత్రిని గూర్చి చెప్పుకొనుచో దృష్టాంతమౌఁగాక పెం
పారం దిర్పతి వేంకటేశ్వరులసఖ్యం బెల్లకాలంబులన్."
—శతావధానసారము - ఉత్త. పుట 90.

చ. "ఇరువురుఁగూడియే రచన యెప్పుడు చేయుదు రొక్కవేళ నొ
క్కరొకరి, యొక్కరింకొకటి కైకొని చేయుదు, రందు హెచ్చు త
గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసినభంగి నుండు, నొ
క్కరు రచియించిరేనియును గాఁవగు తిర్పతి వేంకటీయమై"
—జాతకచర్య. పూ. 240 ప.

అనిన ప్రతిజ్ఞలు వారి యభేద స్నేహమూర్తిని సాక్షాత్కరింపఁజేసినవి. ప్రత్యర్థు లెందరో వారి స్నేహమును భగ్నపరపయత్నించిరి కాని, అకృత్రిమమైన వారి స్నేహ ప్రవృత్తివల్ల వారెల్లరి ప్రయత్నములు విఫలములైనవి.

తిరుపతి వేంకటకవు లాశుకవిత్వము చెప్పి అవధాన సభలను రంజించు నంతవరకు జంటకవులు కవిత్వ మెట్లు చెప్పెదరో తెలుఁగువారికి స్పష్టమైన తెలివిడి లేదు.

చ. "ఒక చరణం బతండు మఱి యొక్కటి నేను నొక్కొక్కఁ డాతఁడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగా,
బ్రకటతరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య! 'నూ
టికి నెల' గయ్య! నిక్క మిది డెబ్బదిమాటలు సెప్ప నేటికిన్?"
—నానారాజసం. పూ. 54 ప.

అని మొదటిసారి విదమరచి చెప్పినవారు తి.వేం. కవులే. పద్యములో నొక్కొక్క చరణ మొక్కొక్కరు చెప్పుట, ఆశువుగా శతావధాన మొనర్చుట అను కవుల రెండు గుణములు లోకమున కాశ్చర్యముద్రఁ గల్పించినవి. ఏక కవి బుద్ధివిలసితమైన యొక సంపూర్ణ భావావేశము ఛందోమయముగా నొక పద్యమగుటయు, లేక ఒక కావ్యమగుటయు లోకమున సహజముగా గోచరించు విషయము. కాని, తి వేం. కవులు ఒక్కొక్క చరణ మొక్కొక్కరు చెప్పి రనఁగా నొక్క వ్యక్తియం దుండవలసిన సమాహితబుద్ధి ప్రాభవము జంట కవులలో నిద్దటి నాశ్రయించి యేకోన్ముఖముగాఁ బ్రవహించునని స్పష్టమగు చున్నది భావయిత్రీ కారయిత్రీ ప్రతిభలయందు ఆ కవులు సాధించిన సమన్వయ సంసిద్ధి యపూర్వము జ్ఞానేచ్ఛాక్రియా వృత్తులు అవ్యక్తవిభావేశోన్ముఖములై జంటకవులయందు భావసంస్కారము నేకరూపముగా నావిష్కరింపఁ జేసినవని యిందు తాత్పర్యము. మానసిక స్నేహము తాదాత్మ్యావస్థనందెడి యుత్తమస్థితికి తి వేం. కవుల భావైక్యము ఒక విశిష్ట దృష్టాంతము! అట్టిది జంట కవులలో నభూతో నభవిష్యతి!

జంటకవుల మనఃప్రవృత్తి కావ్యసృజన వ్యాపారమం దేకైక మార్గావలంబి యైనట్లు ఇతర విషయములం దుండనవసరములేదు. వైయక్తికమైన అభిరుచులు, అభిప్రాయములు భిన్నభిన్నములుగా భావింపవచ్చును. అనఁగా కవన వ్యాపారమందు కవలబిడ్డల మనఃప్రవృత్తిని, జీవిత వ్యాపారమునందు స్నేహ ప్రవృత్తిని జంటకవులు ప్రపంచించెదరని తాత్పర్యము. సామాన్యముగా కవల బిడ్డ లొక నిర్దిష్టవిషయమునం దొకే విధముగా వర్తించుటయు, స్నేహితుల హృదయము లొకటయ్యు అభిరుచులు వేరైయుండుటయు లోకప్రసిద్ధము. అట్లే తి.వేం. కవులు తమ కవిత్వ మొక్క కవి రచించినట్లే భావింపఁజేయు భావైక్యము కవిత్వమున సాధించినవారయ్యు జీవితమున భిన్నదృక్పథములు కలవారై యుండిరని వారి గ్రంథములు నిరూపించుచున్నవి. మచ్చునకు వారివి కొన్ని విభిన్నాశయముల నిచ్చట నుదాహరించుచున్నాను.

1. తిరుపతి వేంకటకవులు ఇరువురు నానా రాజసందర్శన మొనర్చి వారిచే గౌరవసత్కారాదులు పొందియుండిరి. వేంకటశాస్త్రిగారికి రాజదర్శనము ప్రీతిదాయకమే కాని, వారి నాశ్రయించుకొని బ్రతుకెల్ల నస్వతంత్రముగా నడపుట మాత్ర మిష్టమయ్యేదికాదు.

మ. "నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నన్గాని తత్సన్నిధిన్
స్థిరవాసమ్మొనరించునట్టిపని నాచేఁ గాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఱిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చుటొప్పగునె? యంబా! దేవి కామేశ్వరీ!"

అని వేంకటశాస్త్రిగారు తమ యభిమతమును స్పష్టపఱిచినారు. తిరుపతిశాస్త్రి గారు దీనికి విరుద్ధము. అందువలననే పోలవరము జమీందారుగారి యాస్థానము నాతఁ డలంకరింపఁగల్గినాఁడు. అందు తప్పేమియులేదు కాని, వేంకటశాస్త్రిగారొకసారి కోరినప్పుడు వెంటనే తిరుపతిశాస్త్రిగారు అవధానయాత్రకు ప్రభుసేవ కారణముగా రాజాలకపోయినారు. ''నిరంకుశాః కవయః" అన్న సూక్తిని వేంకటశాస్త్రిగారు నూరుపాళ్ళనుసరించిన స్వతంత్రులు.

2. "అవధానాలలో కొన్ని విషయాలు క్రొత్తరకాలు ప్రవేశపెట్టాలని అతనికి (తిరుపతిశాస్త్రిగారికి) ఉత్సాహం ఉండేది. వాట్లను నేను (వేంకటశాస్త్రి గారు) వప్పుకుందేవాణ్ణి కాను. ఎందుచేతనంటే - ఆ విషయాలు గారడీ బాపతులో

చేరుతాయి కాని కేవల ప్రతిభైక స్ఫోరకాలు కావు. సార్వత్రికంగా కాకపోయినా క్వాచిత్కంగానైనా ఆ విషయాలు యితరులున్నూ చేసే కిటుకులు. మన అవధానంలో ఆ కిటుకు కాస్తా బయటపడ్డప్పుడు మన అవధానమంతా ఇలాంటిదే అనే అప్రథకు అది కారణం కావలసి వస్తుందని నా భయం. అతఁడు అప్పటి కప్పుడు దాటుకపోవడమే చూచేవాఁడు కాని, భవిష్యత్తును విచారించే వాఁడే కాఁడు. మా యిద్దఱికీ యీ విషయంలో చాలా ప్రభేదం."

—కథలు - గాథలు - సం. I పుట. 427.

3. ''యేదేనా తన్మయత్వం తటస్థిస్తే మాత్రం యిప్పుడు కూడా అన్నాహారాలు తోచకుండా కవితాధార నడుస్తున్నందుకు నిన్న మొన్న రచించిన 'జయంతిన్నీ' 'క్షమాపణమున్నూ' లోకానికి సాక్ష్యమీయడానికి సందేహం లేదు. యిదే నా ప్రకృతిలో వున్న విశేషం ఇట్టి పట్టుదలగానీ, తన్మయత్వంగాని అతని ప్రకృతిలో లేదు.'' —కథలు - గాథలు - సం. I పుట. 437.

4. ''పరిణతి రవధార్యా యత్నతః పండితేన' అనే భర్తృహరి వాక్యాన్ని ప్రతి కవిన్నీ అనుసరించి తీరాలి. అది అతఁడు ఏ విషయంలోనూ పాటించే వాఁడు కాఁడు. గ్రంథారంభం చేసేటప్పటికే ముగింపు మనస్సులో నాటుకపోవాలికాని ముగింపును గూర్చి యెప్పుడో ఆలోచిద్దామంటే కార్యకారికాదు.''

—కథలు - గాథలు - సం. I - పుట. 438.

5. "సభాముఖంలో వంకరమార్గం త్రొక్కి, ముఖపిధానం చేసి యెదుటి వాళ్ళకు నోరాడనివ్వకపోవడంలో అతనికి మంచి శక్తి వుండేది. కాని, అది తావన్మాత్రంలో ఆఁగిపోతే యేం లాభం? మర్నాడు మళ్ళా అడిగితేకూడా నిలిచే పద్ధతి వాదంగాని పనికిరాదనే వాణ్ణి నేను. అందుకోసం తాత్కాలిక విజయానికి యెన్నఁడూ ప్రయత్నించక వొక్కొక్క దానికి యెన్నో ప్రయోగాలు వెదికివెదికి వేసారి అప్పుడు దాన్ని బయటికి పెట్టడమే అప్పటికీ ఇప్పటికీ నా ప్రకృతి. ఇందుకోసం అతఁడు నాయందు ఆంతరంగికంగా చాలా కృతజ్ఞత చూపే వాఁడు. నా మాటను పరమప్రమాణంగా భావించేవాఁడు.''

—కథలు - గాథలు - I సం. పుట. 440.

6. "వ్యాకరణం ఇద్దరమూ సమానంగానే చదువుకున్నాం. మధ్యకాలంలో నేను కాశీ వెళ్ళినా చాలామంది మహా పండితులను సందర్శించడం తప్ప దేశంలో

వున్న తిర్పతి శాస్త్రికంటే విశేషం చదివిందేమీ లేదు. మళ్ళీ దేశంలో యిద్దరమూ కలిసే తమవాయి గ్రంథాలు మొదటి గురువుగారి దగ్గితే అభ్యసించాము. సంస్కృతంలో కావ్యనాటకాలు చదవడంలో నాకన్నా అతని గురు శుశ్రూష హెచ్చు. నా శుశ్రూష ఆ విషయంలో అతనికంటే కొంచెం లొచ్చు. ఈ భేదం మేము కలుసుకొన్న కొన్ని యేళ్లవఱకు - అంటే అధమం రెండేళ్లవరకూ - వుండేది. పిమ్మట సరిసమానంగానే మామాసాహిత్యాలు తయారైనాయి. అతఁడు తీవ్రమైన బుద్ధిశాలి. అయినా నాలాగ సర్వదా విద్యావ్యాసంగాన్ని చేస్తూ దాన్నే వక తపస్సుగా పెట్టుకొనే స్వభావం కలవాఁడు కాఁడు నేనో? సర్వదా దాన్నే మననం చేస్తూ కాలక్షేపంచేసే స్వలాభం కలవాణ్ణి. అందుచే శుశ్రూషా విషయంలో తక్కువ అయినా పరినిష్ఠిత సాహిత్యంలో అతనికంటే కూడా అంతో ఇంతో నా శక్తి అతిశయించిందని పరిశీలకులు గుర్తించవలసి వస్తుంది. యీ అతిశయం దేనిలోను? యేవేనా ఖండన మండనాల ప్రసక్తిలో మాత్రమే. దేన్నేనా అన్వయించడం వస్తే నాకన్న అతఁడే అన్వయించేవాడు. ఈలాంటి స్వల్ప భేదం వున్నా అతనివాదం 'యే యెండ కాగొడుగు'గా వుండేదవడం చేత దురుద్ధరంగా పూర్వపక్షాలు చేయడానికే కాని శాశ్వతమైన సిద్ధాంత కల్పనకు పనికివచ్చేదికాదు. ఈ వ్రాసిన సోదెవల్ల ముఖ్యఫలితం సంస్కృత సాహిత్య విషయంలో అతనిది సర్వమూ అంతో ఇంతో గురు శుశ్రూషా లబ్ధం; కాని తక్కిన యావత్తూ స్వయంకృషి చేత తోడి విద్యార్థులతో కయికురు బొయికురులాడడం వగయిరా వ్యాసంగం వల్ల సంపాదించుకున్నదనిన్నీ చదువరులు తెలుసుకోవలసివుంటుంది." కథలు - గాథలు. సం I - పుట - 464.

7. "తిరుపతిశాస్త్రికి నాకూ ఉన్నభేదం ఒక్క స్వయంకృషిలోనే. నేనెప్పుడూ 'చింతకవులందుఁ దపసులచిత్తమందు' అని మొల్ల వ్రాసిన పద్యపాదానికి వుదాహరణంగా వుంటాను. అతఁడు నావలెకాక యెప్పుడో పని పడ్డప్పుడు రచన చేసినా చాలాకాలం స్నేహితులతో యితర కాలక్షేపంతో వెళ్లించేవాఁడు. అందుచేతనే నాకంటే అతని ఆరోగ్యం బాగుండేది. నా ఆరోగ్యం యెప్పుడూ అంతంతగానే వుండేది. ఆరోగ్యంలో ఉన్నప్పటికంటే కూడా అనారోగ్యంలో వున్నప్పుడే నాకు విశేషించి రచన సాగడం అనుభూతం.... మేమిద్దఱమూ పట్టుదల కలవాళ్ళమే. వొప్పు తప్పంటేనే పరాక్రమిస్తానుగాని తప్పు తప్పంటే వప్పుకుంటాను. తప్పు గూడా మార్గాంతరంగా సాధిస్తాను గాని దానితత్త్వం

ఇలాంటిది అని వెంటనే కాకపోయినా నిజం మఱికొన్నినాళ్ళకైనా చెప్పేస్తాను. 'నాఽమూలం లిఖ్యతే కించిత్' అని వ్రాసిన పెద్దిబొట్లుగారి వాక్యం నాకు ప్రాణప్రదం...." క. గా. - సం I. పుట 471.

8. " 'యద్దేవా' కవిత్వం చెప్పడానికేమి, వీరరసకవిత్వానికేమి, తగాయిదాలు తెచ్చే కవిత్వం చెప్పడానికేమి అతఁడు మంచి మొనగాడు." క.గా.-I 494.

9. "నాకొక నియమము కలదు.

ఉ॥ ఆవల నెవ్వఁడేని కవియల్లిన పద్యములం బఠించుచో
నీవిధమెల్ల నిశ్చయము; ఈ మతికిన్ దగు నితఁడంచు సం
భావన గల్గఁగా వలయు భావమటుల్ పొదగట్టుకున్న నా
దేవురుగొట్టు పద్దెముల దీవనలేమిటి కవ్వరాత్రృతూ!" క గా.I. పు. 542.

10. "పిలిచ్చినంతలో' శబ్దాలకు ప్రాధాన్యం యివ్వక అర్థానికే యిస్తే 'పండితపామర సాధారణ్యేనా' ఆ కవిత్వం ఆనందజనకంగా వుంటుందని నేను తలుస్తాను.

"బ్రతికిన నాల్గునాళ్ళు ఋతవాది యుధిష్ఠిరుఁడన్న మేటి కీ
ర్తిని గలవాఁడనై ధరఁ జరించి తుది న్నృపకోటి మెచ్చ దు
ర్గతి గనకుండ స్వర్గమునఁ గాపురముండఁ దలంచు నాకు నీ
యతుకొనరించితే కటకటా! యదునందను పేరుమీదుగన్."

ఆ యీ పద్యమైతే నా రచన కాదు (తి.శా.ది) గాని నాకు యిలాటి రచనే యిష్టం. అయితే లోకం మాత్రం యిది తి.శా. రచనకాదనిన్నీ —

"పటు జంఝూనిల ఝోరణీ రణరణత్ప్రాగ్భార నున్నాటవీ
తటశాఖా పటలాంత రుద్గత నితాంతస్ఫార ఘోరాగ్ని రు
ష్టపటనాధూపిత భస్మసాత్కృత కురుట్కాండమ్ముతో వహ్నికిన్
మిటియింపందలపెట్టినారుగద సఖ్యా మ్మార్యచూడామణుల్."

ఇది తి. శా. గారి రచననిన్నీ చెప్పుకుంటారు. "లోకము మూయను మూకుడున్నదే" (క.గా. III - పుట 454). సంస్కృత సమాసాలువున్న కవిత్వం తి. శా. గారిదనిన్నీ తెలుఁగు జిలుఁగుపదాలు వేంకటశాస్త్రిగారిదనిన్నీ అనుకొనేవారు బాల అమాయకులు. అలా వ్రాసేవారి వ్రాతలు ఆదరించే యెడల తి.శా. గారికి చాలా అన్యాయం జరుగుతుంది."-కథలు - గాథలు - సం I - పు. 430.

11. వేంకటశాస్త్రిగారికి స్వయముగానే గ్రంథమును అనువదింపవలెనను అభిప్రాయముండెడిదికాదు. ఇతరుల ప్రోద్బలమువలననే మొగమాటముకొలకు అనువాదము నొనర్చుటకు అంగీకరించెడివాడు. తిరుపతిశాస్త్రిగారు అనువాద నాటకములలో చాలభాగము రచించినారు.

12. "బుద్ధికి రెండు శక్తులు గలవు. అందొకటి గ్రహణశక్తి, రెండవది ధారణాశక్తి. గ్రహణశక్తిలోఁ దిరుపతికి వేంకటేశ్వరుఁ డించుక లొచ్చు. కావుననే గురువుగారు శాస్త్రాధ్యయన కాలములోఁ దిరుపతిశాస్త్రి నెక్కుడు మెచ్చుకొని నారు. ధారణాశక్తిలోనో - వేంకటేశ్వరునికి తిరుపతిశాస్త్రి ఇంచుకలొచ్చు. వీర లిరువురకుఁ బ్రధాన విద్యయగు శతావధానమున కీధారణయే ముఖ్యమగుటచే వేంకటశాస్త్రి నతఁడు కొనియాడవలసివచ్చెననునది యిందలి రహస్యము." దివాకరాస్తమయము.17 పు.

13. "తిరుపతిశాస్త్రికన్న వేంకటశాస్త్రి వయస్సున నెంత పెద్దయో వేంకటశాస్త్రికన్నఁ దిరువతిశాస్త్రి బుద్ధిలో నంత పెద్దయని లోకము విశ్వసించుఁ గాక!" ది.అస్త.పు. 17.

"లోకోభిన్నరుచిః" అను లోకోక్తి ననుసరించి, వైయక్తికమైన అభిరుచులు, అధికారములు, ఆకాంక్షలు, ఆచరణములు వేరువేరుగానున్నను కావ్యనిర్వహణమునందు మాత్రము అట్టివి తమ సమైక్య కవిత్వశక్తి కవరోధ ములు కాకుండ బండి సాగించిన జంటకవులు తిరుపతి వేంకటకవులు. విభిన్న త్వములో నేకత్వము వారి కావ్యనిర్మాణ ప్రవృత్తి!

తిరుపతి వేంకటకవులు తెలుఁగుదేశమునకు ప్రప్రథమమున శతావధాను లుగా పరిచయమైరి. శతలేఖిన్యవధాన ప్రక్రియ సంస్కృతాంధ్రములందు వేర్వే రుగా చేఁబట్టి నిర్వహించినవారు ప్రాచీన కవులలో లేకపోలేదు. కాని, అట్టివారు నూటికి కోటికి ఒక్కరు. తెలుగులో చరికొండ ధర్మన, రామరాజభూషణుఁడు, మాడభూషి వేంకటాచార్యులు మొ॥వా రిటువంటివారే. కాని, వారి శతావధాన ప్రక్రియ దేశవ్యాప్తము కాలేదు. ప్రజలలో సాహిత్య చైతన్యము కల్గింపలేదు. కాగా, సంస్కృతాంధ్రములందు నల్లేరుపై బండినడక వలె నాశుకవిత్వమును ధారావాహిగా నడిపి "రెండు బాసలకు మేమె కవీంద్రులమంచు" శతావధానములే కాక అష్టావధాన సహస్రావధానములు సైతము సల్పి, మేటి కవులనిపించుకొన్న

వారు తి. వేం. కవులు పూర్వకవులలో నొక్కొక్క రొక్కొక్క భాషలో నొక్కొక్క అవధాన ప్రక్రియను ప్రదర్శించి యుండ, వారు జంటకవులుగా అవధాన ప్రక్రియలన్నియు ప్రదర్శించి చూపినారు. ఇట్టి విశిష్టావధాన ప్రజ్ఞకు వారే ఆద్యులు, అనవద్యులు! ఉభయభాషా కవిత్వ సవ్యసాచులు! నానారాజకవి పండిత ప్రజాపరిషత్తులందు అవధాన కవితాకళా సౌందర్యావిష్కార మొనర్చి ఆంధ్రావళికి కవిత్వ భిక్ష పెట్టిన అమృతమూర్తులు! ఆంధ్ర సాహిత్య మొకసారి "శ్రీనాథుండు ప్రోవన్" సొంపు వాటిల్లినది. మఱల తిరుపతి వేంకటేశ్వరులు "సాకన్" ఇంపు వాటిల్లినది!

శృంగారరస కావ్య నిర్మాతలుగా తి. వేం. కవులకు తెలుఁగు నాఁట నఖండ కీర్తి వచ్చినది. పరభాషా సాహిత్యాదార ప్రభావము వలన జాతిలో దేశీయభాషా సాహిత్యాభిరుచి మందగించి, తత్ఫలిత పాతనాదు లస్తినాస్తి విచికిత్సలో పడిన గడ్డు దినములలోఁ బ్రజామనః ప్రవృత్తిని అవధాన ప్రక్రియచే నాకర్షించి, సర్వజన హృదయాహ్లాదియు, రసరాజమునగు శృంగార రస మార్మగాగల కావ్యరచనా ప్రక్రియతో మురిపించి, సాహిత్యోపాసనాభ్యాసమును జాతిలో పునరుజ్జీవింపఁజేసినారు. వారి రసికానందము, శ్రవణానందము, పాణి గృహీత, లక్షణా పరిణయము, శుకరంభాసంవాదము జాతిలో సాహిత్య చైతన్యము కల్గించినట్టివే. "శృంగారీ చేత్ కవిః కావ్యేజాతం రసమయం జగత్" అన్నట్లు వారు రసమయమైన కావ్య జగత్తునే కాక, రసావిష్టమైన సహృదయ జగత్తును కూడ సృష్టింపఁ గల్గిరి!

ఆంధ్రావళికి శ్రవణానందమునేకాక నయనానందము కల్గించు రూపక ప్రక్రియను నిర్వహించి ప్రజాహృదయానంద రససింధువులై ప్రసిద్ధి కెక్కినారు జంటకవులు. తెలుఁగు వారి అభిమాన కావ్యమైన మహాభారతములోని కథను నాటకములుగాఁ దీర్చిదిద్దిన గౌరవము తిరుపతి వేంకట కవులకే తొలిసారి దక్కినది. వారి పాండవోద్యోగ విజయములు తెలుఁగు నాఁట వీర రస విజయ యాత్రలు సాగించినవి. వారి ప్రహసనాదులు ప్రజలలో పేరుకొన్న మూఢా చారాలను, అర్థములేని పట్టుదలలను, సానుభూతిలేని విమర్శలను, వింత వింత వితండవాదములను వెక్కిరించి వెలివేసినవి. కందుకూరి వీరేశలింగముపంతులు గారి సాంఘిక సంస్కరణోద్యమము, గిడుగువారి భాషా సంస్కరణోద్యమము పూర్వరంగము సిద్ధము చేయుగా, తిరుపతి వేంకటకవుల కవిత్వ సంస్కరణోద్య

మము రసవంతముగా తెలుగునాట నిర్వహింపఁబడినది. ముగ్గురికిని ప్రజాశక్తులే మూలాధారములు! సమకాలీన సాంఘికావసరములను గుర్తించి ప్రాతను సంస్కరించి క్రొత్తను ప్రదర్శించి భావిపురోభివృద్ధికి దోహదమైన నవ్యాలోకము జాతి కందించుటయే వారి యుద్యమముల పరమ తాత్పర్యము! అందు తి.వేం. కవుల ఉద్యమ లక్ష్యమే సాహిత్య నవ్యాలోకము!

తి వేం. కవులు కవిత్వము నొక ఆరాధనా విశేషముగను, పారమార్థిక పురుషార్థ సాధకముగను భావించిన మనీషులు. ఆర్ష సంప్రదాయము వారి యాదర్శ సాహిత్యమున కాయు స్ఫూర్తిమైనను నవ్యత నందగించుకొనియే ముముక్షువులను మురిపించినది. జగదంబ వారి యుపాస్య దైవము. ఆమె చల్లని చూపులలో నెల్లలు వేసికొనినది వారి పురాణస్తోత్ర శతక వాఙ్మయ సామ్రాజ్యము! దేవీభాగవత మాముష్మిక ఫలప్రదాయియగు నలౌకిక కావ్య కల్పవృక్షము. కామేశ్వరీ శతకాదులు, కామేశ్వరీ స్తోత్రాదులు భక్తిబోధ సుధానిధులేకాక, అనామయ ప్రసాద మహిమా గరిమాన్వితములు. శివకేశవసూర్యాదులను వారు స్తుతించినను వారి దద్వైత భక్తి. దైవికమైన శక్తి వారి యుక్తి నాశ్రయించి భక్త సంతతికి సాహిత్యోపాసనానురక్తిని గల్గించి వారిని గురుపీఠమునఁ గూర్చుండఁ బెట్టినది!

అధిక్షేప సాహిత్యము వారి యభిమాన ధన నిక్షేపము. సత్యధర్మసూత్రా చరణ విధికిఁ దొడిగిన కవచము! పరిశుద్ధమైన ప్రాచీన గురు శిష్యధర్మము, మహిమాన్వితమైన సత్యవాక్య ప్రభావము, సమసామర్థ్యముగల పండిత ప్రకాండులతోడనే శాస్త్ర చర్చలు సల్పెడి వీరోచిత గుణసంపత్తి, ఉన్మార్గవర్తనులైన ఆప్తులను ముఖాముఖి మందలించియు వ్యంగ్యముగా నధిక్షేపించియు సన్మార్గ వర్తనులుగా నొనర్చెడి పవిత్రోద్దేశ్యము వారి యధిక్షేప సాహిత్యమునకుఁ బరమ ప్రయోజనములు. దీనికి ఫలము విశ్వశ్రేయస్సే!

తిరుపతి వేంకటకవుల కఖండకీర్తి వచ్చుటకు వారి శతావధాన ప్రక్రియ యొక్కటియేకాదు హేతువైనది. దానికితోడు వారు వైవిధ్యముతో గూడుకొనిన సాహిత్యమును సృజించి సమకాలీన కావ్యజగత్తులో లేని నవ్యత నావిష్కరింపవలె ననెడి వారి విశిష్ట ప్రయత్నము మఱియొక ముఖ్య కారణము. ఈ జంటకవులు కావ్యప్రక్రియలలో నొకసారి పట్టిన ప్రక్రియ మఱలఁ బట్టలేదు; పట్టిన దానిని బంగారము చేయక విడువలేదు. వారి కావ్యజాలములో నొక్కొక్కటి ఒక్కొక్క విశిష్ట సృష్టి! మచ్చునకు కొన్ని—

1. శ్రవణానందము - శృంగార రసప్రధానమైన సాంఘిక కావ్యము. (A Poem with a Social theme )
2. పాణిగృహీత - ప్రహసనతుల్యమైన శృంగార రసాభాస కావ్యము; మన స్త్రత్వ శాస్త్ర రహస్యప్రతిపాదక పద్య కావ్యము. (A Poem w.th Psychological e ıposition.)
3. లక్షణాపరిణయము - ఆశువుగా జెప్పఁబడిన వర్ణనాత్మక కావ్యము. (Extempore Descriptive Poetry )
4. ఏలామాహాత్మ్యము - పుణ్యతీర్థ మాహాత్మ్యము. (Legends of Holy Places and Rivers )
5. సుశీల - యాత్రాకావ్యము, సాంఘికవిమర్శయు, పాత్ర చిత్రణము ప్రధానమైన పద్యకావ్యము. (A Poem of travel and adventure. A Poem of Social criticism A Poem of character Portraying )
6. పూర్వ హరిశ్చంద్ర చరిత్రము - పురాణపాత్రల పూర్వ కథలను తెల్పెడి కథా కావ్యము (A Poem of short stories dealing with the previous births of Puranic characters.")
7. జాతకచర్య - ప్రథమాంధ్ర పద్యాత్మక స్వీయచరిత్ర (First Auto. biography in Poetry.)
8. పురాణ కథలు - (Epic stories in Poetry.)
9. వ్రతకథలు.భక్తిరస కథాకావ్యము (Devotional Religicus stor. ies in Poetry.)
10. స్తోత్రవాఙ్మయము.భక్తితత్క కవిత్వము (Devotional Poetry)
11. పాండవోద్యోగ విజయములు - వీరరసరూపకములు (Dramas of Heroic Sentiment).
12. పాండవ జననాదులు - వస్తురూపకములు (Dramas of Vastu (Story) significance.)
13. పండితరాజము - ప్రతీకార్థ ప్రధానమైన రూపకము, కవి జీవితగాథ - (A Play with a symbolic meaning and a drama dea. ling with a Poet's biography).

14. అనర్ఘనారదము - తత్త్వార్థప్రధానమైన రూపకము (A Play with a Philosophic message)
15. సుకన్య-సాంఘిక సంస్కరణోద్దిష్టమైన పౌరాణిక రూపకము (A Play envisaging Social reform.)
16. ప్రభావతీ ప్రద్యుమ్నము - ఒక తెలుఁగు ప్రబంధమును నాటకీకరించుట (A Dramatic form of a Telugu Prabandha).
17. బొబ్బిలి పట్టాభిషేకము - సమకాలీన రాజకీయ సంఘటన వర్ణనము (A Poem of Description of a contemporary state incident).
18. బిడాలోపాఖ్యానాదులు-అన్యాపదేశకావ్యము (Satirical Poems)
19. గుంటూరు సీమాదులు - వివాదసాహిత్యము (ప్రమాణ సహితము) (A (Poem bearing on Controvercial literature)
20. వచన రచనలలో - వ్యాసములు - (Critical Essays)

    1. సాహిత్య చర్చలకు సంబంధించిన వ్యాసములు - (Literary Essays)

    2. స్వీయ చరిత్రకు సంబంధించిన వ్యాసములు - (Autobiographical Essays)

    3. ప్రసిద్ధుల చరిత్రకు సంబంధించిన వ్యాసములు - (Biographical Essays)

    4. సాంఘిక విమర్శకు సంబంధించిన వ్యాసములు - (Essays of Social Criticism)
21. కావ్యనాటక శతకానువాదము-లు - ఆంగ్ల - గీర్వాణ భాషలనుండి. (Translations from English and Sanskrit )

కవిత్వాదులలో నింత వైవిధ్యముతో గూడిన నవ్యతా దర్శనము చేసి సాహిత్యసృష్టి యొనర్చినారు కావుననే వారు నవ్యకవితా పితామహులనుటకు అర్హులగుచున్నారు. అల్లసాని పెద్దన ప్రబంధ నిర్మాణమునకు మూలకర్తయై ఆంధ్రకవితా పితామహుఁడు కాఁగా తి. వేం. కవులు నవ్యకవిత్వ శాఖావిస్తృతికి మూలకందములై నవ్యసాహిత్య పితామహులగుచున్నారు. తిరుపతి వేంకట కవుల సాహిత్యోద్యమము ప్రాచీన మూఢ విశ్వాసముల కెదురుచుక్క! సరస నవ్యకవితా వర్షములకు పొడుపు చుక్క!

ప్రాత పునాదులపై క్రొత్త భవనము కట్టినా రీజంటకవులు. ఒక్క సంస్కృత పాండిత్యముతో నాంధ్ర కవిత్వము కరతలామలకమౌనన్న సిద్ధాంతమునకు వారు బద్ధ విరోధులు.

"తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుదె కాని
సంస్కృతమ్మున కన్నఁ గష్టమ్మ హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁ జాలు
దాని, కిద్దానికో రెంటఁ దగులవలయు" —పాణి. పం. 53.

అని వీరి ప్రబోధము. గీర్వాణాంధ్రములఁ దఱచి నిగ్గుఁ దేల్చిన శబ్ద శాస్త్ర పారగు లన్నమాట లవి. శుకరంభా సంవాదముతో సంస్కృత కవనమునకు స్వస్తి చెప్పి ఆంధ్రకావ్య నిర్మాణ రంగమునందు దుమికిన మాతృభాషా భక్తు లన్న మాటలివి! తెలుఁగు నిఘంటువులు, తెలుఁగు వ్యాకరణ గ్రంథములు, లక్షణగ్రంథములు ఎట్లసమగ్రములై ప్రతిభావంతులగు కవుల ప్రయోగములకు ప్రామాణ్యతను సిద్ధింపఁజేయఁజాలక పోవుచున్నవో, కల్పనా స్వతంత్రములగు కవుల కావ్యప్రక్రియలకు సహృదయ పూర్వకమైన లక్షణ సూత్రముల నందింపఁజాలక పోవుచున్నవో నిరూపించి, ఇట్టి విషయములలో కవిత్రయ ప్రామాణ్యము నంగీకరించి పండిత ప్రకాండులతో వాదులాడి తి. వేం కవులు భాషా సారస్వతోపాసకుల కనువ సంకెళ్ళను పటాపంచలొనర్చి స్వేచ్ఛను ప్రసాదించిరి. దేశ స్వాతంత్ర్యముతో పాటు శాస్త్ర సాహిత్య ప్రక్రియా స్వాతంత్ర్యమును జోడుకలిపి వీరు చాటించిరి

చ. "తెలుఁగున కున్న వ్యాకరణ దీపము చిన్నది; గ్రామ్యమంచుఁ బె
ద్దలు కొనియాడు భారతము తప్పన శక్యము కాదు; దానిలోఁ
గలిగిన లక్ష్య భేదములు కాదన కాద్రుతి సంగ్రహించి ని
శ్చలగతి నిందుఁ గూర్చెదరు చక్కఁగఁ దిర్పతి వేంకటేశ్వరుల్.
—దేవీభాగ. ప్ర. 35 ప.

కవిత్రయ ప్రయోగములను పాక్షికముగా నంగీకరించి పాక్షికముగా నంగీకరింపని అప్పకవి, బాలవ్యాకరణకర్త, శబ్దార్థరత్నాకరకర్త మొ॥వారు, వారిని ప్రమాణముగా గొని వాదులాడెడి కవి పండితులు తి. వేం. కవుల వేడి చూపునకు గురికాక తప్పినదికాదు.

క. వ్యాకరణ మొక్క త్రోవ, మ
హాకవు లొకత్రోవ, కోశ మఖిలం మ్మొకత్రో
వై కనుపట్టెడి, నీ భా
షా కావ్యమ్ములను దఱచి చదివిన కొలఁదిన్—

క. కేవల సంస్కృత మర్యా
దావిదులును గేవలాంధ్ర తత్త్వరులును గా
కేవార లుభయభాషా
కోవిదులవ్వారు దీని గురువులు జగతిన్. —దేవీభా. ప్ర. 26,27.

అని మొగమోటము లేకుండ సత్యము కుండబ్రద్దలగునట్లు చెప్పి—

గీ. కేవలం గ్రామ్యపదములం నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
"కలవు లే"వని పెనఁగ శక్యంబె? ధాత
రాదులను లేని పదములు నవనిఁ గలవె?

—దేవీభా. ప్ర. 25 వ.

అని సిద్ధాంతీకరించిరి. సహేతుకముగా పరీక్షింప సరసమైనదికాదని తేలునంతవఱకు ఏ సిద్ధాంతమునైనను కాదని త్రోసివేయలేదు. గిడుగువారి వ్యావహారిక వాదమును బరిశీలించి పద్య కవనమునందును, పాఠశాలలలో పఠన పాఠన సాహిత్యము నందును గ్రాంథికభాష యుండవచ్చుననియు; వచన రచనకు, గచ్ఛాస్సాహిత్య మునకు వ్యావహారికభాష యుపాదేయమనియు కవు లంగీకరించిరి. కావ్యములందు రసవంతముగా నుండునట్లు వ్యావహారిక పదములు ప్రయోగించినను దోషము లేదని వారి మతము. అన్యదేశ్యాలను తమ రచనలలో విచ్చలవిడిగా వాడిన విశాల హృదయము వారిది.

ఉ. కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షా లలితాంగి మాఱు టది సత్కవి సమ్మతమౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁగలం వౌటను నొచిరిఁబట్టి మేము క
బ్బాలను వారుచుంటిమని పండితు లేగతి నొప్పకుందురో''

—పాడి ప్ర. 19.

అని తమ మతమును సవినయముగను, సహేతుకముగను ప్రపంచించి యున్నారు. ఇట్లు స్వాతంత్ర్యము ప్రకటించియు దేశీయభాషా మర్యాదకు విరోధ ములైన ప్రయోగములనుగాని, ఎరువు సొమ్ముం వంటి భావములను గాని,

తెలుఁగువారి ప్రవృత్తియం దమరని కవిత్వ ప్రక్రియలను గాని వారు సమర్థింప లేదు. అనఁగా తాత్కాలికావేశముతో ప్రాతను విరుగఁద్రొక్కి ముందు కనాలోచితముగా దూసుకొనిపోయినవారు కారనియు; శాస్త్ర సమ్మతములును, ఔచితీ సహితములును, విశ్వశ్రేయోరూపములును, సమకాలీన సాంఘికావసరాను గుణములునైన నవ్యమార్గములనే వీరనుసరించిరనియు ఒక సాహిత్య పరిణామ విప్లవమునకు వీరు మూలకారకులైరనియు ఈ చర్చవలని తాత్పర్యము.

తిరుపతి వేంకటేశ్వరుల నవ్యాలోకము సంవరించుకొన్న తెలుఁగు కవికి భయము తొలఁగినది, కలము సాగినది, ఉజ్జ్వలమైన భవిష్యత్తు గోచరించినది. ఇఁక కొన్ని శతాబ్దుల వఱకు పద్య కవిత్వము చావదను ధైర్యము జనించినది. ఆ జంటకవుల దృష్టి ప్రాచీన కవితపై నొక దివ్యాలోకము, నవీన కవితపై నవ్యాలోకము!

తిరుపతి వేంకటకవులు సమకాలీన కవిలోకములో మకుటములేని మహారాజులవలె భాసించిరి. ప్రత్యక్షముగనో పరోక్షముగనో వారి ప్రభావము పడని కవి ఇరువదవ శతాబ్ది పూర్వార్ధమునందు లేడన్నచో సత్యదూరము కాజాలదు!

ఇంతటి ప్రభావశక్తిని వారికి సంపాదించిపెట్టిన అంశములలో వారి ప్రసన్న కవితాశైలి ప్రధానమైనది. జాతిలో చైతన్యము కల్పించుట వారి కవితా లక్ష్యము. అందులకై ప్రసన్న గంభీరమైన శైలిని వారెన్నుకొనినారు. వేంకటశాస్త్రిగారొక చోట నిట్లనిరి: "రచన అనేది సుబోధంగా వుండాలనునది ముందు జనించిన పిమ్మట నా జననమని నన్ను మన్నించువారు సంభావింతురుగాక! ఏమంటే, కవిత్వమనేది తన మనస్సులో వుండే అభిప్రాయాన్ని యితరులకు తెలుపుదు చేయటానికి పుట్టింది కాబట్టిన్నీ, ఆ యితరులలో భాషాపాండిత్యం ఎక్కువ ఉన్నవాళ్లేకాక తక్కువగా ఉన్నవారూ వుంటారు కనుకున్నూ. యీ అభిప్రాయం పండితులలో చాలామందికి రుచించదు" (కథలు-గాథలు-I-275 పు.) పండితులకు రుచించనంతమాత్రమున స్వీయసిద్ధాంతమును మార్చుకొనలేదు తి. వేం. కవులు. మఱొక విధముగా అన్వయము చెప్పినచో- వారు పండితుల కొఱకేకాదు కవిత్వము వ్రాసినది. "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" "మహాకవిత్వ దీక్షావిధి నందినవారు." తెలుఁగు జాతీయత కెత్తిన నవ్యపతాక వారి కవితాశైలీ సిద్ధాంతము.

"రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్య"మ్మనునది వారి కవిత్వ శైలికి మూలసూత్రము! యాంత్రికముగా రోజురోజుకు ప్రపంచ జీవితము వేగవంతమగుచున్నది. సామాజికులలోఁ దీరికగా కూర్చుండి బృహత్సంహితలను మననము చేసికొనెడి వ్యవధానము క్రమముగా సన్నగిల్లుచున్నది. ఈ అశుగవేగము ననుగ

మించుచున్న నాటి సాహిత్యమును విస్మరించకుండ ప్రబోధింపఁజేసిన వైతాళికులీ జంటకవులు. ఒక్కసారి గొంతెత్తి కవన మాలపించుచో శ్రోతృహృదయ మద్దియాకృష్టమై కవితాస్వాదనోన్ముఖము కావలెను! అపై నాలోచించినంత మేర అమృతము వాని భావుకత కందీయవలెను. దోఁబూచులాడు వ్యంగ్య విలాసము, అరసిచూచిన గాని అంతుదొరకని అర్థగాంభీర్యము వీరి కవితకు ప్రధాన లక్షణములు. వీనినే ప్రసన్న గంభీర గుణములని చెప్పుకొనవచ్చును. లాక్షణికులు చెప్పు ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజస్సు అను గుణములు రసోచితములుగా కావ్యములందు ప్రయుక్తమైనను ప్రసాదగుణమే వీరి శైలికి నైజము.

"కవుల మున్నటి రూల్సుకు కట్టుపడము
మనులు పండితరాయాది కవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన
లక్ష్యపెట్టము......."

"తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూలపదముల గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదంబున రసముట్టిపడినఁగాక! (శ్ర. ప్ర. 12)

అనునది వీరి కవితాశైలికి సంబంధించిన ప్రతిజ్ఞ. భరతమహర్షి కవిత్వ నిర్వచనము వీరి రూపక కవితాశైలికి చక్కని కవితాసూత్రమగు ననుటలో విప్రతిపత్తి లేదు.

"మృదులలిత పదార్థ్యం, గూఢ శబ్దార్థ హీనమ్,
జనపద సుఖబోధ్యం, యుక్తిమన్నృత్య యోగ్యమ్
బహుకృతరసమార్గం సంధిసంధాన యుక్తమ్
సభవతి శుభకావ్యం నాటకప్రేక్షకాణామ్."

అని భరతుని నిర్వచనము. దీని నొజ్జబంతిగా గొని రచించిన కవుల కవిత్వ రచనము నాటకమున నుంతఁదగినది. పద్యమా? గద్యమా? అని వివాదములు రేగిన సమకాలీన పరిస్థితులలో గద్యముకన్న శ్రవణసుభగము, సులభసుగమము నైన పద్యము నాటకమున రసవత్తరముగా నుపయోగింపవచ్చునని నిరూపించి పద్యగద్యాత్మకమైన నాటకరచనాశిల్పమునకు అమృతభిక్ష పెట్టినది. వారి భారత నాటకములు పెక్కుమంది నటకుల కెనలేని కీర్తిప్రపత్తులను గల్పించినవి. పకుల కాపరులనుండి పండిత ప్రకాండుల వఱకు ముఖస్థములై వారి కావ్యములలోని

పద్యములు వారికి ప్రజాహృదయములలోగల గౌరవ స్థానమును వేనోళ్ళఁ జాటుచున్నవి. తి.వేం. కవులు ప్రజల నాలుక మీద బ్రతుకుచున్న కవులు!

తిరుపతి వేంకటకవుల కవిత్వము వినినతోడనే కల్గునది శ్రవణానందము! వీరి కవిత్వ మాలోచించిన కొలఁది కల్గునది రసప్రవణానందము!!

తిరుపతి వేంకటకవులు మహాకవులు, పండితులు, శాస్త్రదృష్టలు, విమర్శకులు, రసజ్ఞులు, తాత్త్వికులు, దేవీభక్తులు, లోకజ్ఞులు, సంస్కర్తలు, విప్లవజ్యోతులు!!

వీరికి కింకవీంద్రఘటా పంచానన, విద్వత్కవి, బాలకళానిధి, బాల సరస్వతి, శతావధాని, కళాప్రపూర్ణ, మహాకవి చక్రవర్తి - ఇత్యాది బిరుదములు సార్థకములై యొప్పారుచున్నవి. ఇందులో 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదము స్వదత్తాంకముగాని తదితరము లితరులిచ్చినవే! తిరుపతి శాస్త్రిగారు గతించిన తరువాత వేంకటశాస్త్రిగారికి మహాకవి చక్రవర్తి బిరుదము, కళాప్రపూర్ణ అనెడి ఆంధ్రవిశ్వవిద్యాలయపు గౌరవ బిరుదము లభించినవి. మద్రాసురాష్ట్ర ఆస్థాన కవిపీఠము వేంకటకవిగారు మొదటిసారి అధిష్ఠించినారు. ఇట్లొక్కరికి ప్రత్యేక గౌరవములు జరిగినను - అవి "తిరుపతి వేంకటకవులకు" జరిగినట్లే వేంకటశాస్త్రిగారు భావించిరి; తెలుఁగుదేశము కూడ భావించినది!

మహాత్ముఁడు గాంధీజీ స్వాతంత్ర్య శంఖ మొత్తి పరదాస్య శృంఖలల నుండి దేశమును విడిపింప నుద్యమమును సాగించి, తత్ఫలము కన్నులార గాంచి చరితార్థుఁడైనాఁడు. అట్లే తిరుపతి వేంకట కవులు నిరర్థక శాస్త్ర శృంఖలలను విదిల్చి కవితకు నవ్యతా స్వాతంత్ర్యము నిప్పింప యత్నించి దానిని కన్నులార దేశమునందు గాంచి సంతృప్తులైనారు. వీరిరువురికిఁ జక్కని పోలికలు కలవ. ఇరువురు వేషభాషలలో నిరాడంబరజీవులే! ఇరువురు కొల్లాయి కట్టిన వారే! ఇరువురు స్వీయదేశాభిమానులే! ఇరువురు జీవితమున సత్యాన్వేషణ మొనర్చిన వారే! ఇరువురు ఆధ్యాత్మిక దృష్టికలవారే! ఇరువురు ప్రజాశక్తిని నమ్మినవారే! ఇరువురు దేశమును తమవెంట నడిపించిన నాయకులే! కాని, ఒకరిది రాజకీయ రంగము మఱియొకరిది సారస్వతరంగము!

ఇట్టి తిరుపతి వేంకట కవుల సాహిత్యమును క్రమముగా స్వతంత్ర కావ్యములు, స్వతంత్ర రూపకములు, ఆశుకవిత్వము, అధిక్షేప కావ్యములు, వచనరచనలు, అనువాదములు అనెడి శీర్షికల క్రింద వివేచించుచు వారి నవ్యాలోకమును సమీక్షించుటయే యీ నా ప్రయత్నము! తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరమ్."

*

# స్వతంత్ర కావ్యములు

"అపారే కావ్య సంసారే కవి రేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥
శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాత మేవతత్॥
భావా నచేతనానపి చేతనవ చ్చేతనా నవ్యచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా."

అని ఆనందవర్ధనాచార్యుల ప్రవచనము. కావ్య ప్రపంచ సృష్టికిఁ బితామహకల్పుఁడైన కవి తన యిచ్ఛానుసారముగా విశ్వమును మార్చును. అతఁడు శృంగారియగుచో కావ్య జగత్తునే రసమయ మొనర్చును. విరాగియైనచో నాతని సృష్టి నీరసమై భాసించును. చేతనముల నచేతనములుగను, అచేతన ములఁ జేతనములుగను వ్యవహరింపఁగల కవిశక్తి సర్వతంత్ర స్వతంత్రమైనది. అందువలననే "నిరంకుశాః కవయః" అనియు ననుట. పైఁజెప్పఁబడిన స్వాతంత్ర్యగుణ మేకవియందు భాసించునో అతఁడు తారకలలోఁ జంద్రునివలె కవిమండలిలో నుజ్జ్వలుఁడై భాసించును. తత్ప్రతిభావిలసితములగు కావ్యతేజః కిరణములు చిమ్మచీకట్లు క్రమ్మిన పెక్కుతావులందు నూత్నప్రకాశముల వెదచల్లి కాంతి మార్గముల నావిష్కరించి క్రాంతి కున్ముఖముగా నడచును. అట్టి ప్రతిభావంతులగు నాంధ్ర కవులలో తిరుపతి వేంకటకవులు ప్రథమశ్రేణికిఁ జెందినవారు.

తిరుపతి వేంకటకవులు కలము పట్టునాటికి నవ్యాంధ్ర సాహిత్య యుగ కర్తయైన కందుకూరి వీరేశలింగము పంతులుగారి సంఘ సంస్కరణ విజయ యాత్ర ఆరంభమైనది. పంతులుగారి పాంచజన్య శంఖారావమునకు సాహితీ స్రవంతులు పులకరించినవి; నూతనోత్తేజముతో నవ్య దీధితులతోఁ బరవళ్లు త్రొక్కసవి. ఆంగ్లేయ భాషా సాహిత్యముల ప్రభావము తెలుఁగు సారస్వత రంగమున బాగుగా ముద్రితమై కవులయొక్కయు విమర్శకుల యొక్కయు నాలోచనా పద్ధతులలోఁ 'ప్రాత క్రొత్తల మేలుకలయిక' నెలకొనినది.

ఉదాత్తీకరణమునందుకన్న వాస్తవికతపై మక్కువ పెరిగినది; ఆదర్శము లందుకన్న ఆచరణముపై దృష్టి మరలినది దానితోపాటు సాహిత్య సృష్టి యందును కవులు ప్రాచీనాలంకారిక సమ్మతమగు నుదాత్తాదర్శ వస్తువర్ణనము నందేకాక లోకవృత్తమునకుఁ బ్రతిబింబ రూపములగు సాంఘిక కావ్యేతివృత్త వర్ణనమునందును శ్రద్ధ వహించిరి లోకవాస్తవము బట్టబయలగునట్లు చెప్పి, అందలి గుణలోపములలో లోపముల నతిశయించి చెప్పి, తద్వర్ణనాబాహుళ్య ముచే పఠితహృదయమున తదువ్యక్తినిఁ బహిష్కరణ మొనర్చుచు వ్యతిరేక క్రమపద్ధతి నాశ్రయించి సత్త్వబోధము లోకమున కందింప నప్పటి రచయితలు తమ రచనల ద్వారా కృషి యొనర్చియుండిరి. ప్రక్రియాభేదముచే కావ్య, లఘు కావ్య, ప్రహసన, వ్యాయోగ, ప్రకరణ, వ్యాసాదులు వారి రచనకుపకరణములై వర్తిల్లినవి. ఇట్టి ప్రక్రియలలో కావ్యప్రక్రియను జేపట్టి సాంఘిక దుర్వ్యవస్థలను విమర్శించి సంస్కరణ మొనర్పఁబూనినవారిలో తిరుపతి వేంకటకవులాదర్శ ప్రాయులు. వీరేశలింగము పంతులు ప్రహసనాదులలో సాధించిన ప్రయోజన మును తి వేం. కవులు కవిత్వముచే సాధింపఁగల్గిరి కాని, పంతులుగారి కార్య రంగ మతివిస్తృతము. కవులది కొంత పరిమితము.

సంస్కర్తకు ప్రాచీనత్వముపై ద్వేషముండదు. కాని, యది యెప్పుడు చైతన్యరహితమై నిరర్థకమగునో అప్పుడు దానిని తత్తత్సమయోచిత ప్రయో జన సాధన సమర్థమగునట్లు సంఘ శ్రేయస్సు నభిలషించి మార్చును. చైతన్య స్రవంతియైన జాతి వాని ప్రబోధమునకు లొంగి, గతిమార్చి ప్రగతినందుకొనును. యుగకర్త లనఁదగు కవులు కొందఱు చరిత్రలో నాయా కాలములం దుదయించి తమ కవిత్వ మహత్త్వముచే సంఘప్రబోధమొనర్చి తమ విధ్యుక్తధర్మమును నిర్వర్తించుచుండెదరు. తిరుపతి వేంకటకవుల యిట్టి సంస్కరణ దృష్టియే వారిచే శ్రవణానందము, పాణిగృహీత అనెడి కావ్యములను రచింపించినది.

తి.వేం. కవులు రచించిన ఈ రెండు కావ్యములలో వారి సంస్కరణ దృష్టి ప్రధానముగా రెండు మార్గముల నాశ్రయించినదని చెప్పవచ్చును. ఒకటి కావ్యము ధీరోదాత్తుల వంటి ఆదర్శవ్యక్తుల చరిత్రలు వర్ణించునట్టిదేకాక మధ్య మాధమ పాత్రల చరిత్రములు వర్ణించు సాంఘికేతివృత్తములు కలవై సామాజిక సాన్నిహిత్యము నందగించుకొని యుండనొప్పుననెడి ప్రగతి భావము. రెండు: సంఘాభివృద్ధికి నిరోధకములై నిలుచుచున్న కొన్ని గడ్డు సమస్యలను, ఆచార

వ్యవహారములను తాము నమ్మిన ధర్మదృష్టితో విమర్శించి పతితలముందుంచి వాని సత్పరిణామమునకు పరోక్షముగాఁ గృషి చేయుట. వీరి ప్రక్రియలకు మూలాధారములు ప్రాచీన సాహిత్యమునందు అసలు లేకపోలేదు. కాని, యవి యంత ప్రచారమున లేవు. దానికిఁదోడు ప్రాతసరుకును చదివి జీర్ణించుకొను అభిరుచి జాతియందు క్రమముగా తి వేం కవుల నాటికి దిగజారిపోవుచుండెను. కావున వాని తత్త్వమును పునరుద్ధరించి వెలుఁగున కిడ్చినా రీ కవులు అదియు నొక సంస్కరణమే. దీనిని కొంత వివరించెదను.

వీరి ప్రథమ మార్గములో ముఖ్యమైనది మధ్యమాధమ నాయకేతివృత్త స్వీకారము. దీనిని శారదాతనయాదులు సమర్థించియేయున్నారు. ''చతుర్వర్గ ఫలోపేతం చతురోదాత్తనాయక'' (కావ్యాదర్శము) మ్మని దండివచన మొక వైపు ఘోషించుచుండ, నాట్యదర్పణకర్త 'స్వభావా ఉత్తమ మధ్యమ భేదేనైవ వర్ణనీయాః, నీచోఽపీకః కథావశాత్' అనియు, భోజుఁడు 'నాయకస్త్రత్ర గుణత ఉత్తమో మధ్యమోఽధమః' అనియు శారదాతనయుడు 'జ్యేష్ఠోమధ్యః కనిష్ఠశ్చ త్రిధా నాయక ఉచ్యతే' అనియు ప్రవచించి యుండుటలో స్వల్పదోషులు, బహుదోషులు సైతము కావ్యనాయకత్వార్హత నొందుచుండుట కవకాశము కల్గుచున్నది. కాని, ప్రాచీను లాదర్శప్రాయమగు నుత్తముని చరిత్ర ప్రవచించి, మానవజీవిత ధ్యేయమును బోధించి పతితహృదయమునకున్ముఖముగా నడిపించిరి. తి.వేం. కవులిట్టి ప్రక్రియల యందును గౌరవము కల్గినవారే. కాని, లాక్షణికులు కావ్య నిర్మాణ ప్రక్రియలలో వైవిధ్యమును విశాలదృష్టితో సూచించినప్పుడు వానిని గార్యరూపమున నిరూపించి సత్ప్రయోజనము సాధించుటలో తమ స్వాతంత్ర్యమును ప్రకటింప నిశ్చయించుకొనిరి. అది ప్రస్తుత సంస్కరణ దృష్టి కాత్యంతోపకారకమగుటచే ద్విగుణీకృత లాభదాయకమైనది. కవులే యొకచో మఱొక దృక్కోణముతో నిట్లనిరి: "అధమ నాయికానాయకులకన్న నుత్తమ నాయకులు గరీయ స్థానయోగ్యులని చెప్పక తప్పదు. ఈ యంశ ముత్తమాధమ విశేషములే చెప్పుచున్నవి. అయినచో సర్వత్ర యుత్తమాశ్రయముగనే కవిత్వము చెప్పుట యుక్తమేమో! యుక్తమనుట కేసంశయము లేదు కాని, ప్రతి కవియు నొక్క త్రోవను బోవలెనివచ్చును ఒకరు పోయిన త్రోవనే పోవుటచేఁ దాను స్వతంత్రించి రచించిన కల్పనలుగూడఁ దత్తత్పలోచితములగు కతన సొంతకుమందు పోయినవారును పోయియుందురు గాన

దనకుఁ జౌచిత్యము నాపాదింపవలసినవి కావలసివచ్చును. ఆయీ హేతువులచే భిన్న విషయములుగా గ్రంథులు కావ్యములు రచించుటకై లాక్షణికులు కొన్ని త్రోవలు చూపించియున్నారు. వానింబట్టి యథేష్టముగఁ గవులు ప్రవర్తింప వచ్చును. ఒక కవి కొన్ని యట్టివియు మఱికొన్ని యిట్టివియు కావ్యములు వ్రాయవచ్చును."*

నరులలో సర్వజ్ఞుఁడును, సర్వగుణ సంపూర్ణుఁడును నగువాఁడుండుట యరుదు. ఎచ్చట లోపముండునో అచ్చట సంస్కరణ మావశ్యక మగుట సహజము. అట్లగుచో సంస్కరణోద్దేశముతో వ్రాయఁబడిన కావ్యములందు మానవుని లోపమే కొట్టవచ్చినట్లు చిత్రించుట యవసరము. అప్పుడు ఈషత్సద్గుణ యుక్తులు, ఈషద్దుర్గుణయుక్తులే నాయికానాయకులగుట సంభవించును. ఇట్టివారి నుద్దేశించి చెప్పినదే పై లాక్షణిక నియమము. ఇట్టి ప్రయోజనము లిట్టిప్రక్రియల చేతనే సాధ్యమగును. కావుననే కవులీ విలక్షణమార్గము నీ కార్యములందుఁ జేపట్టిరి. ఇట్టి వస్తువును తీసుకొన్న కథలు ఎదనెద నితిహాసములలోను, స్థల దేవ పురాణములలోను, కల్పితకావ్యములందును, చరిత్రకథాకావ్యములందును, వీథ్యా దులలోను, జానపద సాహిత్యమునందును గోచరించుచుండును. కాని, ప్రాచీన కావ్యములం దిట్టి సంస్కరణోద్దిష్టమైన స్పష్టమైన మార్గములు కానరావు, ఇంత భావతీవ్రతయు గోచరింపదు. ఉదా॥ నిరంకుశోపాఖ్యానము, నిగమశర్మోపాఖ్యా నము, గుణనిధి కథ, వైజయంతీ విలాసము, విప్రనారాయణ చరిత్ర, కవికర్ణ రసాయనము మొ॥నవి సమకాలీన సాంఘికస్థితిని తమయందు ప్రతిబింబించు కొనినవి గాని సంస్కరణతేజోద్దీపితములు కాలేదు. కావున సంస్కరణోద్దిష్టమైన సాంఘికకావ్యములను నిర్మించిన ప్రథమగౌరవము తిరుపతివేంకటకవులకే దక్కు చున్నది.

ఈ కావ్యముల వలన కవులు ప్రధానముగా లక్షించు ప్రయోజనములు కొన్ని గలవు. వ్యభిచారము కులవృత్తిగాఁగొని సత్పురుషుల నాకర్షించి వారి గార్హస్థ్యధర్మమును భగ్నమొనర్చు పతితుల నొనర్చు వేశ్యలలో నూతన పరి వర్తనము గల్పించి వైవాహిక జీవితమునకు వరింపఁజేయుట మొదటిది. వైవాహిక వేళలందు భోగముమేళము పిలువనివారు అప్రయోజకులను భావము సంఘములో

---

* శృంఖలాశృంఖలీకరణము. పుట 6 - 7.

వ్యాపించి యుండుటచే దానిని తొలగించి సాంఘిక నైతికపు విలువలను కాపాడ యత్నించుట రెండవది. ప్రబోధ మేకపక్షమునకే గాక మహోన్నతులు, ధనికులు నైనవారు వేశ్యాగమన మొక విలాసముగా నెంచి, అది పురుష చిహ్నముగా సంఘమున గౌరవము సంపాదించువారి పట్లను తేటతెల్లముగాఁజెప్పి, ఆ హేయ మార్గముపై సేవగింపు గల్గించుట మూఁడవది. అభిజాత్యము గల్గియు, గుణ వంతులయ్యు ప్రమాదవశమున గాలుజారిన యుత్తము లెట్లు పెందలకడనే నా వంకమునుండి వైదొలఁగవలెనో బోధించుట నాల్గవది పవిత్ర సాంసారిక జీవితౌన్నత్యమును వ్యంగ్యముగా బోధించి భారతీయ సంస్కృతి ప్రాభవమును ప్రకటించుట యైదవది. బాల్య వివాహములవలన నేర్పడుచున్న బాలవితంతు సమస్యను, దానివలన గలుగు వర్ణసాంకర్యమును, వారికి గల్గు అధర్మ సంతానము వేశ్యాదులకు క్రీతమగుచుండెడి దురాచారమును దూషించుట నాల్గవది. అనాథబాలలు సంఘమున నెట్లు కడగండ్ల బాల్పడుచున్నారో వారి జీవిత మందలి మానసిక సంక్షోభమును ప్రదర్శించిచూపి, తమ కోర్కెలకు, తమ వృత్తికి, బయటి లోకమునకు లంగరందక విశృంఖలమైన విచిత్ర జీవితమును వరించి వారెట్లు నిరాశా సంకులమైన అంధకార జీవిత కూపమున మున్గుచుండిరో జగత్తుకు తెలియ జెప్పుట యేడవది. నవ్య కవిత్వమునందు గోచరించు పాశ్చాత్య భావానుకరణమును నిశితముగా విమర్శించి, భారతీయ కవిత్వ వ్యక్తిత్వము చెడకుండ నవ్యత గ్రహించుటను బోధించి, కవిత్వ సార్వకాలిక ధ్యేయమును నిరూపించి యుత్తమము, చైతన్యవంతమునైన సాహిత్య సృష్టికొఱకు పాటుపడుట ఎనిమిదవది. ఇట్టి ప్రగతి శీలముతో బయలుదేరిన కావ్యముల నొక్కింత తరచి చూతము

## శ్రవణానందము

తిరుపతి వేంకటకవులు రచించిన శ్రవ్యకావ్యములలో వారి కఖండకీర్తిని దెచ్చినది శ్రవణానంద కావ్యము. సాహిత్యాభిమానముగల ప్రతి తెలుఁగువాని హృదయమును కదిలించిన కావ్యమిది దాని నామూలాగ్రము కంఠస్థ మొనర్చిన వారిప్పటికిఁ గలరు.

క. "ఒక శ్రవణానందమ్మన
ఒక పద్యమునందుఁ గల్గు నొక పాదము నం
దొక యక్కరమున కొసఁగిన
సకలమ్మగు రత్నగర్భ దాలనె తూఁచన్"*
అని సమకాలీన ప్రశంసలందిన ప్రబంధ మది.

శ్రవణానంద మని పేరుంచుటలోనే చమత్కారమున్నది. ఎవరి శ్రవణ మున కానందము? అవయములకు నవయవికిని భేదము పాటింపఁబడదుకాన సహృదయుని శ్రవణములనియే తాత్పర్యము. బ్రహ్మానంద సహోదరమగు కావ్యరసానందమే యీ శ్రవణానందము. అప్పుడు పతితకు ప్రతికావ్యము శ్రవణానందము కల్పింపదా? యను శంక కల్గును. రసకావ్యము కల్గింప వచ్చునని సమాధానము. అట్టి సామాజిక రసానుభూతిని అధికరించి కావ్యనామ ముంచుటయే యిచ్చట చమత్కారము. దానివలన పతిత హృదయమున కుతూహలీకరణము గలిగి కావ్యపఠనోత్కంఠ జనించును. ఇట్టి పద్ధతి నాశ్ర యించియే తెలుఁగున 'కవికర్ణ రసాయ'నాది కావ్యనామము లుంచఁబడినవి. కవులిందు స్వీయ రసకావ్య నిర్మాణదక్షతను స్వాభిమానముతోఁ దెల్పుకొను టయే గాక, శృంగారాంతమును గూడ సూచించు చుండిరి. అర్థవ్యంగము నాశ్ర యించి సర్వహృదయాహ్లాదియగు శృంగార మిందు రసమనియు శ్రవణ సుభగములైన ప్రసాద మాధుర్యాది కావ్యగుణము లిందు రసోచితముగాఁ గూర్పఁ బడినవనియు, గుణత్రయాశ్రితమైన సామాజిక సర్వప్రవృత్తి కిది ఆస్వాద యోగ్యమనియు నీకావ్యనామము ధ్వనించుచున్నది.

ఇది యైతిహ్యమూలము కావ్యము. ఇందలి యితివృత్తము కల్పితము. తెలుఁగులోఁ గల్పిత ప్రబంధములు చాల తక్కువ. పింగళి సూరన వంటివారు స్వతంత్ర మార్గము త్రొక్కి కల్పిత కావ్యములకు మార్గదర్శకులు కాగా, తి.వేం. కవులు నట్టి మార్గము ననుసరించిరి. "కేవలం కల్పనా కథలు కృత్రిమరత్నము" లనెడి రామరాజ భూషణుని మాట నోటుపడఁ జేసిన దీకావ్యము. దీనికిఁ దోడు కృతికర్త కల్పితగాథను పఠించినాఁడు—

---

* శ్రీ రామచంద్రుల సీతారామ శాస్త్రిగారు వ్రాసిన పద్యము.

చ. తెలుఁగున( జాటు పద్యములు తీయనలై యలరార( జేయు మీ
రలు వసిఁబాని యందమగు గ్రంథ మొకం దతి నూతనమ్ముగా
నలరియు నీతియుక్తమగునట్లు ప్రధానరసంబు చిప్పిలన్
గలయ రచింపరాదె? కృతినాయకుఁగా నను( జేసి యొప్పగన్" అని.
—శ్ర. పు. 24.

ఇందు నూతనమనఁగా కల్పితమనియే భావము. కావుననే తి.వేం. కవులు కవి జీవితమును కావ్యముగా రచింపఁబూనినారు. కవిజీవితములు, ఆత్మచరిత్రలు, జీవిత చరిత్రలు తెలుఁగులో వ్రాయఁబడ వలెననెడి యుద్యమము వీరేశలింగము పంతులుగారు స్వయముగా సాగించియుండిరి. అవన్నియు సామాన్యముగా చారిత్రక సత్యములై యొప్పు చుండెడివి. తిరుపతి వేంకట కవులట్టి చరిత్ర దృష్టిని మాని తమ ప్రతిభాశక్తితో నొక కవి జీవితమును కల్పించి పూర్వ సాహిత్యమునందు ప్రాయికముగాఁ గాననగు నృపత్యమాత్యవిట చరిత్రల కన్న యొక వైలక్షణ్యము సాధించిరనవచ్చును.

వారిదృష్టిలో—

తే గీ. "రాజుల చరిత్రలును గవిరాజ చరిత
ములును గ్రంథమ్ములకు వన్నెఁ గలుగఁ జేయు;
నందులో నా మనమ్మున కరసిచూడఁ
గవుల కతలకు రాజుల కతలు లొచ్చు." —శ్ర. పు. 26.

ఇట్టి దృష్టియే 'పండితరాజ' నాటక రచనకును హర్ష చరిత్రానువాద మునకును గూడ హేతువైనది. కావ్యము నీతియుక్తమగుట వీరి రెండవ లక్ష్యము. యశసాదులగు కావ్య ప్రయోజనము లందు కాంతా సమ్మితమైన యుపదేశ మొకటియై యున్నది. కొందఱు కవులు కథను వాస్తవిక వాతావరణములో స్వయం స్వభావ పరిపుష్టి వహించి కార్యకారణ బద్ధమై పరిణతి నొందునట్లు కావ్యమును రచించి, దానియందు ప్రబోధమును గౌణముగా భాసింపఁ జేసెదరు. కొందఱు కావ్యముఖమున నొక నిర్దిష్ట నీతిప్రబోధము లక్షించి తదర్థ వ్యంజన సమర్థములైన సర్వకావ్యార్థ సంచయమును సమకూర్చి తత్ప్రతిపాదనాను కూలముగా కార్యమున ననుసంధించెదరు. కవి సమర్థుఁడైనచో నిట్టి ప్రక్రియలలో రసపోషణమునకు, నీతిప్రబోధమునకు పోష్యపోషక సంబంధము గల్పించును.

కానిచో అర్థప్రధానముగు నొక నీతికి కావ్యరసమును బలిపెట్టును. తి వేం కవులు శ్రవణానందమునం దెంత నీతిబోధకుఁ బ్రయత్నించిరో అంత రసపుష్టికి పాటు పడిరి. ఆ యర్థమే "ప్రధాన రసంబు (శృంగారము) చిప్పిలన్'' అను పదము నందు సూచింపఁబడినది. తనను నమ్మించి వలపించి, వంచనఁజేసిన నాయిక నుద్దేశించి నాయకుఁడు వితర్కించుచు కావ్యప్రబోధమును వ్యంగ్యముగాఁ జాటి నాఁడు—

ఉ. ''వెలవెలలన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలుగల పెండ్లికిం జనఁగరాదు; జనంగనబోల దాటపా
టల, నదిగాక విద్యఁ గడంగి పఠింపఁగరాదు; దీనికిన్
సొలసినవారకెల్ల మధుసూదను దుర్గతి రాకతీరునే—

తే.గీ. అనుచు నెఱుఁగంగ నేర్చిన యట్టివారి
కెల్ల నెఱుఁగంగఁజేసితి విందువదన!
యెఱుఁగనేరని యట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁగలాఁడె!'' —శ్ర.పంచ. 84,85.

అను మాటలలో లోకహితోపదేశముకొఱకై తమ కావ్య ముద్దిష్టమైనదని చెప్పి,

కం. "లోకోపకారకంబగు
నీ కృతికిన్ మెచ్చవలదె! నేర్పరులెందున్" (శ.పంచ. 86) అని హెచ్చరించిరి. 'కృతి' యను శబ్దములోని శ్లేష గమనింపఁదగినది.

శ్రవణానందము శృంగార రసప్రబంధము. ఇందు నాయకుఁడు మధుసూదనాఖ్యుఁడగు కవి. నాయిక బాలామణి యను వేశ్య. మనుచరిత్రలోని వరూధినివలె బాలామణి నాయకప్రాప్తివఱకు నన్యకాంతయే. వరూధినికన్న బాలామణి యదృష్టవంతురాలు. ఆమెకు మధుసూదన ప్రణయసంప్రాప్తి కలిగినది. అపైఁ గొంతకాలమునకు కాలప్రభావముచే నామె బుద్ధి యన్యపురుషసక్తమైనది. వెంటనే యిరువురికి నెడబాటైనది కథ ముగిసినది. కథాశక్తి యంతయు నాయిక నాయకప్రాప్తిని సంపాదింప శతథః యత్నించుటయందే సంపుటీకరింపఁబడినది. ధీరుఁడగు నాయకుఁడు క్రమోన్మీలిత నాయికాగతానురాగ చేతసుఁడై చివర కామెకు దాసుఁడయ్యుఁ దన తప్పు తెలిసికొని యాత్మబోధ యొనర్చుకొని నిగ్రహముతో నాత్మోన్నత్యమును సాధించుకొనినాఁడు. ఒకానొక

యుత్తముఁడు స్వచ్ఛమగు స్వీయనాయికానురక్తిని(దవిలి తత్స్వచ్ఛత శంకావహమైన వెంటనే దానిని వీడి స్వీయధర్మమును రక్షించుకొని వేశ్యావ్యామోహమనెడి యాపద్దుర్గుణ భూయిష్ఠులగు మద్యమప్రవృత్తుల కాదర్శప్రాయుఁడై, పతన దుఃఖితులగు సత్పురుషుల కుజ్జ్వల భవిష్యన్మార్గదర్శియై లోకహితైక మూర్తి యగుట యిందలి తాత్పర్యము.

స్థూలదృష్టితో చూచుచో నిందుఁగల్గెడి శంక లిట్టివి. అవి - కావ్యమునందు వేశ్య నాయికగా నుండవచ్చునా?; ఉన్నచో నా కావ్యమునందు స్ఫురించెడిది రసమా? రసాభాసమా? వేశ్య నాయికయగుచో నాయకుఁ డెట్లుండుట యొప్పును? మధ్యమాధమనాయకులకు కావ్యమునందున్న స్థానమెద్ది? అనునవి.

శ్రవ్యకావ్యములలో గణిక నాయికగా నుండకూడదను నిషేధ మెచ్చటను లేదు కాగా ప్రకరణాది దృశ్యకావ్యములలో గణిక 'యేకత్రైవానురాగయై' యుండ వచ్చునని దశరూపకాదులయందవకాశము కల్పింపఁబడినది. ప్రక్రియాభేదముచే మాత్రమే భిన్నమగుచున్న దృశ్యకావ్యములందలి యీ యవకాశమును గ్రహించియే శ్రవ్యకావ్యములనందును ప్రయోగించు తలఁపున శారదాతనయాదులు మధ్యమాధమ నాయికానాయకులకు కావ్యనాయికా నాయకార్హతలు గల్పించి పెట్టిరి. దానితోపాటు స్వీయ, పరకీయ, సామన్య అని ఏర్పడిన నాయికాత్రయ విభాగము ప్రయోగ సౌభాగ్యము వహించి సార్థకమగుటకును వీలున్నది. తి.వేం. కవులీ దృష్టితో నాయికను కల్పించినారు. ఇచ్చట గమనింపఁదగినది శుష్కలాక్షణిక నియమ ప్రవచనముకాదు, నియమముల వెనుకనున్న పరమతాత్పర్యము కవులెట్లు వెలుఁగునకుఁదెచ్చి కావ్యకళాత్మ నావిష్కరించినారనియే.

గణికయయ్యు ననన్యకాంతయై 'ఏకత్రైవానురాగము' గల్గియున్నచో శృంగారమనిదశరూపకకర్తయొప్పుకొనుచునేయున్నాఁడు లాక్షణికులుస్థూలముగా వేశ్యానాయిక యనఁగా పరిచిత బహుపురుష సంయోగ యనియే భావించిరి. వేశ్యాకులమున జన్మించియు 'ఏకత్రైవానురాగము'గల్గియున్నచో గణికపరకీయ కన్న నెందును దీసిపోదు. అభిజాత్యము గల్గియు చంచలమైన యుత్తమనాయిక వేశ్యకన్న ఘనమైనదికాదు ఇచ్చట గమనింపవలసినది మనఃప్రవృత్తిగాని కులముగాదు; లాక్షణికప్రోక్త వేశ్యాపదము వ్యభిచార మనఃప్రవృత్తికి సంకేతము. అట్లన్వయించుచో విరోధముండదు. ఈ కావ్యమునందు వేశ్యాశ్రయమైన శృంగారము క్రమారోహణస్థితి యందు నడుపఁబడి, ఆభాసస్థితి యుదయించు

సరికి కథ ముగింపఁబడినది. కావున శృంగారరస ప్రాధాన్యత కెందును లోటు కలుగలేదు. ఒక విశేషము. అభినవ గుప్తపాదులు రసములకును చతుర్విధ పురుషార్థములకును సమన్వయము స్థాపించునంతవఱకు లాక్షణికులలో నైతము రతిభావాదులయందు ధర్మాది పురుషార్థదృష్టి యంతగా గోచరింపదు భాణాదు లలో గోచరించు విటవేశ్యాదులరీతి శృంగార వాచ్యమగుట యందువలననే. నిజముగా భాణాదులను ధర్మదృష్టితో నెంచుచో రసాభాసములు.

నాయికా మనఃప్రవృత్తిపైననే నాయకపాత్ర చిత్రణౌన్నత్యము శృంగార కావ్యములం దాధారపడియుండును ఊర్వశి వసంతసేనలఁబట్టియే పురూరవ చారుదత్తుల సృష్టి రాణించినది. ఇందు తి. వేం. కవుఁలు వసంతసేన నొజ్జ బంతిగాఁగొని బాలామణినిఁ జిత్రించుటచే మధుసూదనుఁడను సుకవి నాయకుఁ డైనాడు. కాళిదాసు నాయికానాయక సమాంతర హృదయ సంయోజన శిల్పము నందు మేటి; శూద్రకుఁడు అసమాంతర హృదయ సంయోజన శిల్పదక్షుడు. శూద్రకుని సున్నిత శిల్పము కవుల కావ్యమున కాయువుపట్టైనది.

ఉత్తముడు నాయకుఁడగుచో మధ్యమాధములు పతాక ప్రకరీనాయకులు కావచ్చును. లేక వారే నాయకులగుచో కాలవైపరీత్యముచే పతితులయ్యు నుత్త మత్వ సాధనోత్సాహలౌనట్లు చిత్రింపఁబడినచో నాయకస్థితికి లోపము రాదనెడి మతము తి. వేం. కవులది. ఈ దృష్టియు పూర్వనాయక సమ్మతమే. కాని లక్ష్యములంతగా లేకపోవుటచే నీ కావ్యప్రక్రియ నవ్యముగా భాసించుచున్నది.

శ్రవణానంద కావ్యము పఠింప నారంభించితిమా ముగియునంతవఱకు దానిని వీడ బుద్ధి పుట్టదు. అట్టి యుత్కంఠాభిరుచులఁ గల్గించుట కథాకథన శిల్ప మర్మజ్ఞులగు కవుల లక్షణము. బీజావాపనమైనది మొదలు ద్రాక్షతీగ పందిరి కల్లుకొనుచు క్రమముగా నెట్లు చివుళ్ళు, రెమ్మలు, ద్రాక్షా గుళుచ్ఛములు వేయునో అట్లే ఈ కథ కార్యకారణోపపత్తులతో సహజముగా నల్లుకొని ఫలవంతమగుచున్నది

కావ్యనాయకుఁడగు మధుసూదనకవి ఉత్తుంగ హిమ నగ శృంగము వంటివాఁడు, ధీరుఁడు, ప్రశాంతుఁడు. వర్ధించిన విస్తరివంటి దాతని జీవితము. హిమాచలమునకువలె నాతనికి ధవళయశః కాంతులు దిగంతముల లాస్య మొన ర్చినవి. తన కీర్తి కెచ్చట మచ్చరాకుండ కాపాడుకొనుటయే అతని జీవిత

ధ్యేయము. 'శ్రేయాంసి బహు విఘ్నాని.' బాలామణి అతని బ్రతుకు బాటలో దారనిల్లినది. ఆమె భూమియందవతరించిన యప్సరోఙ్గన. ఆమె కాళిజాత్యము కన్న ఆశయము గొప్పది. అందని మ్రానిపండైన మధుసూదనుని గోరినది. ఆమెయందు సంస్కారవాసనగా నున్న సంగీత సాహిత్య పిపాస కవివరునిపై మరులు గొల్పించినది.

తే.గీ. "విత్తమార్జించు పనికినై వేలకొలఁది
గా నుపాయములున్నవి కాని కార
దా కుచమ్ములు గలవాఁడు దక్క నితరుఁ
డింతిఁగౌఁగిటఁ జేర్చిన నేమి ఫలము?" - శ్ర. ప్ర. 91.

అని తమకము వహించినది. కోర్కె రేకెత్తగా హిమనగ సన్నిభుని గరిగించి జాలువారించి తజ్జల తరంగములం దూయలలూగ నెంచినది. అనగ రాజు కరుడుగట్టిన ధీరగుణుఁడు ఏ వసంతగ్రీష్మములందో కాలమహిమచే నించుక ద్రవించును, మఱల ఘనీభవించును ఆ కింక మెఱిగిన బాలామణి యుచితసమయములలో నాతనియందు మదనతాపము కల్గించినది. అతఁడు కరిగినట్లే కరిగి మఱల ధీరుడైనాఁడు. ఇందు నాయిక యొనర్చు ననంత ప్రయత్నములందు జీవకళ, చైతన్యశక్తి, తొణికిసలాడుచుండును. ఆమె యొక తటిల్లత - అతఁడొక మేఘనాథుఁడు.

కథా ప్రవృత్తి ననుసరించి యాశ్వాస విభాగ మిందు ప్రయోజనవంతముగా నొనర్పఁబడినది. నాయికానాయకుల నొక్క రంగము మీఁదకుఁదెచ్చి ప్రథమాశ్వాసము, వచోనైపుణ్యము చూపి వేశ్యమాతయు, బాలామణియు నాయకుని వశవర్తినొనర్ప యత్నించి విఫలులయి కార్యాంతరమాలోచించుటలో ద్వితీయాశ్వాసము, నాయిక తన వచో విలాసములు వదలి విలాస చేష్టా విశేషములచే నాయకు నేకాంతమున లోఁగొనబోయి, చెలుల యవివేకముచే నాతనిఁ గోల్పోవుటయు, నాయకుడు గాఢ మనోజతప్తుడై నాయికాయత్తచిత్తుఁ డగుటయుఁగల్పించి తృతీయాశ్వాసమును, మిత్రప్రబోధముచే విముఖుఁడైన నాయకుని సామీప్యమును విద్యాభ్యాస నెపమున సాధించి, యేకాంతమున వానిఁ దనవానిగా జేసికొనుటతో చతుర్థాశ్వాసమును, తుష్టకామయై మదించి, చంచల యగుటచే నాయకుఁడు విజిత మన్మథుఁడై నాయికను త్యజించుటలోఁ బంచమాశ్వాసమును ముగించి కవులొక కథాక్రమ వికాస శిల్పమును బాటించిరి. అడుగడుగునకు నాయికాయత్నము

ఫలించినట్లే యుండును కాని, చమత్కారముగా నది విఫలమగును. అనిశ్చిత ఫలములగు కథా ఘట్టములం దాశ్వాసములు నిలుపుటచే ఒకితకు కథాగతిలో నుత్కంఠ ద్విగుణీకృతమగుచున్నది. ప్రతియంకమునందును కార్య కారణ సమావృతమైన యొక సమగ్రత గోచరించు చున్నను పూర్వాంక కథ పరాంకవృత్తమునకుఁ గారణరూపమై నిలుచుట యిందు సాధింపఁబడిన ప్రయోజనము.

రసానుకూలములగు సన్నివేశములను పాత్రభావోన్మీలన క్రమమున కనుగుణముగా తి. వేం. కవుల కావ్యమునం దొక నిర్దిష్ట ప్రణాళిక ననుసరించి సంఘటించినారు.

1. నాయికా నాయకుల వేశ్యాగృహమందలి ప్రథమ సమావేశము.

2. అంతికోద్యాన వనమునందలి ద్వితీయ సమావేశము.

3. నదీతటమున వెన్నెలరేయి జరిగిన తృతీయ సమావేశము

4. మిత్రుని యింట నాయకుఁడు నిద్రించుట.

5. విద్యాభ్యాసావసరమున నాయకుని యింట నాయికతో జరిగిన చతుర్థ సమావేశము.

6. మిత్రుఁడొకఁడు నాయికయొక్క చంచల మనఃప్రవృత్తిని దెల్పుటచే మనము విరిగి నాయకుఁడు గార్హస్థ్య ధర్మమును స్వీకరించుట—

అనునవి ఈ కావ్యమునందలి ప్రధాన సన్నివేశములు నాయికా నాయకుల మనఃప్రవృత్తిలో రతిభావము రసస్థాయినందుకొనుట కొక్కొక్కటి యొక్కొక్క మెట్టు. ప్రథమ సమావేశమున నాయిక నయనచకోర చంద్రుఁడగు నాయకుని సన్నిహిత మొనర్చుకొని స్పర్శసుఖ మనుభవించినది. ముగ్ధభావముచే ఛన్న మయ్యును ప్రస్ఫుటమగు తన కోర్కెను సాత్త్వికభావోదయముతో తాంబూల మందించుటలోఁ దెల్పుకొనినది. నాయకుని ప్రశాంత మనఃకాసారములో స్పష్టాస్పష్టమైన మనోవికారము చిఱుతరంగ రేఖలను ముద్రించి నిలిచినది. అది అపవాద భీతిచే నణగార్పఁబడినది. ద్వితీయ సమావేశమునందు సయుక్తికము లైన నాయికవచనము లాతనికి మనఃప్రీతిఁ గల్పించి, ఆమెయం దొక విశిష్ట భావగౌరవ మేర్పరచి "ఇపుడెవ్వనినైనను బుట్టఁబెట్టవే?" అను ప్రశంస నిప్పించియు అతని ధృతిప్రభావమునకు లొంగిపోయినవి. ఈ పై రెండు సన్నివేశము

లందు నాయకునకు నాయికతో సమగ్ర పూర్వపరిచయాదులు లేకయే సమావేశ మేర్పఱుచుటచే నతని హృదయ మార్ద్రము కాలేదు. ఈ సత్యము వేశ్యమాత గమనించినది. కూతున కిట్లని ధైర్యము సెప్పినది:

చ. "పరిచయ మెక్కుడైన పిదపన్ మఱియెంతటివారికైన ము
మ్మరమగు మోహవారినిధి మగ్నులఁగా నొనరింపవచ్చు." (ద్వి.102)

నని పెండ్లి మేళమున కొప్పించినది. పెండ్లిలో వేశ్యనృత్యాదులు నాయకుని హృదయమును కరఁగించి పూర్వరంగము సిద్ధపరచినవి. కవులు విభావపరి పుష్టితో సన్నివేశమును సిద్ధపఱిచిరి. నాయకునిముం దాలంబన విభావమును బాలామణిని - అపరరతీదేవిని—

సీ. "చిన్ని వెన్నెల మోము చెల్వువద్ది కొసంగు
చిన్నారి పొన్నారి చెమట దాని,
నాయాసమున తెప్ప లల్లనల్లనార్చు
శ్రీయుతంబగు కన్నుదోయి దాని,
నొలయు నిట్టూర్పు వాయువుంచేఁ దబ్బిబ్బు
లై యుబ్బు పెన్గుబ్బ లమరుదానిఁ,
గరఁగి నీరై నానికను జాలువాఱు నిం
దూరంపు తోరంపు సౌరుదానిఁ
తే.గీ. గంకల ధ్వనులొలయఁ బొంకమ్ము మీఱ
జాఱు మొలనూలు గల కటిస్థలము దానిఁ
గందియున్నట్టి పాదయుగంబు దాని" (తృ. 28)

సృష్టించి సరసచైతన్య సజీవచిత్రమును నిలువఁబెట్టిరి; ఉద్దీపన విభావములుగాఁ జెట్లకుఁ బూచిన పుష్పజాలములను వర్షించు పిల్లవాయువులను, పల్లవాంతరములనుండి వెరలిపైఁబడు చంద్రకిరణములను ఝుమ్మని మీదఁబడి హాహాకారసేయు భ్రమరసమూహములను, కామతంత్రములు తెనిఁగించి విప్పిచెప్పెడి శుకపికములను, అన్యోన్యముగా రతిక్రీడసల్పి కోటికలికిక లెత్తించు శారికలను తీర్చిదిద్ది రంగము నలంకరించినారు. నాయిక భావోన్మత్తయై నాయకుని కరగ్రహణ మొనర్చినది. ఇఁక నాయకుఁడు—

ఉ॥ "గట్టు చెదెన్, దవానలగ గుండెలు జల్లనె మై చెమర్చె ని
ట్టట్టు వడంకె హస్తములు, నన్యముఁజెప్పట కోపఁడాయె. నా
పట్టున నాకుకుందయినఁ బల్కఁగలాఁడె మఱొక్క మాట! లేఁ
దట్టి జితేంద్రియుండు ప్రవరాఖ్యుఁడు దక్క మఱొక్కఁడెక్కడన్.
—శ్రీ.శృం. 47.

కథనంతయు నొకక్రమపద్ధతిని నడపించి యొకయున్నతస్థితి కెక్కించి, పఠితకు రసస్థాయి నందించినారు కవులు. ఉత్తుంగతరంగ సంకులములైన మహానదులు రెండు సంగమింపనున్నట్లు చిత్రించుచున్న యీ సన్నివేశము నందు చెలుల ప్రవేశ పెట్టి నిగ్రహాత్మక మగు నొక్క మలుపును సృష్టించుటచే కథ ద్విగుణీకృత శక్తిమంత మగుచున్నది. కళాగోపనముచే కళాప్రకాశము వెలార్చు పద్ధతి యిది.

ఇది భావిసన్నివేశమునకు దారి తీసినది. నాయికానాయకులపుఁ దులాను రాగ ముదయించినది. వారు పరస్పర సంగమాకాంక్షులై మన్మథ బాధకెరలై పోయిరి. ప్రణయలేఖలు, సందేశములు నడిచినవి. అపవాదభీతుఁడగు నాయకుఁడు నాయికకు వత్తునని మాట యిచ్చియు పోఁజాలక మిత్రునింట నిద్రించెను. కామాతురయైన బాలామణి లజ్జ నుజ్జగించి నాయకుని యింటనే ప్రవేశించి యాతని గృతార్థు నొనర్చినది. ఇచ్చట సన్నివేశక్రమవికాస మపూర్వ పణితి యందు నడచినది. మదనవ్యామోహమున సుప్తమైయున్న వివేకము నాయకునికి ప్రథమ సంగమానంతర ముదయించినది మానసబోధాత్మకమగు పరితాపాగ్ని యందాతఁడు తప్తుడై శుద్ధుఁడైనాఁడు. నాయక సన్మార్గానుసరణమునకు హేతు భూత మా చివరి సన్నివేశము. ఇట్లు నాతి విపులమగు నీకావ్యమునం దిన్ని సార్థక సన్నివేశముల ననంత కథార్థస్ఫూర్తి కంగములుగా సంఘటించి తమ కావ్య నిర్మాణశిల్పమును వెలార్చిన తి. వేం. కవులు ధన్యులు.

సుసంఘటిత సన్నివేశాత్మకమగు నీకావ్యేతివృత్త మొకవిధముగా శ్రవ్య కావ్యముగాఁ దీర్చి దిద్దఁబడిన ప్రకరణమా యనిపించుచున్నది. దానికి కారణ మిందుఁగల నాటకీయరచనా పద్ధతి. సూత్రధారుఁడు పాత్రలఁబరిచయముచేసి రంగముపైఁ ప్రవేశపెట్టునట్లిందు కవులచే పాత్రలు ప్రవిష్టములై స్వీయ సంభా షణలవలననే కథాగతిని సాగించుచుండుట చాలచోట్లఁ గాంచెదము. ప్రధానముగా

ద్వితీయ తృతీయ చతుర్థ పంచమాశ్వాసములు సంభాషణ బహుళములై వరలుచుండుట యిందులకుఁ బ్రబల తార్కాణము, ఇట్టి వస్తు నిర్మాణ శిల్పమున కంగములైన వానిలో సంభాషణ శిల్పము, వర్ణనా శిల్పము, వాక్యార్థ శిల్పము, అలంకార శిల్పము, పాత్రమనఃప్రవృత్తి చిత్రణ శిల్పము అనునవి ముఖ్యములు.

1) సంభాషణ శిల్పము : పాత్రోచితమైన సంభాషణౌచిత్య పోషణవలన రసప్రతీతికి చక్కని మార్గమేర్పడును. వేశ్యమాత యుక్తి నైపుణ్యమునకుఁ బెట్టినది పేరు. ఏ యెండ కా గొడుగు పట్టఁగలదు. ఏ పాట కా తాళము వేయఁగలదు. పరమవైష్ణవునిపై మచ్చుమందు చల్లి యర్పించి, విశిష్టాద్వైతము నొప్పఁజెప్పినది; తన కనుగుణముగా దానిని మలచి ప్రవచించినది. కూతునా వైష్ణవునికిఁ జూపి—

తే.గీ. "(కాన) దీనిని మీ దాసిగా నొసర్చి
సంతసము పెరుమాళ్ళకు సంఘటింతు
భాగవతుల కైంకర్యంబు భగవదధిక
సమ్మతంబని కాదె? వైష్ణవ మతంబు?" (ద్వి. 29)

అని వేశ్యావృత్తికి పెరుమాళ్ళ సేవకు బాదరాయణ సంబంధము గలిపినది. మహాకవి నోటికి తాళము వేసినది. అతఁడు నివ్వెరపోయి దాని ధాటికిఁ దాళలేక తప్పుకొనిపోయినాఁడు. కవులన్నట్లు వేశ్యమాత నిజముగా "మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత." (ప్ర. ద్వి. 56)

బాలామణి మధుసూదనుని నొండిగా నుద్యానవనమునఁ గలిసి మాట్లాడినపుడు సయుక్తికములగు పల్కులాడినను ఒకమాట కొకమాట కతుకులేదు. మదనోద్వేగమువలన నిలకడలేని మనస్స్థితి ఆ సంభాషణలో కవులు స్థాపించినారు. మదనావిష్టులైన నాయికా నాయకుల సంభాషణలు శృంగారావస్థల కాయువు పట్టులు. తృతీయ సమావేశమునఁ బాణిగ్రహణ మొనర్చు నాయికయందు చివరి శృంగార యవస్థయగు 'మరణము'ను ధ్వనింపఁజేయుట తద్విప్రలంభ పరాకాష్ఠను సూచించుచున్నది. ఇచ్ఛ, ఉత్కంఠ, అభిలాష, చింత, స్మృతి, గుణస్తుతి, ఉద్వేగము మొ॥ శృంగారావస్థలు నాయికా నాయకులయందు ఆయాచోట్ల పూర్వరాగమునందుఁ బ్రయోగించినట్లు పఠితలకు సులభముగాఁ దెలియును.

అవస్థలనుబట్టి సంభాషణలు రచించుట కవులొనర్చిన యొక శిల్ప విశేషము. దానికి కావ్యమంతయు నుదాహరణమే. విరహోత్కంఠిత, విప్రలబ్ధ, అభిసారిక, వాసకసజ్జికం శృంగారావస్థలు ఆయా పట్టములందు నాయికలో సమన్వయింపఁ బడి శృంగార రస కావ్యమున కలంకారములైనవి.

2) వర్ణనాశిల్పము: శ్రవణానందమునందు ప్రబంధమార్గం ననుసరించి అష్టాదశ వర్ణనలలో కథానుకూలములగు వానిని గొన్నింటిని గైకొని కథార్థ సంచయమునకుఁ బోషకములగునట్లు కూర్చి రచించిరి. ప్రథమాంకములోని నగరాది వర్ణనములు నాయికానాయకులకు చక్కని పూర్వరంగము నిర్వహించినవి. ప్రకృతి పురుష పరస్పర ప్రభావతత్త్వమును నిరూపించుచున్నవి. ద్వితీయాశ్వాసములోని వసంత ఋతువర్ణనము నాయికపట్ల నాయకునికి మనః ప్రీతియు, కోర్కెయు నంకురింప నుచితమైన కాలస్థితిని నిర్వహించినది. తృతీయాశ్వాసములోని సాయంకాల, నక్షత్ర, సూర్యోదయాది వర్ణనములు నాయికానాయకుల ప్రణయ భావతీవ్రత కుద్దీపనములై శోభిల్లినవి. చతుర్థాశ్వాసములోని గ్రీష్మ వర్షర్తువులు నాయికానాయకుల ప్రథమ సమాగమము గల్పించు ఉద్యుక్తతలై యింపునింపినవి. పంచమాశ్వాసములోని హేమంత ఋతువర్ణనము నాయక పరాఙ్ముఖతకు కాలప్రభావ సమన్వయమును నిర్వహించినది. ఇట్లు కథానుకూల ఋతువర్ణన మొనర్చుచు ప్రకృతిగుణము పరోక్షముగా మానవచిత్తవృత్తిని ఎట్లు మార్చునో చిత్రించుచు నీకావ్యమున రసభావములను కవు లుదాత్తీకరించిరి.

ఉదా: వసంతర్తువర్ణనము :

సీ॥ అత్తతోఁ బోరాట మంది పోయినయట్టి
జామాత తనుఁదాన సఖ్యపడియె;
భార్యతోడ విరోధపడి పోయినమగండు
మగుడ భార్యను బ్రతిమాలుకొనియె;
సన్న్యసించుటకు నిశ్చయమందిన విరాగి
రాగాండుఁడై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థమై దూరగతుఁడైన సంసారి
తత్తఱమ్మున నూరిదారిపట్టె

తే.గీ. బ్రహ్మచారులు పెండ్లికై పెట్టఁబడిరి
వేశ్యమాతం తోడను విగ్రహించి
సిద్ధి విటులెల్ల నల్లాని నడుసరించి
రహహా! యేమందు నవ్యసంతాగమమున. (వ్రి. 65)

ఈ వర్ణనము కథాసందర్భమున కత్యంతానుకూలమై, కాంతాభావనిని సూచించుచు, కథాగతికి తోడ్పడుచు, భక్తిపర విరాగవృత్తిని గల్పించుచు, రసమును పోషించుచు, సజాతీయ భావబంధురను కావ్యమును సాటుచున్నది.

ఇక్కడ విషయవైవిధ్యముగల మఱికొన్ని వర్ణనల నిందుఁ బొందుపరచు చున్నాను:

1) వృత్త్యనుప్రాసాలంకార సంశోభితమై దీర్ఘ సుసంస్కృత సమాస సంఘటితమై ఓజోగుణభూయిష్ఠమైన వర్ణనము:

ఉ. "వేసవి వచ్చె భాస్కర నవీనగభీనమరీచిరాజ్వ ల
ద్భానవవాసనైక పలనా కలనా ఘనతాయితా నమ
ద్వ్యోమన గాననాటిక్కృతి ఘుంక్కృతి సంఘన వట్పదాళి
భాసుర కమ్ర పద్మ విటప ప్రకర ప్రతిభా ప్రమోదమై."
—ప్రవ. చయ. 81.

ఈ వర్ణనమునే మాధుర్య ప్రసాదగుణ ప్రధానముగను, ఉదాత్త భావనా చమత్కృతి యుతముగను ఒనర్చిన వైఖరి—

ఉ. "వేసవి రాక పెట్టదని వేడుకనొక్క వచింపనేల? యా
మాసమునొంటి తాపమున కాఁగఁగలేక రమావిభుండు దా
వాసము జేసె సంద్రమున, నివాసము జేసె సుమేరువున్ హిమా
నీసముపేత పర్వత వసింపసింపట [illegible]." —ప్ర. చ. 84.

చ. "ఎలమల దాహపుం గలుపు వెన్నెలఁగ నేల? తినేసు సంతవాఁ
డలితర తృష్ణచేఁ దన సహస్ర కరమ్ములు సాచి నేమపుం
గరి పవనాలి గుంటలనెకాను సవమ్ములఁగాను, కూపసం
తతులనెకాను కండికిఁ గనంబడనంతయుఁ ద్రావె నీరమున్."
—ప్ర. చ. 85.

వసంత గ్రీష్మములు శృంగార రసభావ పోషకములైన ఋతువులు. సామాన్యముగా వసంతర్తువులో నాయికానాయకులకు ప్రథమ వీక్షణ సన్నివేశము గల్పించి, గ్రీష్మర్తువులో పూర్వరాగఫలముగా ప్రథమ సమాగమము వర్ణించుట ప్రాచీనులగు కవులు పాటించిన మర్యాద. గ్రీష్మతాపము మదనతాపము నధిక మొనర్చినగాని "మరణా"ద్యవస్థలు పుష్టి మంతములు కావని వారి మతము. ఈ మతము ననుసరించి ప్రథమ సంయోగ సమయ సూచితమైన యీ గీష్మవర్ణనము పూర్వకవి సమ్మతము, అపూర్వ రసశిల్ప రహస్యమునై రక్తిం గట్టుచున్నది. కవులకు గ్రీష్మవర్ష ఋతువర్ణనమన్న సామాన్యముగా మక్కువ హెచ్చు. పెక్కు కావ్యార్థ ప్రయోజనములు సాధితములగునట్లు కవులు తమ కావ్యము లందీ రెంటిని ప్రయోగించుట చూచుచుందుము. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదలో ద్వితీయాశ్వాసమున మత్స్యధ్వజ వృత్తాంతమున గ్రీష్మర్తు వర్ణన మొనర్చెను. అందు వేశ్యాసంభోగాసక్తుండైనవాఁడు నాయకుఁడు. గ్రీష్మర్తువులో సర్వజంతుసంతతులు తాపముచే నీరసించిన యింద్రియవ్యాపారము గలవియైనవి. వానితోపాటు మత్స్యధ్వజుఁడును అట్టి ప్రవృత్తినే కల్గియుండెను. అందువలననే బయటి యరుఁగుపై బరుండియున్న త్రైర్థికుని ప్రబోధము మనసునకు వెంటనే అంటినది. వేశ్యపై మనస్సు పుటుక్కున విఱిగినది. అదియే వసంతమైనచో నట్లు జరిగెడిదికాదు. భావి నాయక మనఃపరివర్తన కనుగుణమైన కాలప్రభావ వర్ణనము కృష్ణదేవరాయల శిల్పము. కవు లిచ్చట అట్టిదానిని సార్థకముగాఁ బ్రయోగించినారు. పంచమాశ్వాసములో "మనమా! వద్దిక నాదుమాట వినుమా! మర్యాదఁగాపాడుమా!" అని పరితపించనున్న నాయకునికి వేశ్యా సంభోగము వసంతమునందుకన్న గీష్మమునందే యనుసంధించుట యోగ్యముకదా! నాయక కథాప్రవృత్తుల కనుగుణముగా నొనర్పఁబడిన యీ వర్ణనలు నిరర్థకములు గావనియు సార్థకములనియు తాత్పర్యము.

2. కాలప్రభావము వర్ణించు మఱియొక ఉదాహరణము - నిశాప్రభావ వర్ణనము :

సీ॥ పగలు భార్యనుబట్టి పడగొట్టు ముక్కోపి
        భృత్యుఁడై చరియించు రేయియందుఁ;
    బగలు స్త్రీయన శత్రువుగఁజూచు విజ్ఞాని
        నిశియందుఁ బరమాత్మనియతిఁ జూచుఁ;

పగలు సన్న్యాసమే ''బహుబా''గనెడి యోగి
రాతిరి తనదు భార్యను స్మరించుఁ;
పగలు ''వివాహంబు వద్దువ''ద్దను వర్ణి
పెండ్లికై రాతిరి పేర్మి గొలుపుఁ

తే.గీ. గాన నెటువంటివాఁడైనఁగాని రాత్రి
యేకతమ్మున స్త్రీ గాలి సోకెనేనిఁ
దత్తఱంబంది పరవశాయత్తుఁడగుచుఁ
గోర్కె లిగురొత్త బైఁబడఁగోరకున్నె? - (శ.శృ. 30.

వెన్నెలరేయి, ప్రశాంత ఏకాంత వాతావరణము, రతిమూర్తియైన వేశ్య సాన్నిహిత్యము పండితుఁడైన మధుసూదనుని హృదయ స్థైర్యమును దోలాయమాన మొనర్చి వైచినవి. అతని యందుదయించిన విచికిత్స యీ పద్యము; సదసద్వివేక బుద్ధి ప్రకృతి పురుష పరస్పర ప్రభావముపై నొనర్చిన వ్యాఖ్య పై పద్యము.

3. సందర్భ శుద్ధియు, భావుకతయు గల సరసవర్ణనము వేకువ వర్ణనము:

తే.గీ యామినీ గోపకామిని యాకసం బ
నెడి ఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చిన వెన్నముద్ద యన నంత
వెదలెఁ దెల్లని కాంతితో వేగుఁజుక్క. (శ.శృ 87.

ఉత్ప్రేక్షాలంకారము వస్తువున కలంకారమగుచున్నది. వేకువయందు గోపకామినులు పెరుగు చిలికి వెన్నెముద్దలఁ దేర్చుట ప్రకృతి సహజము. తత్కాలోచిత ప్రజాజీవితమును ధ్వనించు కల్పన యిది. వర్ణ సామ్యముచే నుపమల నెన్నుకొనుట యిందలి వైశిష్ట్యము!

4. వర్ణనలలో కవుల వ్యక్తిత్వము ద్యోతమానమగు ననుటకు ఈ క్రింది చరణాయుధ వర్ణనము సాక్ష్యము. కవుల శబ్ద శాస్త్ర పరిచయము, తదితర కావ్య రచనా సంస్కారము, ప్రస్తుత కావ్యార్థానుగుణ భావకల్పనము అనెడి గుణము లుట్టిపడ రచించినది ఈ క్రింది వర్ణనము :

సీ. ఏ చరణాయుధం బింపు మీఱఁగఁ బాణి
ని యతికి హ్రస్వాది నియతిఁ దెల్పె
నే చరణాయుధం బాదార విప్ర ని
త్యస్నాన దైవజ్ఞతను వహించె

నే చరణాయుధ ప్రాచుర్య రూపుఁడై
హరి నిశీథము వేకు వనఁగఁ జేసె
నే చరణాయుధ శ్రీ చేత కూలి పి
ఠాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము

తే గీ. అట్టి చరణాయుధ సమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోరు కలఁగ
ఉఉఉ ఊఊః యటంచు నత్యుచ్చరీతిఁ
గూయసాఁగెను తమ తమ గూళ్ళ నుండి. —శ్రీ.తృ. 88.

ఇందు మొదటి చరణమున పాణిని హ్రస్వదీర్ఘప్లుతములను కోడి కూత లోని ఉఊఁలతోఁ బోల్చి చెప్పిన సూత్రము "ఊకాలో అచ్ హ్రస్వదీర్ఘప్లుతః" (సంజ్ఞా ప్రక. 1.2.27) అనుదాని ప్రస్తావన కలదు. అచ్చులలో ఉకారమును సూత్రమునందు గ్రహించుట కాకోడికూతతో నుపమించుటకేయని తాత్పర్యము. శబ్దశాస్త్రపారగులైన కవులకు చరణాయుధ వర్ణనమునందు ప్రథమభావ స్ఫూర్తి పాణినీయ సూత్ర విషయక మగుట యుచితమే కదా! విప్రవస్నానమును దైవజ్ఞ మనుటకు కులాచార సంస్కారము హేతువు. ఇంద్రుఁ డహల్యాజారుఁ డగునెడ కుక్కుటాకృతి నొందిన పురాణగాథ ప్రసక్తి వారి యైతిహాసిక పురాణపాండిత్య జనితము. పిఠాపుర కుక్కుటేశ్వరస్వామి ప్రసక్తికి ఏలా మాహాత్మ్య కావ్య రచనా సంస్కారము కారణము. "జారచోరాదులకు గుండెలో దిగులుఁ బోరు కలఁగ" అను విషయము కావ్యమున ఉత్తరభాగమున వివరముగా వర్ణితము కానున్నది కాన తత్కథా విషయక ప్రాతిపదికరూపమూలాచరణములు. ఇట్లీ వర్ణన మర్థవంతము, భావనామయమునై యొప్పారుచున్నది.

5. పాత్ర గుణరూప వర్ణనము : వేశ్యమాత :

సీ. మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత
తులలేని పచ్చిబూతులకు బుంగ
యనుచిత వ్యాపారమునకుఁ బెట్టిన పేరు
స్తుతి పాఠవాక్య సంతతికి వంది
పరమనోభిప్రాయ హరణమ్మునకు నద్ద
మన్పృత వాక్యముల కిమ్మైన కొంప
తనయానువిరచితావినయమ్ములకు ఛత్ర
మఖిల దోషములకు నాలయంబు

తే గీ. బెట్టుసరి మాటలకునెల్ల బుట్టినిల్లు
నిఖిలధన సంతతులకు శనిగ్రహంబు
వెనుకముందును తెలియని వెట్టి వెట్టి
విటులపాలిటి యమదూత వేశ్యమాత! —శ. ద్వి. 56.

6. కవిత్వ స్వరూప వర్ణనము :

సీ. పాపిష్ఠ రాజులపాలి దయ్యమ్ము సం
ధ్యావందనమునకు బావగారు,
పరదేశ సంచార కరణమ్మునకు రైలు
ఆపతపమ్ములకెల్ల సవతితల్లి
ముక్తికాంతా సంగమునకుఁ దారుపుఁగత్తె
సద్యశోవ్యాప్తికిఁ జాటుదప్పు
ఆనందమునకు దివ్యాంగనా సంగంబు
రాజసంబునకు గారాల కూచి

తే.గీ. భాగ్యభోగమ్ములకు నెల్లఁ బట్టుగొమ్మ
యఖిల వేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణ రసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁదరంబె? —శ. ప్ర. 13.

7. అభినయ ముట్టిపడు సంభాషణారచనా చమత్కృతి-వేశ్యమాత మాటలు :

క. "అమ్మా! మన యయగారికి
నిమ్మా! తాంబూల మింటి కేగెదరఁట వే
పొమ్ము కొనిరమ్ము మన వు
ఙ్యమ్మన వారిటకు వచ్చినారు గదమ్మా!'' —శ. ద్వి. 14.

3) వాక్యార్థ శిల్పము: సమర్థులగు కవులు రచనా చమత్కృతులెన్నియో యొనర్తురు. పిండి కొద్ది రొట్టె. వానినిఁ బండితు లాయా ఘట్టములందు స్వయముగా గుర్తించి ఆనందింపవలసినదే కాని వాని నన్నింటిని వివరించు టసాధ్యమగును. కావున స్థాలీపులాకన్యాయమున కొన్నిఁటి నిచ్చుటఁ బేర్కొందును.

(i) రసోచితములగు నానుడులను జాతీయములను కవులు కావ్యమునందు వాడి రసపోషణ మొనర్చియుండిరి.

ఉ:- 1) ..........మహిని బల్మి
చేతఁ బాలైనఁ ద్రావరు; స్నేహరీతి
చేత విషమైనఁ ద్రావుట సిద్ధమకద! శ్ర. ప్ర. 110
2) 'నిప్పున కంటునే చెదలు నీరజమిత్రునకంటునే రజంబు' శ్ర. ద్వి. 9
3) 'దాసరుల తప్పు దండముతో సరికద!' శ్ర. ద్వి. 21
4) 'మనులకు నపవాదకన్నఁ గష్టము కలదే' శ్ర. ద్వి. 61
5) 'కరఁగునే? నిప్పంచుఁ జెప్పఁగా ఘృతమకటా!' శ్ర. ద్వి. 91
6) 'ఆలినొల్లనివానికి నీలికూరలోన నుప్పెక్కుఁడు!' శ్ర. తృ. 44
7) 'తిన్నమ్మకు తిన్నంతయు; గన్నమ్మకుఁ గన్నయంతకాదే'
శ్ర. పం. 44
8) 'గతి లేనమ్మకు గంజి పానకము' శ్ర. పం. 89

(ii) లోక ప్రసిద్ధములగునట్టి రుచిరార్థ సూక్తులకు తి.వేం. కవుల కావ్యములు నిధులు. ఉదా:

ఉ. మూలములేని టీక సుమ పుంజ సమృద్ధముగాని శయ్య వా
డాలత లేని పెండిలియు సంతతి లేని గృహంబు మంచి తాం
బూలము లేని భోజనము ముద్దులు గుల్కెడి కన్నెమిన్నతో
మేళనలేని జవ్వనము మేలగునే? కవిరాజశేఖరా! —శ్ర. తృ. 41

(iii) నీతి బోధకములగు సూక్తులు కవుల రచనలలో నవలీలగా దొరలుచుండును. ఉదా:

కం. తనకెంత తెలివి కలిగినఁ
దన కార్యమువట్లఁ దానె తగుదుననుట యొ
వ్వని పని; యోగ్యత గలిగిన
తన మిత్రుల నడుగుటొప్పుఁ దగవరికెందున్. —శ్ర. చ. 57.

(iv) ఇట్లే కాకువున కుదాహరణము:

క. కులకాంతల తోడఁ గూడినఁ
గలదే మతి తప్పిదంబు? గనుఁగొనుఁడి మదిన్
గులకాంతయు వెలకాంతయు
నిలలో నొకటిరు వారలే మనుజునకున్. —శ్ర. ద్వి. 77.

(v) శ్లేష చమత్కారముతో సమానపద సంఘటిత సమాసముల గూర్చి శబ్దార్థములలో భావ చమత్కృతి కల్పించు చిత్రరచనము వీరి కావ్యములం దచ్చటచ్చట ఉద్యాన వనములలోని కాసారముల వలె గంభీరములై భాసిల్లు చుండును. ఉదాహరణకు :

సీ॥ కామాగమాభ్యాస కలన మీకుఁ గవీంద్ర!
కామాగమాభ్యాస కలన మాకుఁ,
దత్తదంగ స్ఫూర్తి మత్త మీకుఁ గవీంద్ర!
తత్తదంగస్ఫూర్తిమత్త మాకు;
నవరసాలంకరణ రతి మీకుఁ గవీంద్ర!
నవరసాలంకరణ రతి మాకు;
సనుమనస్కామోద శయ్య మీకుఁ గవీంద్ర!
సనుమనస్కామోద శయ్య మాకుఁ;
తే.గీ. బరవశ విధాన కౌశల పటిమ మీకుఁ
బరవశ విధాన కౌశల పటిమ మాకుఁ
గాన మీకును మాకు నైక్యంబు తప్ప
గాదు; వివరించి చూడుమో కవివరేణ్య! -త్ర. ద్వి. 81.

ఇందు శ్లేషింపబడు పదములివ్వి : అభ్యాసము = (కవి) నేర్చుకొనుట, (వేశ్య) అలవాటు చేసుకొనుట, స్ఫూర్తి=(కవి) తోఁచుట; (వేశ్య) పరిపూర్ణత; రసము=(కవి) కావ్యరసము; (వేశ్య) బంగారము; శయ్య=(కవి) కావ్యశయ్య; (వేశ్య) పడక; బరవశము=తన్మయత్వము (కవి); పరులకు స్వాధీనమగుట (వేశ్య).

(vi) వర్ణభేదముచే నర్థభేదము సాధించి శ్లేషతో పాత్ర సంభాషణలకు మెఱుఁగుఁబెట్టుట కుదాహరణము :

సీ॥ సరస పద్య విశేషసక్తి మీకుఁ గవీంద్ర!
సరసపద విశేషసక్తి మాకుఁ;
చిత్ర బంధశ్లేషసిద్ధి మీకుఁ గవీంద్ర!
చిత్ర బంధాశ్లేషసిద్ధి మాకు;
శుచికులోదయకృత స్ఫూర్తి మీకుఁ గవీంద్ర!
శుచికలోదయకృత స్ఫూర్తి మాకు;

అభినవ పాండిత్య విభుత మీకుఁ గవీంద్ర!
అభినయ పాండిత్య విభుత మాకు
తే గీ. నన్నిటను మీకు మాకును నరసిచూడఁ
దౌల్యమేగాని వర్ణభేద మొకఁడుండె
నింతమాత్రము భేద మదేరికైనఁ
గలదని యెఱుంగరే? మీరు కవులు గారె! —శ్ర. ద్వి. 82.
శ్లేషః. వర్ణభేదము=అక్షరభేదమనియు, కులభేదమనియు భావము.

viii) సాభిప్రాయములగు విశేషణములను వాడి విశేష్యద్వయమున కన్వయము సంఘటించుట. ఉ॥

తే.గీ. "నిదురఁబోఁగొట్టుఁ గ్రమముగా నెత్తికెక్కుఁ
గలుషత ఘటించుఁ గుండయుఁ గట్టియుఁ దన
చేరి కొనఁగూర్చు నదిగానఁ జెప్పనగునె
వేశ్యకును నస్యమునకును భేద మిలను." —శ్ర ద్వి. 54.

4) అలంకార శిల్పము: ఈ కావ్యమునం దుపమ, రూపకము. ఉత్ప్రేక్ష, ఉల్లేఖము, అర్థాంతరన్యాసము, అతిశయోక్తి, దృష్టాంతము, నిదర్శన, స్వభావోక్తి, భ్రాంతిమత్తు. విరోధాభాసము, కావ్యలింగము మొ॥ అలంకారములు రస వ్యంజకములుగా ననుసంధింపఁబడినవి. ఉదా- ఉల్లేఖము :

సీ॥ "నా కళ్ళ యెదుట మొన్నటిదాఁకఁ జిన్నత
నంపుఁజేష్టల సంచరింపలేదా!
నా కళ్ళ యెదుట నున్నతి లేక వెట్టిగా
వీధి వీధుల విఱ్ఱవీఁగ లేదా!
నా కళ్ళ యెదుట నెంతయు వింత రఘువంశ
మును జంకఁబెట్టుక చనఁగ లేదా?
నా కళ్ళ యెదుట నున్నతులెల్ల నవ్వంగఁ
జిటి పొటి పద్దెముల్ సెప్పలేదొ?
తే. గీ. ఎంతలో నెంతవాఁడయ్యె! నెంత బుద్ధి
వచ్చె! నెటువంటి సత్కీర్తి వచ్చెఁ! చిత్ర
మసుచు నాతని చర్యలే యభినుతింత్రు
పండితవరేణ్యు లక్కవి భాగ్యమేమొ! —శ్ర. ప్ర. 72.

5) మనః ప్రవృత్తి చిత్రణ శిల్పము: మనోవ్యాపారమునందలి భిన్న కక్ష్యలను, చిత్త వికారములందలి యంతరాంతరములను, వాని క్రమ పరిణామములను, వాని వలన సహజముగ గల్గు ఫలితములును ప్రస్ఫుటమగునట్లు చేయుట, ఆంతరంగిక భావములకును, బాహ్యాకారమునకును గల సంబంధమందు సామ్యవ్యత్యాసములను వర్ణించుటయేగాక ఆయాపాత్రల యింగితాకారములు పరస్పరము ప్రభావము వేసికొనుటను ప్రతిఫలక్రియారూపమున వర్ణించుట అనెడి ప్రధానాంశము లీకావ్యరచనమునందు గాననగుచున్నవి. తృతీయ చతుర్థాశ్వాసములం దీశిల్ప మనల్పమై యున్నది. పంచమాశ్వాసములోని "మనమా! వద్దిక నాదుమాట వినుమా! మర్యాద గాపాడుమా!" యనుమకుటముతో శతక కవిత్వమువలె భాసించుచున్న పద్యము లంతర్బహిర్వ్యక్తుల సంఘర్షణకు చక్కని యుదాహరణములు. తెలుఁగునాట వీని కెనలేని ప్రచారమున్నది.

శ్రవణానందముపైఁ బెక్కు ప్రాచీన కావ్యముల ప్రభావము పడినట్లు గోచరించుచున్నది.

అ) సంకుసాల నృసింహకవి, వెంకటాధ్వరి వంటి కవుల ప్రభావము కావ్యనామ మెన్నుటలోఁ గానవచ్చుచున్నది.

ఆ) కావ్యనాయికానాయక రూపకల్పనమునందు మనుచరిత్రలోని వరూథినీ ప్రవరాఖ్యులు, విప్రనారాయణ చరిత్రలోని దేవదేవీ విప్రనారాయణులు మొ॥ పాత్రలు ఒజ్జబంతులైనవని భావింపవచ్చును. ఈ 'కవిప్రవరు'డసామాన్య గుణుఁడు మొ॥ అందర్నిదర్శనము లట్టి యూహలను బలపరచుచున్నవి. మనుచరిత్రలో వరూధిని ప్రవరుని పొందఁజాలని నిర్భాగ్యురాలు - కాని, ఇందో దేవదేవి వలె వైష్ణవుని బొందిన అదృష్టవంతురాలు నాయిక బాలామణి.

ఇ) వస్తువు పైనను, కూర్పుపైనను మృచ్ఛకటికము. నిగమశర్మోపాఖ్యానము, నిరంకుశోపాఖ్యానము, వైజయంతీవిలాసము, విజయవిలాసము, కవికర్ణరసాయనము అను కావ్యముల ప్రభావము గోచరించుచున్నది.

ఈ) ప్రథమాశ్వాసములో 64, 88, ద్వి. ఆ. లో 78, తృ లో 16, 36 సంఖ్యగల పద్యములపై నల్లసాని పెద్దన ప్రభావము కలదు.

ఉ) 3 ఆశ్వా. 20, 42 పద్యములపై శ్రీనాథుని ప్రభావము గోచరించును. ఇట్లే నన్నయ్య, తిక్కన, పోతన, ధూర్జటి కవుల కవిత్వగుణములు కొన్ని

తి. వేం. కవుల కావ్యములందు స్పష్టముగా గోచరించును. వీనిని చౌర్యములను టకు వీలులేదు. అనుకరణములనుట పొసఁగదు. వివిధ ప్రాచీన కావ్య రచనా శిల్ప సంస్కారమునుండి ఆవిర్భూతములై స్వతంత్రతాముద్రగలిగిన కవితా మూర్తులు! తి. వేం. కవుల వ్యుత్పత్తికి వ్యాఖ్యానములు.

తి. వేం. కవులు స్వీయప్రతిభా సామర్థ్యముతో నొక విశిష్టమైన శైలిని స్థాపించుకొనిరి. అది ధారాశుద్ధి కలిగి, ప్రసన్నమాధుర్య గుణబహుళమై, ద్రాక్షా పాకమునఁబడి, భావసంపన్నమై వ్యంగ్యార్థభరితమై యొప్పుట వీరి శైలీలక్షణము. విశ్వనాథుని రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్మనెడి మతమును వీరు సమర్థించునట్లీ క్రింది పద్యమున స్ఫుటమగుచున్నది:

తే.గీ. "తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూల పదంబులు గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదమ్మున రసముట్టి పడినఁ గాక!" —శ్ర. పు. 12.

శ్రవణానంద కావ్యము చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి జీవితములోని ఒకానొక వాస్తవిక ఘట్టము నాశ్రయించి రచింపఁబడినదని లోకమున నొక ప్రవాదము కలదు. దానికితోడు జాతకచర్యలో తిరుపతిశాస్త్రిగారి వివాహమునకు వెళ్ళి నప్పుడు వేంకటశాస్త్రిగారికి శ్రవణానంద కావ్యవస్తువు దొరికినదని పేర్కొని యున్నారు. (జాత. పూర్వ. 388 ప.) జాతకచర్యలోని తిరుపతిశాస్త్రిగారి వివాహవర్ణనమునందును, ఈ కావ్యములో మధుసూదన బంధుగృహములోని వివాహవర్ణనము నందును నొకేపద్యము వాడఁబడియున్నది. మఱియు వేంకట శాస్త్రిగారి కావ్యమున నొకచోట—

"కలుగనే కలుగదు కలిగెనేనియుఁ గవీం
ద్రునకుఁ బణ్యస్త్రీ గమనము గల్గు" —శ్ర. తృ. 67.

నను పద్యముకూడ శ్రవణానంద కావ్య ప్రవాదమును ధ్వనింపఁ జేయు చున్నది. సత్యము దైవమునకే ఎఱుక! ఏది యెట్లైనను ఏదో ఒక బలీయమైన స్వీయానుభూతి కవికి సరసకావ్య రచన కుత్సాహస్ఫూర్తి కల్గించుచో నది జగద్ధితమైన కార్యమే కాఁగలదు కదా!

## పాణిగృహీత

శ్రవణానంద కావ్యము నవ్యసాహిత్యమున కొక నూత్న చైతన్యము గల్పింపఁగా పాణిగృహీత యొక విప్లవజ్యోతిని వెల్గించినది. వీరేశలింగముగారు ప్రహసనమును గైకొని సాంఘిక సంస్కరణ చైతన్యము రేకెత్తింప, తి. వేం. కవులు కావ్య రచనము చేపట్టి దానిని సాధింపఁదలఁచినారు. ప్రహసనమునే కావ్యముగా వ్రాసి మెప్పించినారు. విట చేట వేశ్యాదుల జగత్తే ఈ కావ్యమునందలి జీవితరంగము. ప్రాచీనలాక్షణికులు దృశ్యకావ్య విభాగములో నుపలక్షించిన లోకోపకారకములు, ప్రబోధానుకూలములునైన ప్రక్రియా భేదములను జాగరూకతతో గుర్తించి, శ్రవ్యకావ్య లక్షణములకు వాని నన్వయించి తద్ద్వారమున వాని రచనా ప్రక్రియా పరిధిని విస్తృతపరచి యొనర్చిన విప్లవాత్మకమైన ప్రయోగ విశేషమే ఈ కావ్యరచనము. పండితు లీవిధమును వెంటనే అంగీకరింపరను భయము కవులకే లేకపోలేదు. కాని—

మ. "అగు కావ్యమ్మిది యైననున్ ప్రహసన ప్రాయమ్ము, ప్రారంభ మా
దిగ దీనం బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాస, రో
మగువన్ నాయికచేత, దుర్విటుల నిర్మర్యాద వాక్యమ్ము లొ
ప్పగ దానిన్ వెలయించుఁ బండితులు తప్పుల్ దీరురేమోకదా!''

అనుచునే సాహసముతో ముందుకుఁ ద్రోసికొని వచ్చినారు.

పై పద్యమున కవు లీకావ్యమును దీర్చిదిద్దుటలోఁ బాటించిన మూఁడు లక్షణములను వ్యక్తపరచియున్నారు. అవి: 1) ప్రహసన ప్రాయమగు కావ్యమును నిర్మించుట, 2) పెక్కు చోటులందు రసాభాసము కల్పించుట, 3) గణికను నాయిక నొనర్చుట చేతను, దుర్విటుల నిర్మర్యాద వాక్యములు లోకానుకృతితో గూర్చుటచేతను రసాభాసమును ప్రస్ఫుటమొనర్చుట అనునవి.

హాస్య రసప్రధానమగు రూపకము ప్రహసనము. అది శుద్ధ - సంకీర్ణ భేదముచే ద్వివిధము. సంకీర్ణ ప్రహసనము అవికృతములైన వేష - పరిచ్ఛద - చేష్టితములుగల వేశ్యా - చేట - నపుంసక - విట - ధూర్త - బంధకీ సంకులమై యొప్పారును. లోకవ్యవహార సిద్ధమగు వార్తయు, దంభమును, ధూర్తుల ప్రవివాదములును ప్రహసనములందు గానఁబడును. అందలి ప్రధాన రసమగు హాస్యము- వికృతములైన పరివేష - అలంకారములు, ధార్ష్ట్యము (నిర్లజ్జత), లౌల్యము,

కుహకము, అసత్ప్రలాపము, అంగవికల లను చూచుట, అనిమిత్తభయాదులను, అకార్యకరణములను, వికృత వేషాదులును పర్ణించిచెప్పుట మొదలగు వానివలన జనించును. ఇట్టి ప్రహసన లక్షణములు పెట చేట వేశ్యాదుల వృత్త మీ కావ్యమందుండుటచే స్ఫుటమగుచున్నవిగాని రసవిషయమున మాత్రము కొంత మీమాంస కావలసియున్నది. ఇందు పెక్కుచోటుల రసాభాసమున్నదని కవులనిరి. హాస్యము ప్రధానము గావలసిన యీ కావ్యమున రసాభాసమున్నదనుటలో గల తాత్పర్యమేమి? యను ప్రశ్న యిచ్చట ఉదయించుచున్నది. ఉచిత విభావాలంబనత్వముచేఁ గావ్యములందు రసస్ఫూర్తి యగుచుండగా ననుచిత విభావాలంబనత్వమువలన రసాభాస మొదవుచున్నది "అనుచిత విభావాలంబనత్వం రసాభాస"మ్మని రసగంగాధరకర్త. శృంగార రసమునందు ఉపనాయక విషయకమగు రతియు, ఋషి గురుపత్నీగతమగు రతియు, బహునాయక గతమగు రతియు, అనుభయనిష్ఠమగు రతియు, నధమ పాత్రగత రతియు, ప్రతినాయక నిష్ఠమగు రతియు, పశుపక్ష్యాది రతియు ననుచిత విభావము లనఁబడును." అంతియకాక కావ్యమునందు రసభావము లనుచిత విభావాలంబనములై ఆభాసములగుచుండుటను భావించు సహృదయునికి తత్సన్నివేశ వికృతిచే హాసము జనింపకమానదు. అనఁగా రసాభాసము వ్యతిరేక దృక్పథములో హాస్యముగాఁ బరిగణింపఁబడునన్నమాట! భరతుఁడు హాస్యోత్పత్తిని వర్ణించుచు నీ తత్త్వమును ప్రపంచించియున్నాఁడు. ఈ కావ్యమునం దిట్టి రసాభాసము పెక్కుచోట్ల సంఘింపఁబడుటచే ప్రహసన ప్రధాన రసపోషణము వ్యంగ్యముగా కవులు సాధించిరని భావింప వీలగుచున్నది. ఇట్టి ప్రక్రియ కావ్యజగత్తులో బొడగట్టుట సకృత్తు.

కృతిభర్తయగు పుచ్చా సీతారామయ్యగారి కోర్కెపై నీ కావ్యము వ్రాయఁబడినదఁట! ఈతని కోర్కె కడువిచిత్రమైనది. సామాన్యముగాఁ గృతిభర్తలు కృతికర్తలను ఏదేని యొక సరసకావ్యము నభ్యర్థింతురు, లేక వస్తువును నిర్దేశించి చెప్పుదురు. ఇచ్చట ఆతఁడు కొన్ని సమస్యలనిచ్చి వాని కనుగుణమైన వస్తువు నల్లుఁడని నిర్దేశించుట విశేషము.

చ. మనుజున కెద్దియో యొకతె మానిని యుండుట యొప్పునో? కుల
మ్మున కనుకూలమైన విధిబోడియె యంచొక నేమమో? యిటన్
మనమున నెంచి చూడ నెట మంచి? యిహమ్ము పరమ్ము వాయదో?
వినవలె దీనికెంతయును వీలగు గాథ రచింపు టొప్పగున్.

—పాఠి ప్ర. 41.

ఇట్లు కావ్య వస్తు సూత్రముల నందించుటతోపాటు తోడ్తోడ కావ్య ప్రయోజనములను గూడ శాసించి కావ్య నిర్మాణము నొక నిర్దిష్ట మార్గమునందు త్రోసిరి.

చ. "విటులకు బుద్ధి వచ్చుగతి; వేశ్యలకుం దలవంపుగ; విశం
కట పదగుంఫనమ్ములను గాక కదున్ సులభంపు శైలి నొ
క్కటి రచియింపుడీ కృతిని గైకొనఁ జిన్నట నాటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కొలుపు కోరిక లివ్వటి కీరికల్ గనన్."

—పాణి. ప్ర. 46.

ఇట్టి లక్ష్యములతో సిద్ధమైనది పాణిగృహీత. నాయకునిచే నగ్నిసాక్షిగా వివాహితయైన స్త్రీ పాణిగృహీతయనియు, తనంత దాను నాయకుని పాణిగ్రహణ మొనర్చి వాని నుంచుకొను బానిసతొత్తు పాణిగృహీత యనియుఁ బిల్వఁబడును. ఇందొక పాణిగృహీత చరిత్రము వర్ణితమైనది. ఒక అజ్ఞాత బాలవితంతువునకుఁ గల్గిన బాలిక జలజాక్షి. మాతచేఁ బరిత్యక్తయై వేశ్యా గృహమున ననాథగాఁ బెరిగి తత్కులవృత్తియందు బలవంతముగ నుంచఁబడినది. నాట్యకళయందామె ఆరితేరినది. యౌవనోదయ సమయమున నొక విటుని మనసార ప్రేమించి కొంత కాలమునకు ఉదారుఁడను సుందరాకారుని వలచి అతనిని వదలినది ఉదారునికిఁ బాణిగృహీతగానుండుటకు మాట యిచ్చినది ఉదారుఁడు కొంతకాల మామెకు దూరము కాగా నారని యూరికే వెళ్ళి యాతని పొందుకోరినది. సంగీత కవిత్వ ములపై నామెకున్న మక్కువచే నాపై నొక కవిని మోహించినది. అతనితో రహస్య క్రీడకు దిగినది; ఉదారుని క్రోధమునకు గురియైనది; అతనికి దూరమై నది. చివఱ కన్యమార్గము లేక ఆత్మహత్యఁ గావించుకొనినది. నాయకుఁడు హృదయ పరివర్తనము పొంది పూర్వౌన్నత్య స్థితి నలంకరించినాఁడు. ఇది ఇందలి కథా సంగ్రహము. దీనివలన కవులు వర్ణాంతర వనితను పాణిగృహీతగా నుంచు కొనుట కీడనియు, విటులు వేశ్యా సంపర్కమునకుఁ బాల్పడి సంఘమున మాన ధన మర్యాదలు గోల్పోయి మోసపోయెదరనియు, వేశ్యలు ఒకనిపై గాఢాను రాగము చూపుచున్నట్లు కపట నాటకము చేయుచు ఉప నాయక రతిచే చాంచల్యముఁ బ్రకటించి విశ్వాస ఘాతుకలయ్యెదరనియు నిందు ప్రబోధము నిర్వహించి కృతికర్తచే నర్థితమైన అర్థములను సార్థకపఱచినారు.

విశృంఖల మనః ప్రవృత్తి చిత్రణమే యీ కావ్య కథాగతికి ఆయుస్సూత్రము. ఇట్టి మనస్తత్వ ప్రధాన కథా ఘట్టములను సృష్టించుటలో శుకసప్తతి కావ్యకర్త పాలవేకరి కదిరీపతి, కళాపూర్ణోదయకర్త పింగళి సూరనలతో కవులు పోల్పఁదగినవారు. కవుల కాలము నాటికి సమాజములోఁ బ్రాచ్య పాశ్చాత్య సాహిత్య సమాలోచనము మిశ్రముగాఁ గొనసాగుచున్నది గాన యీ కావ్యావతరణకు సహజ పూర్వరంగము సిద్ధమై యున్నది. ఫ్రాయిడ్ వంటి పాశ్చాత్య వేత్తల రచనల ప్రభావముచే మనస్తత్వ పరిశీలనము ప్రధానముగా లైంగిక భావ మూలమైన శాస్త్ర పద్ధతి అభివృద్ధిఁగాంచ మొదలిడినది. మానవ భౌతిక స్వాప్నిక జీవితములపై లైంగిక భావ ప్రభావము పెక్కుతీరుల విభజింపఁబడి మనశ్శాస్త్రము విస్తరించినది. మానవుని ఆదర్శ జీవితముపై కంటె భౌతిక జీవితముపై దృష్టి మరలి, తన్మూలములైన మనశ్శాస్త్ర సూత్రములఁ గన్గొని వానినావిష్కరింప నవ్యులు ఆరంభించిరి. 'రొమాంటిసిజము' దేశములో మొలకెత్తుటకు కవుల హృదయ సీమలలో బీజావాపనము జరిగినది. స్రరియలిజం వంటి కవిత్వ రచనా ప్రక్రియా వృత్తులు ఆంగ్లేయ భాషా కోవిదులగు కవులకు పరిచితము లైనవి. నవలలో 'సైకలాజికల్ నావెల్' అను శాఖ సామాన్య మానవ భావ స్థితిలో సహజముగాఁ బొటమరించు వ్యభిచారిత్వమును, తత్సంశ్లిష్ట విరచనమును, తద్గాంభీర్య గవేషణమును, చమత్కారాధానముగా నావిష్కరించు ప్రక్రియా వైవిధ్యమును తెలుఁగువారికి పరిచయ మొనర్చినది. అట్టి సమయములో పాశ్చాత్య భాషా సాహిత్య కోవిదులను సైతము నాశ్చర్యమున ముంచెత్తు అనంత గాధ మనస్తత్వ శాస్త్ర విభాగ వైశారద్యము మూల సూత్రముగా కల్గిన యీ కథా ఘట్టముల సంపుటి సాహిత్య జగత్తులో విప్లవ జ్యోతి యనుటలో విప్రతిపత్తి లేదు.

ఈ కావ్యజ్యోతి వెల్గుటకు తన జీవిత స్నేహ దాన మొనర్చిన పాణి గృహీత జలజాక్షి. ఈ కావ్యములోని చైతన్య మీ పాత్రయే. సంఘములో బాల్య వివాహమనెడి సనాతన దురాచారమునకు బలియై ఒక బ్రాహ్మణ బాల వితంతువున కధర్మముగా బుట్టి వేశ్య యింటఁ బెరిగిన వనిత జలజాక్షి. అభిజాత్య ప్రభావముచే మనస్సు వ్యభిచార వృత్తి కంగీకరింపకపోయినను గత్యంతరము లేక ఒక విటుని నంటఁగట్టుకొనినది, ఇచ్ఛలేకున్నను అతనియందనురాగ మచంచలముగా నిలిపినది.

కాని ఆమెయందు వయోనుగుణ్యముగా జాగృతములగు అభిరుచులు, ఆకాంక్షలు స్వేచ్ఛగా తృప్తినందెడి యవకాశము లేక, కనీసము చెప్పుకొనగా వినెడి దిక్కును లేక, ఆత్మీయత కొఱవడిన స్వార్థపరులు తగిలించెడి ఇనుప సంకెళ్ళకు చేతులప్పగించి, అంతర్వ్యక్తికిని బహిర్వర్తనమునకును జరిగెడి సంఘర్షణము గుండెను పుండు చేయుచుండ వేశ్యావాటికలో గతిలేక జీవించెడి ఆ జలజాక్షి తనకే స్పష్టముగా తెలియని బహిర్లోక స్వాతంత్ర్య జీవితమునకై కలలు గన్నది. ఆ కూపస్థమైన బ్రతుకు వదిలించుకొన దలచుకొన్నది. దానికి విటుడు సమర్థుడు కాఁడు. అసలే నట్టేట మునుగుచున్న తనను మఱింత క్రుంగ దీయువాడుకాని యొడ్డుకుఁజేర్చువాఁడు కాదతఁడు. ఉదారుని గాంచినది మొదలు అతని వలన తన యస్పష్ట లక్ష్యము సాధింపఁగలనను ధైర్యము ఆమెలో పొటమరించినది. చాకచక్యముతో తన విటుని తార్పుగాని వలె ప్రయోగించినది. దారము తెగిన గాలిపటమైనది. ఉదారుని పొందినది. తాను చేసెడిది తప్పని తనకు తెలియును - స్వీయేంద్రియములా నాలుకలు సాచి బుసలు కొట్టుచున్నవి. ఎచ్చటనైనను తనకు వేశ్యాత్వము పరిషారణమై తన భావుకమైన స్వేచ్ఛ పోషింపఁబడవలెనని యామె ఆత్రము పడినది. ఒక విటుని వదలి మఱియొక విటుని గైకొనుచున్న తాను వేశ్యాత్వము వీడినట్లా? తగిలించుకొనినట్లా? పూర్వుఁడు విటుడన్న పేరుతో తన జీవితమున ప్రవేశించి తన బ్రతుకును బండలు చేసినాఁడు. ఐనను ఆమెయందు స్త్రీజ్ఞానము నాతఁడే మేల్కొల్పి నాఁడు. కాని, ఆ స్త్రీత్వమును పంజరమున బంధింపఁబూనినాఁడు. అలవాటు చొప్పున అతఁ డనురక్తుఁడైనాఁడు కాని, అభిలాషపూర్వకముగా అనురాగమును జూరకొన్నవాఁడు కాడు. పూర్వుఁడు తన యిచ్ఛకు ఫలరూపుఁడు కాడు; నవ్యుఁడు తన యిచ్ఛకు ఫలము. అతఁడే నిజమైన భర్త. ఆ భావనబట్టి కొండలు ప్రాకనెంచినది. పూర్వునికై పరితపించు హృదయముతోడనే ఉదారుని కాదన లేకపోయినది. గతము పీడకలగా మఱచిపోయి క్రొత్తను క్రొత్తగా సృష్టించు కొనదలఁచినది. తాను కులయువతులకన్న ఏమిటను తీసిపోనని భావించెడిది. అట్లే ఉదారునితో మెలఁగ నిచ్ఛగించినది.

ఉదారుఁ డామె కన్నులలో వెలుఁగునట్టి యా విచిత్ర పవిత్ర జ్యోతిని చూచి అది వేశ్యలయందు జన్మించిన పతివ్రత యని నిర్ణయించుకొనినాఁడు.

తన యొద్ద ఆమె కనంత స్వాతంత్ర్య మిచ్చినాఁడు. మేరుపర్వతమంత స్వంత ఆస్తిని ఆమె భోగమునకై చిల్లిగవ్వ వలె తెచ్చించి భోగతృష్ణ యొక్క పరా కాష్ఠను దర్శించినాడు. తన గాన లహరిలో నామెను తీర్థమాడించినాడు. ఆమె ఉక్కిరిబిక్కిరియైనది. పథ్యము పుచ్చుకొన్న వానికి పంచభక్ష్యములు పెట్టినట్లయి నది. వానిని జీర్ణించుకొనఁగల్గు శక్తి రోగికుండజాలదు జలజాక్షి కిట్టి స్వేచ్ఛను సద్వినియోగము చేయునంత పూర్వసంస్కారము లేదు. వేశ్యావాటికలో తొత్తుగా బ్రతికినదిగాని మహారాణివలె బ్రతుకలేదు. పగటి వెలుఁగును గర్హించి చీకటి లోని నైల్యమును వరించుట శరీరమున కలవడిన దచ్చట. ఉదారుని పొందుతో తానెంత మారనెంచినను ఇంగువ కట్టిన గుడ్డవలె తన పూర్వవాసన వదల లేదు. ఉదారు డామెకు కవిత్వమువంటి లలితకళలతో పరిచయమొనర్చినాఁడు. సంగీతము తానే పాడి వినిపించినాఁడు. తేరగా దొరికిన తేనె చేదైనది. దొంగ దాటున కవి నొకని కోరుకొన్నది ఇద్దరికిని నొకరికి తెలియక నొకరికి తన్నప్ప గించుకొనినది. వేశ్యావాటిలో శిక్షణ అట్టిది.

లోకమున స్త్రీ ఎన్నిఁటినో కోరును. అన్నిటిని మనసార ప్రేమించును. కాని, మనసుతోపాటు శరీరమును భర్తకు మాత్రమే ఇచ్చును. కామము స్త్రీజాతి కొక విశిష్ట ధర్మాచరణ స్వరూపము. దాని నవగాహన మొనర్చుకొనిన వనిత గాని తద్విధమైన జీవితము నడపలేదు. వేశ్యకు 'కామము'న ధర్మదృష్టి లేదు; తాను వలచిన వస్తువును మనసుతో గ్రహించుట తెలియదు. శరీరమును వశ పఱచి దాని నాకర్షింప యత్నించును. జలజాక్షి వేశ్యా సంపర్కమువలన నిట్టి యాలోచన ధార కలవడినది. కావుననే కవిత్వమును ప్రేమించుట యనఁగా, కవిని కామించుటయని పొరపడినది. ఆమె కది ధర్మమో, ధర్మ విరుద్ధమో నిర్ణ యించు శక్తిలేదు. అందువలన ఉదారుని యొద్ద స్థానము కోల్పోయినది. ఉభయభ్రష్టయైనది. అప్పటికి ఆమెను తాను పతివ్రతయా? వేశ్యయా? యను సంశయము బాధించినది పశ్చాత్తాపాగ్నిలో హృదయమును పుటము పెట్టు కొందమని ఆమె యత్నించినది. చిన్నప్పటినుండియు తన రక్తములో జీర్ణమైన వ్యభిచార పాప సంస్కారములు చిత్తైకాగ్రతను సాధింపలేక విఫలములై పోయినవి. తన అశక్తత తనకు తెలియవచ్చినది. దానికి నిష్కృతి లేదనియు స్పష్టమైనది తన గాలిమేడలు కూలిపోయినవి. నైరాశ్యముతో బ్రతుకు నీద్వ లేక దానిని స్వయముగా నార్పివైచికొన్నది.

నాయకునితోపాటు పఠితకును ఆమె మరణవార్త సానుభూతి కలిగింపక పోదు. అదియే ఆమె చచ్చి సాధించినది. సంగీత సాహిత్యముల నుపాసించుటకు తగిన చిత్త స్థైర్యము, సంస్కారము లేని కులవిస్థితి యిందు వ్యంగ్యమేమో!

జలజాక్షి తరువాత బలమైన పాత్ర ఉదారుడు. అతఁడు సంపదున్మత్తుడు, సంగీత నాట్యకళాభిమాని వేశ్యాభుజంగుడు. అర్థబలముచే మదించిన యాతని యింద్రియ కంఖాణములు పగ్గములు త్రెంపుకొనినవి. నిస్సహాయుఁడై అవి లాగిన దిక్కుకే జీవిత రథమును సాగనిచ్చి చేతులు పారసాచినాఁడు. తి.వేం. కవులు బ్రతికిన రోజులలో సంఘముసం దిట్టి వేశ్యాభుజంగులు కనపడకపోవుటయే వెలి. అట్టి కాలమునకు ప్రతినిధిగాఁ బుట్టినాడు ఉదారుఁడు.

క. "తగు కాంతలోదఁ బొందున్
దుగలని మనుజానకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును
తగవ ద్వంచితము లధిక పాపాస్పదముల్"

అని యతని సిద్ధాంతము. మాతృహితబోధ లితనియందు బూడిదఁ బోసిన పన్నీరైనవి. జలజాక్షిలోని చకచ్చకితమైన పాణిగృహీతా లక్షణము ఈతని జీవితము నూబిలో దింపినది. ఆమెను "వలువు లంజెలలోఁ బతివ్రత యని" నమ్మి వర్తించి మోసపోయినాడు. ఎదుటివారి బహిస్స్వరూపముల నర్థము చేసికొనునుగాని అంతస్స్వరూపము లితని కవగతముకావు. నల్లని వన్నియు నీరు, తెల్లనివన్నియు పాలు. కవిగానితో సరసమాడు జలజాక్షిని కన్నులార చూచిగాని శంకింపని సాధువర్తనుడు, మెత్తనివాఁడు. కావుననే "కలుకు సేయని వాఁడు ధవుండు గల్గఁ దా యోగినివంటిదైనఁ గను నొక్క క్షణ మ్మున భోగినీగతిన్" అనెడి లోకోక్తి సత్యమైనది. పతిత యని తెలిసిన జలజాక్షిపైఁగూడ ఎనలేని సానుభూతిని చూపించు ఉదారుఁడు ఔదార్యగుణమున కవతారము. వేశ్యామోహ దుర్విదగ్ధుఁడగు నతఁడుత్తముఁడయ్యుఁబతితుఁడై గుణపాఠమునేర్చి పూర్వస్థితి నందుకొని వ్యతిరేకవ్యంగ్య ప్రబోధమననుసరించి జగతికి తన పాట్లుపలదని ఘోషించినాఁడు.

జలజాక్షి మొదటి విటుఁడు ఉద్యాయనో ద్యోగి దైక్యానం తల్లి ప్రత్యేకముగాఁ పేర్కొనఁదగిన పాత్రలు. జలజాక్షి ప్రథమయౌవనాభిసారికత్వ మంత ఋణమైన



నుంచకదీర్చి, నేర్పుగాఁదప్పికొన్న నిర్వేదమూర్తి ఆ విటుఁడు పూర్వులవంశ గౌరవము కుమారుని కాలములో నష్టటమనుఁగునేమోయని నిగమశర్మ అక్కకు పెనతల్లియో అన్నట్లు ఇందు ప్రబోధము నిర్వహించినది. క్షమానిర్వేద భావ ముల మిశ్రమూర్తి ఆ మాతృశ్రీ. ఇట్టి కావ్యమునందు సృష్టింపఁబడిన పాత్రలు, సంఘటనలు అన్నియు మనశ్శిల్పకళాశిల్పమర్మములై వెలసియున్నవి. కవు లెద నెడ తత్తత్పాత్రానుగుణముగా కావ్యమునందు ప్రకటించిన మనశ్శాస్త్ర విషయము లగాధములు, కడుసున్నితములు, సునిశితములు.

మచ్చునకు ఉదా:

ఉ॥ ''దూరమునందు నున్నయెడఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొక యించుకయున్ జనింపదా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును దగ్గఱైన యా
పూరుషు మోము గన్గొనినఁ బోవు నదెంతటి ప్రౌఢ కేనియున్''
—పాణి. తృ. 6.

వెలయాలి హృదయములోని వెలలేని వేదనములను కవులు వ్యక్తీకరించి ''రవి గాంచనిచోఁ గవి గాంచునే కదా!" యను అభియుక్తిని సార్థకపఱిచినారు. జలజాక్షి తలపోత యిది:

సీ॥ తగిన సంతాన మ్ముదయమంద "నాయనా''
యని వార లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గౌరవార్హులుండిన వారు
తలలేమంచు నెత్తంగవలయు?
తనుఁ గన్నతండ్రి యుత్తముఁడేని యతని మొ
గమ్మెమిగతిని దాఁ గాంచవలయు?
ఏదేని శుభకార్య మేతేర నెవనితోఁ
గాంక్షమైఁ బీతమెక్కంగవలయు?
తే.గీ. నక్కటా! తాను బాదగుటట్టులుండ
వెనుకటి ముందటివారల వెలిసేఁదార్చు
రోవెలందుల పుట్టువుల్ కోఁతగావె
యెఱుఁగనేరకి యర్థమ్ము హీనమతులు.'' —పాణి చతు. 92.

ఈ విధముగా సమకాలీన సాంఘిక సమస్యలను సానుభూతితో నర్మము చేసికొని కావ్యములో నట్టి సమస్యలు సృష్టించి, చర్చించి ఫలరూపముగా నొక సందేశమును కవులు లోకమున కందించిరి ఆది:

చ॥ కాలమునఁ బుట్టినట్టి యొక కోమలిఁ బిన్నటనాఁడ పెండ్లియై
కలిగిన యంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలుమఱుఁ దన్ను మెచ్చఁ గులపావనుఁడన్న యశమ్ము లోకమం
దలమఁ జరించువారికిఁ గదా! నిజమైన సుఖమ్ము లెమ్మెయిన్."

—పాణి చతు. 18.

ఈ కావ్యమునందు స్త్రీ పునర్వివాహము, బాల్యవివాహము, బాలవితంతువులు వేశ్యావృత్తికి లోనగుట, దేవభాషా దేశభాషా కవిత్వపురీతులు, నవ్యకవిత్వ విమర్శనము మొదలగు సంశములను, నగర నాయక ద్యూత సూర్యోదయాది వర్ణనములను కథానుకూలముగా ననుసంధించి తి. వేం. కవులు రచించిరి.

ఇందు కవిత్వము సర్వజన సులభమై ప్రసాదగుణము కల్గి ప్రవాహ వేగముతో నొప్పారుచున్నది. అన్యదేశ్యపదములు అధికముగా వాడుట ఇందలి యొక చమత్కారము. దానిని సమర్థించుచు తి. వేం. కవులు—

ఉ॥ కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁ గలపౌటను నొచిరిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పుకొందురో?

కవులకు భాషా విషయమున గల విశాలదృక్పథము దీనివలన స్పష్ట మగుచున్నది కదా! సోమిదేవమ్మ వంటి ఉదారుని తల్లి నోటిలో నైతము నన్య దేశ్యములు పల్కించి జీవద్భాషాగమనవైఖరిని వ్యాఖ్యానించినారు కవులు.

అన్యదేశ్యపదముల కుదాహరణము:- హార్మనిన్ (పు. 34); ప్లీడరు, (పు. 84); కలెక్టరు, డాక్టరు, వర్కు, జనానా (తృ. 105) వైను, బ్రాంది- పినికి - (చతు. 47); ఇంగిలీషు (పం. 78) గాగర, కంగు, హరువు, పౌదరు, అత్తరు (షష్ఠా. 113); యమ్మారార్వై (M.R.R.Y) గారికి - (షష్ఠా. 96). వీనితోపాటు జాతీయములు, లోకోక్తులు, ఛలోక్తులు, నానుడులు, వీరి కవితలో నీర క్షీరములవలె సహజముగాఁ గలిసి శోభించుచుండును.

'పాణిగృహీత' తి. వేం. కవుల ప్రతిభాసృష్టిలో శ్రవ్యకావ్యముగా నవ తరించిన ఒక మనస్తత్త్వ ప్రధానరూపకము (Psychological Drama).

## లక్షణా పరిణయము

ముచ్చటైన మూఁడాశ్వాసములలో తిరుపతి వేంకట కవులు సలక్షణముగా నాళువుగాఁ జెప్పిన ఆంధ్ర ప్రబంధము లక్షణా పరిణయము శ్రీకృష్ణుని అష్ట మహిషులలో కడపటిదియగు లక్షణా కన్య వివాహ గాథ కడు స్వల్పమయ్యు వర్ణనా బాహుళ్యముచేఁ బెంచఁబడి యీ కావ్యమున విపులముగా రచింపఁబడి యున్నది. ప్రథమాశ్వాసమునందు బృహత్సేన ప్రభువు, లక్షణాకన్య ప్రథమ యౌవనము, నారదకృత శ్రీకృష్ణ సంకీర్తనము వర్ణింపఁబడినవి ద్వితీయా శ్వాసమున - సూర్యాస్తమయము, చంద్రోదయము, నాయికా విరహము, మదన చంద్రానిలముల నుపాలభించుట, శుకముఖమున ద్వారకానగర వర్ణనము, అందు చాతుర్వర్ణ్యములు, వారకాంతలు, గొల్లపడుచులు, పూఁదోటలు శ్రీకృష్ణ పరాక్రమాదులు, శుకరాయబారము, ప్రభాతము, సూర్యోదయము, వనము, వనవిహారము, మద్రపురము, చాతుర్వర్ణ్య వర్ణనము, రాజ మన్మథారాధనము అనునవి వర్ణితములు. తృతీయాశ్వాసమున నాయికా నాయకుల విరహములు, స్వయంవరమున మత్స్య యంత్ర భేదనము, వివాహము. శరదృతువు వర్ణితము లైనవి ఏకాశ్వాసమున సరిపోవు చిన్న గాథ నిన్ని వర్ణనలచేఁ బెంచి చెప్పుటచే నీ కావ్యమును వర్ణనా ప్రధానమగు ప్రబంధమనియే భావింప వీలగుచున్నది.

లక్షణా పరిణయము భాగవత దశమస్కంధమునఁ గలదు. అష్టమహిష కల్యాణములన్నియు నొక్కటిగను, అందులో నొక్కొక్కరి పెండ్లి వేరువేరు గను వర్ణించిన కావ్యములు తెలుఁగునఁ బెక్కుగలవు. అష్టమహిషులలో లక్షణను స్వీయగా పోతనామాత్యుఁడు, రాజవిలాసకర్త కాకయ్యయు చిత్రించియున్నారు. ఇందు పోతననే తి.వేం. కవు లనుసరించిరి.

అష్టమహిషులలో ప్రథమ యగు రుక్మిణికిని లక్షణకును పెక్కింట సామ్యము కనబడును. శ్రీకృష్ణ గుణ కీర్తన శ్రవణమే రుక్మిణీ లక్షణలకు శ్రీకృష్ణునిపై ననురాగ ముదయింపఁజేసినది. ఇరువురును నాయకునికి ప్రణయ సందేశమును దూతలచే నంపినారు. రుక్మిణి బ్రాహ్మణునంపినది, లక్షణ శుకము నంపినది. రుక్మిణి రాక్షస వివాహమునను, లక్షణ స్వయంవర వివాహమునను స్వీకరింపఁబడిరి. శత్రుయుద్ధము, ద్వారకలో వివాహమగుట ఇరువురి గాథలం దును సమానమే. ఆంధ్ర భాగవతమునందలి రుక్మిణీకల్యాణ ఘట్టము జగత్ప్ర

సిద్ధమైనది. ఏతత్కర్తయగు పోతన యొక్క కవితాగుణములను పుక్కిటఁబట్టి కవు లాఘవుగా నీకావ్యము రచించి, పూర్వకావ్యములకున్న గౌరవము గల్పించుట ప్రశంసింపఁదగిన విషయము.

ప్రబంధ సంప్రదాయముల ననుసరించి యిందు శృంగారమే ప్రధాన రసము. శృంగారము ప్రాయికముగా పూర్వరాగ సంభోగ విప్రలంభ భేదముచేఁ త్రివిధము. ఇందు పూర్వరాగ విప్రలంభముచే సంభోగ శృంగారము పుష్టిమంత మగుచున్నది. పరిణయాంతమైన ఈ కావ్యము మంగళారంభ మంగళమధ్య మంగళాంతమును ధ్వనించుచున్నది.

ఈ ప్రబంధేతివృత్తమున శుకదౌత్యమునకు విశేషప్రాముఖ్యము కలదు. తి. వేం కవుల మేధావిలసితములగు నగరాది వర్ణనలన్నియు దాదాపుగా శుక ముఖముననే నడచుచున్నవి. ఈ శుక మొక ప్రబంధకవివలె భాసించును. విరహతప్తయైన నాయిక యొద్ద కృష్ణ వృత్తాంతము చెప్పఁబూనుకొని నగర దాతు ర్యర్థ్యవారకాంతాదుల వర్ణనము చేసి కాని అసలు కథకు రాదు. అట్లే శ్రీకృష్ణుని ముందు మద్రరాజతనయను పరిచయముచేయుచు మరల నగర వర్ణనాదు లన్నియు శాస్త్రోక్తముగా జేసికాని అసలు నాయికను గురించి చెప్పదు. శుకాదు లను దూతలుగా నెన్నుకొనుట ప్రాచీన సాహిత్యమున ప్రసిద్ధమే. శుకాదులకింత సామర్థ్యమున్నదా? యనుచో కాళిదాసుని మేఘసందేశాదులే అనుమానగ్రస్తములు కావలసివచ్చును. అది యొక కల్పనాచమత్కారము అనియే సహృదయులు సమ్మతింతురు.

ఈ కావ్యమునందు నాయికానాయకుల విరహమును సరిశూకముగా వర్ణించుట యొక విశేషము. రుక్మిణీ కల్యాణాదులలో నిట్టిది కానరాదు. కృష్ణుడుఁ దక్షిణ నాయకుడు. నూతనవధూప్రణయ మాతని యందంకురించి యితర రాణులను కొంతకాలము విస్మరింపఁజేసినది. నవ్యానురాగ ప్రభావమటు వంటిదే కదా! నాయకునం దుదయమైన శృంగారావస్థలలో 'అరతి'ని కవులెంత సరసముగా వర్ణించిరో గమనింపఁదగును :

సీ॥ రుక్మిణితోఁ బొత్తు రుచియింపఁ దాయెఁగా
 దాయగాఁ దోఁచె సుదంతవింత;
 సత్రాజితి యటన్న శత్రుత్వమాయెఁగా
 మాయగాఁ దోఁచె జాంబవతి పేర్మి

రాధికావరి చెల్మి రహిలేక పోయెగా
పాయఁగాఁదోఁచె నాళ్ద్ర పేర్మి
నీల పొం దరవి వెన్నెల పోలికాయెఁగా
కాయగాఁ దోఁచె నర్కసుత మమత

తే.గీ. వన్నెగల గొల్ల కన్నెల చిన్నెలన్ని
యెన్నికకు రాక మునుమున్న వన్నె దఱిఁగె
చిన్ని చిన్నారి చిన్నెలు వెన్ను దన్న
లక్షణా మయుఁ డయ్యెఁ బద్మేక్షణుండు." —తృ. 4.

శ్రీకృష్ణునియం దీ లక్షణా విరహము వివాహసుఖపర్యంతమే. ఆపై మఱి తన దక్షిణ నాయకత్వమును సాధించి యదాపూర్వుఁడైనాఁడు. లక్షణాధర మాధుర్యాస్వాదితుఁడైన మధుసూదనునిఁ గావ్యాంతమున కవులు అష్టమహిషి మనోరంజనునిగాఁ బరిచయ మొనర్చిన విధము రమణీయము.

సీ॥ "లక్షణ నీరీతి లాలన చేయుదే?
యన మంచిదానవే! యనియె శౌరి;
యా బోటిపై మనం బరిగెనే? యారీతి
నన లేదులేదనియె శౌరి;
ఆ యింతి కీవింతలన్నియు నేర్పితే?
యనవెట్టివాఁడనే? యనియె శౌరి;
ఆ నారి కిప్రీతియమరెనే? నీమీఁద
నన నించుమించుగా ననియె శౌరి;

తే.గీ. ఆ లలన యెన్నదేని నన్నడిగెనే? య
టన్న, నెఱుగనొ, మెఱుఁగదో యనియె శౌరి
చెప్పకుందువె? నాతోడఁ జెప్పననిన
నబల! నీ కలయిక సాక్షి యనియె శౌరి" —తృ. 110.

ప్రశ్నోత్తర రూపమగువర్ణన కిది పసిఁడి యుదాహరణము.

లక్షణ లక్షణబద్ధముగాఁ దీర్చిదిద్దిన శృంగార నాయిక. ఆమెయందు వర్ణితములైన సుగుణసంపద, ఋజావర్తనము, పాతివ్రత్యము, కోమలత్వము, కమనీయత్వము అను గుణములు స్వీయా నాయికయని చెప్పకఁ జెప్పుచున్నవి.

శృంగారావస్థల కనుగుణముగా నాయకున కనురక్తికూర్చిన యబల లక్షణ. పరిణయక్రమ వికాసస్ఫూర్తి ఆమెను ముగ్ధత్వమునుండి ప్రౌఢగా మార్చినది.

తే గీ. "ముగ్ధయై కొంతకాలంబు మురువుసూపె
మధ్యయై కొంతకాలంబు మదిగరంచె
ప్రౌఢయై కొంతకాలంబు ప్రమద మొసఁగె
లక్షణాచంద్రముఖి సరోజేక్షణునకు,'' —శృ. 70

నాయిక పూర్వరంగ విప్రలంభ మనుభవించినట్లు ద్వితీయాశ్వాసమున వర్ణించుచు, ఇచ్ఛ. ఉత్కంఠ, అభిలాష. చింత. స్మృతి, గుణస్తుతి. ఉద్వేగము, తాపము. ప్రలాపము, మూర్ఛ అనెడి మదనావస్థలను వ్యంగ్య గౌరవ ముట్టిపడ కవులు వర్ణించియుండిరి. (చూడు. ద్వి. ఆ 15 ప.43 ప) మదన తమకముతో నాయిక శుకసందేశమిచ్చు ఘట్టము కమనీయము ఉదా:

క. రమ్మనుమీ! నైపుట బా
రమ్మనుమీ. విరహమతిభరమ్మనుమీ, వా
రమ్మనుమీ వ్యవధి. సుదూ
రమ్మనుమీ పురి స్వయంవరమ్మనుచు తగన్

క. మ్రొక్కితి ననుమీ! తనకుం
దక్కితి ననుమీ! విశేషతాప భారమునన్
సొక్కితి ననుమీ మిగులన్
జిక్కితిననుమీ స్వయముగఁ జెప్పితిననుమీ! —ద్వి 64,66.

ఇందు నాయిక నాధుని హృదయము కరఁగునట్లు దైన్య ముట్టిపడ ప్రార్థన మొనర్చినది. ఒక్కొక్క మాటలో పెక్కు సంచారిభావములు పుష్పసుగంధముల వలె గుబాళించుచున్నవి. 'రమ్మనుమీ' యనుటలో దైన్యగర్వావేగములు,'నైపుట బారమ్మనుమీ' అనుటలో నిర్వేదగ్లానిత్రాసములు, 'విరహమతి భరమ్మనుమీ' అనుటలో శ్రమదైన్య విషాదమోహములు, 'వారమ్మనుమీ వ్యవధి' యనుటలో వితర్కధ్యానౌత్సుక్యములు, 'సుదూరమ్మనుమీ' అనుటలో దైన్యావేగములు, 'స్వయంవరమ్మనుమీ' అనుటలో హర్షభయశంకామోదములు, ధ్వనితములు. మఱియు 'మ్రొక్కితిననుమీ' యనుటలో భక్తివినయగుణములు, 'తనకుం దక్కితి' ననుటలో'' తననిస్సహాయతామాయకతాత్మసమర్పణాదులు, 'విశేష....

సౌక్కరి' ననుటలో దయాభావమభ్యర్థించుటయు, అనన్యకాంతనను దృఢనిశ్చయము వెలార్చుటయును, 'మిగులన్ చిక్కితిననుమీ' యనుటలో దర్శన సంయోగాభిలాషలు కల్గకున్నచో మరణమే శరణ్యమగునను దైన్యము, బెదిరింపు, 'స్వయము....ననుమీ' యనుటలో స్వీయానురాగమును, స్వయంవర వివాహ నిశ్చయమును నాయిక ప్రకటించినది 'నీటి కొద్ది తామర'గా నిందు భావార్థములు ధ్వనించును.

ఈ కావ్యము వర్ణనా ప్రధానమగుటచే తద్విషయకములైన కవితా చమత్కృతులు పెక్కులిందుఁగలవు అవి సహజ గుణాలంకారములవలె యిందు వెలసియున్నవి. కృత్రిమత్వముగాని, సుదూరాన్వయ కాఠిన్యముగాని, నిరర్థకమైన కల్పనముగాని ఆ వర్ణనలలో గానరావు. నన్నయ, శ్రీనాథ, పోతన, పెద్దనాదుల కవితలోని పద్యపు నడకల తూగు, శబ్దార్థాలంకార ప్రయోగ నైపుణ్యము, ధారాశుద్ధి, నిర్మలత్వము, రసోచితగణరీతి, శయ్యాలంకార వినిమయ దాకచక్యము ఈ కవితలో పఠితకు సులభముగా స్ఫురించుచుండును.

ఇన్ని సద్గుణములతో నొప్పు నీప్రబంధ మాశువునఁ జెప్పఁబడినదని మరువరానిది. ప్రయత్నపూర్వకముగా గ్రంథరచన మొనర్చిన నవీన మహాకవుల కావ్యముల కేమిటను తగ్గదు. వీరి యీ యాశుకవిత్వమున అవధాన కవిత్వ చమత్కృతులు కొన్ని గానఁబడుచున్నవి. ఉదా॥

1. యమకమునకు :-

క. నయమా ప్రతిపద సంపదు
దయమా యామీఁద మత్త తత్త్రదిపురా
ద్భయమా యదియనుగాకవి
నయమా వేఁటొకరుఁ డిట్లనన్ తాద్రుశుఁడే. (పు. 5)

2. సమస్యాపూరణము వంటిది :-

"రాతికి జోడు సీతనయ రాజవర్యేణ। యెఱుంగఁజెప్పితిన్"- అనునది సమస్యయైనచో - పూరణము - ఇట్లగును :

ఉ॥ "ఆతని కాతఁడే ప్రతి సమస్త విధమ్ములఁ దత్కుమారికా
రీతియుఁ జూడ నాతని వరింపఁగ నెంచెడి యట్ల తోచుఁ మే
లీ తరుణీ శిరోమణికి నీడతఁడా పటిభూత శంబరా
థాతికి జోడు సీతనయ రాజవరేణ్య! యెఱుంగఁజెప్పితిన్."

3 సామెతను ప్రయోగించిన వర్ణనము :

తే.గీ. పశ్చిమాచలమునఁ గాంతి పరిఢవిల్లెఁ
గాని తూరుపుఁగొండ రిక్తదశనందె;
"నొకఁడు చెడిపోవుపైఁగాని యొకఁడు బాగు
పడుటలే"దని జనులాడుపలుకు నిజము."

4. ఛలోక్తి :-

ఉ. "నారిచరామి" యన్న వచనార్థ మెఱుంగునొ లేదొ! యమ్మురా
రాతి పఠించి యచ్చెలి శిరమ్మున హస్తము వెట్టి బిట్టు ప్రే
మాతిశయమ్మునన్ గురువరానుమతిన్ బదియారు వేలపై
చేతులఁ దక్క భార్యలఁ ద్యజింపఁదలంచెనొ లక్షదార్థమై. —ర్వ. 48.

5. సహజవర్ణనాచమత్కృతి :-

మ. పరివేషమ్ములు గట్టి పూగళకలం ప్రాయమ్ములై యంత బం
గరు గోళీల నతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ముల మీరి గట్టిపడి విన్నాణంపుఁ బల్కుప్పులై
పరిమాణింప నశక్యమై యెసఁగె నప్పద్మాక్షి వక్షోజముల్"
—లక్ష. పు. 15.

ఇంకను దుష్కరప్రాసములు, తెలుఁగు ఛందస్సులో రచించిన సంస్కృత పద్యములు మొ॥ చమత్కారము లెన్నియో గలవు. ఈ కావ్యము పరిమాణమునఁ జిన్నదయ్యు మహనీయ గుణ సంపదచే కడుంగడు పెద్దదై తి.వేం. కవుల ప్రబంధ నిర్మాణ కీర్తి పతాకయై భాసించుచున్నది.

## ఏలా మాహాత్మ్యము

ఆశ్వాసద్వయమం దద్వితీయముగా రచింపఁబడిన తీర్థ పురాణమీ ఏలా మాహాత్మ్యము. పూర్వకవి విరచితములై, స్థలదేవ తీర్థ భక్త మాహాత్మ్య ప్రతి పాదితములగు స్థలపురాణ లక్షణములన్నింటినిఁ గల్గి కథా సంవిధాన నిర్వహణము లత్యంత నిర్దుష్టముగా నొనర్పఁబడిన వస్తుకావ్య మిది. "ఏలాభుక్తి విధాయినీ" అని ప్రసిద్ధి గాంచి, గోదావరీ మండలమందు తెలుఁగుబిడ్డల భక్తి కృతజ్ఞతల నందుకొనుచు, సాగరసంగమదోష వివర్జితయై, విశుద్ధ చరిత్రగా

జానించు పుణ్య తరంగిణి 'ఏలానది' కృతిభర్తయగు శ్రీ తోట సర్వారాయఁ డానదీమతల్లి ప్రజలకొనర్చు సేవ నుగ్గడించుచు.

క. "ఏలానదితోఁ బెఱనదు
లేలా తులఁదూగు నొక్క యింత జలమ్మున్
దాలోదాఁపక జలనిధి
పాలుంగానీక పంటపైరుల కిచ్చున్" అని పేర్కొని,

ఉ. "కావున నన్నదీమహిమగా నొక చిన్నకృతిన్ రచించి యం
దేవియునేని! బుణ్యకథ లేటిచి కూర్చి" రచింపుడని కవులను ప్రార్థించెను. ఏలానదీ జలముఁ ద్రావి ఏతన్మాహాత్మ్యముగా వినఁదలఁచిన కృతిభర్తయు నాతనిఁ గృతార్థు నొనర్చిన కృతికర్తలును ఇరువు వందనీయులు.

ఈ కావ్యకథా నిర్మాణము చక్కని విషయవివేచనముతో నొనర్పఁబడి నది. ఒక విధముగా నది కృతిభర్తచే సూచితమైనది కూడ. జలనిధియందు సంగమింపక పంటపైరుల కుపయుక్తమగునట్లు ఏలానది యేల ప్రవహించు చున్నదో, దాని కెనలేని మాహాత్మ్యః మేలఁ గల్గినదో నిరూపించు కథా భాగము ప్రథమాశ్వాసమునఁ గలదు. ఆ నదీతీరమునందలి పుణ్యతీర్థ దేవమాహాత్మ్యము లును, ఆ తీర్థములందు ముక్తినందిన భక్తుల చరిత్రములును పుణ్యకథాలహరు లుగా ద్వితీయాశ్వాసమునందు ప్రత్యక్షమైనవి. ప్రథమాశ్వాసము నదీజన్మ మాహాత్మ్యము కాగా, ద్వితీయాశ్వాసము నదీ జీవిత మాహాత్మ్యమై వెరసి తత్స మగ్ర చరిత్ర చిత్రణ గౌరవమును కావ్యమున కందించుచు పురాణగౌరవము నిద్ధింపఁజేయుచున్నవి.

తి.వేం. కవుల కథాకథన కౌశల మిం దత్యంత గంభీరముగా నున్నది. సంగ్రహమయ్యు వక్తవ్యాంశము లెవ్వియు లుప్తములు గాకుండునట్లును, వేగ వంతమయ్యు నుచిత పాత్ర సన్నివేశ వర్ణనాదులను వదలకుండునట్లును, సరళ మయ్యును కథార్థము నందలి బిగువు సడలకుండునట్లుగను, బహుకథాకథన సంశ్లిష్టమయ్యు వస్తువునందు విషయవివేచనత్వము నుజ్జగింపకయు తి.వేం. కవు లీకావ్యరచన మొనర్చియుండిరి.

ప్రథమాశ్వాసమునందలి కథ సంగ్రహముగా నిది: నారదుఁ డొకనాఁడు కైలాసమున కేగి శివజటాజూటవాసినియగు గంగకుఁగల ఔన్నత్యము నుగ్గడించి

పార్వతికి సపత్నీమాత్సర్యము కలిగించెను. పార్వతికోర్కెపై నామె కుపాయాంతరము బోధించి వెడలెను దాని ననుసరించి గౌరి తన చెలికత్తెలగు జయవిజయలు గోరూపధారిణులై గౌతమాశ్రమమున కరుగునట్లు శాసించెను. వారును తదాకృతులతో నచ్చటికేగి నీవారసస్యములను పాడుచేయుచుండ గౌతముడు కోపించి, కుశాగ్రముతో తాడింప నందొక ధేనువచ్చటనే గతాసువయ్యెను. రెండవది సమీపస్థమగు ఏలా మున్యాశ్రమమునఁ బ్రవేశించి మృతినొందెను. గోహత్యాదోష దూషితులైన ఏలా గౌతములు తరణోపాయముగా భాగీరథీ నదిని భువికిఁ దెప్పింపఁ బరమేశ్వరుని గూర్చి తపమొనర్చిరి. ఇంద్రుఁడా ఋషుల తపస్సును భగ్నపఱుపుటకై ఊర్వశీతిలోత్తమలఁ బ్రయోగించెను. గౌతముఁ డూర్వశీవ్యామోహమునఁ జిక్కక తపః ఫలముగా గోదావరీనదిని సాధించెను. కాని తిలోత్తమాసక్తుఁడై ఏలా మహర్షి తపఃఫలమును గోల్పోయి, పునఃప్రయత్నమొనర్చి శివుని మెప్పించి, ఏలానదిని సాధించి తనవెంట నా తరంగిణి రాగా సూర్యోదయాత్పూర్వమే వెనుకకుఁ దిరిగిచూడక నడచుచు సముద్ర సమాగమమొనర్చుటకై ప్రయాణమొనర్చుచుండెను. ఇంతలోఁ గిమ్మీరుఁడు శివుని మెప్పించి సముద్ర సమాగమ విరహితయైనట్టియును, ఫలసాయము నిచ్చునట్టిదియునునగు నొక నదిని వరముగా కోరినాఁడు. ఇరువురి కోర్కెలను తీర్చనెంచిన శివుఁడు కుక్కుటాకృతి వహించి ఏలా ఋషిని వంచించి, నదికి సముద్ర సమాగమము లేకుండ నిల్పి, పాదగయాసాగరమునందు కలిపి, తత్సమాగమస్థలమున కుక్కుటేశ్వరుఁడై నిలిచి, స్వీయక్షేత్రము నొకదానిని స్థాపించుకొనెను. శబరీనదిని ఏలకు ఉపనదిగా ననుగ్రహించెను.

క. "ఏ నరుఁడైనను నిత్యం
   బీనది యందేని లేక యీ మడుఁగునయం
   దేనియుఁ గృతాభిషేకుం
   డై నంత మదీయ పదవి యతని కొసఁగుదున్"

అని ప్రకటించినాఁడు. ఈ కథకు కాలానుక్రమము ననుసరించికాక కార్యకారణ క్రమమున ననుసంధించి, కిమ్మీర తపముతో ప్రారంభించి యుత్కంఠావహముగా నాశ్వాస కథ రచించి పింగళి సూరన యొక్క కథాకథన నైపుణ్యమును ప్రకటించిరి. ఇట్టి శిల్పమే ద్వితీయాశ్వాసమునందును బాటింపఁబడినది. అందు శాల్మలీపురము అపుత్రగరి క్షేత్రమును కోటిలింగాల క్షేత్రమును

ఆగుటయు, అమృతపుత్ర తీర్థము నందలి అమృత సుతేశ్వర మాహాత్మ్యమును, ఆయురారోగ్య పుత్ర పౌత్రాభివృద్ధిద మగు తిరుపతి క్షేత్ర గౌరవమును, ఆమయాపహ తీర్థగాథయు పీఠికాపురీవాసులగు కుంతిమాధవ, కుక్కుటేశ్వర, పురుహూతికా శక్తుల మహత్త్వమును, పాదగయాతీర్థ ప్రభావము ను కవులిందు వర్ణించి యుండిరి. గణపతి సోమయాజి, బ్రహ్మపుర వైశ్యదంపతులు, శంకర స్వామి, ధర్మకేతువు మొ॥ వారి చరిత్ర లిందు తీర్థ మాహాత్మ్యాది ప్రతిపాదకము లుగా సమకూర్చఁబడినవి.

ఏలానది పాడిపంటల నిచ్చుటతోపాటు తీరస్థమగు పుణ్య తీర్థములవలన అనామయత్వమును, పుత్రపౌత్రాభివృద్ధియు కలిగించుచున్నది. ఈ కథయందు పురుషార్థ త్రయ సాధనమే ప్రధానాంశము. సంతాన ప్రాధాన్య ముగ్గడింపఁబడినది. గణపతి సోమయాజి చరిత్రలో ప్రవరగార్హస్థ్యజీవితేతివృత్తచ్ఛాయలు కొన్ని కానఁబడుచున్నవి. కథానుకూలములగు చోట్ల సమకాలీన సాంఘిక విమర్శనము గూడ ఎడనెడ నొనర్పఁబడినది. ఉ॥ "ముసలికిం జిన్ని పెండ్లము మొసలియనరె" అను విసరులు విసిరియున్నారు.

సమయోచిత ప్రకృతి వర్ణనా సామర్థ్యము పఠితృహృదయాకర్షకముగా ప్రౌఢ నిర్భర శైలిలో రచించినారు. ఉదా॥ వర్ష వర్ణనము :

సీ. నీరధారా వినిర్భిన్న భూమీధర స్రవదసృక్సమవార్ఝరంబుతోడ
నాకాశ వాహినీప్రపాలంబనాట్టహా స స్ఫురత్ఫేన పుంజములతోడఁ
జిరకాల రోధః ప్రచితతాభిమానానుయాతభూజప్రచయమ్ముతోడ
స్వాంబుప్రవాహ సంవర్ధితారామభూజ సమర్ప్యమాణ పుష్పములతోడ.

తే.గీ. నుభయ తీరస్థ జనపద క్షుభితజాన
పద సమారోహితోన్నత వసుమతీ వి
రచిత పరసౌధ భూమికా నిచయమగుచు
మిండికిని మండికి నేకమై మించె నేల. (ద్వి. 110)

ఒక తెలుఁగు నది చరిత్రను తియ్యందనములుట్టిపడ రచించిన దివ్య కావ్య మిది.

## గోదేవి

అనంతామాత్యుని భోజరాజీయమందు వర్ణితమై జగత్ప్రసిద్ధిఁ జెందిన "గోవ్యాఘ్రసంవాద"మును "గోదేవి"యను స్వతంత్ర కావ్యముగా తి. వేం. కవులు నిర్మించిరి. ఆకృతితోగాక అధికారముతో దీని కున్నత స్థానము కల్గుచున్నది. సత్యప్రాముఖ్య ప్రతిపాదనము ఈ కావ్య పరమ ప్రయోజనము. వత్సల రసము సత్య వీరము ఆ కావ్యమునందు జాలువారినవి.

## పతివ్రత

జానపద సాహిత్యములో నఖండ ప్రఖ్యాతిఁ గాంచిన పాము పాట కవుల నోట "పతివ్రత" కావ్యముగా నవతరించినది. ప్రొఫెసరు శేషగిరిరావుగారి కంకిత మీయఁబడినది; పతివ్రతా మాహాత్మ్యమును, భక్తి ప్రభావమును చాటు పుణ్య ప్రబంధ మియ్యది.

## శివ భక్తి

శివభక్తి భక్తి రసకావ్యము పట్టణత్రాయ చరిత్ర యిందు రసభరితముగా వర్ణితమైయున్నది. ఈ మూఁడు కావ్యములు రచించుటలో కవులకు సత్య మాహాత్మ్య ప్రకటనమునందును, భక్తిరస కావ్య నిర్మాణమునందును గల అత్యంత ప్రీతి ప్రస్ఫుటమగుచున్నది.

## బొబ్బిలి పట్టాభిషేకము

బొబ్బిలి యువరాజావారి పట్టాభిషేకమును గూర్చి విపులమగు వర్ణనఁ జేయుచు రచించిన వర్ణనాకావ్య మిది. ఆ రాజీ కవిరాజులను ఘనముగా గౌరవించెను. సమకాలీన చారిత్రకాంశముల కజరామరత్వము కల్పించు సదుద్దేశమే యీ కావ్య రచనకు హేతువు. ఈ కావ్యము శ్రీపాదవారిచే విమృష్టమై వివాదరంగ స్థలమై కీర్తివడసియున్నది.

## సుఖజీవి

ఈదర వేంకటరాయ గుణ ప్రశస్తి కావ్యము సుఖజీవి. ఉత్తమ గుణ కీర్తన మొనర్చెడి కవుల స్నిగ్ధ ప్రవృత్తియే యీ కావ్యముగా జాలువారినది.

## సుశీల

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు వార్ధక్యమునందు ప్రొద్దుపోక వ్రాసిన ఆఱాశ్వాసముల కల్పితకావ్య మిది. ఆ కాలమునందు వారు వ్రాసిన వ్యాసములందు వలెనే యిందును శాఖాచంక్రమణ మధికము. 'సుశీల'లో చెప్పుకొనఁదగినంత కథ లేనేలేదు. విరక్తులైన ఒక వృద్ధవైశ్యుఁడు, ఒక వృద్ధక్షత్రియుఁడు ఒక వేశ్యయువతి, ఒక నాడీశాస్త్ర మర్మజ్ఞుఁడగు బ్రాహ్మణయువకుఁడు కలిసి తీర్థ యాత్రలొనర్చుచు ఉత్సవాదులలో పండితులతో వాగ్వివాద మొనర్చుచు పెక్కు (కవుల) సమకాలీన సాంఘిక సమస్యలపై చర్చలు జరిపికొనుచు, పెక్కు ఉపాఖ్యానములను పరస్పరము చెప్పికొనుచు కొంతకాలము గడిపి చివరకొక చోట స్థిరనివాస మేర్పరచుకొని ముముక్షుజీవనులైరి. ఇందు సుశీల పాత్రకున్న ప్రాధాన్యమునుబట్టి కావ్యమున కామె పేరుంచఁబడినది.

ఈ కావ్యమందలి కథలను సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెను. కథకుఁడు కథ చెప్పుచుండ మధ్యాహ్న సాయం సంధ్యా సమయములు వచ్చి నప్పుడు కథ ఆపఁబడును. మఱల ఆ తరువాత కొనసాగును. అనఁగా ఇందా శ్వాస విభాగము కథా ఘట్టములఁబట్టిగాక కడుస్వేచ్ఛగా నొనర్పఁబడినదని భావము. కృతికర్త వంశావళియు, అవతారికయు కావ్యాంతమునఁ గలవు. షష్ఠ్యంతములకు, ఆశ్వాసాంతపద్యములకు బదులు ఆశీఃపూర్వక పద్యము లున్నవి. ఆశ్వాసారంభ కృతికర్త సంబుద్ధ్యంత పద్యములు లేవు. దేవీ మాహాత్మ్య ప్రతిపాదన మూలమైనది యీ కథ. సుశీల దేవీభక్తురాలు. కవుల ఆత్మీయతాముద్ర యీ పాత్రపై వేయఁబడినది. 'సినిమాతారల' నుండి సదసద్ చర్చలవఱకుగల సర్వవిషయములందును సుశీల యభిప్రాయములే తి. వేం. కవుల అభిప్రాయములు.

పాత్రలను పఠితకు పరిచయము చేసిన వైఖరి కడుగడుసుఁదనముతో నొప్పారుచు, నవ్యులనుసరించు 'స్కెచ్' అను కథానికాంశమునకు దగ్గఱగా నడచినది. కావ్య కథా సంధానమునుబట్టిచూడఁగా తి. వేం. కవులు పింగళి సూరనార్యునివలె సంశ్లిష్ట కథా కథన శిల్పమును ప్రదర్శింప యత్నించినట్లు కానఁబడును. కాని, కళాపూర్ణోదయములో నున్నంత సమన్వయశక్తి, కార్య కారణ భావము, ఇందు కానరావు. కథా నిర్మాణమునందుకన్న పాత్రరూప స్వభావ ప్రపంచనమునందు కవులు కొంతశ్రద్ధ వహించినట్లు కానవచ్చుచున్నది.

మూర్తీభవించిన లోకగుణము సెట్టి; స్వల్పముగా నీతి, అనల్పముగా వైరాగ్యము గల్గిన వాఁడు రాజా; వైరాగ్య వాసనంకుఁ బుద్ధిల్లు సుశీల వేశ్య; నాటి శాస్త్ర సాహిత్యముతో పాటు, నాగరికత, సామర్థ్యము, సౌందర్యము కలవాడు యువ బ్రాహ్మణుడు; మదీస్తందునపరావతారము శక్తిభక్తుఁడగు అర్చకుడు; "నిక్కు"ం కారింకణములు ముద్రించుకొన్న కామాతురుఁడు నిక్కు. వీరి సన్ని సన్నివేశములన్నియు యాదృచ్ఛికములే. వీరి జన్మచరిత్రలన్నియు కాంక్షేపార్థము చెప్పుకొనినవే. సమకాలీన సాంఘిక, మత, నైతిక, రాజకీయ, సాహిత్య విషయములపై విమర్శలన్నియు కవులావేశములోఁ జెప్పుకొన్నవే. తింతండుల న్యాయముతో మంచిచెడుగు లిందుగలవు. ఈ కావ్యము నవల యగుచో ఆంగ్లేయ సాహిత్యమందలి "Picaresque Novels" శాఖకు చేర్పవచ్చును. ఒక్కొక్క వ్యక్తి వంటిక దేశాటనానుభవము కవియందిముడలేక యిట్టి కావ్యముగా వెలువడును. ఇందులో అద్భుత మధికము.

జాతీయములు, సూక్తులు ఇంచధికము. తేట తెనుఁగు కవిత ధారాళముగా ప్రసన్నగుణముతో సాగియున్నది. అన్యదేశ్యము లమితముగా వాడఁబడినవి. వమోఒక్తిసముచయముల కొన్ని యతి దోషములు పడినవి. కాని, వానిని కవులే గుర్తించి ముందుమాటలోఁ జేర్కొని యున్నారు. 'ప్రమాదోధీమతామపి'. ఆ వృద్ధ కవి సింహములు గర్జించినచో వాటికాఁగాదు కవిలోకమంతయు సదుగులకు మదుగులొత్తవలసినదే. అట్టి దోషములు తి వే. కవులు. ప్రమాదములను సర్వాన్వేషణ దృష్టితో నొప్పుకొన్నచో నాతఁ డుత్తమసంస్కారియే కాఁగలఁడు.

## పూర్వ హరిశ్చంద్ర చరిత్రము

సత్యసంధుఁడై పురాణప్రసిద్ధిఁబొందిన హరిశ్చంద్ర చక్రవర్తి పూర్వజన్మ వృత్తాంతము ప్రధాన ప్రతిపాద్య వస్తువుగాఁగల్గిన కథాకావ్యమిది. హరిశ్చంద్రునితో పాటతని గాథతో పెనవేసికొనియున్న పాత్రల పూర్వవృత్తములు నిందు చోటు చేసుకొనినవి. అవి: చంద్రమతి, లోహితుడు, కాలకౌశికుఁడు, వీరబాహుడు మొ॥ వారి చరిత్రలు.

తే.గీ "పూర్వపూర్వజన్మంబునఁ బొదమినట్టి
కర్మ ముత్తరోత్తర కష్టకారణంబు
గాఁ బరిణమించు మంచియుఁగాని చెట్ట
గాని యది పిదకే వచ్చుఁగాని విడునె?" - (ప - 83.)

అను పూర్వకర్మఫల సిద్ధాంతము నాయసూత్రముగాఁగొని పూర్వజన్మ కథ లనుసంధింపఁబడినవి. ప్రకృత జన్మమునందు జరిగిన సంఘటనములకు కార్యకారణరూపముగా గోచరించు పూర్వజన్మగాథలు త్రికాలజ్ఞులగు మహర్షులు చెప్పుట యీ కావ్య కథాకథన విధానము.

1935 సం॥లో స్కూలుఫైనలు పాఠ్యగ్రంథములైన తెలుఁగుఁబొత్తము లలో నొకటియగు శ్రీ కొమండూరి అనంతాచార్యులవారి గద్యప్రబంధమునందలి కథ నాధారముగాఁగొని చంపువుగాఁ గవులు ఈ కావ్యము రచించిరి.

నైమిశారణ్యమున సూతుఁడు శౌనకాదులకు బోధించిన కథాసంచయ మిది. కావ్యకథారంభమునకు పూర్వరంగముగా నైమిశారణ్య మేర్పడిన విధమును, అందు ఋషులు నివాసమొనరించు హేతువును కథగా వర్ణించిరి. వారచ్చట నివసించుట భావి కలియుగ దురాచారముల నుండి దూరముగ నుండుటకేనట! నైమిశారణ్యవాసుల యభిమత మేదైనను కవులు తమ సమకాలీన సాంఘిక నవీన పాశ్చాత్యాచారములఁ గొన్నిఁటిని రోసి, ప్రాచీన సదాచార వర్తుల కుచిత గౌరవ మర్యాదలు జరుగుటలేదని చింతించి, భావనామయమై స్వీయాదర్శ సమగ్రమై యొప్పు నొక సంఘమును సృష్టించి సంతృప్తి పడిరేమో యనునట్లి నైమిశారణ్య ముని సంఘ సృష్టి గోచరమగుచున్నది. కవుల మనఃప్రవృత్తుల యొక్కయు, నమ్మకముల యొక్కయు అభిరుచుల యొక్కయు సమష్టి సృష్టి యీ నైమిశారణ్య సంఘసృష్టి. ఇది ఈ కావ్యములోనున్న ప్రధాన విశేషము.

కావ్యమునందలి గాథలలో నొక్కొక్కదాని నొక్కొక్క ప్రత్యేక శిల్ప దృష్టితో దర్శించి నిర్మించినట్లు కానవచ్చుచున్నది. చంద్రమతీ హరిశ్చంద్రులు పూర్వజన్మలో కలకంధరా నీలలోహితులనువారు. కలకంధర కాపు కులమున నొక గృహిణి. నీలలోహితుఁ డామెను కామించి, యామె మామవైపువారిని బంధించి ఆమెను సాధించి స్వీకరించెను. ఇందులో రాజుల చంచలబుద్ధియు,

గృహిణుల జార బుద్ధియు ప్రధానముగ వర్ణితములైనవి. ధర్మవిరహితమైన యొక్క కామమునకు లొంగిన మానవుని మనఃప్రవృత్తి తదనుకూల ప్రచార విశేషముల నెట్లు గాంచునో చిత్రించుటయందు కవులీ కథలో కడుచైతన్యవంత మైన కవిత్వము వెలార్చిరి. కలకంధర చామరగ్రాహిణిలో రాజున కంపిన సందేశము వ్యంగ్యరచనకు పరాకాష్ఠ (ద్వి. ఆ 33-46). రమణీయార్థ ప్రతి పాదక లలిత శబ్దప్రయోగము, ఉక్తిచమత్కృతి, వక్రత, గడుసుఁదనము, అభిమానముతోడి యనురక్తి ప్రతిపాదనము అను పాత్ర గుణము లీ పద్యములలోఁ దొడికిసలాడుచున్నవి. మగనాలియై యన్యపురుషుని వరించుచు దానినే తన వలపు గరిమకుఁ దార్కాణముగాఁ జిత్రింపఁగల్గిన ఆ పాత్ర యొక్క మాట నేర్పు కొక ఉదాహరణము :

క. "వలపు వెల తెలియఁదలఁచిన
వెలవెలదియుఁ బెండ్లియాడు వెలఁదియుఁ దెలుపం
గలరే? పాపమొ? పుణ్యమొ?
అల వలపుం దెలుపఁదగిన దన్యాంగనయే." —ద్వి. 43.

ఇందు వెలవెలఁదికి వెలయందే మక్కువయనియు పెండ్లియాడు వెలఁదికి గార్హస్థ్య ధర్మమునందే భక్తియనియు, అన్యాంగనయగు తనవంటి వలపుకత్తెకు వలపునందే రక్తియనియు నామెతాత్పర్యము. తాను ధన మాశించుటలేదనియు, గార్హస్థ్య ధర్మమును వలపుకొఱకు త్యాగముచేయు ననురాగవతి యనియు నిరూ పించుకొనుట యీ పద్య తాత్పర్యము. ఇట్లే కలకంధర మామ రాజునకు బుద్ధి సెప్పు వాక్యములు నిశితములై, నీతియుతములై; సూటిదనము, తేటదనము, విషయ వివేచనము, పారుష్యము మనెడి లక్షణములు గలిగి శక్తిమంతమగు కవిత కాలంబనములై యున్నవి. ఆ పాత్ర యొక్క పౌరుషము ధర్మనీతినిఁ గరగించి మోసలుపోసిన వాక్యశిల్ప మా సంభాషణము (ద్వి. 117-128). చంద్రమతి హరిశ్చంద్రుల సమావేశము శృంగార సంస్కృత నాటక సన్నివేశ కల్పనా రహస్య పాండిత్యమును పుక్కిటఁ బట్టినది. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుచే నేడు

దీవుల నేలించుటకు హేతువు విస్తరించు కథ కదు సంశ్లిష్టమయి రసోచిత కథాంగ విస్తరావిసర్త ప్రక్రియా నిర్వహణముచే సుగమమై రమణీయముగ నున్నది. ప్రధాన కథలు విపులములై యైదాశ్వాసము లాక్రమింప షష్ఠాశ్వాసమున కథానిబద్ధమై సంగ్రహ కథ రత్నహారమువలె భాసించినది. లోహిత, వీర బాహు, కాలకౌశికుల వృత్తాంతములు వరుసగా త్రిగుణ ప్రాధాన్యమును ధ్వనింపఁ జేయుచు విశ్వామిత్రానుశాసితములగుచున్నవి.

ఈ కావ్యమునం దవాంతరగాథలు పెక్కు లత్యంత లఘుకావ్యరూపములై ప్రధాన కథయందు సందర్భసహితముగా నతుకఁబడియున్నవి. కావ్యశైలి ప్రసన్నమై, కథావేగమునకు దీటైన గంభీర ప్రవాహరూపమై ద్రాక్షాపాకమున నొప్పారుచున్నది. కవులు వృద్ధులయ్యు శృంగార రస ఘట్టములం దలంకార రమ్యములైన వర్ణనలు రసోచితముగా నొనర్చియుండిరి. ఈ కావ్యమందలి రాత్రింక ప్రబోధ వాతావరణము పండిన కవి వ్యుత్పత్తికి నిదర్శనము.

తి. వేం. కవులు నవ్యత నందగించుకొనిన సజీవకావ్యములను నిర్మించుట యందధికమైన ఆసక్తి కలవారు. కావ్య ప్రక్రియలలో ప్రాచీనములు నవ్యములు వీరియందు పెనవేసికొని పోయినవి. ప్రాత లేనిదే క్రొత్త లేదనియు, మానవుఁడు గతములోనే పుట్టి భవిష్యత్తులోనికి 'ఇంతింతై వటుడింతయై మఱియుఁ దానింతై' అను పద్ధతిని పెరిగి నవ్యతా దర్శనము చేయవలెననియు వీరి సిద్ధాంతము. వీరి నవ్యతకు 'శ్రవణానందము', 'పాణిగృహీత' సాక్షులు; ప్రాచీనతకు మిగిలిన కావ్యములు సాక్షులు. దేశములో నొక విప్లవము తెచ్చునెడఁ బ్రాచీనులను కాదనకుండగనే, వారిలో వారికే తెలియక అణగారియున్న నవ్యతను వెలికిఁదీసి ప్రకటించి, తాము లక్షించిన పురోగతికి వారిమనసులు మళ్ళించినచో భావితరమున కన్నివిధముల బలము చేకూరుసని భావించి కవులు ప్రాచీన కావ్యలక్షణములలో నవ్య సాంఘిక కావ్యగుణములను, ఆత్మాశ్రయ కవిత్వచ్ఛాయలను ప్రవేశపెట్టి వైలక్షణ్యము సాధించిరి. ప్రాత ఎరువుకు క్రొత్త పండ్లు కాసిన కల్పవృక్షములీ కవుల కావ్యములు.

అవియన్నియు నొక యెత్తు.వీరి 'జాతకచర్య-ఇటీవలి చర్య' మఱియొక యెత్తు.

## జాతక చర్య - ఇటీవలి చర్య

'జాతక చర్య - ఇటీవలి చర్య' అను పద్య కావ్యము శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి సమగ్ర జీవిత చరిత్ర. కవియే స్వయముగా దీనిని రచించుటచే స్వీయ చరిత్ర యనఁబడుచున్నది. తెలుఁగు సారస్వతములో మొదటి స్వీయ చరిత్ర మీ కావ్యమని కాటూరి వేంకటేశ్వరరావుగారు పేర్కొనియున్నారు.* ఇది పద్య కావ్యమగుటచే నపూర్వమనఁబడుచున్నది.

గతము లేనిది నేఁడు లేదు. ప్రస్తుతము జీవించువాఁడు తన కీయునికిని ప్రసాదించిన గతమును గూర్చి ఆలోచించుట సహజము. గతమును చరిత్ర యందుము. ప్రస్తుతమును వార్తయందుము. భవిష్యత్తు నూహయందుము. కావ్యములు ప్రసిద్ధులగు పూర్వుల చరిత్రములను గ్రహించుచున్నవి. రామాయణము, మహాభారతము మొ॥నవి ఎంతటి కావ్యములో అంతటి చరిత్రలు, అంతటి జీవిత చరిత్రలు. పరాశ్రయములగు నుత్తమ గుణములఁ గ్రహించుట ప్రాచీన కవుల లక్షణము. అవికత్థనత్వము వారి జీవలక్షణము. అట్లగుటచే స్వీయ ప్రశంసలు వారు చాల తక్కువగా నొనర్చెడివారు దానివలన మన దేశములో కవుల చరిత్ర దొరకుట బహు క్లిష్ట సమస్యయైనది. కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రథమాంధ్ర కవుల చరిత్ర రచనకుఁ బడిన పాట్లు గమనించుచో నా సత్యము

---

* "తెలుఁగులో ఆత్మ చరిత్రమును రచించుటకు శ్రీ వేంకటశాస్త్రులవారే ప్రథమములని చెప్పవలయును. అంతియేగాక ఇట్టి స్వీయ చరిత్రములు ప్రచురముగానున్న ఆంగ్లాది భాషలలోఁ గూడ నవి గద్యమయములుగా నున్నవే కాని దీనివలె పద్య కావ్యములు కావు. స్వవృత్తాంత గోపనము విధించు ప్రాచీన ఆర్య సంప్రదాయమునకు చెందినవారయ్యు శ్రీ శాస్త్రులవారు ఇట్టి కృతికి దారి వెట్టుట వారి యుపజ్ఞకు, స్వతంత్రతకు మఱియొక నిదర్శనమగుచున్నది. ఇప్పటికి సుమారు 35 సం॥ల క్రితము అనఁగా శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి స్వీయ చరిత్ర రచనమున కించుక పూర్వమే ఈ గ్రంథమారంభింపఁబడినను ఉత్తరార్ధము మాత్రము మొన్న మొన్ననే జరిగినది."

—(కాటూరి వేంకటేశ్వరరావుగారు - జాతకచర్య - పీఠిక.)

బై టపడును. అవియు కవుల చరిత్రయు, వారి స్వీయచరిత్రవలెనే నేఁడు వారికి కరతలామలకములు. ప్రతి మహాత్ముని ఆత్మచరిత్రము జాతి చరిత్ర కొక్క సువర్ణాధ్యాయము వంటిదనుటలో నతిశయోక్తి లేదు.

తిరుపతి వేంకటకవులు నవ్యాంధ్ర కవితాపితామహులు. వీరి యాత్మ చరిత్ర తెలుఁగు కావ్యజగత్తు కొక అలంకారప్రాయమైనది. వేంకటశాస్త్రిగారు ఉత్తమ పురుషలో స్వీయచరిత్ర రచించుట మాని ప్రథమ పురుషలో నీ కావ్య మును రచించిరి. నన్నయాది కవులందీ సంప్రదాయము. జీవితగాథ యంతయు జాతకచక్ర ప్రభావమే యనునట్లు చిత్రించి తమకు జ్యోతిషశాస్త్రముపై గల అపార గౌరవమును చిరస్థాయి యొనర్చుకొనిరి.

ఉ. జ్యోతిషమందు నాకెపుడు శ్రద్ధయు భక్తియు మెండు, దానిలో
జాతక భాగమందున నెసంగెడి నెక్కుడు నమ్మకమ్ము, నా
జాతకచక్రకముం గుఱిచి చక్కయొనర్చి లిఖించియుండితిన్
"జాతకచర్య" నానరు చక్కని కబ్బమొకండు భూవరా!

—జాత. అవతా. 21 వ.

అను పద్య మిందులకు సాక్షి. ఈ కావ్యము ద్వారా కవులు భావించిన మఱికొన్ని ప్రయోజనము లివ్వి:

1. ప్రాచీన భారతీయ శాస్త్రాదుల పట్ల తమకున్న నమ్మకమునకు కావ్యమునం దొక విశిష్ట స్థానమును గల్పించి తద్ద్వారమున ప్రజలకు తద్వై శిష్ట్యమును దాటి చెప్పుట.

2. జీవిత సాఫల్యసిద్ధికై కవి యొనర్చిన పురుషకార యత్నమంతయు కార్యకారణ సమన్వయ మందునట్లు గ్రహసంచారఫలమున కన్వయించి నిరహం కారతను ప్రకటించుట.

3. కావ్య నిర్వహణ ప్రక్రియలలో నొక నవ్యతఁ బ్రకటింపవలెననెడి యుత్సాహము

4. లోకములో తమ్ముఁ గూర్చి ఏర్పడుచున్న కల్పితగాథల నరికట్టుటకై సత్యచరిత్రము నొకదానిని సంపూర్ణముగా విరచించుట.

సామాన్యముగా స్వీయచరిత్రలయందు రచయిత యొక్క నిర్దిష్ట సత్య సాధనకై యొనర్చిన కృషి యభివర్ణితమగును. అది నీరసమైన జీవిత సన్నివేశ ముల కూర్పువలెగాక జీవనసౌధాగ్రపరోహణమున కేర్పడిన సోపానసన్నివేశ

ముల క్రమనిర్మాణసందర్భరూపమై యుండవలెను. బహుశాస్త్రపాండిత్యము వలనను, బహుదేశాటనము వలనను కవి సాధించిన విపుల లోకజ్ఞత నిందు పొందుపరచుచు సమకాలీన సాంఘిక జీవితము ప్రత్యక్షమగునట్లు విమర్శించి చెప్పుచు, ఆత్మ ప్రత్యయము సర్వాధీనమై వరలునట్లు చిత్రింపఁబడును. సందేశాత్మకత ఇట్టి కావ్యముల కాయుస్సూత్రము. తి. వేం. కవులు పై లక్షణములన్నియు క్రోడీకరించి యీ కావ్యసంపుటిని సంఘటించిరి.

పందొమ్మిదవ శతాబ్దపు టుత్తరార్థమునందును, ఇరువదియవ శతాబ్దపు టారంభ దశయందును తెలుఁగు కవిత్వ చరిత్రకు పుట్టిల్లు వీరి జీవితగాథ. వీరు దేశమున నలుమూలల నొనర్చిన అష్టావధాన శతావధాన సభలు, పండిత ప్రకాండులతో నొనర్చిన వాగ్వివాదములు, నానారాజ సందర్శనములు, అధిక్షేపములు, సద్విమర్శలు, ఉపన్యాసములు, కావ్యనాటక సముదాయములు, అనువాద కావ్యములు, దేవీభాగవతాది పురాణ రచనలు, తెలుఁగుదేశమును సాహిత్య వర్షముల దడిపివైచినవి.

వీరికిఁ జరిగిన సన్మాన సభలు, షష్టిపూర్త్యుత్సవములు, బిరుద ప్రదానోత్సవములు, వీడ్కోలు సభలు. అవధాన సభలు, అభినందన సభలు, గజారోహణాద్యుత్సవములు, బ్రహ్మరథోత్సవములు తెలుఁగు భారతికే జరిగినట్లు ఆంధ్రులు భావించి కీర్తించి యున్నారు. చరిత్రను సృష్టించిన చరితార్థులీ కవులు.

ఇందు జాతక చర్య సూత్రగ్రంథము వంటిది. ఒక్కొక్క వాక్యమును భేదించుచో సంపుటములకొద్ది గ్రంథసంచయము పెరిగిపోవును. నానారాజ సందర్శనము, అష్టావధాన సారము, స్తోత్రవాఙ్మయము, వివాద సాహిత్యము గద్య వాఙ్మయములో చాలభాగము, ప్రబంధనాటకాదులలో నచ్చటచ్చటి సన్నివేశములు జాతకచర్యకు వ్యాఖ్యానములే. జాతకచర్యకన్న ఇటీవలి చర్య విపులముగా వ్రాయబడినది. ఈ రెండిటిని కొన్ని విశిష్ట లక్షణములు కుదిరినవి.

1) జాతకచర్య సూత్ర గ్రంథమువలె నతి సంగ్రహముగా నుండును. ఇటీవలి చర్య భాష్యరచనవలె నాతి విపులముగా నుండును.

2) జాతకచర్యలో వేంకటకవి తిరుపతిశాస్త్రితో కలిసి సాహిత్య జైత్ర యాత్రలు చేసి సంపత్తును, యశస్సును గడించిన ఘట్టము అధికము. ఇటీవలి చర్యలో క్షీరసాగర శయన విశ్రాంతి గొనుచు యశోలక్ష్మీ సంయుతుఁడై సాహిత్య గోష్ఠిలో కాలము గడిపిన ఘట్టము అధికము.

3) జాతక చర్యలో నుత్సవ విగ్రహముగా నున్న వేంకటశాస్త్రి ఇటీవలి చర్యలో మూల విగ్రహరూపమై భాసించుట గాననగును.

4) జాతకచర్యలో వేంకటకవి జంటకవి; అవధాన వందానునుఁడు; ఇటీవలి చర్యలో ఒంటికవి, మద్రాసు రాష్ట్రాస్థాన కవీంద్రుఁడు.

ఇది వేంకటశాస్త్రిగా రొంటిగా రచించినను "ఒక్కరు రచించిరేనియును గాఁదగు దిర్పతి వేంకటీయమై" అను వారి నియమమును బట్టి ఇవి తిరుపతి వేంకటీయమే

కవులు సత్యగోపనము చేయలేదని - తిరుపతి శాస్త్రి వివాహ ఘట్టమున 'శ్రవణానంద' కావ్యవస్తువు దొరికిన దనుటయందును, శ్రీపాదవారికి వ్రాసి యిచ్చిన 'క్షమాపణ'ము పేర్కొనుట యందును, తమ కావ్యములలోఁ బడిన ప్రమాదముల నొప్పుకొనుట యందును స్వీయ గుణ లోపముల చర్చ నిష్పాక్షికముగాఁ బ్రవంచించుటయందును మనకు స్పష్టమగుచున్నది.

వీరి జీవిత ఘట్టములనుండి పఠితలు నేర్చుకొనఁదగిన నీతి సముదాయములు పెక్కులు గలవు.

1) "వ్యక్తిగతమైన యీయాయి వైరములను
జాతికంటఁ గట్టుట యనఁ జాలఁ దప్పు" - జాత. ఉత్త. 18.

2) "గానమును దోసము న్యాయము
గను జూపి విమర్శన సలుపఁగాఁ దగు నెందున్" - జాత ఉత్త. 297.

3) "చెవులపిల్లి కొమ్ముఁ జేఁబూని గొడ్రాలి
కొడుకులొందొరువులఁ గొట్టుకొనుట
పొసఁగెనేని యనృతముఁనకు జంకని ప్రాణి
పరమువలన తీతిపడుట పొసఁగు" - ఇటీ. 297.

4) "కవియుఁ, బాచకుండు, గాయకుండు ముగ్గు
రొక్కరూప, వీర లొకరి మీఁద
భరము పెట్టుకొనుచు బ్రతుకఁగా వలయు స్వ
తంత్ర భావమెందుఁ దరవ నాఒన్తి" - ఇటీ.

5) "నెరసులు దొరలిన మాత్రన
పరమార్థమ్మునకు హానివాటిల్లదు, దు
ర్భరనుగు బాషోత్కరమును
బరిహృతి గావించు రసము ప్రభవించునెరన్" - ఇటీ.

## జాతకచర్య - ఇటీవలి చర్యలోని కొన్ని ముఖ్యాంశములు

### (చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి జీవితములోని ప్రధాన ఘట్టములు)

స్వస్తిశ్రీ ప్రమోదూత నామ సం॥ర శ్రావణ శుద్ధ ౧౨ (ద్వాదశి) సోమవారము (క్రీ. శ. 1870 ఆగస్టు 8 వ తేదీ) రాత్రి ౨౫ గడి. ౮ విగడియలవేళ పూర్వాషాఢా నక్షత్ర మిదున లగ్నమున జననము.

**1870-1871**

దేహార్తి కలిగి మరల ఆరోగ్యము చేకూరెను.

**1871-1874**

(1) అంమూరు గ్రామమున మాతామహ గృహమున దేహార్తి.
(2) ద్విభాషి వెంకన్నగారు జాతకము చూచి ధైర్యము సెప్పుట.
(3) స్వాస్థ్యము సేకూరుట - అనుజప్రాప్తి.

**1874-1875**

చెల్లెలు పుట్టెను - సిరులు కలిగెను.

**1875-1881**

దేహపీడ.శుభము భగినీలాభము - విద్యారంభము - కొంత ఆలస్యమైనను చురుకుగా విద్య సాగుట-సోదరి యగు కామేశ్వరి వివాహము - ఉపనయనము - మఱియొక సోదరి జన్మించుట - విద్యాలస్యము - ఋణబాధ - పితృశరీరపీడ - విద్యాభివృద్ధి - దారిద్ర్యము.

**1881-1882**

(1) స్థాన విభ్రంశము - 'యానము' అను గ్రామమున నివాసము—
(2) "హూణభాషాభ్యాస కలనఁ జొనిపె;
నంధ్రభాషకుఁ బ్రాధాన్య మనుమడించి"— జాత. పూర్వా. 29.
(3) "ఆంధ్ర హూణభాషలు సమమ్ముగానేర్పి వదిమ నలరె"
జా. పూ. 30.
(4) శీర్ష వ్రణబాధ.

**1882 - 1884**

(1) "హూణభాషకు విమ్నుంబు నొసఁగి యంధ్ర
భాష కొక్కింత ప్రాబల్య పదిమగూర్చె) - జా.పూ. 31.
(2) కాకుపర్తి భుజంగరావు గారియొద్ద రఘువంశ పఠన మారంభించుట.

## 1884 - 1885

మాతుల మరణము - విశేషమైన రుజ - ఆరోగ్యసిద్ధి - వేదవిద్యా భ్యసనము

## 1885 - 1887

(1) విద్య నడచుచునే చిల్లరవిద్యలు - గానము, మద్దెల, కుస్తీ, తిట్టు కవిత - నేర్చుట, మాతృపితృ, మూఁడవ చెల్లెలి మరణము, స్థాన భ్రమణము - సదనలాభము.

(2) అల్లమరాజు సుబ్రహ్మణ్య కవితో కలిసి కాకపుర ప్రయాణము - గణపతి పండితుని యొద్ద విద్యాభ్యాస వైఫల్యము - కాటవరమునకుఁజేరి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి యొద్ద మూఁడు నెలలలో కుమార సంభవమున మూఁడు సర్గలు పఠించుట - కవిత్వ లక్షణ శాస్త్ర పరిచయము.

(3) పదకవిత్వ రచనము - గురువులు వారించుచున్నను కవనమందాసక్తి యధికమగుట - చతురంగ ఖేలనము - మేఘసందేశ కావ్య పఠనము-విఘ్నము-శరీరపీడ - స్వగృహాగమనము - చతురంగ ఖేలనమునఁ గాలక్షేపము.

(4) కాజులూరు గ్రామమున కామసోమయ్యగారి యొద్ద మేఘసందేశ కావ్యపఠనము - చతురంగ ఖేలనరతి - విద్యాభివృద్ధియందు మాంద్యము - కవిత్వాహంకారము.

## 1887 - 1888

(1) దక్షిణాక్షి వ్యాధి - కవిత్వమునందు కృషి.

(2) యానాము వేంకటేశునిపై నొక శతకము చెప్పనారంభింప నందుఁ గొంద ఱొప్పులను గూడ తప్పులని యీర్ష్యాన్వితులై పల్కుట.

(3) సంస్కృత సంధి నెఱుఁగమి అవమానము, పాణినీయ పఠనేచ్ఛ.

(4) ఒక బాలునితో గాశి కేగ నిశ్చయించుట - నేత్రరోగభీతిచే విరమించుట - అక్షిరోగ చికిత్స జరిగినను ఆరోగ్యము చిక్కకపోవుట - మఱి యొకనితో గాశికి ప్రయాణము.

(5) గొల్లెపూడి సత్రము - కాకపురి - పీఠిపురము-కత్తెపూడి - అన్నవర సత్రము - తుని - నక్కపల్లె - వైశాఖపట్టణము దర్శించుట - మిత్రుని వైముఖ్యము - తిరుగుప్రయాణము - ఖాసీము కోట - ఎలమంచిలి. నక్కపల్లె -

రుని - అన్నవరము (ఉత్తమ సత్రము).పిఠాపురి - వ్యాకరణ విద్యాగురువుకై అన్వేషణము.

(6) దామర్ల కోటలోని ప్రతివాది భయంకర రామాచార్యుని యొద్ద కావ్య వ్యాకరణ పాఠములు - మాధుకరము - మిత్ర నిష్క్రమణము- భారవిలో మూఁడు సర్గలు, వ్యాకరణముగఁ బంచసంధులు పఠించుట - అక్షివ్యాధి - దామర్లకోటను వీడుట.

(7) పిల్లంక గ్రామమున అనంతాచార్యుల వద్ద లఘుకౌముది పఠించుట- అప్పుడప్పుడు పల్లెపాలె గ్రామమున మధునాపంతుల సూరయ వద్ద చదివి, భారవి కావ్య శేషము, మాఘము, లఘుకౌముది ముగించుట - ఆంధ్ర సాహిత్య పఠనము - అక్షిరోగ తీవ్రత.

(8) విద్యాసక్తి పిన్నతాతయగు నృసింహ కవి గ్రంథములు, సిద్ధాంత కౌముది మొ॥ గ్రంథములతో నెటకేనిపోయి విద్యార్జనము సేయనెంచుట.

(9) కడియొద్ద నగరవాని చెర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి వద్ద చదువనెంచి పయనమగుట - కోటిపల్లె - కడియము - బ్రహ్మయ్య దర్శనము - గురువు "నీ కీడుజోడైన విద్యార్థి తిరుపతి" అని ప్రశంసించుట - అక్షిరోగ చికిత్సకై చింతపర్రు ప్రయాణము - ఆ యూరి కరణము వద్ద అధ్యాత్మ రామాయణ పఠనము - పురాణమున పద్యపఠనకౌశల్య మలవడుట - అక్షిరోగోపశమనము - పూర్వమే ఆరంభించిన వేంకటేశ శతకము ముగించుటకై యత్నించుట - గృహాగమనము.

(10) బ్రహ్మయ్య శాస్త్రిని చేరుట - తిరుపతి శాస్త్రితో సహపాఠిత్వము - వ్యాకరణ పఠనము - తిరుపతి వేంకటేశ్వరుల మధ్య ''త్వమేవాహమ్" అను స్నేహము- గణేశ్వర నవరాత్రములు - రాజమహేంద్రవరములోని వైశ్యాదులను ప్లీడర్లను బంధ చిత్ర కవిత్వ పద్ధతుల మెప్పించి ధనార్జన మొనర్చుట - గురు మనఃప్రీతి.

**1888-1889**

గురువుగారి దేశాటనము - కవనము - ధనాకర్షణము.

**1889-1890**

(1) "ఆంధ్ర కవనమ్ము కన్న నత్యధికముగను
సంస్కృత కవిత్వమున బుద్ధి సంఘటించె."

(2) వివాహము - కిర్లంపూడి జమీందారుపైఁ బద్యములు - తిరుపతి శాస్త్రి యింట గురువులు సహిమ్యేఁద్రై యుండుట.

(3) ఒకని సాహచర్యముతోఁ గాశికిఁ బ్రయాణమగుట - త్రోవలో -

(a) నిడమర్రు గ్రామమున రామదాసు గారివద్ద "శతఘంటకవనమ్మ"ను అష్టావధానము చేసి పండితుల ఆశీస్సులనందుట

(b) గుండుగొల్లు అవధానము

(c) బెజవాడ - సికిందరాబాదు - పుల్పాలక్ష్మయ్య సాయము - త్రివేణీ సంగమము - కాశిలో నాల్గు మాసముల నివాసము - శ్రీ సుబ్రహ్మణ్యసూరి యొద్ద శిష్యరికము—

(d) బ్రహ్మయ్యశాస్త్రిగారి లేఖ-కోమటి సాయముతో తిరుగు ప్రయాణము- జగన్నాథుని, కూర్మేశ్వరుని, సింహాద్రి నారసింహుని, దర్శించి సేవించి, ఉప్పమాక - పీఠికాపురము - చేరుట.

(4) కోనసీమ ప్రయాణము - ముమ్మడివరము, బనాపురము, కేశవకుర్తి అవధానములు - విశేష ధనార్జనము.

(5) బ్రహ్మయ్యశాస్త్రినిఁ జేరి శ్రీపతితోఁ గవనము - తిరుపతి యిది వఱకు విడిగా కవనమల్లినను - ఇప్పటినుండి జంటకవి యగుట.

(6) "అంత ధాతురత్నాకర మనెడి చంపు
వొకటి మొదలిడి పాణినీయోపయోగ
మగుగతి రచించి; రాగ్రంథమందు రామ
కథ క్రమమ్ముగ ధాతువుల్ గ్రాలనలరు" - జా. పూ. 241.

(7) గురువు ధవళగిరికి మకాము మార్చుట - అచ్చటనే నివాసము.

**1890 - 1892**

(1) ధాతురత్నాకరమును గొంతవడి పూర్తిఁ జేసెను.

(2) "పీఠి నా జిన్నిరూపకం బొకటి" రచింపఁ బూనుట.

(3) పెద్దజబ్బు చేసి ఆరోగ్యము నేకూరుట.

(4) అష్టావధాన గరిమ - శాస్త్ర పాండిత్య వృద్ధి - వేదవిద్యా ప్రవేశము.

(5) కాకినాడలోఁ తిరుపతి వేంకటకవుల అష్టావధానము (ఇది జంట కవుల మొదటి యవధానము - 23.11.1892)

(6) జాదము వేంకటరత్నము శతావధానమునకై ప్రోత్సాహము - శతావధానము - ప్రశంసలు వచ్చుట.

(7) ముమ్మడివరపు అష్టావధానమున బద్ధమత్సరులైన వెంపరాల వేంకట శాస్త్రి తన సుతునిచే శతావధానమున 1. ఉపజాతి వృత్తములో భూపుత్రి పెండ్లి 2. వంశస్థములోఁ గాకినాడ బ్రాహ్మణ్యము గురించి అడిగించి - దోసములువచ్చి వాదుకు లాగుట. ఉపజాత్యాఖ్య వృత్తమదికాదు, వర్ణము తప్పినది అను ప్రతి పక్షము వారిని ఓడించి, ప్రతిపక్షి పద్యములో "వర్ద్ధిష్యద్వ్యద్ధి" అను పదము దోసమని నిరూపించుట - పట్టణమున నూరేగింపు.

## 1892 - 1893

గురువు వద్ద విద్యాభ్యాసము - కాశికా సహస్రము రచనము - కవిత్వము విద్యాభ్యాసముగా నేర్చుట - కోనసీమకు అవధానార్థము వెళ్ళి అమలాపురమున శతాష్టావధానములు - గురు సన్నిధి.

## 1893 - 1894

(1) ధాతురత్నాకర రచనము పూర్తియైనది.

(2) కాశీసహస్రము విస్తృతముగా రచించుట - చోరబాధ.

(3) ఏలూరు అవధానము చేసి బందరు చేరుట - అచ్చట పెక్కు విశేషములు.

(4) కం॥ శుకరంభాసంవాదం
బొకటియు, మఱికొన్ని వచన యుక్తమ్మగు ప
ద్యకదంబము గలిగిన నా
టకములు నాటకుల కచ్చఁగ నొసఁగి రెంమిన్. —పూర్వ.331.

(5) నిక్సి. ఐ. యెడ్డిదొర మెప్పుకోలు - మద్రాసున కాహ్వానము.

(6) తనయూర నవరాత్రోత్సవమున - హరికథనొండు వ్రాసిరి. దాని పేరు "లీలాశుక చరిత్రము."

(7) ఇంజరమను పల్లెలో నివాస స్థలము - తిరుపతితోఁగలిసి భాష్యము కొంతవఱకు గురువువద్ద చదువుట.

(8) మద్రాసు ప్రయాణము - ఆనిబిసెంటు ఉపన్యాసము - ఆమె ముందష్టావధానము - వేంకటగిరికి ప్రయాణము.

**1894 - 1895**

(1) వేంకటగిరి ఆస్థానమున - శ్రీ రాజగోపాల కృష్ణయాచ విభుని, వేంకటకృష్ణయాచ, ముద్దుకృష్ణ యాచేంద్రుల దర్శించుట - బట్టుసుకవి లేక పోవుటచే జాగు - నెల్లూరు ప్రయాణము.

(2) నెల్లూరుజిల్లా జడ్జి సభజరిపి యోగ్యతాపత్రదానమొనర్చుట-గంటలో మూలస్థానేశ శతకము ఆశువుగాఁ జెప్పుట - నియతాక్షరితో అష్టావధానము.

(3) వేంకటగిరి నుండి మిత్రునిలేఖ - ముద్దుకృష్ణయాచేంద్రునిచే సత్కారము - గోపాల భూమీశు సత్కారము - గోపాలభూమీశుతో దిరుపతి యందు కొన్నాళ్లు వసించుట.

(4) క్రొత్త పల్లెలో తిరుపతి శాస్త్రిగారి వివాహము - వేంకటశాస్త్రి గారికి "శ్రవణానంద" కావ్యేతివృత్తమునకు ముడిసరుకు దొరుకుట.

(5) ఇంజరమున వాసము.

(6) "రసికానందము" అను చిన్ని పుస్తకము రచింపఁబూనుట

(7) ఇంతకు పూర్వమే రెండేళ్ళనాడు బందరు థియేటరు మిత్రుల కోరిక మీఁద ఆశువుగా సంస్కృతమున జెప్పిన శుకరంభాసంవాదమును దెలుఁగు సేయుట.

(8) వైశాఖపట్టణమున అవధానము - ధవళగిరి అష్టావధానము - అమలాపురావధానము.

(9) కాశీసహస్రము చెప్పుట.

**1895 - 1896**

(1) గద్వాల ప్రభు పువాసీనుఁడగుట - తిరిగివచ్చుచు బెజవాడ, బందరు లందు సభలు.

(2) బులుసు పాపయ్యశాస్త్రి తనయా వివాహము తంగేరులో- ఉపద్రష్ట సుబ్బరాయని "వలని"- "నేత్రి" అను ప్రయోగములు దుష్టములని నిరూపించుట.

(3) విజయనగర ప్రభువును గాంచనేగుట; కాశినాథ పండితుని కాపట్యము - రాయదు శాస్త్రి సహాయము - సచివాగ్రణి దర్శనము - కోదండ రామ మూర్తికి సమాధానము - అవధానము - మునసబుగారు - ప్రిన్సిపాలు కిలాంబి రామావతారముగారి అధ్యక్ష్యమునఁ గసాలలో నవధానము - ఆనంద గజపతి దర్శనము - హేమంపు బిరుదములు - వార్షికము.

(4) పీఠికాపుర నృపతి శ్రీజగన్నాథ రాట్సన్మానము.

(5) క్రొత్తపల్లి జగ్గభూపతి శతావధానము - సన్మానము - గద్వాల ప్రయాణము.

## 1896 - 1897

(1) గద్వాల శ్రీరామ భూపాలుఁడు - వైష్ణవ పండితుని మాత్సర్య మెదుర్కొని - బహుమతుల నదయుట.

## 1897 - 1898

(1) మొగలుతుర్తి ప్రభువు లక్ష్మీనృసింహుఁడు - బిరుదములు, బహుమానములు, సన్మానము నిచ్చుట.

(2) పాలకొల్లు అవధానము, కాకినాద అవధానము.

(3) "శ్రవణానందము" పూర్తిందవిలించుట.

(4) ఇహపర సుఖప్రదమగు "దేవీభాగవతము" తెనిఁగించుటకై పూనుట.

(5) గద్వాల వార్షికము గ్రైకొని, ఆత్మకూరు ప్రభువగు సీతారామునిచే వార్షిక మేర్పఱచుకొనుట - ఆత్మకూరులో శ్రీనివాసాచార్యుని వితండ వాదము.

(6) గుంటూరు అవధానము.

(7) ఆత్మకూరు ప్రభువుయొక్క ఆనతిపై "శ్రీనివాస విలాస"మను సంస్కృతకావ్య మనువదింపఁ బూనుట (కాకినాదలో).

(8) ద్వితీయ భగిని స్వర్గస్థురాలగుట.

## 1897 - 1898

(1) వాదరేవు వేంకటరత్న మంత్రిగారి ఇంటిలో 'శ్రీనివాస విలాస' రచన.

(2) కిర్లమపూడి నుండి ఆత్మకూరు వెళ్ళి కురుమళ్ళిప్రభువు ఉత్సవము లలోఁ బాల్గొనుట - జ్వరబాధ.

**1898 -1899**

(1) శ్రీనివాస విలాస ప్రబంధము తేనికి వినిపించుట-వాదోపవాదములు.

(2) గజోత్సవము - భూదానము - దేవీభాగవతానువాదము - శ్రవణా నంద కావ్యమున మార్పులు చేయుట - శ్రీలక్షణా పరిణయము నూర్నగరి రచించుట.

(3) రంగాపురరాజా కృతి నర్థించుట-జ్వరబాధచే నొల్లక నిలుసేరుట.

(4) ప్రభాకరాఖ్య కవి వేంకట కవి యొద్ద కొన్ని రోజులుండుట.

(5) కిర్లమపూడి ప్రభువు చిన్నరావు నొద్ద అష్టావధానము - వార్షికము.

(6) పీఠికా పురావధానము - భూమ్యాది దాన సన్మానము.

(7) శ్రవణానందము వాదరేవు వేంకటరత్న మంత్రి కంకితము.

(8) దేవభాగవతాంధ్రీకరణము.

**1899 - 1900**

(1) 'ఏలా మాహాత్మ్య' రచనారంభము.

(2) పోలవరము జమీందారు ఆర్నాల్డ్ రచించిన 'లైట్ ఆఫ్ ఏసియా'ను అనువాదము సేయఁగోరుట.

(3) రామచంద్రపురము, ఆలమూరు, కపిలేశ్వరము, క్రొత్తపేటలయం దవధానములు.

(4) శ్వశుర గృహమున 'బుద్ధచరిత్ర' రచనము - గురుమృతి.

(5) 'జాతకచర్య' రచనారంభము - దేవీభాగవతానువాద రచనము.

**1900 - 1901**

(1) గృహనిర్మాణ యత్నమున కానుకూల్యము.

(2) పాలతేరులోఁ జిన్నరాజ్మాన్మానవేంద్రునిచే గౌరవము.

(3) గజపతినగర, విజయనగర, వైశాఖ పట్టణ యాత్రలు-సభలు-

(4) ఏలా మాహాత్మ్యమును సర్వరాయని కంకిత మిచ్చుట. భూమి నుపహారముగాఁ గొనుట.

(5) ప్రోలవరము జమీందారుకు బుద్ధ చరిత్ర వినిపించుట.

(6) ఇంటిపనుల కడ్డంకులు - పెక్కు చిక్కులు.

(7) దేహ పీడకలిగి, పోలవరమున రామమూర్తిగారివలనఁ దగ్గుట.

**1901.1902**

(1) ఇలవేల్పగు కామేశ్వరీదేవిని గూర్చి శతక మారంభించుట.

(2) తిరుపతిశాస్త్రి పోలవరము జమీందారు నాశ్రయించియుండ తానొక్కఁడే యవధానములు సేయుట-అనకాపల్లె, శ్రీకాకుళము, ఉర్లాము సంస్థానము లందు అవధానములు.

(3) మందసావిభు సన్మానము - గ్రహణిబాధ - గద్వాల ప్రయాణము - తిరుపతిశాస్త్రితో కలిసి యవధానము.

(4) 'లక్షణాపరిణయ' కావ్య మంకితమిచ్చుట.

(5)ఆత్మకూరు కుకవుల నోడించి భూపతితో భూమిపై వాదము పట్టెను.

(6) రాణి - బూతు సమస్య.

**1902-1909**

(1) నూజివీడు శతావధానము - వార్షికము - ఏలూరు శంకరుని యొద్ద నుండుట - అవధానము.

(2) తోట్లవల్లూరులో పట్టాభిషేకము-నెల్లూరు ప్రయాణము-గృహ నిర్మాణము సంపూర్తి యగుట - నూజివీడు పయనము.

(3) బందరు హిందూ కాలేజి హైస్కూలులో నుద్యోగాహ్వానము- అందు ప్రవేశించుట.

(4) విద్యార్థుల భక్తి - పండిత కలహములు - విజయములు.

(5) పుస్తకాల ముద్రింపు - వ్యాపారము - ధనార్జనము.

**1909-1912**

(1) బహుళ కవిత్వ రచనము-వివాదములు ప్రబలినవి-అనేక కావ్యములు రచింపఁబడినవి.

(2) గిరశము - గుంటూరుసీమ వెలసినవి.

(3) కాకరపర్తి గందరగోళము-మూఁడు మాసములపాటు గుంటూరులో నివాసము-బందరు తిరిగి వచ్చుట.

(4) దత్తపుత్ర ప్రసక్తి.

**1913-1914**

(1) భార్య గర్భవతి యగుట.

(2) వేమవరపురాగ్రహార అవధానము - కంకణ సన్మానము (అన్నియు నొక ఎత్తు - ఈ అవధాన మొక ఎత్తు).

(3) పుత్రోదయము - కడియమున బారసాల.

**1914-1916**

(1) హైదరుపుర సన్మానము - ఏలూరుపురమునఁ గోర్టు సాక్ష్యము - భుజంగరాట్సేవకుని కేసులో కోర్టునందు శ్రీనాథుని వీథినాటకమునం దశ్లీలార్థములు లేవని కోర్టులో సాక్ష్యమిచ్చుట.

(2) మైలవరపు ప్రభువు నానతిపై అవధానము - చెన్నపురికేగి వేంకటగిరి ప్రభువు కోర్కెపై శృంగార రసనియమములపై యుపన్యాసములు.

(3) స్వగ్రామమున వ్యవసాయము-అంటు మామిడితోట.

## జాతకచర్య - ఉత్తరార్ధము

**1916-1918**

(1) బందరు స్కూలు ఉద్యోగమునుండి విశ్రాంతిఁ గొనుచున్న వేంకటశాస్త్రిగారికి వీడ్కోలు సభాయత్నములు. కృష్ణాపత్రికలో ప్రకటనలు - వీడుకోలు సన్మానము (1916 అగస్టు 5 వ తేదీ).

(2) సోదరి కామేశ్వరమ్మ మృతి.

(3) తోట్లవలూరి ప్రభు పట్టాభిషేకము.

(4) గంపలగూడెపు ప్రభువు - క్రొత్తపల్లె ఆహ్వానము. రెండవ సంతాన వియోగము - గృహప్రవేశము - హరినాగభూషణము కచ్చేరి.

(5) నరసరావుపేట శతావధానము, మంగళగిరి యవధానము.

**1918-1920**

(1) తోట్లవల్లూరిలో గజారోహణము- నూజివీడులో విద్యాగోష్ఠి-వార్షికము.

(2) ఇన్ఫ్లుయంజా జ్వరము - పితృ వియోగము.

(3) చేబ్రోలు అవధానము - అనంతవరాగ్రహారావధానము-వేటపాలెము, తాళ్ళపూడి గ్రామ గ్రంథాలయ సభాధ్యక్షత - సికింద్రాబాదు ప్రయాణము.

**1921-1923**

(1) అన్నవరము, చిత్రాడ సభలు - రామాంబ నెల కిరువదియైదు రూప్యములిచ్చుట.

(2) చల్లపల్లి అంకినీడు - పట్టాభిషేకము-మిత్రులగు విస్సా అప్పారావు, సోమన కామేశ్వరరావు, పద్మనాభము, మల్లచయనులతో కాలక్షేపము - మురుమండ పయనము.

(3) స్వగ్రామమునఁ బాతకాల నిలుపుట - పెద్దకొడుకు వడుగు.

(4) ప్రభావతీ ప్రద్యుమ్న నాటక రచనము - కామేశ్వరీనుతి-మల్లేశ్వర విజ్ఞప్తి రచించుట

**1924-1926**

(1) ఆత్మకూరు - హైదరాబాదు అవధాన సభలు - విస్సా అప్పారావు కూతురు పెండ్లికి, కాటరావుపల్లెకు - లక్ష్మీనరసపురికి - ముక్త్యాలకు, పర్లమూరుకు, వంగవోలుకు, హంసలదీవికి వెళ్ళుట - కాశీనాథుని నాగేశ్వరరావు గారు మద్రాసులో సభ నేర్పాటు సేయుట.

**1927 - 1928**

(1) కుమార్తె కలుగుట - బందరు సభ - అన్నవరము, మురుమండ, వ్యాఘ్రేశ్వరపురము సభలు, కృష్ణ భారత కృతి సమర్పణ సభలో నుపన్యాసము - యూనివర్సిటీ బోర్డు మెంబరుగా నియమితులగుట - విజయవాడ, గుడివాడ సభలు.

(2) బొబ్బిలి పట్టాభిషేకము - నూజివీడు, సింహాద్రి సభలు.

(3) పెద్ద కొడుకు పెండ్లి, రెండవ కొడుకు వడుగు, పెండ్లి-జమీందార్లు పెక్కుఱచే కానుక లంపఁబడుట - కొమర్తెల పెండ్లిండ్లు.

**1929 - 1932**

(1) బొబ్బిలి పట్టాభిషేక కావ్యము రచించుట - కృతి సమర్పణావసరమున గొప్ప సన్మానము.

(2) యూనివర్సిటీ పరీక్షాధికారి యగుట.

(3) చీరాలలో గజారోహణోత్సవము - కారకరపత్రి సన్మానము - ఇట్లే పెక్కుచోట్ల.

(4) మోతే నారాయణరావు మృచ్ఛకటికమును వ్రాయించుకొనుట - పాండవ విజయ రచన ప్రసక్తి.

(5) వేటపాలెము సభ - ప్రతియేట రాజమహేంద్రవర గజానవోత్సవములు జరుపుట - ఏలూరులో - భాషా పరిషత్సభలో ఉపన్యాసము - గెద్దెనాపల్లి, ప్రత్తిపాడు, ఉండి, భీమవరము, గుడివాడ సభలు.

(6) పింగళి లక్ష్మీకాంతముగారి విజయ పత్రము - బందరులో షష్టిపూర్త్యుత్సవ సన్మానములు.

(7) శ్రీపాదవారికి ఆకాశరామన్న ఉత్తరము.

**1932 - 1933**

(1) బహు సన్మానములు

(2) షష్టిపూర్తి సన్మానము.(ఆంధ్రదేశమంతయు పండుగగా జరుపుకొనిన మహోత్సవము - తెలుగు పత్రికలు, కవులు, పండితులు వేంకటశాస్త్రిగారిని వేనోళ్ళ పొగిడిరి.)

## ఇటీవలి చర్య

(శ్రీ ఇనుగంటి ప్రకాశరాయని శంకితము)

**1933 - 1934**

1) పింగళి లక్ష్మీకాంతము గా రాదరించుట.

2) కాటూరి వేంకటేశ్వరరావుగారింట యొక మాసముండుట.

**1934-1938**

1) రెండవ కొడుకు 'అవధాని' యనిపించుకొనెనని సంతసించుట.

2) ఆవ్వారి సుబ్రహ్మణ్యముగారి అకాల మరణమునకు జింతిల్లుట.

3) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారితో వివాదము. కారణము - కొల్లాపుర సంస్థాన పండితుని కవిత్వము దోషభూయిష్ఠమని శ్రీపాద విమర్శింప వేంకటశాస్త్రి దానిని ఖండించుట.

4) జయపుర మహారాజా సన్మానము.

5) భార్యా వియోగము.

6) 'జయంతి - క్షమాపణము' శ్రీపాదవారి వాదమును విశదపఱచునట్టి గ్రంథములు రచించుటకు ఆరంభించుట.

7) శ్రీ రావు గంగాధర రామరాయలు మద్రాసుకుఁ బిలువనంపించుట - అచ్చట సుఖముండుట.

8) పచ్చయప్ప కళాశాలలో సభ - ఘన సన్మానము.

9) ముట్నూరి కృష్ణరావు, అడవి బాపిరాజుగారు గురుపూజ సేయుట.

10) శ్రవణానందముపై 'బాను' - దానిని తొలఁగించుట.

**1938 - 1939**

1) చిలుకూరి వీరభద్రరావు కల్లూరి వెంకటరామశాస్త్రి జీవిత చరిత్ర వ్రాయుచు శ్రీపాదవారిని విమర్శించి వేంకటశాస్త్రి పేరెత్తిరి - కోర్టుసాక్ష్యము.

2) మండపేటలో ద్విభాషి వేంకటరావు సన్మానించుట.

3) బులుసు రామమూర్తి త్రిలింగపీఠ పక్షమున పుష్పకిరీటము శిరము నలంకరించుట.

4) దీపాల పిచ్చయ్యశాస్త్రిగారింటఁ గొన్నాళ్లుండుట.

5) జవ్వాజి లక్ష్మయ్య సన్మానము చేయుట.

6) ముదిగొండ నాగవీరయ్య తన శివపురాణము వినిపించుట.

7) "జయంతి"ని పూర్తిఁజేయుట.

**1939-1940**

(1) శ్రీ సౌభాగ్య కామేశ్వరీ శతక పూర్వభాగము - అప్పజోస్యుల కంకిత మిచ్చుట.

(2) ప్రతాప కృష్ణమూర్తి శ్రీపాదవారికి జయంతి ఖండనము వ్రాయ సలహా నిచ్చుట.

(3) కాకినాడ ఆంధ్రాభ్యుదయ సభలో నన్నయఁగూర్చి యుపన్యసించుట.

(4) ఏలూరి వైశ్యుల కోర్కెకతన గోదేవియను కావ్యమును రచించి, పిఠాపురపు జమీందారు గారి కంకితమిచ్చుట.

(5) 'సుశీల' కావ్యరచనము - కృతిపతి లింగము జగన్నాథరావు.

(6) "గిడుగా - పిడుగా" అను వ్యాసము శ్రీ గిడుగు రామమూర్తి గారి మీఁద వ్రాసినది కృష్ణాపత్రికలోఁ బ్రకటితమగుట.

## 1940-1941

1) 'సుఖజీవి' యనెడి చిన్నిపొత్తము శ్రీ ఈదర వేంకటరావు గారిని గూర్చి వ్రాసినది.

2) రాజమండ్రిలో జన్మదినోత్సవము.

3) 'పతివ్రత' అను కబ్బమును ప్రొఫెసరు శేఖరరావు జమీందారు కంకితము.

4) "కవిచక్రవర్తి!" అనెడి బిరుదముతో ఇనుగంటి శ్రీ ప్రకాశాఖ్య నృపతి కవిసభలోఁ బిల్చుట.

5) విశ్వనాథకు 'కవి సమ్రాట్' బిరుద ప్రదానోత్సమునకై రాజమండ్రి వెళ్ళుట.

## 1941-1942

1) శ్రీపాదవారు 'అరణ్యరోదన' మనెడి తిట్టు కవిత చెప్పి, అందు చెళ్ళపిళ్ళ గజారోహణోత్సవమును 'మదురుగోడ' నెక్కుటగాఁ బోల్చి నిందించుట - ఇట్లే పెక్కుతిట్లు అందుఁగలవు.

2) 'శివభక్తి' కృతి రచనము.

3) బెజవాడ సన్మానము.

4) బేతపూడి వీరభద్రయ్య, ముల్లు పాపయార్య విరచిత దేవీ భాగవతమును సంస్కరించుట.

5) అమరవాది నీలకంఠయ్య భారత రూపకములు రచించి వినిపించెను.

6) కాకినాడ ఆంధ్రసభవారి సన్మానము.

7) కామేశ్వరీ స్తవమున జపాను యుద్ధఁపుటలజడిఁ గూర్చిన కవిత.

## 1942 - 1943

1) పిఠాపురపు జమీందారునకు జాతకచర్య, గోదేవి యను గ్రంథముల సంకితమిచ్చిన ప్రసక్తి.

2) తీవ్ర దీర్ఘవ్యాధి కాని, జీవితయాత్రకు లోపము లేదు.

3) ముదిగొండ వీరభద్రయ్య స్కాందపురాణాంతర్గతములైన ఈశులీలలను 'శివలీల' అను కావ్యముగా ననువదించుట.

4) బెజవాడలో సుతుని పెండిలి, మనుమడి వడుగు, జమీందారుల కానుకలు.

5) వియ్యంకుడు, అల్లుడు కలిసి కుమార్తెను బెట్టు కడగండ్లను గూర్చి చింతిల్లుట.

6) వేమూరు రాముడికిఁ గామేశ్వరిపైఁ జెప్పిన పద్యములను గృతినిచ్చుట.

7) "శివభక్తి" రచించుట.

8) "ఆంధ్ర చంద్రాలోకము" అను కృతికి కర్త యగుట.

## 1943 - 1944

1) దోసమటంచెరింగియును దుందుడు కొప్పఁగఁ జెంచినామన్న పద్యముపై విమర్శ రేగుట.

## 1945 - 1946

1) కష్టనిష్ఠురములు - సన్మానములు.

2) ప్రొ. శేషగిరరావుగారికి 'పతివ్రత" సంకితమిచ్చుట.

3) మూఁడవ పుత్రుని అవివేక వర్తనము.

4) 'విక్రమ చెళ్ళపిళ్ళ' రచనము.

5) శ్రీపాదవారిపైఁ జెప్పిన పద్యములు దురన్వయముల పాలగుట.

6) శ్రీ హరి వేంకటప్పయ్యగారి కోరికపై శ్రీ కృష్ణానదీ తటస్థమగు శ్రీ మదుబయ రామేశ్వర క్షేత్ర మాహాత్మ్యము రచించుట.

7) లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రి రచితమైన శ్రీమదాశ్చర్య రామాయణంబును సంస్కార వ్యాజమునఁ దిలకించుట.

8) జైమిని కృతమగు 'వేదపాదస్తవ' మాంధ్రీకరించుట.

9) శ్రీపాదవారు 'అమృతానంద' మనెడి గ్రంథములో శాస్త్రిగారి బిరుదములను విమర్శించుట. శ్రవణానందము శాస్త్రిగారి జీవితచర్య యనుట.

10) అపారవ్యాస పరంపరలను రచించుట.

11) రామాయణ కల్పవృక్షముపై శ్రీపాద విమర్శ - లీగలు నోటీసు.

**1946 - 1948**

(1) శ్రీపాదవారు శ్రీ విశ్వనాథవారిమీదఁ గోర్టులో నోడుట.

(2) నవకాళ జిల్లాలోని హత్యల గూర్చి కవిత్వము - ముస్లిములను గర్హించుట - గాంధీజీని ప్రశంసించుట.

(3) "భారత భారతీ సముద్రము" అన్న భారత పాఠమును సమర్థించు విమర్శ వ్రాయుట.

(4) కోన వెంకట రామశర్మను, వఝ్ఝు సూర్యనారాయణ శర్మను విమర్శించుట.

(5) ప్రకాశం యూనివర్సిటీమీఁద విమర్శ - మద్యనిషేధముపై విమర్శ.

(6) అస్పృశ్యత, విడాకులు, హరిజనోద్ధరణోద్యమము, వర్ణాంతర వివాహములు-వీనిపై విమర్శ - హరిజనులు దేవాలయ ప్రవేశమొనర్చుటపై విమర్శ.

(7) హైదరాబాదులోని దుండగముల గూర్చి విచారించుట.

(8) స్వాతంత్ర్య ప్రాప్తిపై మహదానందము వ్యక్తపఱచుట.

**1949**

(1) మద్రాసు ప్రభుత్వమువారు ఆస్థానకవిగా వేంకటశాస్త్రిని నియమించుట-బెజవాడలో బ్రహ్మరథోత్సవ గౌరవమునందుట-ఆంధ్రభారతి కిఱువదియవ శతాబ్దములో నింత వైభవముగా నుత్సవ మెన్నఁడు జరుగలేదని దేశమంతయుఁ గీర్తించినది.

క॥ ఒక వంక ప్రభుత్వము వే
ఱొకవంకఁ బ్రజాసమూహ ముత్సాహోద్రే
క కవిత్వారాధనలోఁ
బ్రకటీకృత జయపతాక పట్టి రితనికిన్.

**1950**

వికృతినామ సంవత్సరమున శివరాత్రి పుణ్యదివసమున వేంకట కవి శివైక్యము నొందెను.

"ఆంధ్రకవితా జగద్గురు వమరపురికి
దరలిపోయెను శిష్యసంతతుల విడిచి
సహజ గీర్వాణ వాణీ ప్రసక్తులైన
దేవతలు చెప్పఁగల రింక దెల్గు కవిత.

మరల దిరుపతి వేంకటేశ్వరుల జంట
కలిసె ముప్పది యేండ్ల పైకాలమునకు
సాగఁగల దింక దిక్పాల సభలయందు
అచ్యుతావహ శతవధానాంధ్ర కవిత."

—శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు

## కథాకావ్యములు

తే.గీ. "ఏ దినమునందుఁగవిత యొకించుకేని
నే లిఖింపనొ? వాక్శుద్ధి నిజము నాకు
నాదినము దుర్దినంబు సమ్మోద మిదదు
కవు లెఱుంగుఁడు నా వార్ధకమ్ము విధము" ఇటీవలిచర్య - 552 ప.

వారణాసి మొదలు మదరాసువఱకు గల విపుల దేశమును పర్యటించి గీర్వాణాంధ్రములలో శతలేఖిన్యవధాన బంధుర మహాకవిత్వ సుధాధారా ప్రసరములఁ జిల్కరించి, పునీతమొనర్చి, విజయవాటికా నగరమునందలి 'క్షీర సాగర' గృహశయ్యా విశ్రాంతిని గైకొనుచున్న వేంకటశాస్త్రిగారి వార్ధక జీవితము నిస్సారముగాక కథాకావ్య రచనలతోడను, సాహిత్యవ్యాస రచనము తోడను, సార్థకమై సరస్వతీ పూజ కంకితమై పోయినది, స్థానచలనములేని విశ్రాంతి కవికి విస్తార సారస్వత సృష్టికి దోహదమైనది. వాడిపోయెడి కవిబడుగు దేహము కార్తిక దీప ఘటమువోలె లోవెలుఁగును ఉజ్జ్వలముగా లోకమున వెద జల్లినది అట్టి కాంతికిరణములే ఈ కథాకావ్యములు.

వేంకటశాస్త్రి గారి కాలమున రచించిన కావ్యములలో ముఖ్యమైనది ఆంధ్ర స్కాందము. సంస్కృత స్కాంద మేఁబది ఖండముల వ్యాప్తిఁగల్గి

యష్టాదశ పురాణములలోఁ గరు పెద్దదై యొప్పుచున్నది. వీరభద్రయారాధ్యుల ప్రేరణచే వేంకటకవి "శివలీల" యనుపేర నా పురాణమునందలి పెక్కు శివమహిమ గాథలను కథానువాదముగా రచించిరి.

తే.గీ. "మొదట 'శివలీల' లనుపేర నిది రచింపఁ
దొరకొనుచెకాని లీలలవలెనె గాక
యిందులో వ్రతకల్పము లెన్నొ చేరె
వీరభద్రయారాధ్యులు గోరుకతన." —(ఇటీవలి.)

ఇటీవల నీవ్రత కల్పములే "వ్రత కథ"లను గ్రంథముగాఁ బ్రత్యేకింపఁ బడినవి ఇట్టి కావ్యమును బెంచి వ్రాయుటకుఁ గల కారణములు రెండు. ఒకటి: కవిత చెప్పనిరోజు కవికి దుర్దినమువలె భాసించుట. రెండు: శివుని గూర్చి చెప్పిన కవిత యిహపరములు సాధించుననెడి కవి నమ్మకము. వ్రత కథలు. కథానువాదములవలె భాసించినను స్వతంత్ర ప్రతిపత్తిగల కావ్యముల వలెఁ దోచుచున్నవి కాన యిచ్చట చర్చింపఁబడుచున్నవి.

## వ్రతకథలు

కం. 'శివలీలలు విరచించిన
కవనములోఁ దృప్తి సనక కావించెద వై
భవకరము భవత్పూజన
ము వ్రతకథల పుణ్యచరితముల రచనముల్.

కం. దేవా! "యావ త్తైలం
తావ ద్వ్యాఖ్యా" నినుగొల్చి ధన్యతఁగాంచం
గా వాంఛించుచుఁ గవితా
భావుకమగు సేవ నీకుఁ బచరింతు శివా!

అనుటలో "గవితాభావుక"మగు నీ గ్రంథము భగవత్సేవా విశేషమనియే స్పష్టమగుచున్నది కదా!

ఇట్టి పుణ్య కావ్యమునందుఁ బదునొకండు వ్రతకథలు చేర్పఁబడి యున్నవి. అవి: 1) సత్యనారాయణ వ్రతము 2) మంగళగౌరీ వ్రతము 3) వినాయక చతుర్థీవ్రతము 4) కేదారేశ్వర వ్రతము 5) కార్తీక సోమవార వ్రతము 6) స్కంద షష్ఠీవ్రతము 7) సావిత్రి గౌరీవ్రతము 8) శివరాత్రి

వ్రతము 9) నందికేశ్వరవ్రతము 10) కులాచారవ్రతము 11) ఏకపత్నీవ్రతము. సంస్కృతమున వ్రత కల్ప మహోదధి యను సంకలన గ్రంథమున మున్నూట యిరువది వ్రతములు కలవు. అనఁగా దినమున కొక్కటి చొప్పున సంవత్సరము పొడుగునను వ్రతములు కర్మిష్ఠి చేయవచ్చునన్న మాట!

వ్రతములు ప్రధానముగా చిత్తశుద్ధికిని, పవిత్రాచార నిష్ఠకును, ఐహికాముష్మిక ఫలసిద్ధికిని ఉద్దిష్టములైనవి. అనుష్ఠించువారినిబట్టి యివి పురుష, స్త్రీ, ఉభయ భేదముచే త్రివిధముగా లోకమునఁ గాననగుచున్నవి. సాధారణముగా వినాయక, ఏకపత్నీ వ్రతములు పురుషానుష్ఠేయము లనియు, మంగళగౌరి, కేదారేశ్వర, స్కందషష్ఠి, సావిత్రీ గౌరీ వ్రతాదులు నారీజనానుష్ఠేయము లనియు,మిగిలినవి ఉభయానుష్ఠేయములని భావింపవచ్చును.మన సంస్కృతిలో వ్రతాదులు స్త్రీలచేతనే అధికముగా నొనర్పఁబడుట కానఁబడుచున్నది. పురుష నకు వేదచోదితమైన కర్మవిధి నిర్ణీతమైయున్నది. కావున నతని కీవ్రతములతో నంత ప్రసక్తి యుండదు. కాని, కలియుగమున సులభఫలప్రాప్తి కొఱకీ వ్రతాచరణవిధి సర్వులకును సూచింపఁబడినదని పౌరాణిక మతము. ఏదైనను భారతీయ గృహ సంస్కృతికి మూలకందమైన గృహిణి వివాహపూర్వము, వివాహానంతరము తన యొక్కయు, తన కుటుంబము యొక్కయు, లోకము యొక్కయు శ్రేయము నభిలషించి పుణ్య కార్యములు సలిపి విశ్వ ప్రేమను, ఆదర్శచరితమును సాధించుట కుపకరించు సోపానక్రమ మీ వ్రతకల్పము అట్టి వ్రతముల పుణ్యగాథలను వర్ణించి వ్రత కథా శ్రోతలకును ఆంధ్ర కావ్య గాన శ్రవణ సదవకాశమును గల్పించుటయేగాక - కవి సంస్కృతీ ప్రబోధోపకరణముగా కవితను భావింపవచ్చునని నిరూపించెను.

ఈ కావ్యమునందలి వ్రత కథలు పురాణ ప్రసిద్ధములగుటచే వాని నిందుఁ జెప్ప పనిలేదు. కవులీ కథలను సంగ్రహ రూపములుగా రచించియుండుటచే కథా కథన ప్రధానములై లఘు వస్తు కావ్యములుగాఁ బొడఁగొట్టుచున్నవి. కాని, రమణీయ సన్నివేశములుగాని, మనోభావ చిత్రణముగాని, సంభాషణా చమత్కృతిగాని, ధర్మనీతి ప్రబోధముగాని రచించుపట్ల నచ్చటచ్చట కవులావేశముతో విపులీకరించి రచించియున్నారు. అట్టి చమత్కృతు లేవైన గానవచ్చుచో వానిని దిఙ్మాత్రముగా సూచించి విడుతును.

వ్రతగాథ లన్నిఁటి యందును వ్రతాచరణ విధానము, వ్రత ప్రభావము, ఆచరించి లాభించిన పుణ్యాత్ముల చరిత్రములు, ఫలశ్రుతి అను నంశములు సమానముగాఁ బొడగొట్టుచున్నవి. ఒక్కొక్క దానిలో నొక్కొక్క కథయే గాక అంతర్గాథలుగా కొన్ని, వివిధాంశ వివరణములుగా మఱికొన్ని, సమాంతర వ్రత ప్రభావ గాథలుగా మఱికొన్ని యీ కథా ప్రవాహములో జోటుచేసికొనినవి.

సత్యనారాయణ వ్రతము జగత్ప్రసిద్ధమైనది దానిని యథాతథముగా రచించుచు నచ్చటచ్చట కొన్ని చమత్కారము లొనర్చిరి. నారద నారాయణుల సంభాషణలో నారదుని మాయానుభవాత్మకమైన పూర్వ గాథను స్పృశించి క్రొత్త చమత్కారము గల్పించినారు. సత్యనారాయణ స్వామిచేత భారతీయ పారతంత్ర్య పరిస్థితిని భవిష్యత్కాల చరిత్రగా బిచ్చమెత్తుకొను బావనికిఁ జెప్పించిరి. ఉదా: "అప్పటికి పుణ్యభూమియగు భరతఖండంబు ఖండాంతర వాసుల పరిపాలన కగ్గమగు. వారివారికిఁ బంపకమ్ములు కుదురక ఘోరమైన సంగ్రామములు చెలరేఁగి మన పురాణములందెన్నఁడు గని వినని మహాక్షామంబు లుప్పతిల్లు...." (పు. 39) ననునట్టివి. ఈ వ్రతాచరణమునందు ప్రసాద స్వీకారము ముఖ్యము. అం దనాదరము జూపినవారికిఁ గల్గిన దుఃఖములు, దాని నాదరించినవారికిఁ గల్గిన సుఖభోగములు ఇందుఁ జెప్పఁబడిన నాల్గు కథలలోఁ బ్రధాన ప్రతిపాద్య కథాంశములు.

మంగళగౌరీ వ్రతము లేఁగన్నియలచేఁ జేయించుట మన దేశాచారము. పతిసుతాదులకు దీర్ఘాయువు, దీర్ఘ సుమంగళీత్వము దీనికి ఫలము. మంగళగౌరీ వ్రత నిష్ఠాపరురాలగు నూత్న వధువు అల్పాయుమ్కుడును, సర్పదష్టుఁడునునగు తన భర్తను బ్రతికించుకొను కథ యిందు సరసముగను సంగ్రహముగను వర్ణిత మైనది. ఇందు వచనముల వాడుక అధికము. 56వ వచనములో విఘ్నేశునిచే శాపోపసంహారమును బ్రాహ్మణ బాలునికిఁ దెలియఁజెప్పించిన తరువాత 61వ వచనములో నాతనిని అవిదిత పూర్వ విషయునిగాఁ జిత్రించుటయందు కథార్థ సంవిధానము కొంత లోపించుచున్నది.

వినాయక చతుర్థీవ్రతకథ భాగవత హరివంశాదులందుఁ బ్రసిద్ధమైనదే. శ్యమంతక మణిని గృష్ణుఁడర్థించుటవలన సత్రాజిత్తునకుఁ గల్గిన మనస్సంక్షోభము సున్నితముగాఁ గవులు చిత్రించినారు. సన్నివేశములను పాత్రల మనఃప్రవృత్తుల కనుగుణముగాఁ దీర్చి దిద్దు నేర్పు జాంబవతీ శ్రీకృష్ణుల సంభాషణలయందు

గోచరించుచున్నది. ఊయలకుఁ గట్టఁబడిన మణిని గైకొనుచున్న కృష్ణుని నయోక్తులతో వారించుచు ఆ పని మాని జాంబవంతుని బారినుండి ప్రాణముల రక్షించుకొనుమని ప్రబోధించు జాంబవతియందు శ్రీకృష్ణునిపైఁగల యనురాగ మును అంతర్వాహినిగా ననుసంధించి కల్పించి సూక్ష్మ కావ్య శిల్ప రచనా కౌశల్యమును కవులు వెలార్చినారు శ్రీకృష్ణుని శంకించి రోషపడిన బలరాముని పల్కులను హరివంశము సందలివానినన్న కవులు విపులముగాను, వాడిగను తీర్చిదిద్దిరి. చవితి చంద్రుని శాపగాథ నారదుని ముఖమునఁ గృష్ణునకుఁ జెప్పించి ఔచిత్యమును సంవిధాన కౌశల్యమును ప్రకటించిరి. నారదుని సంభాషణలో పాత్రౌచిత్యముతో గూడిన చమత్కారమున కీ క్రింది పద్యముఁ జూడుడు:

కం ''ఆనందో బ్రహ్మశ్రుతి
యే నిత్యు వచించు నతఁడ వీవయ్యును నీ
యానము విన్నఁబోవుని
దానం బెయ్యదియొ? నాకు దాపక చెపుమా!" (78 ప)

విరుద్ధగుణ సాదృశ్యము ఈ పద్యమునందలి చమత్కారము. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" ఇత్యాది తత్త్వవాక్యములు ఋషిముఖమున వెలువడుట పాత్రౌచిత్యము. జాంబవంతునినోట పోతనగారి యెత్తుగడలో నొక పద్యమును నిబంధించిరి.

క. "ఇందుఁగలఁ డందులేఁడని
సందియ మెవ్వని గుఱించి జనులెందఱొ ఆ
బృందారకమూర్తిని నా
నందని పాదిన్ గ్రహించి ననుమనుపు మఱా.'' (55 ప)

''ఇందుఁగలఁ డందులేడను సందేహము వలదు'' అన్న భాగవత పద్య మీ ఎత్తుగడకు మూలము. నీతిదాయకములగు అర్థసంపద ఈ కవుల కవిత్వ మునకు సహజాలంకారము. ఉదా:

తే.గీ. "దేహ కందచందమ్ములు తృప్తికరము
లనుచు నెంచితివేమొ! విద్యావివేక
ముఖ్యములు భూషణమ్ము లిమ్మల నెఱుఁగు
మింకనేనియు, నవి చెద వెన్నటికిని'' (103 ప.)

ఫలమునుబట్టి వినాయక చతుర్థీ వ్రతమునకు సంకష్టక చతుర్థీ వ్రత మనియు నామాంతరము కలదు.

కేదారేశ్వర వ్రతము దోరధారణ ప్రధానమైనది దానియందుఁ జూపు ననాదరమువలనఁ గలుగు లాభనష్టముల నిరూపించునట్టిదే యిందలి కథ. పుణ్యవతియను రాణి దోరధారణముచే సుఖించును. భాగ్యవతియను రాణి దోర ధారణమును ధన మదముచే ననాదరించి బహుక్లేశములకు గుఱియగును. చివరకు వ్రతాచరణమువలన సర్వమును సుఖాంతమగును, వైశ్యకన్యలు కేదా రేశు భజించిన గాథ యిందుపగాథ. పుణ్యవతిచే నీ కథ కథాకథన శిల్ప మర్యాద చెడకుండఁ గవులు జెప్పించిరి. వివాదగ్రస్తములగు కథా భాగములను వదలి వైచి, కథను ప్రసన్న పఱచినట్లు 72 వచనము తెల్పుచున్నది.

కార్తిక సోమవారకథ యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణ యువకుని గాథ. యజ్ఞ దత్తుఁడు గుణనిధిగా జన్మింపక పూర్వమున్న కుబేరుని జన్మమని కాశీఖండమునఁ గలదు. గుణనిధికథ శివపురాణమున ప్రసిద్ధి చెందినదే. దాని ననుసరించియే యిది నిర్మితమైనను కొన్ని మార్పులు కానవచ్చును. గుణనిధివలెనే యజ్ఞదత్తుఁడు వేశ్యాది వ్యసన లోలుఁ డయినట్లు కలదు. కాని, అతఁడు వివాహితుఁడు, ఇతఁ డవివాహితుఁడు. అతనికి తల్లి నీతిబోధ లెన్నియో చేసినది. ఇతనికి వేశ్యమాత చేసినది. ఫలసిద్ధియందును ఒకటే. అతఁడు శివరాత్రినాఁడు భోజనార్థియై అన్నము దొంగిలించి, తినుటకై పరువెత్తును. ఇతఁడు వంటశాలలో నక్కి శివునికి ముందు నివేదించి, కొంత అన్నము మెక్కి ఆపైఁ బరుగెత్తును. అతఁడు శివరాత్ర్యుపవాసము చేసెను. ఇతఁడు కార్తీక సోమవారముండెను. శివపార్వతులు యజ్ఞదత్తుని పూర్వగాథ చెప్పుట యిందుఁగల మఱియొక విశేషము.

"ఉంగరము పోయెనంచు నేనంగలార్వ
నప్రతిష్ఠకుఁ గలికి! నేనంగలార్తు
నిహము పరమును జెడు కుట్టి నేలకంటి
నంచు నేనంగలార్తు నేమనఁగలాఁడ" (77 ప.)

అనెడి ఛాందసుఁడగు తండ్రి మాటలును, కొడుకును గప్పిపుచ్చు తల్లి మాట లును, ఆయా పాత్రల రూపురేఖలను దీర్చిదిద్దుచున్నవి. కాని, శ్రీనాథుని రచన (గుణనిధి కథ)లో నున్న జీవకళ యీపాత్రల కలవడ లేదు. దానికి కారణము

ఇవి సంగ్రహ కథనాత్మకమగుటయే కథా సందర్భమునందు కథలు లోకోపకారకములగు సందేశములఁ గొన్నిఁటిని నుడువుచుండుట నిందుఁ గాననగును అట్టి వానిలో నొకటి—

ఆ.వె. విప్రబాలకుండు వెదురుబొంగును వంప
కున్న యెడల రాచమన్ననందుఁ
గాక బొమ్మరాట కత్రియ పద్ధరి
కగ్గమగు నటందు రాద్యులెందు.

క. కావున బాల్యమునందున
దీవపలు తనూజానెఱిఁగి దీగజపినచో
దేవప్రియుఁడగు నొండెన్
దేవానాం ప్రియుతగూడి దృష్టాంత యగున్.

క. గారమ్ము కుబ్జకు నప
కారమ్మొనరించు శక గరపినచో సం
స్కారమ్ము గల్గి యది యుప
కార మొనరించు నెఱుఁగఁగాఁడగు గేస్తుల్. (44.46)

నవీన విద్యాబోధన విధానము ననుసరించు మనకీ సూక్తులు కొంత యెబ్బెట్టుగానున్నను పూర్వాచార మర్యాదల నెఱుఁగుటకైన యివి యుపకరించు ననుటలో సందేహము లేదు.

స్త్రీవంధ్యాత్వనివృత్తియే స్కందషష్ఠీవ్రత ప్రయోజనము. దశవిధవంధ్యాత్వముచే బాధపడు స్త్రీలు ఉద్ధరింపబడు శంకిత వృత్తాంతమిందు ప్రధాన కథ. సుబ్రహ్మణ్యస్వామి సర్పాకృతిలోనుండు కారణముఁ దెల్పెడి కథ యుపగాథ. లవలియను నిషాదకన్యను గాంధర్వమున గ్రహించి సుబ్రహ్మణ్యస్వామి దినమును సర్పాకృతితో నామెఁ జేరి నిజాకృతి తోడనే కీర్తింపబడుటకు నిచ్చగించుచుండెను. ఇట్టి చిత్రప్రవృత్తిని కవు లావిష్కరించుచు తమకున్న లోకానుభవము నిట్లు కావ్యమునఁ జాటుకొనిరి:

చ. “అతి గహనంబు కామగుణ మద్యఁది పెద్దల సమ్మతిన్ లవం
బతికి చరింప దాది నది యన్యవధూటిగఁ దోఁచి పీఁడటన్
సతి తనకైనఁ దప్పఁడన సాధ్వగ నాదినిదోఁచు పట్టునన్
మతి లగియింప దావిధపు మాదుకి గన్పడ దంద్రు తద్విదుల్.”

చ. "అతితరమైన యత్నమున నస్మలు చూతురొ యేమొ యంచునే
సతి గవయంగ నేగునల సాధ్వస మీవలికుం మండెటో
స్మృతి గనుపట్టి నయ్యది యమేయ సుఖం బొదఁగూర్పు వానికిన్
మితి గనువట్టదందుఱు మనీషులు కామకలావిచక్షణుల్" (18, 19)

కవుల అపార వ్యుత్పత్తికి నివి మచ్చుతునకలు. ఈ వ్రతకథ నారద పురాణాంతర్గతమైనదని కథానిదర్శనమువలన (47 ప.) తెలియుచున్నది.

భారత ప్రసిద్ధమగు సావిత్రిగాథ సావిత్రీగౌరీవ్రత కథ. దీనికిఁదోడు పతిసంజీవన వ్రతమనఁబడు భీమేశ్వర వ్రత కథయు నిందు జతపఱుపఁబడినది. కథ మహాభారతమునందుకన్న చాల సంగ్రహమైనది. కాని సారవద్రచన కల్గి నది. నారదుని మాటలలో భావికథార్థ సూచన నిల్పు శిల్పము.

తే.గీ. "పతికి నొకవేళ మృత్యువు తారసించు
గాక యేతద్వ్రతమ్మునఁ గలుగు పుణ్య
మునఁ దారకుఁగొన్ని వరము లమూల్యములు పొ
సంగఁజేసి తరలిపోక సంభవించు" (23 ప.)

పతి కనామయాయురారోగ్యములు చేకూరుకొఱకై స్త్రీలచే నీ వ్రతము బహుళముగా నాచరింపఁబడుచున్నది.

శివరాత్రి వ్రత మేకదివస దీక్షా ప్రధానమైన వ్రతము. అది జ్ఞానమునఁ గాని, అజ్ఞానమునఁ గాని నిర్వర్తితమైనచో నక్షయ ఫలమనుభవమునకు వచ్చును ఈయర్థ మిందుగల హరిణ వ్యాధోపాఖ్యానము తెల్పుచున్నది. అనంతామాత్యుని భోజరాజీయములోని గోవ్యాఘ్ర సంవాదమువంటి గాథయే యిది.

మృగశీర్షా నక్షత్ర స్థానములఁ బొందిన మృగములు మూఁడు ఇందు గోస్థానమును, ఆహారాభావముచే శివరాత్రి యుపవసించి ఘుణాక్షరీ న్యాయము వలె బిల్వములచే శివునిఁ బూజించి తరించిన వ్యాధుఁడు వ్యాఘ్రస్థానము నలంకరించిరి. హరిణోక్తులలో వివేచనాత్మకమైన విషయావిష్కార శిల్పముగోచరించుచు, హరిణమునొసర్చు ప్రమాణములం బట్టి సుదీర్ఘముగాఁ జెప్పఁబడినది. ప్రసక్తానువశముగా వానిమాటలలో భార్యాప్రాశస్త్యము (83-88); సత్యప్రభావము (134) మొ॥ విషయములు చేర్చి అర్థసంపదకు కవులు పాటుపడిరి. శివరాత్రి వ్రత మాహాత్మ్యమును భక్త్యావేశముతోఁ గీర్తించిన వేంకట శాస్త్రిగారికి కావ్యరచనా ఫలమిచ్చినది కావుననే శివరాత్రి పుణ్యదివసమున శివసాయుజ్య మంద గల్గిరని భావించుట సత్యదూరము కాఁజాలదు. కవిగారన్నట్లు సత్యముగా.

క. "వ్రతములఁ దపములు పటి దై
వతములఁ దీర్థమ్ములున్ సవనమ్ములును మునీ
శితులార! శ్రోతృజనముల
మతినమ్మికఁ బట్టి ఫలమమర్చెడినెందున్."

నందికేశ్వర వ్రతము సకల సంపత్ప్రదాయిని. దేవత లందఱు దీని వలనఁ దృప్తిఁ జెంది సుఖములఁ బ్రసాదింతురు. కేదారేశు భజించి ధనికురాలయి విజ్జపేఁగు నొక యిల్లాలిని వినయవతిగా నొనర్చుటకై వ్రతఫలరూపముగా శివ పార్వతు లామెకు దర్శనమిచ్చిరను గాథ యిందు సరళ సుందరముగా వర్ణితమై యున్నది.

కులాచారవ్రతము, ఏకపత్నీవ్రతము అను పేర్లే విచిత్రముగా నున్నవి. శైవ ప్రాధాన్యముఁ దెల్పుచు వైష్ణవులు వైదికులు కారనియు, స్మార్తులు కారనియు, ఇటు బ్రాహ్మణులు కారనియు నిరూపించు కథ యిది. పూర్వాచారము ములు వదలి మిడిమిడి జ్ఞానముతో స్వంతమార్గముల నాశ్రయించుట ప్రమాద మని యిందలి నీతి. ఇందలి కథ సంవిధాన చమత్కృతి కడు కమనీయము.

అంతఃకలహము లేర్పడినను, ఇరువురు విడివడి పోయినను భార్యా భర్తలు పరస్పరము ఏకపతిపత్నీ వ్రతమును వీడరాదని ప్రబోధించు కథ ఏకపత్నీ వ్రతము. పాశ్చాత్య నాగరికతా ప్రభావముచే భారతీయులు ప్రాచీన మతాచారములను, గార్హస్థ్య మర్యాదలను ఉజ్జగించుచున్న ఆ రోజులలో కులా చారములఁ గూర్చియు, ఏకపత్నీవ్రతమును గూర్చియుఁ బ్రత్యేకించి నొక్కి చెప్పుటయే ఈ కథాప్రయోజనము.

కవులీ కథాకావ్య రచనము కడుసుందరశైలిలో నిర్వహించి ఆబాలగోపా లమున కర్థమగునట్లు రచించుటయేగాక నిత్యపారాయణానుకూల్యము సంతరించి పెట్టిరి. వృద్ధాప్యములో పండిన వ్యుత్పత్తి పద్యకావ్యములందు పొడివి లోకమున కందించినట్లు రాణించినది కావ్యము. పుణ్యవాసన కాలవాలమై మాధుర్యగుణ మకరందధామమై, విమలకథార్థ ప్రకాశవిరాజమానమై, గంగాధరచంచరీకమై శోభిల్లెడి ఈ కథామంజరి భక్తజనాళి హృదయానందదాయకమగు ననుటలో విప్రతిపత్తి లేదు.

## పురాణగాథలు

మ. కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి యీ
భవ మద్దానఁ దరింతుఁ దద్ధ్రువమె మద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువునే దాన జయించితిన్ రుజ జయింతున్ దాని చేపట్టి నా
కవనమ్మే భవదీయ తేజమని వక్కాణింతు విశ్వాత్మకా!

—శివపూజాఫలము, 192 ప.

విశ్వేశ్వర విభూతిని వర్ణించు కొన్ని పురాణకథల నొకచోఁ గూర్చి రచించిన వస్తుకావ్యము 'పురాణగాథలు.' దీనియందు వస్తునిర్మాణ విధానమొక విశిష్ట శైవపురాణ లక్షణమును బోలియున్నది. పురాణ మొక దైవ నాయకమై తన్మాహాత్మ్య ప్రతిపాదన ప్రధానమై యుండును. ఇందు మల్లికార్జున దేవుని మహిమయే సర్వత్ర వర్ణితమైయున్నది. ఇందు స్థూలముగా నెనిమిది గాథ లున్నవి. అవి 1. శ్రీశైలముగ్ధ బాలానుగ్రహ మహిమ. 2 గాయత్రీ మహిమ. 3. శ్రీ శివజ్ఞాన దాన మహిమ 4. పరశురామ చరిత్ర 5. అగస్త్యచరిత్ర 6. భద్రాయుశ్చరిత్ర. 7. మలయవతి చరిత్ర. 8. శివపూజా ఫలము అను శీర్షికలు కల్గినవి

తి. వేం. కవులు పై గాథల నెన్నుకొనుటయందును వానిని పై నిర్దిష్ట క్రమమునఁ గూర్చుట యందును నొక వైలక్షణ్యము పాటించి యుండిరి; శ్రీశైల మహిమ గాథ స్థల దైవత మాహాత్మ్యములను, ముగ్ధబాలానుగ్రహ మహిమ దైవభక్త సులభత్వమును, దైవానుగ్రహమును, గాయత్రీ మహిమ మంత్ర మహిమమును, శివజ్ఞాన మహిమ శైవజ్ఞాన దాన మహిమను, పరశు రాముని చరిత్ర శివానురాగ పాత్రుల మహిమను, వ్యాసాగస్త్యుల చరిత్రలు - క్రమముగా - శివాగ్రహానుగ్రహ ప్రభావమును, భద్రాయుశ్చరిత్రము శివయోగి మాహాత్మ్యమును, మలయవతి చరిత్ర భక్తుల శీలమును, భగవద్భక్తి ప్రాశస్త్య మును ఉగ్గడించుచు, దైవమొనర్చు భక్త పరీక్షాదులను, బాణాసుర వృత్తాంతము దైవము యొక్క భక్తపరాధీనతను దాది చెప్పుచున్నవి. ఇట్లు క్షేత్ర, తీర్థ, దైవ భక్త మంత్ర భక్తిమహిమాదులన్నింటికి ప్రతిపాదించు కథా సంపుటములను గైకొని సంధించుటచే నీ 'పురాణగాథలు' ఒక శైవ పురాణ మహత్త్వము గల్గిన దనుటలో విప్రతిపత్తి యుండదు.

"పురాణగాథలు" అనుసమాసమునకు పురాణము లందలి కథలు అనియు, పురాతనమైన గాథలనియు అర్థద్వయ మేర్పడుచున్నది. ఈ గాథలలో కొన్ని స్కాంద, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త పురాణముల నుండియు, కొన్ని భారత భాగవతాదులనుండియు, కొన్ని శ్రీశైల మహిమనుండియు గైకొనబడినవి. ఇందుపకథలుగా నున్న గంగా గౌరీ సంవాదము పురాణాదులలోనే గాక లోక ప్రసిద్ధము కూడ. అట్లగుటచే నీ గ్రంథనామము సాభిప్రాయము, సార్థకము నగుచున్నది.

ఈ పురాణ కథలు ప్రవృత్తి భేదముచే పరస్పరభిన్నములుగా గోచరించు చున్నను వానియందు సమానములగు కథా లక్షణములు కొన్ని గోచరించుచున్నవి. అవి : 1) శివమాహాత్మ్యమే ముఖ్య ప్రతిపాద్య వస్తువుగా నుండుట. 2) గాథను మల్లికార్జునదేవునిఁ గృతికర్తగా నెంచి యా దేవునకు వినిపించునట్లు కథారంభ పద్యములు రచింపఁబడియుండుట. 3) కావ్యారంభాంతములందును, ప్రతి గాథాంతమునందును "దేవా! యావత్తైలం తావద్వ్యాఖ్యాన"మ్మని చెప్పెడి కవి వినయవాక్కు నిబంధింపబడి యుండుట. 4) పురాణ కథా కథన కుతూహలుఁ డగు సూతుఁడు శౌనకాదుల కీ కథలు వినిపించునట్లు చెప్పించుట. 5) గాథ యొక్క ప్రధాన వస్తు నిర్దేశము శౌనకాది ఋషిబృంద ప్రశ్నాదులయందు నిబంధించుట. 6) కొన్ని యెడల కథాంశముల పౌర్వాపర్యవ్యవస్థ ఋషులచేత సూచింపఁబడుట. 7) అవాంతర కథా ఘట్టములను కథానుకూల్యముఁబట్టి సూతప్రేరితముగనో లేక శౌనకప్రేరితముగనో గల్పించి కూర్చుట 8) కథా కథన ప్రక్రియలో నుత్కంఠను పోషించుట. 9) నగరాది అష్టాదశవర్ణనలలో నెద్దానినైనను వ్యర్థముగా గైకొని కథను పెంచెడి దృష్టి లేకుండుట. 10) సూటిగా, సంగ్రహముగా సర్వార్థ గంభీరముగా రసోదంచితముగా అల్పాక్షరములం దనల్పార్థ రచనగా గాథ నావిష్కరించుట. 11) బలమైన పాత్రల కొక క్రమోన్మీలన వికాసముఁ గల్పించి వానియందు మనో భావములను విపులముగా వర్ణించి రసౌచిత్యమును పాటించుట. 12) ప్రధానోపకథల సంవిధానము కృతకముగా నుండక, ఒక మొక్కకు కొమ్మ రెమ్మ చివురు తొడిగినట్లు స్వభావోద్భవ వికాస విలాసములను నేర్పుతో గల్పించుట. 13) ప్రతిగాథకును ఫలశ్రుతిఁ జేర్కొనుట అనునవి. ఇట్లగుటచే సజాతీయ రత్న సమాహారమువలె నొక రామణీయకత నందగించుకొన్నవి పురాణగాథలు.

## 1

శివతపోవరగర్వియైన చంద్రగుప్తుఁడు అజ్ఞానమూలకమగు ప్రమాదవశమున యుక్తవయస్కయు చంద్రవతి యను పేరు గలదియునగు తన కుమార్తెఁ గామించి యామెను వెన్నంటెను. పట్టమహిషి వారించినను వినక కామాతురుఁడై వచ్చు నా రాజును గాంచి భయమంది చంద్రవతి శ్రీశైలక్షేత్రమునందలి పాతాళగంగ దరికేగి శివునిఁ బ్రార్థించి రాజును శిలాకృతి నొందునట్లు శపించెను. క్షేత్రమహిమవలన రాజునకు వివేక ముదయించి తాను చేసిన తప్పిదమునకు వగచి శివుని గూర్చి తపమొనర్చి కల్యాణావతారదర్శనముచే తన శాపనివృత్తి కలుగునట్లు వరము పొందెను. చంద్రవతియు నైహికభోగవైముఖ్యము వహించి శివుని గూర్చి తపమొనరించుచు నానావిధ పుష్పపత్రముల నాతని నర్చించియు దర్శనభాగ్యము నొందజాలక మల్లికాపుష్పముల నర్చించువేళ నాతని ప్రత్యక్షభాగ్యమును బొందెను. మల్లికార్జున నామధారునిగా వెలయవలెనని శ్రీశైలనాథుని నామె కోరుకొనినది. నాటినుండి శ్రీశైలస్వామి మల్లికార్జునుఁడైనాఁడు. ఇది శ్రీశైలమహిమ గాథ.

సామాన్యముగా క్షేత్రమాహాత్మ్యాదులందు ఉత్తములగు భక్తులు భగవత్ప్రసాదముచే ముక్తిఁజెందు కథలతోపాటు మధ్యమాధములయొక్కయు, పతితులైన యుత్తముల యొక్కయు చరిత్రములు వర్ణితములై, అట్టివారిని పరమదయామయుఁడగు భగవంతుఁడు రక్షించినట్లు చిత్రించుట కలదు. పతనము బహువిధములుగా నుండును. మానవ ప్రకృతిని గూర్చి గాఢముగా విచారించిన కొలది తద్వైవిధ్యము పరిశీలకునికి గోచరము గాకపోదు. శ్రీశైలమహిమలో చంద్రగుప్తుని మనఃప్రవృత్తి కడువిచిత్రమైనది. శివుని తపస్సుచే మెప్పించి వైరివీరుల నిర్జించిన యుత్తమ క్షత్రియుఁడు, ధీరుఁడు అతఁడు. అతనికి 'కామ' మావరించినది. వివేకము నశించినది. కన్నకూతునిఁ గవయనుంకించినాఁడు. భార్యాప్రబోధము పెడచెవినఁ బెట్టినాఁడు. ఇంతకన్న మఱి పతనము లేదా పాత్రకు. కవులీతనితోపాటు పెక్కురు పతితులు లోకమునందున్నారని తెలివిడి చేసినారు.

సీ. కూఁతులఁ గామించు కుమతులు, కోడండ్ర
జెఱపెట్టనెంచు కుచ్చితపు మొద్దు
లక్కసెల్లెండ్ర వ్యవాయమ్మునకు సిద్ధ
పడు చెడ్డ దున్నల కొడుకులు పెద

తల్లితోడను బినతల్లితోఁ గ్రీడింపఁ
    దలఁపునించెడి పాడు ఖలులు గురుని
యింతిఁ గామించెడి యెడ్డెలు మేనత్త

నత్తను రమియించు నట్టి కూళ" (27) లు లోకమున నున్నారు. వీరుత్తములకు జుగుప్సావహులే కాని జగత్తున నిట్టివారు కోటానకోట్లు కలరు. వీరినిఁ దరియింపఁజూనని ఆదర్శ సాహిత్యము సర్వథా ప్రయోజనము కాదు. ఇట్టి పతితులకు నైతము స్థానము గల్పించి, స్థల దేవ తీర్థ మాహాత్మ్యాదులచే వారియందు వివేకాదులు కల్గించుట యిట్టి క్షేత్ర మహిమ గాథల ప్రయోజన ములలో నొకటి యని భావింపఁదగును. ఇది మన ప్రాచీనుల సంఘ కల్యాణ దృష్టికి విశిష్టోదాహరణము.

కవులీ ప్రధానకథ కంగముగా కరవీరభక్త గాథ ననుసంధించిరి. అత్యంత లఘుకావ్య మీ ఉపగాథ. ఇట్టి యుపగాథలు పెక్కులు కలవు పురాణ కథలందు. మచ్చు కీగాథ నుదాహరింతును.

క. కరవీరుండను భక్తుఁడు
కరముగ్ర తపం బొనర్పఁ గరుణాకరుఁడు శం
కరుఁడు ప్రసన్నుండై యే
వరము గావలయు నన్న వాఁడు వినతుఁడై

తే.గీ. దేవ! నా తపమునకు సంతృప్తి నీకుఁ
గలిగె నేనియు నన్ను వృక్షముగఁ జేసి
దాని పుష్పమ్ములను దైవతములు నీవుఁ
బూజ గొనుచుంటయే వరంబుగ నొసంగు

తే.గీ. చేతులారంగ నిన్నుఁ బూజించువాఁడె
ధన్యుఁడట్టి పూజకుఁ గడు మాన్యమైన
పుష్పములును దళంబులుఁ బుణ్యమునకు
నాలవాలమ్ములని చెప్పనేల? గిరిశ!

ఉ. గంగ పవిత్రమయ్యె నెసకమ్మున నిన్ను శిఖక్తుఁ జేసి యో
యంగజవైరి! పూజ్యతకు నాకరమయ్యె [illegible]
కుంగామిరెన్ జగజ్జననిఁ గోరు[illegible] నొసంగి; నిన్ను నా
రంగ సపర్య సల్పుట జరామ[illegible]బాధ్య దలంచునో శివా!



వ. కావున నాకు నిట్టివరంబు ప్రసాదింపుమని వేఁడు కరవీరునకు
నట్ల యగుం గాకయని పురారి యదృశ్యుండయ్యె. (97.101)

ఇది స్వయం సమగ్రమైన చక్కని చిక్కని చిన్నికథ ఇందు ప్రతి పదము రమణీయార్థప్రతిపాదకము. ప్రతి భావము సాభిప్రాయము. కరవీరుని యందు పరమ భక్తుని యొక్కయు, పరమ తపస్వియొక్కయు లక్షణములు పెనవేసికొనినవి. అతని తపశ్చర్యయందలి దీక్ష "ఉగ్ర" శబ్దమున ధ్వనితము. శంకరుఁడు కరుణాంతఃకరణుఁడగుటచే నల్పకాలతపస్సునకే ప్రసన్నుఁడయ్యెను. వరప్రదాన సంసిద్ధుఁడయ్యెను. "కరవీరుఁడు భక్తుఁడు" అను పదమునకు వ్యాఖ్యానము మిగిలిన మూఁడు పద్యములు. ఆర్ద్రమైన భక్తునియందు భాసించు వినయాతిశయము, భక్తితాదాత్మ్యము, ఆనందచేతనము, దైవసంకీర్తనము, దైవానునయము మొ॥ లక్షణము లన్నియు నా మాటలలో గుబాళించుచున్నవి. "దేవ గిరిశ! శివ" అను సంబుద్ధు లాయా పద్యపాదములందుఁ బ్రతిపాదిత భావమున కనుగుణములైనవి. పూజలుగొనువాఁడు దేవుఁడుగాక మఱెవ్వఁడగును? పుష్పములును, దళములును పుణ్యమున కాలవాలములని గిరిశునకుఁ దప్ప అన్యుని కెట్లు తెలియును? జరామరణరహితమగు శాశ్వతముక్తి పదవి నిచ్చువాఁడు శివుఁడుగాక మఱొక్కఁడెట్లగును? కావుననే నాసంబుద్ధులు సాభిప్రాయములు, ఆయా భావములకు మకుటాయమానములు. ఇంత చిన్ని కథలో నింత మహార్థ సమన్వయశక్తి నిమిడించిన కవుల మహత్తు మొదట అభినందనీయము.

## ముగ్ధ బాలానుగ్రహ మహిమ :

బసవపురాణాది వీరశైవకావ్యములలో వర్ణితులైన భక్తులతో ప్రధానముగా ప్రౌఢ భక్తులు, ముగ్ధభక్తులు అను రెండు విధములవారు కలరు. అందు ప్రౌఢ భక్తులు వీరశైవదీక్షాపరులు; ఉగ్రవ్రత నిర్వహణవ్యగ్రులు. ఇఁక ముగ్ధభక్తులు శైవదీక్షాపరులయ్యు నుగ్రవ్రతులుగాక నమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధ హృదయులు, సాధువులునై, స్వచ్ఛమైన వాత్సల్యము, పారవశ్యముతోఁగూడిన భక్తిభావము, శివుని గాంచిన వెంటనే ఆప్తునివలె, మిత్రునివలె, పుత్రునివలె ఉత్కటస్నేహముతో గూడిన ముగ్ధభావముతో గీర్తించి, సేవించి, లాలింప వలెననెడి సున్నిత మధురభక్తి మొదలగు గుణములు కల్గి, శివుని కొఱకై ప్రాణములనైనను త్యజింప సిద్ధమై త్యాగోత్సాహ, భక్తివీరులై యొప్పువారు. అట్టి

స్నిగ్ధ భక్తతరి స్త్రీ బాల పురుష భేదముచే త్రివిధము. ఈ గాథయందు వర్ణిత మగుచున్న త్రిహాయన వయస్కుఁడగు బాలుఁడు ముగ్ధ బాల భక్తుఁడు.

ఒక యగ్రహారమున నొక బీద బ్రాహ్మణ కుటుంబము కలదు. వారి కేకైక పుత్రుఁడు. ఒకనాఁడు ప్రక్కయింటివారు అల్లుడు వచ్చెనని పిండి వంటలు చేసికొన నాయింటి బాలుఁడొక దప్పచ్చులు తినుచు నోరూరించుటఁ గాంచెను. అతఁ డింటికేగి తల్లిని అప్పచ్చికై మొరపెట్టెను. ఆమె పిల్లవాని హటము మాన్పింపనెంచి "నీ అక్కబావలు వచ్చుచో నప్పచ్చి వచ్చు"నని సమాధానము చెప్పినది. వారెవరని ప్రశ్నించు నాబాలునికి శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునులే అక్కబావలని తెల్పెను. శివరాత్రి కాబాలుఁడు తైర్థికులతో శ్రీశైలము చేరి యాదిదంపతుల నాహ్వానించి మొరపెట్టుకొనెను. తిరుణాల ముగిసినను బాలుఁడు శ్రీశైలనాథుని వదలిరాడు. అక్కబావలు వచ్చునంత వఱకు రానని గుడిలో తిష్ఠవైచెను. అతనిపై జాలిగల్గి ఆ పురాణదంపతులు కృతకనరాకృతులతో నాబాలునెత్తుకొని వారియింటికేగి, ఆతిథ్యము స్వీకరించిరి. ఆ బాలుఁడు వారిని అక్కబావలనియే యెంచి మేలమాడుచు శివుని యెంగిలి రొట్టెను తాను లాగి భుజించెను. శివకటాక్షముచే వారు సర్వసంపద్భరితులైరి. ఇది కథా సంగ్రహము.

కథలో సంభాషణలోని జిగి బిగి, చమత్కారము కవుల నాటకీయ రచనాసామర్థ్యమును వేనోళ్ళఁజాటుచున్నది. బాలునితో నేగనున్న పార్వతీ పరమేశ్వరుల మాటలు కడు సరసములు.

సీ॥ పుట్టినింటికి నీవుపోయి యెన్నాళ్లయ్యె
        నని శంకరుఁడు మేలమాడఁజొచ్చె;
    నత్తవారింటికి నరిగి మీరెన్నాళు
        లయ్యెనో! యని మేలమాడె నాపె
    కట్టు దుకూల సంమమ్ములా! యేమండె
        ననుఁ జూచి నవ్వికొం(డ్రనియె శూలి;
    అచట నేనిప్పింతు నట్టి పుట్టములు మీ
        కెందుకు రండనియె భ్రమరాంబ

తే.గీ. వారు భిక్షులంటంచుఁ బురారి నగియెఁ
గాదు సకల భాగ్యము లిచ్చు వారు మీర
లల్లు రైయుండ భిక్షులెట్లగుదురు! రగుదు
రనుఁడు మీ దయ కపయశంబనియె గౌరి. (65)

భ్రమరాంబకు సైతము "పుట్టిల్ల"న్న మమకార మెంత తీపియో! ఆ చివరి రెండు మాటలు ఆ యంబ యెదందలో పొంగిపొరలు దయాతరంగ నాదములే. ఎంత వ్యంగ్య వైభవము, ఎంత వాక్చాతుర్యము! రత్నరాసులు కుప్పలువడిన హిమవన్నగమను పుట్టింటఁ బుట్టిన యారాచబిడ్డ బీదబాపని యిల్లు పుట్టిల్లని భావించి తాదాత్మ్యముతో భర్త నీసడించినది. ''వారు భిక్షులైయుండ మీ కపయశంబని" ఎత్తి పొడిచినది. భక్తవరాధీనతలో భర్తను మించినదీ భ్రమరాంబ!

'మాయ బావ'ను తెలిసికొనలేక మక్కువతో నా శివుని పజ్జ మెలఁగిన ఆ బాలుని జన్మము ధన్యము. అతని పాత్ర కడు సహజముగాఁ జిత్రింపఁబడినది.

శా. "బావా! అంతయుఁ గూడ నాకు నిడకే భక్షించెదే? తెమ్ము నా
కావై పెల్లను, వేఱొకం డిపుడె నీ కందించెదన్ రొట్టె, యి
ప్డే వేఱొక్కటిఁ గాల్చు నమ్మయని యా యీశుండు భక్షించునా
లోనే వేగమ లాగి కొంచరిగె బాలుం డద్ది భక్షించుచున్.''

ఇందు బావ నోటిలోని రొట్టె కాదు ఆ బాలుఁడు పొందినది. అతవుని అమృత హృదయమునుండి ఒక్క కరుణాతరంగము. వెంటనే నట్టిల్లు బంగార మైనది. ఆ చిన్ని భక్తుని మనసు సింగారమైనది. అనల్పభక్తి భావస్నిగ్ధమైన రసహృదయముగాని యిట్టి చిన్ని కథలో మహాకావ్య పఠనానుభూతిఁ గల్పింప లేదు. ఈ గాథలో పార్వతీపరమేశ్వరులు కుష్ఠరోగ బాధితులైన దంపతుల యాకృతిఁ దాల్చి భక్త పరీక్ష యొనర్చిన యొక యుపగాథ కలదు. "శ్రీశైలం శిఖరం దృష్ట్వా...." అను ప్రసిద్ధికి మూలకారణ మీ యుపగాథ.

## 2

దక్షిణ గంగయగు గోదావరి జన్మగాథ 'గాయత్రీ మహిమ' యందు ప్రధానముగాఁ జెప్పఁబడినది. పరమేశ్వరతత్త్వ ప్రతిపాదితమగు గాయత్రి సర్వమంత్ర శ్రేష్ఠమని యిందు ప్రతిపాదితము.

ఏలా మాహాత్మ్యమునందును, దేవీ భాగవతమునందును గల గౌతముఁడు గంగను భువికిఁదెచ్చిన కథా మట్టమే యిందును వర్ణితము. ఆ ఋషికి గౌతమిని సాధించు శక్తి, కరువులో నన్నభిక్ష నిచ్చెడి శక్తి గాయత్రీ మంత్ర లబ్ధమైనదే.

ఇందు పార్వతి సవతియందలి ఈర్ష్యచే గంగను, గంగాధరుని ఈసడిం చిన విధము రసవంతముగా వర్ణింపఁబడినది. ప్రసిద్ధమగు గంగా గౌరీ సంవాద మిట్టిదే. మచ్చున నొక్క పద్యము నుదాహరింతును—

సీ. ఒదలెల్లఁ జేపకం పొక్కచో నింకర
 లేదు వంకర నడ లాదినుండి
ఉన్నతస్థాన మందుంచుటయే కాని
 నీచ స్థలంబేగి నిల్చుచుండు;
"నైనవారికి నాకు" లన్నరీతిని నగ్గ
 మై పావుల కొసంగు నాక సుఖము;
నున్నతంబగు వస్తువొండు తారసమైన
 దప్పించుకొని దారి తప్పి యేగు

తే.గీ. తంగపాటుకుఁ బుట్టిల్లు శివుని కీపె
వట్ల ప్రేమంబు గలిగెఁ "దావలచిన యది
రంభ" యను సామెత కుదాహరణము నాథు
చెయిది నెట్లు విమర్శింపఁ జెల్లునకట!" - (66)

అధఃపతిత యగు నొక వనితగా నన్వయించుకొనునట్లు గంగను వర్ణిం చిన విధము కడు చమత్కారము. ఉక్తి చమత్కృతికి, వక్రోక్తి వైభవమునకు, పాత్రానుగుణమైన సంభాషణమునకు, లోకోక్తి జాతీయ ప్రయోగమునకు, తేఁట తెనుఁగు తీయందనమునకు పై పద్యము చక్కని యుదాహరణము. గౌతముడు బ్రాహ్మణులను శపించు మట్టమున ప్రస్తుత మా కులము వారిలో లోపించిన నార్ష సంప్రదాయములఁ గూర్చి కవులు విమర్శించిరి. గౌతము నెదుట ప్రత్యక్ష మైన శివుని వర్ణనము సందర్భ రసౌచిత్యము వెలార్చుచున్నది. మంత్రమహిమ ఒక నదికి జన్మహేతువగుట ఈ గాథ సారాంశము.

## 3

వివిధ తపో విధానములలో దానమొకటి. దానిలో నన్నదానము, శివజ్ఞాన దానము అనునవి పూర్వోత్తర క్రమమున శ్రేష్ఠములు. ఈ గాథలో మొదట అన్నదాన మహిమ వర్ణితమైనది. ఆపై శివజ్ఞాన దానమహిమ చెప్పఁబడినది. ఒక చోరుని వలనఁ బొందిన శైవగ్రంథము నొక బావఁడు గ్రామస్థులకు వినిపించును. వారిలో నొక వైశ్యుఁడు శ్రద్ధాళువై దానిని వినును. అతని కనంత లక్ష్మి ప్రసన్నమయ్యెను. శ్రవణఫలమే యింతయుండ ఇఁక పఠన పాఠన ఫలమెంత యుండునో పఠిత యూహకు వదలుటయే యిందలి వ్యంగ్య చమత్కృతి. వేశ్యాభక్తి ప్రతిపాదితమగు నొక యుపగాథ యిందు కలదు. వేశ్యయందు పతివ్రతా గుణమును భాసింపఁ జేయుటయు, భక్తికి కులగోత్రాదులతో సంబంధము లేదనియు నది బోధించును. గురుశిష్య పరస్పర పరీక్షావసరము ఈ యుపగాథలోఁ బ్రతిపాదితమైన ముఖ్యాంశము.

## 4

పరశురాముఁడు శివుని మెప్పించి పరశువుఁ బొంది రాజలోకము నెట్లు చంపెనను నంశమును ప్రతిపాదించు పురాణ ప్రసిద్ధమైన గాథనే యిందు కవులు వర్ణించి యుండిరి. పితృవాక్యపరిపాలకునిగా, పితృదేవతా సంతృప్తి కారకునిగా, దాతగా, "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్ర"మ్మనెడి ధీరోద్ధతునిగా పరశురాముని మహత్తర వ్యక్తిత్వ మీ కథయందు సంగ్రహమయ్యు సార్థగంభీరమగునట్లు కవులు రచించి యుండిరి. పాత్రలలో కవుల ఆత్మీయత గోచరించకపోదు.

తే.గీ. "బ్రతికియున్నపు మాటను బాటి చేసి
మృతిగనిన తద్దినమున విస్తృతము గాఁగ
నన్నదానంబొనర్చి గయయెడ విష్ణు
పాదమునఁ బిండమిడి నట్టివాఁడె సుతుఁడు." (8)

అను జమదగ్నిపాత్రలో కవులు స్పష్టముగా ప్రతిబింబించుచున్నారు.

కం. "స్వాతంత్ర్యములేని ధరా
నేతృత్వముకన్న మున్ను నే మొనరుచు భి
క్షాతత్పరతయె మేలుగ
దా! తేఁకువ గలుగునట్టి లజ్జా లెఱుఁగరే." (51)

అను బ్రాహ్మ వాక్యములలో బ్రిటిషువారికి దాసులైన జమీందారుల నెత్తి పొడుచుట ధ్వనింపఁబడుచున్నది. ప్రాతనీటికి క్రొత్తరుచులు కల్పించినట్లుండును ఇట్టి సమకాలీన భావధ్వని చమత్కృతులు.

## 5

తే గీ. "అల యగస్త్యుఁ డేకతమున నాలితోడ
దక్షిణాశకు వచ్చి యద్దిశకు మ
రల నరుగఁడయ్యె నీ వృత్త మెలమి మాకు
నాన తిమ్మని" శౌనకాదు లడుగ చెప్పిన సమాధానమే ఈ అగస్త్య చరిత్రము.

శివపార్వతుల కల్యాణవేళ హిమవన్నగముపై సకల దేవతలు సమావేశము కాగా నాభారమున కాదిశ క్రుంగినది. అగస్త్యుఁడు దక్షిణదిశకు వెళ్ళుచో బరువు సమపాళముగా నుండునని యెంచి శివుఁ డాతని నట్లొనర్ప నాజ్ఞాపించెను. శంకరుని వీడుట కనంతముగా దుఃఖించినాఁ డగస్త్యుఁడు. అతని మాటలు దయారస తరంగిణులై కవుల రచనలో రుచులు మించినది. మచ్చునకు-

చ. "హరికి వివాహమైనటులె యాద్యమునుల్ వచియింపలేదు సా
గరమునఁ బుట్టిఁ గేశవునిఁ గైకొనెఁ బెండ్లి యదేది పెండ్లి యా
సరసిజ సంభవుండయిన శాస్త్ర విధిన్ గయికోఁడు వాణి నీ
పరిణయమే ప్రతీద్యమని వచ్చితిఁ బోలెడు కోర్కితో శివా!" (13)

త్రిమూర్తుల వివాహములను తుల్య పరిశీలనము చేసి, ప్రతీద్యత శివకల్యాణమునకుఁ గల్పించు ఋషి వివేక మహిమ, ప్రతిపాద్య వస్తు సమర్థనము ఆ రెంటి వెనుక తొంగిచూచు భక్తియుక్తమగు వేడికోలు, "బోలెడు కోర్కితో శివా!" అనుటలో నున్న తెలుఁగుదనము, బావురుమన్న లక్షణము, "శివా!" అనుటలో నున్న చనువు "నీవందఱికి శివుడవే" నాకే కానిది అన్న యీసడింపు మొ॥ భావములు ఈ పద్యమునకు మధురానుభూతి నందించెడి శక్తిని ప్రసాదించుచున్నవి.

వాతాపిని జీర్ణించుకొని, వింధ్య గర్వభంజనుఁడై అగస్త్యుఁడు దక్షిణాదికి వచ్చెను. కాశీ విశ్వేశ్వరాగ్రహమునకు గురియై కాశిని బాసివచ్చి, భీమేశ్వర

క్షేత్రము నొద్దనున్న వ్యాసర్షిని దర్శించి యాతని గోడు వినెను. వ్యాసుఁడు కాశిని బాయు ఘట్టము తెలుఁగులో శ్రీనాథుని కాశీఖండ భీమఖండములందు ప్రసిద్ధమై యున్నది. అందు వ్యాసుని కన్న అగస్త్యుఁడే ముందా క్షేత్రము చేరియుండెను. ఇచ్చట అది తారుమారైనది. శ్రీనాథునికన్న కవులది చాల సంగ్రహమైన రచన. శివుని పాత్ర పోషణలో శ్రీనాథునకును, తి.వేం. కవులకును కొంత వ్యత్యాస మున్నది. శ్రీనాథుని శివుఁడు ముక్కోపి, విషయము సూదిగా, మాటుగా, వ్రేటు వేసినట్లు మాటలాడు యథార్థవాది. కవుల శివుఁడు ఎంత కోపియో అంత దయామయుఁడు, మెత్తగా, పొగపు వేసినట్లు, వెక్కిరించుచు, ఎదుటివారి యెదఁ దను కాల్చిచ్చు పెట్టి కాల్చునట్లు, పచ్చిలౌకికుఁడు మాట్లాడినట్లు, మతవైషమ్యము గుబాళించునట్లు, కుకవిత్వమును సహింపనట్లు మాట్లాడును. భీమఖండములో వ్యాసుఁడు కాశిని శపింపబూనెను. కావున నాతనిని శివుఁడు కాశికను వెడలి నడువుమనెను. కాని, యిచ్చట శాపము మాట అటుంచి అతఁడు వందితమ్మన్యుఁడు కావున కాశిని విడువుమని శివాజ్ఞ, ఇది కవుల మార్పు. స్వీయ ప్రతిభా కల్పనము. శివుని కోపమునకుఁ గారణము లివ్వి :

క. "ఒకచో శివుఁడు పరుండనె
దొకచో విష్ణువని వ్రాతు వొక మాటకు వే
ఱొక మాటకుఁ బొసఁగదు ని
న్నకటా! యేలాటి కవిగ నభినందింతున్." (84)

క. ఏదో బోలెడు వ్రాసిన
చేదస్తవుఁ గవిలె కట్టచేఁ గవియగుచో
నీ దాఁకనేల? భువిని భ
వాద్భుళు లిఁక "రామకోటి" వారలుకారే" (85)

ఈ రెండు పద్యములు కవుల వివాద కవిత్వములో ప్రసిద్ధములైనవే. అంతియగాక, ఈ కథలో వేంకటశాస్త్రిగారు కాశిని వీడివచ్చినవేళ గల్గిన భావములు వ్యాసకాశీ వియోగమునందు సమాంతరానుభూతిని రేకెత్తించి యుండవచ్చును.

అగస్త్యుఁడా తరువాత వ్యాసుని వీడ్కొని కేరళదేశ నివాసియై నిలచెను. కావేరీనది అతని కమండలము నుండి పుట్టినది. క్రౌంచుని శపించుటలో నారని

తపశ్శక్తి గోచరించినది. ఇతఁడు వాతాపిని జీర్ణించుకొనుకొను కథాసమయమున నింద్రవజ్రావృత్తము వాడి ఉచిత ఛందోమర్యాదను కవులు పాటించిరి.

ఇంద్రవజ్రావృత్తమ్: "వాతాపి జీర్ణం'' బనిబల్కి పొట్టం
జేతోముదం బొప్పఁగఁ జేతితోడన్
భూతేశ భక్తుండు వివుండు ప్రామన్
వాతాపి జీర్ణించె తపస్వి కుక్షిన్" (54)

## 6

శివయోగుల మాహాత్మ్యముఁ దెల్పు నీ గాథయందు మృతుఁడైన రాజ బాలుఁడు విభూతి మహిమతో పునరుజ్జీవితుఁడై, శివయోగి కరుణచే ఖడ్గశంఖములఁ బొంది వైరివీరుల నిర్జించినట్టి వృత్తము వర్ణితమైనది. శివభక్తులగు పద్మాకరుని వంటివారల దయాభావమును చిత్రించుటయు, ఋషభయోగులవంటి శివయోగుల మహిమ జూపుటయు ముఖ్యప్రతిపాదనముగాఁ జెప్పఁబడిన ఈ గాథలో వారు భద్రాయువును రక్షించుటలోఁగల హేతువు నిరూపింపఁబడలేదు. అది లోపము కాకపోవచ్చునుగాని, యున్నచో కథ సర్వార్థసమృద్ధమై యుండెడిది. ఈ కథయందు దశార్ణదేశాధిపతియైన వజ్రనాభుని కఠిన దూర్తహృదయమును, క్షమైకగుణోన్నతమగు సుమతి కష్టసహిష్ణుతయు, రథచోదకుని నిర్మలహృదయమును చక్కఁగా కవులు నిరూపించినారు. రాపాక లక్ష్మీపతి కవి భద్రాయురభ్యుదయమని ఈ గాథనే యైదాశ్వాసముల ప్రబంధముగా రూపొందించి యుండెను.

## 7

క. భక్తియె ప్రధాన మీశుని
శక్తికొలఁది స్వకుల పథము జారవిడుప కా
సక్తి భజించుచు శివు
రక్తి గలిగియున్న నెట్టి ప్రాణి తరించున్"—(88)

అను సందేశమిచ్చునది మలయవతియను వేశ్య చరిత్ర. ఆమె వేశ్యయయ్యు, స్వకులాచార ధర్మ నిరతయయ్యు పరమేశ్వర లగ్నహృదయయై తరించు నుద్దేశముతో జీవించెడిది. ఆమెను పరీక్షింప నెంచి శివుఁడు మిండ జంగముఁడై ఆమెను మూఁడు రోజులు కట్టడిలో పొంది రెండవ రోజున గరాసు

వయ్యెను. మలయవతి ధర్మ మెంచి, బందుగుల బోధలు పెడచెవిని బెట్టి ఆతనితో సహగమన మొనర్చెను. దేవతలు మెచ్చి పుష్పవృష్టి కురిసిరి. శివుఁడు లింగ మయ్యెను; మలయవతి పానువట్టమయ్యెను. ఇది యిందలి కథ. ఈ కథపై వీరశైవ పురాణ ప్రభావ మధికముగా కానవగును. వేశ్యభక్తి ఆవేశముద్రిత మైనది. సహగమనమునకై సిద్ధమగుచున్న నా వేశ్యయందు ధర్మదృష్టి భక్తిగాను, అది జ్ఞానముగను, అది క్రమముగా నున్మాద స్థితికిని పరిణతి చెందిన క్రమ వికాసమును కవులు కడు నేర్పుతో చిత్రించిరి. వేశ్యావివాహము, సహగమనము, మొ॥ సాంఘిక సమస్య లీకథకు కొంత పూర్వరంగమును సిద్ధపరచుచున్నవి. వేశ్యాగృహ మర్యాదలు, వారి నర్మభాషణా చాతుర్యములు, మిండ జంగమ సమావేశమునందు కడు రమణీయముగాఁ జిత్రింపఁబడినవి. కవుల వర్ణనా సామర్థ్యమున కొక్క యుదాహరణము - మలయవతితోఁ గూడిన శివుని వర్ణనము:

సీ. "స్వీయా సుఖం బెట్లు చెల్వారునో? పార్వ
తీ దేవిఁ బెండ్లాడి తెలిసికొనియె;
నిరువురు కాంతల మరఁగు గేస్తు సుఖంబు
గంగామహాదేవి కతన నరసె;
దారుకావన మేగి తన్మని స్త్రీల చాం
దసపుఁ జైదముల తత్త్వ మ్మెఱింగె;
నాఁడుదై మగవాఁడు పాడిఁ దప్పించున
య్యెమ్మె వీక్షించె మహినిఁ గూడి;

తే గీ. కాని వేశ్యాసుఖం బెఱుంగఁడు హరుండు
నేఁటి కమ్మూఁడు తెఱఁగుల బోటులెవ్వి
థమున వర్తింతురో మంతనముల నెఱుఁగు
రసికజన చక్రవర్తియై యెసక మెసఁగె" (31)

విరూపాక్షుని విటునిగాఁ జిత్రించి యీ పద్య మపూర్వము.

## 8

హరివంశ కథా ప్రసిద్ధమైన బాణాసురవృత్తాంతము "శివపూజాఫలము." ఈ కథ పెక్కు మంది ప్రాచీన కవుల దృష్టి నాకర్షించి యున్నది. నాచన సోముఁడు హరిహరాద్వైత సిద్ధాంత బోధ కీకథను సామర్థ్యముతో నుపయోగించు

కొనినాఁడు. కవులు బాణాసురునం దభేద భక్తిని ప్రతిష్ఠించి అట్టి ప్రయోజనమే సాధించినారు.

చ॥ "మృదువగు వెన్నవంటిది శరీరము నీయది యెప్డు కష్ట మె
య్యది సహియింపనేరదు పదాబ్జసహస్రము లిందుకై సదా
మది జపియింత్రు గోపికలు మాధవ! నిష్కరుణుండవైన నా
ప్రదరము లిందునాటి యపరాధ మొనర్చె ననుగ్రహింపవే" (161)

అను బాణాసురుని దృష్టిలో "శివాయ విష్ణురూపాయ" అను పరిపక్వ బుద్ధియే పండఁబారినది.

తండ్రియనుమతి లేకుండ స్వతంత్రించి గోప్యముగా వివాహమాడిన కన్యను గన్నందుకు సిగ్గిలు బాణునిఁగాంచి పరమేశ్వరుఁడు - అట్లు గొంకు వాఁ డస లాడపిల్లల తండ్రియే కాగూడదని మేలమాడును. అది సమకాలీన సంఘముపై వేసిన విసరు. శివుని చమత్కార భాషణలివి: పిల్లవాని మామయగు కన్యాదాతను గూర్చి.

ఉ॥ మామయి పుట్టుకన్నను బ్రమాదము వేఱొకఁడుండబోదు సు
త్రాముఁడె యౌనుగా కొక సుతంగను హేతువుచేత మామయౌ
చో మఱకమ్ము కన్నుఁ గడు చుల్కన యౌఁ బరితాపమంతగా
దోమకు నుండ దన్నియును దుఃఖము లుండెడి మామగార్లకున్. (179)

ఉ॥ మామయి పుట్టుకన్నను బ్రమాదము వేఱొకఁడుండబోదదే
సోముల మామ గొఱ్ఱెయయి చూపఱు నవ్వఁ జరింపఁడే? యికే
మామకు గౌరవంబొదవు? మంచిది యెంతటి దక్షులైన సు
త్రాముని కన్న దక్షుఁడగు దక్షునితోఁ దులఁదూఁగ నేర్తురే? (180)

ఉ॥ మామయి పుట్టుకన్నను నవమానము వేఱొకఁడుండబోదు శ్రీ
ధాముఁడు విష్ణు, వేను, నలధాతయు మామలుగాకపోవుదే
పాముల పాదమో గరుడు పాతకమబ్బు నటించు జంకియే
యీ ముగురున్ సుతాజనకు లిప్పటికేనియుఁగాక మానుటల్. (181)

శివపారమ్యమును బోధించుచు, శివకేశవాభేదముఁ బ్రకటించు నీ గాథతో నీ ''పురాణగాథలు'' అను కావ్యమును ముగింపటకో తి. వేం. కవులు తమ అద్వైత స్థితిని స్మరించుకొనినట్లనిపించుచున్నది.

## సంస్కృతాంధ్ర రచన - సంవాదకావ్యము - శుక రంభా సంవాదము

శుకరంభాసంవాదము సంస్కృతాంధ్రరచన. ఇందలి సంస్కృత కవిత్వ మాశుధార. అపై నది తెలుఁగుసేయఁబడినది. దానివలన కవులు ''ఉభయకవి మిత్రు''లనిపించుకొనిరి. సంవాదాత్మకమైన యిట్టి ఖండకావ్యములు సంస్కృత మున వేదవాఙ్మయమునుండి కనఁబడుచున్నవి. ఋగ్వేదమునందలి యమీయమ సంవాదము మొదలైన విట్టివే. తెలుఁగున ప్రాచీన మహాకావ్యాంతర్భూత సంవాదములే కాక కందుకూరివారి ''నారదవాణీ సంవాదము'' వంటి ప్రత్యేక సంవాద ఖండకావ్యములు కూడ వెలసినవి. తత్త్వజిజ్ఞాసువులైన ప్రాచీనులు బ్రహ్మము గూర్చియు, శాస్త్ర సత్యములఁ గూర్చియు చర్చించు విషయములు పూర్వ సంవాదకావ్యములం దితివృత్తములు కాగా నవ్యులు సమకాలీన సాంఘిక సారస్వత మత రాజకీయ విషయ చర్చలనే వస్తువులుగా నీకావ్యములందు సంత రించి పెట్టిరి. ఇందు రెండు విభిన్న మనఃప్రవృత్తుల కొక్క నిర్దిష్ట విషయముపైఁ గల్గు చర్చయే ప్రధానముగా వర్ణింపఁబడుచుండును.

ఇట్టి ఖండకావ్యములందలి వస్తువు, దాని విస్తృతి కడు పరిమితములై యుండును. కవి కడు నిగ్రహముతో నిగ్గుఁదేల్చిన భావములను సానఁబెట్టిన పదములలోఁ బొదిగిచెప్పను. ఉపక్రమణలు, పీఠికలు, పూర్వరంగముల వంటి వేమియులేక సరాసరి రంగములోనికిఁదుమికి యొకానొక నిర్దిష్ట భావశిల్పక్రమము ననుసరించి సంవాదము నిర్వహించి పఠితలను అర్థవాదాదులతో ముగ్ధులనొనర్చి వ్యంగ్య భావాదులతో రక్తులనొనర్చి ఆశ్చర్యముద్ర కల్గించునట్లు నిర్వహింప వలెను వాఙ్నిర్మాణ శబ్దవాక్య రచనాది శిల్పములన్నియు సంవాద సౌందర్య తేజోహేతువులగునట్లు సుసంబద్ధములొనర్చుట యందే యిట్టి కావ్యములలో కవి ప్రతిభ ప్రకాశించుచుండును.

శుక రంభా సంవాదము 'కామ - మోక్ష' భావములకు గల్గిన సంఘర్ష ణము. ఈ రెండు భావములు ఇద్దఱు వ్యక్తులుగా రూపొందింపఁబడినవి. మొదటిది రెండవ దానిని నయోక్తులతోడను హేతువాద చమత్కృతుల తోడను, బలవంతముగను లొంగఁదీయఁ బ్రయత్నించును. కాని, అయ్యది తగిన ప్రత్యాఖ్యానములతో ప్రత్యర్థిని ఖండించి స్థైర్యముతో దాని నెరముగా నెట్టి

వైచును. ఇది ఒక విధముగా స్త్రీ విషయ విజయము. దీనిని కవులు కడు సామర్థ్యముతో నిర్వహించిరి.

సంవాద కథా లక్షణములే కావ్యనిర్మాణ మూల సూత్రములై యుండుట గమనార్హము. వాటి ప్రతిపాదములు ప్రమాణముగా నంగీకరించు సమానసూత్రము వాదమునకు ప్రాతిపదిక. ఉ॥ మత విషయక చర్చలో దైవమున్నాఁడనునది ప్రాతిపదికమైనట్లు. రంభాశుక మహర్షుల వాదములో నిద్దరును యౌవనదశ యందుండుటయు తద్దశానుగుణమైన వర్తనము వారికి యోగ్యమని నమ్మటయు ప్రాతిపదిక. కాని, యౌవన దశా లక్షణములను గూర్చి వారికి విభిన్నమైన దృక్పథములున్నవి. పరతత్త్వ సాధన సమర్థమైనది యౌవనమని శుకయోగి మతము. యువతీసంగమ సమాహితమైనది యౌవనమని రంభమతము. దీని యుపపత్తులు దానికి సంతరించుకొనుచు వాదము ప్రతిపాద ప్రత్యాఖ్యానరూపముగా ముందుకు సాగెను. యౌవనము కామ ప్రధానము.

రంభ దృష్టిలో కామము:- క. రమణులతో నెన్నఁడు సుఖ
దములగు నుద్యానముల రతనపుంబలుసౌ
ధములందు మదన శాస్త్ర
క్రమ మొనరుతు ననుట సూవె కామము వాసీ!

శుకుని మతమున కామము: క. మురహరు జపియించుచు జన
విరహితమగు నడవినుండి విధముఁ గనురదు
స్థిరమగు మోక్షం బెన్నఁడు
కరగత మొనరింతుననుట కామము బాలా!

ఇట్టి ఋషి వాక్యములు ఆ వనిత వాదమును పరాస్తమొనర్చును. మఱియు నొకరి దృష్టిలో నీవీబంధమోచనమే మోక్షము మఱియొకరి దృష్టిలో భవబంధ విమోచనమే మోక్షము. ఇట్లొకరిది లౌకికదృష్టి, మఱియొకరిది పారలౌకికదృష్టి. వీరి వాదనలోఁ బాటింపఁబడిన విధానములు—

1) వాదమునం దుపయుక్తము లగుచున్న ముఖ్యాంశములకు స్వీయ మతానుగుణముగా నిర్వచనము లొసంగి స్వరూపస్వభావము లేర్పరచి చెప్పుట. (ప. 1 నుండి 12 వరకు).

2) ప్రధానాంశ నిరూపణానంతరము విషయ విమర్శనమునకుఁ గడంగుట.

3) పరస్పర ప్రతిపాదిత వాదములందుఁగల సాధకబాధములను విడమరచి చెప్పుట.

4) ఉపపత్తులకు ప్రత్యుపపత్తులు, వ్యాఖ్యలకు ప్రత్యాఖ్యానములు సుడువుట. (13-18)

5) తామాదర్శముగా నమ్మెడి యుత్కృష్ట గుణాంశముల నేకరువుపెట్టి వాని ప్రాశస్త్యము నుగ్గడించుట. (19-30)

6) ప్రతివాది మతములను విచ్ఛేదింప సమర్థమైన ధర్మశంకను ప్రతిపాదించి ఆటకట్టింప యత్నించుట. (31)

7) ప్రతివాది దానిని సమూలముగా ఖండించి ఆశ్చర్యము గల్గించుట. (32)

8) గత్యంతర మాలోచించి తనకోర్కె ధర్మబద్ధమని వాది ప్రతిపాదించుట; ప్రతివాదిచే నమ్మించుటకు యుక్తులను బన్నుట. (33 - 39)

9) ఎదుటివాఁ డూహించుటకు గూడ సాధ్యముగానట్లు సద్యఃస్ఫూర్తితో మెరుపువలె నొకయుక్తిని ప్రతిపాదించి ఆటను కట్టించుట. (40 ప.)

10) వాది ప్రతివాదులలో ప్రతివాదికి విజయము కల్గునట్లు చిత్రించుట - అనఁగా రంభా శుకులలో శుకునకే విజయమని భావము. వాదారంభించినది రంభ కావున ఆమె వాది యగుచున్నది. ప్రత్యాఖ్యాన మొనర్చినవాఁడు శుకుఁడు కావున అతఁడు ప్రతివాది. ఇట్టి రచనము శాస్త్రకళా మర్యాదలలో పరిచయమున్నవారికిఁగాని వలనుపడదు.

శాస్త్రము అర్థప్రధానమైనది. నీరసమైనది. ఈ కావ్యము శాస్త్రబద్ధముగా నిర్మింపఁబడినది గాని శాస్త్రము కాదు. రసము చిప్పిలు కవిత కాలవాలమైన కళాఖండ మిది. గీర్వాణాంధ్ర రసికజన హృదయాహ్లాద జనకము. కవిత్వము రెండుభాషలయందును పండిత పామరజన సులభమై యుండుట గమనింపఁదగినది. మూలము, అనువాదము ప్రక్కప్రక్కగా నుండుటచే తారతమ్య పరిశీలన కడు సులభమగుచున్నది.

1) మూలమును జాను తెనుఁగుఁదనము చెడని పద్యమును తెలుఁగున రచించుట :

శ్లో॥ నష్టంవాఽపి భవేత్తపశ్చిరచితం దుష్టం భవేద్వాకులం
భ్రష్టోఽయం నహి మాన్య ఇత్యతితరాం శిష్టైః పరిత్యజ్యతాం
కిం కింవాఽపి భవేదపి స్మిత శరచ్చంద్ర ప్రభా భాసురం
యేనాఽస్వాదిత మంగనామణి ముఖం తస్మై నమస్కుర్మహే॥ (19)

చ॥ కులము చెడంగనీ, ఫలముగూలఁ దపం బలియంగనీ, మహా
త్ములు వెలివెట్టనీ మఱియు మోసము లెన్నియొ మూఁడనీ, పసం
దుల వెలయించు నవ్వొలయు తొయజగంధుల తావిమోవి ము
ద్దులుగొను వారి కేము ప్రణతు ల్పచరింతుము మౌనిసత్తమా!

2) సంస్కృతమున నున్నదానికన్నఁ దెనుఁగున విపులీకరించి చెప్పుట—

శ్లో॥ విశ్వామిత్రః కోవా! కోవా పర్వత మునీశ్వరో మౌనిన్
లోకే సర్వమునీనా। మేకోహి భవాన్విరాగవా నాస్తే॥ (7)

ఉ॥ గాధిసుతుండు మేనకను గైకొనె; పర్వతమౌని యంగజ
వ్యాధి దొలంగఁ జేసె మదనానుమతిన్ హరిణీమృగాక్షి; కే
గాధలు నేనెఱుంగనె? జగమ్మున మౌనులు గారెవారు? నీ
వే ధరలో విరాగివె? మునీంద్రుఁడవే? వివరించి చూడుమా!

3) గీర్వాణాంధ్రముల రెంటను కవిత్వ శక్తి సమముగా ప్రదర్శించుట:

శ్లో॥ "గేహేగేహే మంజులం నూనతల్పం
తల్పేతల్పే సుందరీ దివ్య భోగః
భోగేభోగే వాగగణ్యః ప్రమోదో
మోదేమోదే భాసతేఽద్వైతభావః."

మ. ప్రతియింటన్ సుమమంజులంబయిన తల్పం; బట్టి తల్పంబునన్
బ్రతి తల్పంబునఁ గాముకీ సురతమర్మం; బట్టి మర్మంబునం
బ్రతిమర్మమ్మున వాగగణ్య సుమధామం బట్టి ధామంబునన్
బ్రతి ధామంబున భాసమానమగు నద్వైతంబు మౌనీశ్వరా! (29)

4) అనువాదముకన్న మూలమే గంభీరముగా నుండుటకు—

ఉ॥శ్లో॥ "ఆనందా త్పరమం పదం నహి తథాఽప్యానందదాన ప్రియో"....
అను శ్లోకమున కనువాదము—

ఉ॥ "వేడుకకన్న మోక్షము బువిన్వినరా; దటువంటి వేడుకం
జెడియ లెన్నఁడుం గలుగఁ జేయరు తుచ్ఛ సుఖంబె కాని" - ఇందా
నంద శబ్దమునకు "వేడుక" యనెడి అనువాదము తృప్తినీయదు.

5) మూలముకన్న అనువాదము రమ్యముగా నుండుటకు—

శ్లో॥ "పంచబాణశరపాతనఖిన్నా
మంచ మన్మథ రణాయ విపన్నాం
మౌని చంద్ర శరణాగత రక్షా
పక్ష ఏవహి తపస్స్వపాక్షః॥"

చ. నను వెదవిల్తుఁ డాశుగగణంబులఁ గాఁడఁగ నేసె నోర్వఁజా
లను శరణంటి నీ పదములంబడి నీ జపమాల తోడు, కా
దనక ముదంబునం గవయుమా! శరణాగత రక్షణంబు క
న్నను దపమున్నదే? ఋషిగణ ప్రవరుండవు నీవెఱుంగవే! 33

తెలుఁగున "ప్రవర" శబ్దము వాఁడి ఆంధ్ర సాహిత్య పరిజ్ఞానమున్నవారికి
మను చరిత్ర సంబంధమైన వాసనలు గుప్పించుచున్నారు.

6) అమోఘమగు ముగింపు :- మదన పారవశ్యముతో రంభ శుక
మహర్షిని శరణువేడినది. అతఁడు తనకు మదన శరణాగతుల రక్షించు సామ
ర్థ్యము లేదని త్రోసిపుచ్చెను. వెలదుల పొందును చేతులార వదలుకొను దుర
దృష్టవంతుఁడ వని శుకుని నిసడించి "నీవు నపుంసకుఁడవా?" అని ప్రశ్నించి
నది. శుకుని ముఖమున రోషమునకు బదులు మందహాసము జనించినది!
"నపుంసకులు లోకమున రెండు విధములు. అదహ ప్రవృత్తిని సన్న్యసించువాఁ
డొకఁడు; దైవయోగముచేఁ బుంస్త్వము లేనివాఁడు మఱియొకఁడు. అందు
మొదటి విధమువాడ"ను అని ప్రశాంతముగాఁ దెల్పినాఁడు. స్త్రీలు పయోముఖ
విష కుంభములని శంకను వ్యక్తపఱిచెను. రంభ తన హృదంతరాళమునందలి
యనురాగముఁ బ్రదర్శింప తనువును చీల్చుకొన సిద్ధమైనది. అప్పుడు శుక
యోగి అనిన మాటలు:

చ॥ ఇది యహహా పరిమళ సమేతము దీనికిఁ జింతఁ జేయఁబో
ల దకట! నీదుమాట కడు లక్షణయుక్తము, నాదు మాట త
ప్పిదము కదమ్మ! తొల్లిఁ గడు వెంగలియైన విధాత నాకు నీ
సదమల గర్భమందున నొసంగఁడుగా జననంబు తల్లిరో!" (40)

ఈ చివరిపదమునకు రంభయొద్ద సమాధానములేదు. పతితవలెనే ఆమెయు నిస్తబ్ధ యైనది. కావ్య మాగిపోయినది. కామదూషితమైన రతిని వత్సల భావముగా విరుగఁ గొట్టిన పద్య మిది. పరమశాంతమూర్తి యగు శుకమహర్షియందు పర కాంతా మాతృభావము పరాకాష్ఠ నందినది!

తి.వేం. కవులు తమ 'శ్రవణానందము'లో నపర ప్రవరాఖ్యుని నిర్మింప లేని దోషము పోగొట్టుకొనుటకై యీ ''ఋషిగణ ప్రవరు''ని సృష్టించి ధన్యు లైనారు.

## స్తోత్ర కావ్యములు

మ. "శతలేఖి న్యవధానిఁ జేయవొ? వచస్స్వారస్యముం గూర్పవో?
'ప్రతిలే రీతని' కన్న పేరిడవొ? ద్రవ్యం బీయవో? రాజుల
న్నతులం జేయవొ? యెన్నియేన్గతుల నానందంబు గల్పింపవో?
గతి నీవే యనువారి కేమి కొదవో కామాక్షి! కామేశ్వరీ!"

—కామేశ్వరీ శతకము. 55.

తిరుపతి వేంకటకవుల స్తోత్రవాఙ్మయ సారభూతమైనది పై పద్యము. ఈ విషయముపై నెంత వ్రాసినను పై పద్య సూత్రమునకు వ్యాఖ్యానమే కాఁగల దని నా నమ్మకము. కవులు దేవ్యుపాసకులు. వారికి దేవి యిలవేల్పు. ఆమెకు వాఙ్నతి యొనర్పనిది వారి సరస్వతి యడుగు ముందుకు వేసెడిదికాదు. వారా మెను మనసార నమ్మి యనన్యచింతతోఁ గీర్తించినారు. ఆమెయు దయ బొంపిరి వోవ వారిని గటాక్షించినది. స్థూలముగా ఈ భావము పై పద్యము చదివినపుడు ప్రతివారికి స్ఫురించును. ఈ తత్త్వమే భగవద్గీతాకారుఁడు—

"అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" నవ.అ. 22 శ్లో.

అని ప్రవచించినాఁడు. అనన్య భక్తి కవులుకవిత్వముఖమునఁ బ్రపంచించుచుండ కామేశ్వరి వారి యోగక్షేమములు చూచు బాధ్యత స్వీకరించినది. ఇదియే రాజ విద్యా రాజగుహ్య యోగఫలమని భగవద్గీత చెప్పుచున్నది.

లోకుల భావములు సుఖదుఃఖాత్మకములు. భావావేశము కల్గినప్పుడు మానవుఁ డవ్యక్తవాగ్ఘరీవిలాసములో మాట్లాడును అందును కవులైనచో వేఱు

చెప్పఁబనిలేదు. సహజ కవిత్వ మహత్వము గల్గిన తిరుపతి వేంకటకవు లాశుధారా కవిత్వముచే తమ భావసముదాయమును ఛందోమయముగాఁ జెప్పుట 'నల్లేరుపై బండి నడకవంటి'దైనది. తమ జీవితయాత్రలో నెదురైన సుఖదుఃఖములన్నియు పరదేవతా ప్రభావములని భావించి సర్వము తత్పరముగా నన్వయించుకొని తన్నివేదనాపారవశ్యము వహించి ముముక్షు భావనాముద్ర వహించు కవుల స్తుతికావ్యములు సర్వసహృదయుల స్వాత్మానుభవ స్వబ్రహ్మాధారులై యానంద దాయకములగు ననుటలో విప్రతిపత్తి లేదు.

స్తుతులలో భగవంతునికిని, భక్తునకును వైయక్తిక భక్తిసంబంధ విశేష వర్ణనముండును. భక్తుని యాత్మావిష్కారమును సాక్షాత్కరించుకొని దానిలో తాదాత్మ్యము పొందిన నాఁడే స్తుతి సహృదయ హృదయాస్వాదిత మగును. ఇట్టి తాదాత్మ్యశక్తి స్తుతిలో కవి సంతరించు రసభావౌచిత్యములపై నాధారపడి యుండును. మహనీయ దేవతా గుణస్తుతి శరీరమై యుండ కవి భావనావ్యంజితమైన రస ప్రతీతి ఆత్మయై భాసించి స్తుతికావ్య యొక తేజస్స్వరూపిణిగా సాక్షాత్కరించు ననుటలో సంశయము లేదు.

ఆత్మ చిదానందస్వరూపుఁడు. అతఁడు శరీరమాలంబనముగాఁ గొని లౌకిక సుఖ దుఃఖములనెడి మాయలోఁ జిక్కుకొనును పూర్వ సంస్కారములు ప్రేరేచగా శరీరి (జీవాత్మ) ఆనందస్ఫూర్తిని వరించుచు తత్సాధనిత్తై పరశక్తిని భజించును. ఇచ్చట ఆనందము ద్వివిధముగా దర్శింపఁబడు చున్నది. 1) బ్రహ్మానందము 2) మానుషానందము అని. మానవునిలోనున్న ప్రవృత్తికి పరాకాష్ఠ మానుషానందము, నివృత్తికి పరమ ధ్యేయము బ్రహ్మానందము. లోకవ్యవహారము ప్రవృత్తి ప్రధాన మగుటచే అందనుభూత మగునది మానుషానందమే. కావ్యమునం దీ విషయ జన్యమైన మానుషానందము వర్ణితమగును. కావ్య మలౌకికసత్తారూప మగుటచే నామానుషానందము ప్రాతిభాసిక రూపమున నలౌకికానంద మగును. తదనుభూతి రసానందాఖ్యమై బ్రహ్మానంద సహోదర మనఁబడుచున్నది. కవి కావ్యసృష్టి యొనర్చు నప్పుడును, సహృదయుఁడు కావ్యాస్వాద మొనర్చు నప్పుడును పొందు అనుభూతి అట్టిదేయని లోలభట్టాచార్యులు నుడివి యున్నారు దీని తాత్పర్య మిది:- లౌకిక సుఖదుఃఖములతో సతమతమగుచున్న కవి తదనుభవ విశేషమును హృదయమున మథించి యమృతత్వ మాపాదించి భావావేశముతోఁ గావ్యముగాఁ గీర్తించి తద్ద్వారమున

నలౌకిక రసానందము ననుభవించి బ్రహ్మానంద సాధనోన్ముఖమైన యోగ ప్రక్రియగా దాని నుపాసించును. అట్టి ప్రవృత్తినే పఠితకును ప్రసాదించును. దీనినే మమ్మటాచార్యులు "సద్యఃపరనిర్వృతి" యని పేర్కొనెను.

పై పద్యమున మానుషానందము అభివర్ణితమైనది. కావ్యత్వము దాని యందు భాసించుటచే పఠితకు రసానందము కల్గుచున్నది. పురుషార్థ త్రయసిద్ధి వలన మానుషానంద మేర్పడును. ఆపై చతుర్థ పురుషార్థము గమ్యమానమగును. దానికి కవిత్వము సోపానమగును. ముముక్షువులగు కవులందఱు కవిత్వము నట్లే పరమ పురుషార్థ సాధనోపకరణముగా మంచుకొనినారు:-

మ "మనుజుల్ గొల్వఁగ నేం యన్యులను? 'నోమాతుః పరాదేవతా'
యను వాక్యమ్మున మాత్ర శబ్దమున కన్యార్థమ్ముగా నేర్పునే
జననీరూపమున న్సదా సులభవై భాసించు నిన్నున్ భజిం
చినఁ జేకూరవె భక్తిముక్తులు యశశ్శ్రీ లెందుఁ గామేశ్వరీ!" (కామే.25)

అనెడు తి. వేం. కవు లేముముక్షువులైన కవులకుఁ దీసిపోరు.

ఆది పద్యమునందు యశోఽర్థాదులగు కావ్యప్రయోజనములు ధ్వనిత ములై యున్నవి కవికి దేవి దయవలన సాటిలేని మేటికవు లనెడి కీర్తి, అర్థ సిద్ధి, వ్యవహారవేత్తలగు రాజులచే నతులఁ గొన్న యౌన్నత్యము, శివేతర క్షయమువలన పరనిర్వృతి కనువైన జీవితానందము దేవీభక్తులకు కొదవేమియు లేదనెడి ప్రబోధమునను ప్రయోజనములు కవు లిందు సాధించినట్లు వ్యంగ్యముగా నిబంధించినారు.

తి. వేంకటేశ్వరీయ మనఁబడు స్తోత్రవాఙ్మయమం దేకొద్దియోతప్ప అంతయు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి కవి కృతమే. వారికి ముప్పదియేళ్ళు దాటినప్పటి నుండి శరీరమునం దస్వాస్థ్యమేర్పడినది. అనవరత రుజాసంగ్రామమే వారి తదనంతర శరీరచరిత్ర. "శరీరమాద్యంఖలు ధర్మసాధన'' మ్మనెడి కాళిదాసోక్తి ననుసరించి శరీరారోగ్య రక్షణము కవికి ప్రథమ కర్తవ్యమైనది. పురుషకార మౌషధసేవచేతను, దైవకృప స్తోత్రవిరచనముచేతను వేంకటకవి సాధించి, కవిత్వమున కనామయ ప్రసాద మహత్త్వము కలదను సత్యమును నిరూపించెను.

గీర్వాణభాషా కవులలో మయూరుఁడు సూర్యశతకము రచించి కుష్ఠురోగ బాధా నివృత్తిని జయదేవుఁడు గీతగోవింద కావ్యరచనముచే గతాసువైన భార్యకు పునర్జీవమును, మూకమహాకవి కామాక్షీస్తుతితో వాగ్విలాసమును సంపాదించియుండిరని వారి కావ్యములు నిదర్శనమిచ్చుచున్నవి. తెలుఁగున చెళ్ళపిళ్ళ కవియే ఈ మార్గమున నాద్యులైరని భావింపవచ్చును.

ఇచట యొకటి మీమాంస్యము. ఆది పద్యము కవి దేవి కృపా కటాక్ష లబ్ధానామయత్వ సిద్ధి నందియున్న సమయమున వ్రాసినది. ఇట్టి స్థితి కవి జీవితమున దీర్ఘకాలముండలేదు. వారి జీవితములో నొదుదుడుకులే అధికము. కావున వీరి విడికవిత్వములో చాలా భాగము అనామయముకొఱకైన ప్రార్థనలే గోచరించుచుండును. ఇట్లగుటచే నీస్తుతి వాఙ్మయము నీ క్రింది విధముగా విభజింపవచ్చును—

1) కవి తన శరీరమున కేర్పడిన అనారోగ్యము నుపశమింప వేడికొను పద్యములు.

2) తన కుటుంబ సభ్యుల కేర్పడిన ఆమయమును తొలగించుటకై కవి ప్రార్థించిన పద్యములు.

3) ఆరోగ్యములు కుదుటఁబడినప్పుడు కృతజ్ఞతాయుతముగా దైవమును గీర్తించెడి పద్యములు.

4) తన జీవితములోఁ దారసిల్లిన వివిధ సన్నివేశములను గూర్చియు, వాని వలనఁ దనకుఁ గల్గిన సాధకబాధకములఁ గూర్చియు విన్నవించుచు, వానినుండి తన నుద్ధరింప దైవమును వేడుకొనుచు, వానియందు తనకు శుభము గల్గునట్లు వేడికొను పద్యములు.

5) సమకాలీన మత, సాంఘిక, రాజకీయ, నైతిక విద్యా పరిస్థితులపై తమ యభిప్రాయములను స్పష్టపఱచుచు వానిని దైవమునకు విన్నవించుచుఁ జెప్పిన పద్యములు.

6) తమకు నచ్చని యాచారవ్యవహారములను, సిద్ధాంతములను విమర్శించుచుఁ దద్గర్హణ రూపములైన భావములను దైవమునకు విన్నవించెడి పద్యములు.

7) సాహిత్యగోష్ఠులు, వివాదములు, శాస్త్రచర్చలు. సత్యాసత్యనిరూపణములు తమ సాహిత్య జీవితమునకు సంబంధించినంతవఱకు ప్రత్యేకించి దైవమునకు విన్నవించుకొనెడి పద్యములు.

8) జ్యోతిషశాస్త్ర విషయపరిజ్ఞాన స్ఫోరకములైన పద్యములు.

9) "జపాను యుద్ధము" వంటి ప్రపంచ పరిస్థితులను సమీక్షించుచు వ్రాసిన పద్యములు.

10) పైయంశములేకాక ఇతరములగు వివిధాంశములపై వ్రాసిన పద్యములు.

ఇట్టివన్నియు పురుషార్థత్రయసాధన ప్రధానమైన జీవితాదర్శ లక్షితములైన కావ్యములగుటచే మానుషానంద సాధనమే పరమ ప్రయోజనముగా గల్గినవి. కాని, ఆముష్మిక జీవిత వాంఛను ప్రతిపాదించు కావ్యము ఇట్టి స్తుతికావ్యములలో నుత్తమమైనదని భావింపఁబడుచుండును. కవులచే రచింపఁబడిన "కామేశ్వరీ శతకము" కొంతవఱకు చివరి మార్గమున నడచినది కాని సర్వమును ముముక్షు భావాశ్రితమైనది మాత్రము కాదు. తదితరములన్నియు అనామయార్థమై రచితములైన స్తోత్రములే. అవి : 1) ఆరోగ్యకామేశ్వరి 2) ఆరోగ్యభాస్కరస్తవము 3) మృత్యుంజయస్తవము 4) సతిస్మృతి 5) సౌభాగ్యకామేశ్వరీస్తవము (3 భాగములు) అనునవి.

స్తుతి కావ్యములలో నుత్తమమైనది శతకము. తి.వేం. కవులు రచించిన యుత్తమమైన శతకము "కామేశ్వరీ శతకము." శతక కావ్యములో నేపద్యమునకాపద్య మొకగాథవలె నుండును కవి వివిధ ఘట్టములందు వివిధ రసానుకూలములైన భావములను విశృంఖలముగాఁ బద్యములందు రూపొందించి వాని నొకచోట ననుసంధించును. ఆత్మ నివేదనమే ప్రధానమై ప్రత్యేకమైన వస్తువేమియులేకయుండుటచే పద్యముల కన్నిఁటికి నొక యానుపూర్వి, భావైక్యము ఉండకపోవచ్చును. సమర్థుఁడైన కవియైనచో నొక్కొక్కచో భావక్రమ వికాస పరిణామమును, పురుషార్థ సాధనోన్ముఖమైన మనఃప్రవృత్తియుఁ బ్రకటించును. "కామేశ్వరీ శతకము"న వేంకటశాస్త్రిగారు పెక్కేండ్లలో పెక్కు సందర్భములలోను, ప్రధానముగా శరీర రుగ్మత కల్గినప్పుడును కామేశ్వరీ వరప్రసాదార్థియై చెప్పిన పద్యములు అష్టోత్తర శతసంఖ్యలోఁ గూర్పఁబడియున్నవి. ఇందు కొన్ని రసవత్తరములైన పద్యముల నుదాహరింతును.

1) ధర్మ సాధన కుపకరణమైన దేహమునకు స్వాస్థ్యము గల్గింప నర్థించుట :-

శా. దేహస్వాస్థ్యముకన్న వేఱొకటి ముక్తిప్రాప్తికిన్ సాధనం
బూహింపంబడ దెందు, దానికి మహాయోగుల్ త్వదీయాంఘ్రిసే
వాహంభావము హేతువందు రది నిన్నర్థించుచున్నాఁడ సం
దేహం బేటికి? "దేహి" యన్నపుడు శక్తి! తల్లి! కామేశ్వరీ! (9)

2) "నరనాథసేవా వైముఖ్యము" అనెడి యాత్మాశయమును కవి తెల్పుకొను పద్యము:-

మ. నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాసం బొనరించునట్టి పని నాచేఁ గాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఱిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరులన్నిత్యము గొల్పు టొప్పగునె? యంబా! దేవి! కామేశ్వరీ! (15)

3) జ్ఞాన యుతమైన భక్తి తనకు దేవీప్రసాదమని కవి చెప్పుట :-

మ. ఒకమాట న్వచియింతు మత్సుకృతమేమోగాని నేనెట్టిదు
ష్టకృతిన్ మగ్నతచెంది యుండినను దూరంబైన జ్ఞానమ్ముత
త్కృక భక్తి న్భవదీయ పాదయుగళిం గల్పించె నీ భక్తి మి
న్నక పోనేర్చునె? ముక్తి నా కిడదె యెన్నండేని గామేశ్వరీ! (46)

4) దేవీస్తుతి నొనర్చిన ప్రాచీన కవులఁ జేర్కొని తన భక్తి మార్గ ప్రాశస్త్యము కవి యుగ్గడించుట :—

మ. హరియంచున్ హరుఁడంచు బ్రహ్మయనుచున్ హర్యక్షుఁడంచు న్నిశా
కరుఁడంచున్ బలురీతులన్ జనులు శంకల్ సేయుదుర్ వీరు త్వ
త్పరులౌ టొక్కరునే నెఱుంగ రిది మున్ దాఁ గాళిదాసుండు శం
కరులు న్నిక్కమెఱింగి రా మతమె నేఁ గైకొంటిఁ గామేశ్వరీ! (53)

5) చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి శిష్యరికము, తిరుపతిశాస్త్రిగారి సాహచర్యము ప్రసాదించినందులకు దేవిని నుతించుట :-

శా. ఆయావిద్య లనన్నిటిన్ స్వయముగా నార్జింపఁగాఁజేసి నీ
వే యంచుం బదులెంచు బ్రహ్మగురు లోకేడ్యుం గురుంగా సహా
ధ్యాయింగా నలతిర్పతి న్సలిపి శాస్త్రప్రక్రియన్ స్వల్పమే
నాయాసమ్ము వినాగ నిచ్చిన నినున్ ధ్యానింతుఁ గామేశ్వరీ! (93)

'ఆరోగ్య కామేశ్వరి' యను స్తోత్ర కావ్యమునందు రెండువందలకు మించిన పద్యములున్నవి. ఇందున్నవి వేంకటశాస్త్రిగారియొక్కయు, వారి కుమారులగు దుర్గేశ్వరశాస్త్రిగారి యొక్కయు అనారోగ్య నివృత్తికొరకు దేవినుద్దేశించి చెప్పినపద్యములు. "రోగప్రకోప సమయములందప్పుడప్పుడ వివశముగా దొరిలిన కవిత్వమే కాని యియ్యది యిట్లు రచింపవలెనను నుద్దేశముతో దీక్షపట్టి రచించినది కాదని సమాధానము చెప్పుకోఁదగు"నని వేంకటశాస్త్రిగారే పీఠికలో సెలవిచ్చిరి. ఈ పద్యములు సుమా రెనిమిది సంవత్సరముల కాలపరిమితిలో రచింపఁబడినవి. కొన్ని యుదాహరణములు :-

1) సత్కావ్యమునకును సుజీవితమునకును సామ్యము :

శా. ఆశ్వాసాంతము దాఁక శ్రావ్యమగు కావ్యం బట్టులే జీవితం
బాశ్వాసాంతము దాఁక రమ్యమగుచో నాశాస్యమై సవ్యమై
శశ్వన్మంగళ సంగతంబునయి విశ్వశ్రేయమై పొల్చు. నో
విశ్వేశీ! యటు లౌట సారె కిటు నా విజ్ఞప్తి కామేశ్వరీ! (201)

2) శ్లేష చమత్కృతికి -

మ. తనుకున్ దగ్గని దానిఁ గోరుదురు సంతానంబు నెప్పట్లఁ బ్రా
జ్ఞమతుల్, దగ్గెడి దాని నెట్టి కుమతుల్ గాంక్షింప; రట్లౌట నో
యమ! యిందుంగల శ్లేష శ్లేష్మరుజయంతైనన్ సమర్థించి నా
కొమరుం దగ్గని వానిఁ జేయు మది నాకుం జాలుఁ గామేశ్వరీ! (40)

3) లోకమ్ములో కవిత్వము దివ్యౌషధమని ప్రతిపాదించుట -

శా. పద్యమ్ముల్ రచియించి కోరితి నిఁకన్ బ్రారబ్ధ కర్మక్షయం
బిద్దానం గలిగించి వే సుతున కాయారోగముం బాపి దీ
ర్ఘ్యద్దేహం బొనరించి ప్రోవుము; కవిత్వం బద్ది లోకమ్ములో
'సద్దివ్యౌషధ' మన్న పేరున యశస్యం బౌతఁ గామేశ్వరీ! (12)

4) పూర్వ (ఆరోగ్య) శతక కవులఁ గీర్తించుట:

మ. శతకమ్మున్ రచియించి సూర్యపయిఁ గుష్ఠమ్మార్చె నొక్కండు, ప
ద్యతతి న్నిన్ను నుతించి మూఁగతనమున్ దాఁటాసె నొక్కండు, ని
శ్చిత మీసంగతి, మున్ను నీకతననే జీవించితి న్నేను, మ
త్సుతు నారోగ్యము నీకటాన నగుదే చోద్యమ్ము కామేశ్వరీ! (14)

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సంప్రదాయము చొప్పున అనామయ ప్రసాదార్థియై కవి భాస్కరునిఁ గీర్తించిన స్తుతి "ఆరోగ్య భాస్కర స్తవము" ఇందు దుర్గేశ్వరశాస్త్రిగారికి తిరుగఁబెట్టిన దగ్గు తగ్గుటకును, చెడిన కవిగారి ఆరోగ్యము మెఱుఁగగుటకును, బొబ్బిలి పట్టాభిషేకము దర్శింప శక్తి కల్గుటకును, బందరు షష్టిపూర్త్యుత్సవములలోఁ బాల్గొనఁ గల్గుటకును, కంటి జబ్బు మాన్పుటకును, సూర్యనారాయణునిఁ బ్రార్థించుట యిందలి వర్ణ్య వస్తువు. పుత్త్రునకుఁ గల్గిన దుర్భరరోగబాధను గాంచలేక పితృ హృదయము తపించి పోయినది.

శా. భాగ్యం బీయఁగఁ గంకణంబు వంతబుగ్పట్టారకుండూనె నా
రోగ్యం బీయఁగఁ గంకణంబు భవదాహూర్తంబు వేదార్థ వి
ద్యోగ్యుల్ పల్కెడి పల్కు పొల్లగునె? నీ వాక్కంత ప్రేమించి యా
రోగ్య శ్రీయుతుఁ జేయుమయ్య సుతునిన్ మ్రొక్కెంచెదన్
భాస్కరా! (3)

అని దివాకరుని దయ నభ్యర్థించినాఁడు.

శా. నీ తేజమ్మున వృష్టి దీని కతన న్నీరంధ్ర సస్యంబు త
జ్జాతం బన్నము, జీవ బీజము తతో జాతంబు నౌటన్ జగ
ద్భూతోత్పత్తి తదీయ రక్షణలకు న్ముఖ్యుండ వీవే! బల
స్ఫీతున్ మత్తనుజాతుఁ జేయుమని యాచింతు న్ననున్ భాస్కరా! (27)

అని కాళ్ళవేళ్ళఁ బడినాఁడు—

మ. హరి వైకుంఠమునన్, హరుండు రజతాహార్యమ్మునన్, బంక జో
దరుఁడుం దాసల సత్య లోకమున నిట్లన్యోన్య సంబంధ మొ
క్కరవంతేనియులేక యుందురు, త్వదాకారమ్ము నందట్టి మూ
గురు స్వచ్ఛందముగా వసింతురని పల్కున్ బ్రాసుదుల్ భాస్కరా! (10)

అని అతని దివ్యమూర్తిని కీర్తించినాఁడు—

దివాకర్ల వంశజుఁడైన తిరుపతి శాస్త్రిగారి పేరు జెప్పి, అతని సఖుడనని యైన మన్నించి కొమరుని రక్షింపుమని వేడుకొనినాఁడు. (46)

భాస్కరుని దయకుఁ బాత్రుఁడైన కొమరుని గాంచి చేయెత్తి ఆ కర్మ సాక్షి కెరగినాఁడు. వేంకట శాస్త్రిగారు పుత్త్రి వాత్సల్యమున కెల్ల! కావ్యౌషధ మర్మజ్ఞుఁడైన భిషగ్వరుఁడు!

తనకు మఱల జబ్బు తిరుగఁబెట్టినది స్వామిని వేడుకొనినాఁడు. రోగ బాధలో కూడ దైన్యమునందని ధీరుఁడు వేంకట శాస్త్రిగారు.

మ. తమమున్ దోలిన భంగిఁ దోలవలె నాదైన్యంబు; నాయందు దై
న్యము మాత్రం బిమిడింపఁబోకుమని నిన్ బ్రార్థింతుఁ గేల్మోడ్చి, రో
గము కన్నన్ గడుఁ గష్టమియ్యది, భవత్కారుణ్య పాత్రుండఁ; గా
వ్యము నీకిచ్చితి, నా కనామయత నాపాదింపుమో భాస్కరా! (160)

శా. ఈ కావ్యమ్మన నాదు జీవితము నీ విద్దానితో పాటుగా
సాఁకంగావలె దానిఁగూడ నపహాస్యత్వమ్ము రాకుండ నీ
వీ కార్యమ్ముల నేమఱం జనదు సుమ్మీ! తండ్రి! నీకు న్నమో
వాకమ్ముల్ పచరింతు నాపయిఁ గృపన్ వర్షింపవే భాస్కరా! (198)

అని ప్రార్థించి ఆరోగ్యవంతుఁడై షష్టిపూర్త్యుత్సవము బందరులో నతి వైభవముగా జరిపించుకొనెను. వేంకట కవిని బ్రతికించి భాస్కరుఁడు పరువు నిలువఁ బెట్టుకొనినాఁడు తోడ్తో కావ్యమహిమను నిలువఁబెట్టినాఁడు.

మృత్యుంజయ స్తవము కవిదంపతు లస్వస్థతకు గుఱియైనవ్వు డనామయత నాశించి శివుని గీర్తించిన కావ్యము; మృత్యుంజయ మకుట సంశోభితము: శతక ప్రాయము. అట్లే సతీస్మృతి భార్యారోగనివృత్తి కొఱకై మకుటములేని పద్యములలో కామేశ్వరిని స్తుతించిన పద్య సముదాయము. అర్ధాంగి అనారోగ్యము నకు గుఱియై అమరపురి కరుగ సిద్ధముగా నున్న సమయమున కవి గుండియ కరిగి జాలువారి కరుణా తరంగిణియై స్రవించినది. దేవిని గొంతెత్తి పిలిచినాఁడు. పిశాచము పట్టిన కోడలి కొఱకై జాలిపడినాఁడు, పెద్దకోడలి గర్భస్థ శిశువును రక్షింప వేడుకొనినాఁడు. మఱియొకవైపు దాయాదుల వేధింపులకు నలిగిపోయి నాడు. సతీభిక్ష పెట్టుమని దేవిని వేడుకొని వేంకట కవి—

శా. ఈ పద్మాక్షియె లేనిచో బ్రతుక నేనిన్నాళ్ళు, తజ్జాతక
శ్రీ పూర్ణంబుగ భర్తృజీవితము రక్షింపంగ సంజీవి, వి
ద్యాపారంగతులైన పండితుల కీయంగంబు స్పష్టంబు నా
కై పాలింపుము దీని జీవితము నిన్నర్థింతుఁ గామేశ్వరీ!

అని దైన్యముగా వేడికొన్నను లాభము కలుఁగలేదు. నిరాశాహతుఁడై—

మ. "అవకాశంబది యున్న నేనడుగు నీ యర్థమ్ము నిద్ధించు; లే
దవకాశం బదిగాక యీ సమయమం దాలస్యమే యైనచోఁ
గవి వర్ణ్యత్వము గల్గ దీపెమ్యతికిన్ గాఁబట్టి స్వప్రార్థనం
జెవిఁ బెట్టం దలపెట్టవైతి వనుచున్ జింతించుఁ గామేశ్వరీ!"

అని కావ్యము ముగించిన వేంకట శాస్త్రిగారి బరువుగుండెను ఊహించుకొను పఠిత అర్ద్రీభూతుఁడు కాకపోడు!

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు మూఁడేండ్ల కాలములో నప్పుడప్పుడు వారెదుర్కొన్న అనారోగ్యాదులను సూత్రప్రాయముగాఁ దెల్పుచు సంగ్రహ జీవిత చరిత్రవలె రచించిన గ్రంథమీ "సౌభాగ్య కామేశ్వరీ" స్తవము. ఇది వేయి పద్యముల పైఁబడి యున్నది. ఇట్టి అరోగ్య ప్రసాద కవిత్వమును గూర్చి కవి యిట్లు నుడివి యున్నారు. "జప హోమాదులు కర్మఠులకును, దానములు ధని కులకును, దేవతారాధనము కవులకును సులభముగ నుండును....ముఖ్యముగా దీర్ఘ (వ్యాప్య) వ్యాధులవలనఁ జిక్కుపడువారు సుఖ జీవనము చేయవలయు నన్నచో దేవతారాధనమువంటి దేదియును లేదని నా యనుభవము వలనఁ జెప్పఁ గలను".... "ఇందలి పద్యములకుఁ బూర్వోత్తర సందర్భములు చదువరులు జాగ్రత్తగా గమనించుకోవలయును. ఒక విషయముం గూర్చి రచియించినవి కాకుండుటచే దీనికి యోగము తటస్థించినది!" ఈ కావ్యము శ్రీ అప్పా జోస్యుల కృష్ణశాస్త్రిగారి కంకిత మీయఁబడినది. దీనియందు కవి వర్ణించిన విషయ ప్రపంచ మనంతము. జ్వరబాధనుండి - జపాను యుద్ధము వఱకు ఇందు చోటు చేసికొన్నవి. తి. వేం. కవుల సమకాలీన చరిత్రకేర్పడిన 'రికార్డు' వంటిదీ కావ్యము. మచ్చునకుఁ గొన్ని పద్యములు—

1) వేంకటశాస్త్రిగారి స్వాతంత్ర్య ప్రీతి:-

శా. "స్వాతంత్ర్యానకు భంగమున్న యెడలన్ సామ్రాజ్య మేమైన నా
చేతం బందుల కొప్పుకో దెఱుఁగు నీ చిత్తంబు నా కందుచే
నో తల్లీ! దయసేయుమే 'నవుకరీ' నోచూచి, రాపో, యటం
చాతంకమ్ములు లేక యుండవలె నంచర్థింతుఁ గామేశ్వరీ!" (78)

2) కవిగారి యభిమానరసముల ప్రసక్తి—

శా. "శృంగారమ్మన నిల్చె వీరమున నిల్చె న్నిల్చె నన్యత్ర; భ
క్తిం గాసంతయు నిల్వదేమికతమో? దీక్షాపరత్వమ్ము; నీ
కంగీకారమె లేదొ? నా హృదయమే అలాటిదో? దీక్షకున్
భంగం బబ్బనిభంగి నాకుఁ గరుణింపన్ లేవె? కామేశ్వరీ!" (185)

3) శబ్దచమత్కృతికి—

మ. 1"గదిగా నుండిన నన్ను వెంటఁగొని చక్కన్ 'జెన్నపూ' ర్వచ్చితె
య్యది గావించెదొ? యంచునే మొదట నుయ్యాలూగిలింగాని మ్రొ
క్కెద నోతల్లి! కిరిటిఁ జేసితివి శ్రీకృష్ణుండ నిప్డైతి నీ
దుదయోద్రేకము మెరపీతె"నని సంతోషింతుఁ గామేశ్వరీ ! (410)

4) కైవల్యకాంక్ష—

శా. నాకేమాత్రము శక్తియుండినను సన్న్యాసంబు నిపాటికే
కైకొందున్ గురురాహయోగమున నాకైకొంట సిద్ధింపదె
ల్లో కైకోకయె సన్న్యసించిన మహాయోగీంద్రు లానించు నీ
దే కైవల్యముఁగోరు నజ్ఞ సయిపం బ్రార్థింతుఁ గామేశ్వరీ! (537)

నమశ్శివాయ స్తోత్రము, శివస్తవము, శివశంకర విజ్ఞప్తి అనునవి కవి మనశ్శాంతికొఱకు వ్రాసిన స్తుతులు. పండితవాదముల మధ్య, ఈర్ష్యావాయువుల మధ్య సతమతమైన వేంకటకవి తన "హృదయవేదనమునంతయు నీ స్తుతులతో వెలికిఁ జెప్పుకొనినాఁడు. ఆత్మనివేదనము ఈ స్తుతుల కాయుస్సూత్రము. శివశంకర విజ్ఞప్తిఁ గూర్చి కవి వ్రాయుచు— "పోనీ భగవన్నామస్మరణ చేసుకున్నట్టూ అవుతుంది, మన విచారాన్ని లోకానికి తెల్పినట్టూ అవుతుందని—

శ్లో. "శివ! శివ! శంకర! శివ! శివ! శంకర!
శివ! శంకర! శంకర! శివ! శంభో!
పరమదయాకర! భవహర! శుభకర!
భక్తిందిశ ముక్తిందిశ శంభో!"

---

1. టిప్పణి-గది-రోగి (గదః రోగః అస్యాఽస్తి) గదగలవాఁడని అర్థాంతరము. గదిగానుండిన నన్నున్-గదియే నేను నేనే గదియన్నరీతిగానున్న నన్ను అనఁగా వరకగది తప్ప వీధిముఖం కూడా చూడని నన్ను అని తాత్పర్యము. కిరీటిన్-కిరీటము కలవాణ్ణి. నాటి సభలో పుష్పకిరీటంతో సమ్మానించిరని తాత్పర్యము. గద కలవాఁడున్నూ, కిరీటం కలవాఁడున్నూ శ్రీకృష్ణుఁడు (కిరీటం గదినం' అని భగవద్గీత చూ॥).

అంటూ సంస్కృతములో లోగడ వ్రాసిన "నమశ్శివాయ" స్తోత్రంలాగే వ్రాయడానికి మొదలైతే పెట్టానుగాని 'అయ్యో, సంస్కృత మైతే అందటికీ బోధ పడదు. ఆ పద్ధతిని లాభం వుండ'దని దానిలో తెలుఁగు ప్రతి శ్లోకంలోనూ కలిపాను. సగం తెలుఁగూ సగం సంస్కృతమూ యిలాంటి కలగాపులగాలు యిదివఱలో కవులు రచించడం ఆదారం లేదు. లేకపోతే లేకపోయింది. దీనిలో వచ్చే మహాపాప మేమిటని వూహించి యేలా తోఁచిందో అలాగే వుంచాను. యతులు కూడా కొన్ని చోట్ల పెట్టనే లేదు. కొంచెం వుదహరిస్తాను—

"ధర్మములను పేరిట నపధర్మము
లెన్నియొ పుట్టుచు నున్నవి శంభో!
శివ! శివ! శంకర! శివ శివ శంకర!
శివ! శంకర! శంకర! శివ శంభో!
అవి కల్పించినవా రవివేకులు
గారు వివేకులె నిక్కము శంభో - శివ! శివ!....
కూఁతుఁ గాంచినవారికిఁ బార్వము
కొండంత పుణ్యమని గద శంభో - శివ! శివ!....
యిప్పుడు కూఁతుం గాంచిన వారికి
నెట్టినరకమో తెలియదు శంభో - శివ! శివ!...."

యీ మాదిరిగా యేదో చేదస్తంగా కొన్నివందలు యిప్పటికి నడిచాయి శ్లోకాలు. పనిలేని పాటగా యీ వార్ధక్యంలో ఈ కవిత్వ రచనకూడా నిర్విచారస్థితికి భంజకమైనా యిందులో ప్రతి శ్లోకంలోనూ సగభాగం భగవన్నామం వుండడం వల్ల యిది యీ వయస్సులో యుక్తమయిందే అని సంతోషిస్తూ దీన్ని సాగిస్తూ న్నాను. అంతేనేకాని యిది లోకోపకారకంగా వుంటుందనే తలఁపుతో దీన్ని వ్రాయడం లేదు. (కథలు - గాథలు - 2 - పుట 555.) ఈ స్తుతులు ముసలి తనములోఁ" బనిలేక వ్రాసినవనియు, భగవన్నామస్మరణ ప్రధానములనియు కవియే అనుచున్నపుడు మనమింక వేఱేమి చెప్పఁగలము?

వార్ధకమందలి కవిత్వమునకును, యౌవనమందలి కవిత్వమునకునుగల భేదమరయుటకుఁ దగినట్లు తి.వేం.కవుల "కాశీసహస్రము" చక్కని తార్కాణము. దానిఁగూర్చి వేం.శాస్త్రి ఇట్లనిరి: "నేను మెచ్చుకుండే కవిత్వాలు ఎలావుండేవో-మచ్చుకు -

శ్లో॥ ప్రాత రంబుజ విడంబి లోచనాం
మాతరం త్రిజగతా ముపాస్మహే
శీతరమ్య కరుణావలోకనై
ర్యాతరంగయతి మంగళానినః."

యీ శ్లోకం శ్లేష యమక చక్రవర్తి శ్రీ వెంకటాధ్వరి లక్ష్మీ సహస్రం లోనిది. యిందులో ప్రాతర మాతర శీతర యాతర అని యెంతో శ్రవణా నందంగా నాలుగు చరణాలలోను వుండంగా నాకు చాలా శ్రవణానందంగా వుండేది. కాశీ సహస్రంలో యీ మాదిరి కవిత్వాన్ని చెప్పడానికి కొంత ప్రయత్నించడం కూడా జరిగింది. యెంతవరకు కృతార్థత్వం కలిగిందో చెప్పలేను. మొట్టమొదట సంస్కృత కవిత్వానికి ఆరంభించినప్పుడు కాళిదాసు గారి— "శ్లో. ద్వైతాయన ప్రభృతి శాపాయుధ త్రిదివ సోపాన ధూళిచరణా" అన్న శ్లోకాలను వరవడిగాఁ బెట్టుకొని మేము - శ్లో. "నాళీక జాద్యదితిజాళీ శిరఃకలిత మౌళి ప్రభాంచిత పదా" అంటూ కొన్ని శ్లోకాలు యిష్టదేవత కాళికను గూర్చిన్నీ "శ్లో. బాలం సమస్త జగదాలంబ మంబుధర నీలం బలారి వినుతం"అని శ్రీకృష్ణ భగవానుణ్ణి గూర్చిన్నీ వ్రాసి ఉన్నాం. కాని, యెక్కడికక్కడ యమకంలో కూడా కాళిదాసుగారి రచనలో కొంత చక్కనిభావం యిమిడి వుంది. మా రచన లోనో యేకొంచెె మేమాత్రమో భావం ఉందేమో కాని అట్టి భావంలేదు సరికదా, అట్టి కూర్పు సమేతమున్నూ లేనేలేమ. ఈ సంగతి రచనాకాలంలో మాకు పొద కట్టలేదు. కాని యిటీవల క్రమక్రమంగా పొదకడుతూ వచ్చింది. అయితే ఈ రహస్యం ఎఱుఁగనివారు చాలామంది మమ్మల్ని ఈ రచనను పురస్కరించుకొని ప్రశంసించడం కలదు. ఎవరికోగాని యీ భేదా భేదాలు పొదఁగట్టవు. అందుచేతే "కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తి వా నవా" అన్నారు పెద్దలు"[1] ఈ వాక్యములలో తి. వేం. కవుల ఆత్మ విమర్శనము వారి విశుద్ధ మనస్కతను, వినయమును వేనోళ్ళ చాటుచున్నది. యమకాది శబ్ద చిత్రణలను యౌవనము నందు గౌరవించినను, ఆపై మృదుమధుర కవిత్వమునే చేపట్టి రచన సాగించిన

1. కథలు - గాథలు - IV - 350 పు.

కాళిదాసువలెనే తి.వేం. కవులును తమ పూర్వావస్థ నుండి పూర్తిగా మారిపోయినారు. మహాకవులతత్త్వ మట్టిదియే. వీరి కాళీస్తుతి స్వరూప స్వభావముల నింకొక యుదాహరించి యీ యంశము ముగింతును :

''నాళీకజాద్యదితిజాళీ శిరఃకలిత మౌళి ప్రభాంచిత పదా
నాళీకబంధ్వనల నాళీక శత్రు కిరణాళీ స్వరూపనయనా
కేళీ విశేష నిపుణాళీ ప్రకాండకృతకేళీ విలాసముదితా
కాళీవధోజితమరాళీ తనోతు వచనాళిం కళా విలసితా॥

కంకాలయాది సురకంజాత గంధికరకంజాత పూజితపదా
కంజాత సంజనిత కింజల్క పుంజరుచి సంజాగ్ర....రదనా
పుంజీకృతేంద్రమణి సంజాతపుక్తి కుర పుంజాలి రంజితకచా
మంజు ప్రవాళ రుచి ద్రుంజక్వణావసను సంజీవనీ మహహృదీ.''

తి.వేం. కవులు తమ స్తోత్ర కావ్యములలో కామేశ్వరి, భాస్కరుఁడు, శివుఁడు, విష్ణువు మొ॥ దేవతలను కీర్తించినను వారందరిని ఏకైక బ్రహ్మ స్వరూపముగా దర్శింపఁగల అద్వైతదృష్టి వారి కవిత్వమున కొక అపూర్వ సమన్వయశక్తిని ప్రసాదించుచున్నది.

రస ప్రబంధముల నొకవైపును, వస్తు కావ్యములను మఱియొకవైపును సృష్టించుచు కవులు సంతృప్తిపడక కథాకావ్యములను, స్తోత్రకావ్యములను లయుకృతులుగా సంతరించి సాహిత్య ప్రక్రియా వైవిధ్యమును సాధించి నవ్యాంధ్ర కవిత్వ పీఠామహాసనదవు వారై విద్వత్కవులుగా, సంఘ సంస్కర్తలుగా, మహిత వాక్కులుగా, తెలుఁగువారి హృదయ సీమల నెనలేని గౌరవమునకుఁ బాత్రులైనారు. త్రుప్పువట్టిన తెలుఁగు నాలుకల కామెతలు వెట్టి, పాడిన పాటలే పాడుట వినలేక పసచెడిన తెలుఁగు చెవులకు తేనెజల్లుల మాటల నందించి తెలుఁగు సింగారము, నడకల యొయ్యారము, పలుకు బంగారము రచనలో పొందించి ఆనంద మొదవించిన జంటకవుల వాడికి తెలుగువారల మన్ననలు తొలినుడు లన్నన్ని రోజులు చెల్లుచుండెడివే!

# స్వతంత్ర రూపకములు

## పరిచయము

"దేవానా మిద మామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషమ్
రుద్రేణేద ముమాకృత వ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా
త్రైగుణ్యోద్భవ మత్రలోక చరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్."
—మాళవికాగ్నిమిత్రము 1 అం. 4 శ్లో.

నాట్య ప్రధానమైన రూపకరచన మన్ని ప్రపంచ భాషంలోను ఉత్తమ సాహిత్య ప్రక్రియగా నెంచబడుచున్నది. తెలుఁగున నీ ప్రక్రియ చాల యాలస్యముగా నుద్భవించినను కొలది కాలములోనే అది ప్రశంసనీయమైన విస్తృతిని సాధించినది. అట్టి ప్రగతికి ఎందఱో మహానుభావులు కారకులు. అట్టివారిలో తిరుపతి వేంకట కవులు మఱియు మహానుభావులు.

తిరుపతి వేంకటకవులు సాహిత్య సృష్టిలోఁ బరపిన నవ్యాలోకనమే వారి కొక విశిష్ట స్థానముఁ గల్పించుచున్నది. చేపట్టిన ప్రతి యంశములోను ఒక నవ్యత సృష్టించుట వారి ప్రత్యేకత. వారి దృష్టిలో సాహిత్య సృష్టికి శాస్త్రము కొలబద్ద గాదు; శాస్త్ర విస్తృతికి సాహిత్యము ప్రమాణము. ప్రాతను వీడక క్రొత్త పుంతలు త్రొక్కుటయే వీరి నవ్యతా స్వరూపము.

తే.గీ. "శాస్త్రములు నుండు, నాధారసరణు లుండు
రేకయుండిన నిపుడు గల్పింపవచ్చు
మొదట ఘటనంబు నిక్కమై మొనసె నేని
యద్దునేయువి? యట సందియంబుగాని" (పండిత రాజము. 2 అం.)

అన్నది తి.వేం. కవుల విశాల దృక్పథము. ఇట్టి దృక్పథముతో వీరి సాహిత్య మొక వినూత్న సాక్షాత్కారము నందగించును. దానిని దర్శించుటయే నా చేయు యత్నము.

శ్రవ్యకావ్య నిర్మాతలై యొకవైపును, దృశ్యకావ్య నిర్మాతలై మఱి యొక వైపును తిరుపతి వేంకటకవు లనంత యశస్సు నార్జించియుండిరి. వీరు రచించిన దృశ్యకావ్యములు పదునేను నాటకములు, రెండు ప్రకరణములు, ఒక వ్యాయోగము, ఆఱు ప్రహసనములు, ఒక వీధి - వెరసి మొత్తము ఇఱువది యైదు. సామాన్యముగా రూపకముల కన్నిఁటిని నాటకములని పిలుచుట పరిపాటి యైనను ప్రహసనాదులను ప్రత్యేకముగా వానిపేర్లతో జెప్పు నాచారము నున్నది గాన నేనట్టి మార్గమునే అనుసరింతును.

చరిత్ర యందును, పురాణేతిహాసములందును ప్రఖ్యాతి గాంచిన గాథలను కావ్యేతివృత్తములుగా గైకొని కొన్నింటిని, కల్పితేతివృత్తములతో గొన్నింటిని, పై రెంటిని మిశ్రపఱచి కొన్నింటిని నాటకములుగా తి.వేం. కవులు రచించిరి. వీనికిఁదోడు సంస్కృతమునుండి యనువదించినవి మూఁడు నాటకములు. అవి - రాజశేఖర విరచిత బాలరామాయణము. శూద్రక మహాకవి రచించిన మృచ్ఛకటికము, విశాఖదత్తుని ముద్రారాక్షసము అనునవి. కవులీనాటకములనిట్లు రచించి కవి సహజములైన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాస గుణములను ప్రదర్శించి యుండిరి. ఆంధ్రానువాదములు వారి యభిరుచికి, కావ్యరచనాభ్యాసమునకు గీటురాళ్లు. ప్రసిద్ధేతివృత్తములగు మిగిలిన రూపకములు వారి ప్రతిభా వ్యుత్పత్తులకు చక్కని యుదాహరణములు. బాలరామాయణ మనువాద మొనర్చి రామాయణ గాథపై తమకున్న మక్కువ వెల్లడించిరి. మృచ్ఛకటికము ననువదించి శూద్రకుని యపూర్వ స్వతంత్ర కల్పనాశక్తి పైనను, ప్రకరణ నిర్మాణ శిల్పము పైనను తమకున్న పక్షపాతమును గన్పరచిరి. ముద్రారాక్షసమునుబట్టి రౌద్రవీరాది పరుషరస ప్రతీతియు, రాజనీతియు ప్రధానమగు నాటక రచనా ప్రక్రియతోఁ బరిచయ మేర్పఱచుకొనిరి. ఈ నాటకానువాదముచే సంపాదించిన యనుభవ విశేషము లన్నింటిని తమ స్వతంత్ర నాటక రచనా రంగమునం దౌచితీసహితముగా నుపయోగించుకొనియుండిరి.

ఇతివృత్తమునుబట్టి వీరి స్వతంత్ర 'నాటకము'లను పౌరాణికములు, చారిత్రికములు, సాంఘికములునని త్రిధాకరింపవచ్చును. వారి నాటకముల పేర్లివి:

పౌరాణికములు :- a) భారత నాటకములు.

1) పాండవ జననము (1908), 2) పాండవరాజసూయము (వ్యాయోగము) (1921), 3) పాండవ ప్రవాసము (1907), 4) పాండవోద్యోగము (1911), 5) పాండవ విజయము (1903), 6) పాండవాశ్వమేధము (1903).

b) ఇతరములు - 7) సుకన్య (1908); 8) అనర్ఘనారదము (1909); 9) దంభవాసునము (1909); 10) ప్రభావతీప్రద్యుమ్నము (1931); 11) చవితి చంద్రుఁడు.

చారిత్రికములు :- 1) పండితరాజము (1900 ప్రాంతము) 2) ఎడ్వర్డు పట్టాభిషేకము - (1904).

సాంఘికములు: 1) వ్యసన విజయము (ప్రకరణము) (1903) 2) సౌవర్ణపాత్రికము (ప్రకరణము)

పై నాటకములను పరిశీలించుచోఁ గవుల నీ నాటకముల రచించుటకుఁ బ్రేరేచిన ముఖ్య హేతువుల నీ క్రింది విధముగా నూహింపవచ్చును:

"రాజుల చరిత్రలును కవిరాజ చరిత
ములును గ్రంథమ్ములకు వన్నెఁగలుగఁజేయు
నందులో నా మనమ్మున కరసిచూడఁ
గవుల కతలకు రాజుల కతలు లొచ్చు" (శ్రవ. పు. 26)

అనెడి వారి విశిష్టాభిమతమే వారి మొదటి నాటకమైన పండితరాజమును రచింపించియుండును. ప్రప్రథమ శ్రవ్య కావ్యమున కేది హేతువైనదో అదియే ప్రప్రథమ దృశ్య కావ్యమునకును అదియే హేతువై, వారి యచంచలద్భుతభావ స్వాతంత్ర్యమును ప్రకటించుచున్నది. ఇట్లే వారికి మహాభారతముపైనున్న భక్తియు, ప్రామాణిక బుద్ధియు నపారమగుటచే నా యితిహాస సంబంధములైన ఆరు స్వతంత్ర నాటకములను వారు తెలుఁగున నపూర్వ పద్ధతిలో వినిర్మించియుండిరి. భారత సంస్కృతికి జీవగఱ్ఱయైన రామాయణేతివృత్తము మహా నాటకముగా నున్న బాల రామాయణము ననువదించుట గమనింపఁదగిన విషయము. మోక్ష పురుషార్థ సాధన ప్రయోజనాత్మకమగు దేవీ భాగవతమువంటి పురాణములనుండి ప్రసిద్ధోపాఖ్యానములను గ్రహించి మిత్ర సమ్మితముగా సమకాలీన సాంఘిక సంస్కరణోపాయములఁ బ్రబోధించుటయేగాక సమాంతరముగా దుర్బోధము లగు వేదార్థ రహస్యములను సుగమమగు నాటక ప్రక్రియలలోఁ బ్రపంచింపవలె

ననెడి వారి సంకల్పమే బహుశః సుకన్యానర్త నారదాది పురాణ నాటకములకు దీక్షాపాద మొనర్చియుండును.

సమకాలీన మహత్తర చారిత్రిక ఘట్టములఁ గొన్నింటికి కావ్యరూపముఁ బ్రసాదింపవలెననెడి వారి యుత్సాహమే పట్టాభిషేక నాటకమున కంకురారోపణ మొనర్చినదనవచ్చును సంఘమునకుఁ జీడపురుగులగు వ్యసనాసక్తులకు కాంతా సమ్మితముగా సన్మార్గబోధ యొనర్చి. సంఘ సంస్కరణ మొనర్పవలెననెడి సేవా దృష్టియే వ్యసన విజయమునకు ముందంజ వేయించినది. దేశ స్వాతంత్ర్య సాధన నిమిత్తమై జాతీయ కాంగ్రెసు ముఖమున భారతీయు లొనర్చిన పవిత్ర ప్రతిజ్ఞను మనసార సమర్థించినవారగుటచే వీరి నాటకములందెడనెడ తత్కాలోచిత మాతృదేశ భక్తి ప్రబోధాత్మకములైన సన్నివేశ పద్యరచనాదులు సృష్టింపఁ బడినవి. సమకాలీన సాహిత్య ప్రక్రియలను గుర్తించి, సంస్కరణోద్యమమును సమర్థించి జాతిని బాగుసేయఁ గైకొన్న పూనికయే ప్రహసన రచనకు మూలాధారము. వీని నన్నింటిని మించిన హేతువు కవుల హృదయమందు దయించి పొంగులువారు రచనా కళా స్రవంతి. భవ్య కవితావేశముతో వరవళ్లు త్రొక్కిన యీ జీవనలహరి పదము మెట్టినచోటెల్ల రసార్ద్రి మొనర్చినది; సహృదయ సారసపంక్తులకు మందాకినియై మన్ననల నందుకొన్నది.

## భారత నాటకములు

స్వతంత్ర నాటకములలో నత్యంత కీర్తి కవులకుఁ దెచ్చిపెట్టినవి 'భారత నాటకములు', అందును గడు మన్ననకెక్కినవి 'పాండవోద్యోగ విజయములు." అసలు తెలుఁగు వారికి భారతగాథ అనఁగా గౌరవ మనంతము. "తినిన గారెలు తినవలె వినిన భారతము వినవలె." సాత్యవతేయ సంస్కృత భారతము నాంధ్రావళి మోదముంబొయునట్లు మహా కవిత్వ దీక్షావిధినాంది మహాకావ్యేతిహాసరూపముగా కవిత్రయము భారతమును తెలుఁగుబిడ్డల కందించినది. వారి యడుగు జాడలలోనే నడిచి, ప్రక్రియా భేదముతో నాటక షట్కముగా నా కథను నిర్మించి తెలుఁగు వారికి శ్రవణానందముతోపాటు నయనానందమును జేకూర్చినారు తెలుఁగు జంటకవులు - తిరుపతి వేంకట కవులు. వారి భారత నాటకములలో నే యొక్కటి యైనను ప్రదర్శింపని పల్లెపట్టు తెలుఁగునాఁట లేదన్నచో వానికి వచ్చిన వ్యాప్తిని గూర్చి వేఱఁజెప్ప పని యుండదు.

పురుషార్థ సాధకుఁడైన మానవుని త్రిపురుషార్థ సాధన యత్నములలోఁ బొడకట్టు సంక్లిష్ట జీవిత ధర్మ సంఘర్షణములఁ జిత్రించి, వాని నధిగమించు తీరునివృత్తము నాదర్శముగాఁ గొని చక్కగాఁ దీర్చి దిద్దిన యితిహాసము మహాభారతము. ఇతిహాసమునందు కావ్యమునందు వలె గాక పెక్కు ప్రయోజనములు సాధితములగునట్లును, అదే సమయమున రచనా చమత్కృతి చేతను, ధర్మబోధం చేతను పరమపురుషార్థ జ్ఞానము జ్ఞాపితమగుచుఁడునట్లును నాయకుని లౌకిక ధర్మ జీవిత మనుసంధింపఁబడును. అందొక్కొక్క ప్రయోజనసిద్ధి ఒక్కొక్క కార్యసిద్ధి వంటిది, ఒక్కొక్క యుపాఖ్యానము వంటిది. అట్టి ప్రత్యేక ప్రతిపత్తి కల్గిన కథా ఘట్టము లొక నాయకునియొక్క బహువిధములైన ప్రవృత్తులను ప్రతిపాదించు నొక కావ్యేతివృత్తము నాశ్రయింపవచ్చును. శ్రవ్యకావ్యముగను, విస్తృతముగను రచింపఁబడు నితిహాసములం దవన్నియు రాణించినను, దృశ్యకావ్యములం దన్నియు నొక్కచట్రమున నిముడవు. భారతమును తొలిసారి రూపకములుగా రూపొందించిన తిరుపతి వేంకటకవు లీ సత్యమును గుర్తించినారు. వారి యుగములో నాటకరచనా ప్రక్రియలో వైవిధ్యమును ప్రదర్శించి నూత్నశిల్పదృష్టికి దోహదముఁ గల్పించిన నాటక కర్తలను, వీరితోఁ బోల్పఁదగినవారిని వ్రేళ్ళపై లెక్కింపవచ్చును.

కథలో కొన్ని ఘట్టములుండును. అవి కార్యకారణరూపమున ముడివడియుండును ఆరంభక్రమవికాస సమాప్త్యంగ సమన్వితములైయుండును. అట్టి వానిని శ్రవ్యకావ్యమున కవి తానే వర్ణించును; దృశ్యకావ్యమున పాత్రల ముఖమునఁ బ్రదర్శించును నాటకమునందు కవికి ప్రత్యక్షప్రవేశము లేదు. నిమిత్తమాత్రునివలెనే యుండును. దీనికిఁ దోడు రంగప్రయోగావకాశములు, విధులు, హద్దులు, అర్థము నిలిచి కథను శాసించును. ఆ కారణముచే కథ అధికారిక సూచ్యాదిరూపభేదములఁ బొందుచున్నది. వీనికి లొంగని కథాంశములు కుప్పలు తిప్పలుగా నుండవచ్చునుగాని నాటకమున మాత్రము రూపుకట్ట వీలు లేదు. ఎచ్చట ప్రయోగానుకూల్యము తగ్గునో అచ్చట కథాకథనము హెచ్చును. కవికి బదులు పాత్రలే ఆ పని చేయును. ప్రబంధమునందువలె నాటకమున కథ సంపూర్ణముగా సూటిగా నెన్నడును వెలువడదు. సూచ్యముగా కొంత, వాచ్యముగా కొంత, నాట్యముగా, వ్యంగ్యముగా కొంత, ఊహ్యముగా కొంత, క్లుప్తముగా కొంత వింత వింత ప్రక్రియలలో సాక్షాత్కరించుచుండును. అట్టి కథ యందు

రసవ్యంజకమగునో దానిని రసకావ్యమందురు. ఎందు రసము కథలో గుణీభూత మగనుండునో అది వస్తుకావ్యమందురు. అట్లే బీజము మొదలుకొని నిర్వహణాంతమువఱకు సర్వార్థములు లక్షిత పరమప్రయోజన వ్యంజకములై యుప్పారి సుసంధియుతముగ కథ నిర్వహింపఁబడుటకు తోడ్పడుచుండ, తనయందు పెక్కు కథాఘట్టములున్నను సూత్రబద్ధములగు మణులవలె నేకహారముగా భాసించునది, రసప్రధానమైనది, రసరూపకమనఁబడును. ఇందంగాంగిరసములు పోషకపోష్య సంబంధమున భాసించుచుండును ఎచ్చట కొన్ని కావ్యఘట్టములు స్వయంసమృద్ధములయ్యును, వివిధ లక్ష్యసాధన సమర్థములయ్యును, అవాంతర ప్రయోజనములు మాత్రము సాధించునట్టివయి ముఖ్యప్రతిపాద్య వస్తువుతోడి సాంగత్యమువలన రాణించుచు, కార్యకారణ పరిణామరూప కావ్య కథా క్రమమునకుఁ దోడ్పడకపోయినను వ్యష్టిగా వ్యక్తిత్వము గల్గి యెడనెడ వస్తు ధ్వని నాశ్రయించి కావ్య పరమలక్ష్యమును సమర్థించుచు, నొక్కచో ముడివెట్టఁ బడి ప్రవర్తింపఁబడునో దానిని వస్తురూపక మని యనవచ్చును. ఇందు రస ప్రతీతి వస్తువ్యంజనను ప్రకాశింపఁజేయును. స్వతంత్ర ప్రతిభగల తి. వేం. కవులు పైనఁ బేర్కొనఁబడిన రూపక ప్రక్రియాద్వయమును స్వీకరించినప్పుడే భారతరూపకరచనము సాధ్యమగునని భావించి ఆ రూపక రచన మొనర్చి యుందురని నాయూహ! ఈ దృష్టితోఁ బరిశీలించినచో తిరుపతి వేంకటకవుల భారత రూపకములలో రసప్రధానమైనవి పాండవోద్యోగ రాజసూయములు. వస్తుప్రధానమైనవి పాండవజనన ప్రవాసాశ్వమేధములు.

వస్తు రసకావ్య విభాగము ప్రాచీనాలంకారిక సమ్మతమే కాని యీ విధమైన ఆలోచనధార నాశ్రయించిన వారరుదు. కవుల యాశయములు కావ్యములఁ బట్టియే యూహింపఁదగినవికాన తి.వేం. కవులీ భావమును రూపకప్రక్రియయం దనుసరించి రనుట కెట్టి సంశయము లేదు. ఇచ్చటనే సంశయమువచ్చుచో తెలుఁగులో శతాధిక సంఖ్యాకములైన రూపకముల నిర్మాణశిల్పవైభవమంతయు సంశయగ్రస్తమైపోయినట్లే! తెలుఁగులో భారతమువంటి యితిహాసములు నాటకములుగా నవతరించినవి; బహునాయకుల వీరచరితము లొక్క నాటకమున గుదిగూర్పఁబడినవి; క్షేత్రమాహాత్మ్యములు, భక్తవిజయములు, దైవలీలావిలాసములు నాటకాకృతి నందగించుకొనినవి; రాజపట్టాభిషేకాది చారిత్రిక ఘట్టములు రూపకాకృతి ధరించి నిల్చినవి; వంశ పురుషాంతర చరిత్రలు నాటకములై వర్ధిల్లినవి;

వేదాంత బోధలు బహువిధ రూపకప్రక్రియల నాశ్రయించి సాక్షాత్కరించినవి; సమకాలీన సాంఘిక విమర్శాత్మకమైన ప్రబోధ రచనలు నామమాత్ర పాత్రావలంబములై సిద్ధాంతసంఘర్షణస్వరూపములై తలలెత్తి చూచినవి; రాష్ట్రీక, రాజకీయ, మత, సిద్ధాంత సంఘర్షణములు రూపకములతోఁ గుప్పించి యెగసినవి; ఇట్టివి యెన్నో రూపకస్వరూపములను తెలుగునాఁట నటులు ప్రయోగించుచున్నారు; సహృదయులు చూచి యానందించుచున్నారు. కాని, వీటన్నిఁటికి నిర్దిష్టమైన స్వరూపములు నిర్వచించి చెప్పు శాస్త్రము రూపక ప్రక్రియలతోపాటు పెరుగలేదు.

సంస్కృత లక్షణగ్రంథము లున్నవి. వానికన్న తెలుఁగు రచనలు ముందు నడచినవి. వాని నిన్నిఁటిని సమీక్షించు నాంధ్రనాటక లక్షణగ్రంథములు ఇంకను పుట్టవలసియున్నది! అనువాద లక్షణ గ్రంథములు ఆదరణకు యోగ్యములైనవేగాని ఆచరణ కుపకరించెడివి కావు ఇట్టి పరిస్థితులలో తెలుఁగువారు ప్రాతలక్షణములు వల్లె వేయుచు, ఆ ప్రమాణములకు సరివడని నూతన రూపక ప్రక్రియలను చూచి పెదవి విరువ నారంభించుచో, రూపక ప్రక్రియా వికాసమునకు నడుము విరుచుటయే కాఁగలదని నా మనవి! కావున శ్రవ్యకావ్యములందు రసవస్తు కావ్య విభాగమెట్లుచితమగునో (చూడు వీర రసము పుట 238-241) దృశ్యకావ్యములందును అట్లే అట్టివిభాగ మత్యవసరమగుచున్నది. అవకాశము వచ్చినది గాన నింత దూర మీ విషయము చెప్పితిని.

తి వేం. కవులు భారతేతివృత్తము నాఱు నాటకములుగా రచించిరనిన తోడనే వాని నొక్క మహా నాటకముగా నేల వ్రాయలేదను ప్రశ్న యుదయించును. అట్టి ప్రయత్నము వారి తరువాత కొందఱు నాటకకర్త లొనర్చిరి కూడ! (చూడు. ఇదివరి చర్య 360) కాని, వారి నాటకరచనా ప్రక్రియలకును తి.వేం. కవుల ప్రక్రియకును చాల భేదము కానవచ్చుచున్నది. వారి నాటకములందు రంగవిభజనమున్నది. కవుల నాటకములందు రంగవిభజన ప్రక్రియలేదు. కవులకు పూర్వమే ధర్మవరము రామకృష్ణమాచార్య ప్రభృతులు తమతమ నాటకములలో రంగములు ప్రవేశపెట్టి యుండగా వారు మానుటలో నేదియో యొక విశిష్ట ప్రయోజనము లక్షితమైయుండి యుండును. అది భారత వస్తుతత్త్వ సంబంధియైనది. అందు రసకావ్య నిర్మితి కనువైన ఘట్టములు కొన్ని యున్నవి. రమణీయమైన కథా ఘట్టములు కొన్ని యున్నవి. వీనిని వానిని కలియఁబోని

మహానాటక మొకటి నిర్మించినచో నది యే కోవకుఁ జెందని మిశ్రరూపకమో లేక వస్తురూపకమో అయి కూర్చుండును. ప్రస్తుతమునకు దొరకుచున్న సంపూర్ణ మహాభారత నాటకముల కన్నింటియందును నిట్టి లోపము మాత్రము గోచరింపకఁ బోవుటలేదు.

ఉదాహరణమునకు పింగళి వేంకటనరసయ్యగారి "సంపూర్ణభారతము" అను నాటకమును గైకొందము. వేంకటనరసయ్యగారు తిరుపతి వేంకటకవుల శిష్యులే వారైదంకములలో తమ నాటకమును ముగించిరి. పేరున కైదంకములే కాని ప్రథమాంకములోనే ఏడు రంగములు గలవు. శంతనుఁడు మత్స్యగంధిని వరించినది మొదలు పాండవులు ధృతరాష్ట్రునియొద్ద కరుదెంచువఱకుఁ గల కథా భాగమంతయు నీయంకమునందు ఘటింపఁబడినది. అనఁగా తి వేం. కవుల యేడంకముల నాటకమగు పాండవ జనన మందలి కథ యంతయు నీ యంకమున వచ్చుచున్నదన్నమాట! ప్రయోగమున రెండు మూఁడు నిమిషములకన్న మించని రంగములు కొన్ని ఇందు కలవు. తెర పడుటయు లేచుటయే అధికమై, ప్రదర్శితములగు దృశ్యము లత్యల్పములై, కథ మాత్రమే నడుచుచు రసప్రతీతి లేనివై రంగములు ప్రేక్షకుల మనస్సులను రంజింపఁజేయఁజాలక పోవుచున్నవి. కాఁగా రంగమునకు రంగమునకు కథను గలుపు సూచ్యార్థములు కొన్నికొన్నిచోట్ల లేనేలేవు. వానిని వస్తు రూపక ప్రక్రియల క్రింద మన్నించినను, కొన్నిచోట్ల గుణీభూతముగా నైనను రసము స్ఫురింపదు. సంచారిభావము లేవో కొన్ని చిలుతరఁగలవలె నల్లల్లాడుచు రసస్థాయినందని వీ రంగములు. ఇట్లే ఈ నాటకాంకములన్నియు రంగబహుళములై కథాకథన మాత్ర ప్రయోజనోద్దిష్టములై యుండుటచే రస కావ్యత్వసిద్ధి నానాటకముల కాపాదింప వీలులేకపోవుచున్నది. ఇట్టి యంశములను తమ ప్రతిభా నేత్రములతోఁ బసికట్టిన తి. వేం. కవులు సంపూర్ణ భారతము నేక నాటకముగా రచించుట కుపక్రమింపలేదు.

భారతనాటక రచనాకాలమును బరిశీలించుచో కథాక్రమమున వానిని వ్రాసినట్లు కానరాదు. ఆ నాటక పంక్తిలో మొదట తలయెత్తినది - పాండవ విజయ నాటకము. ఆపైనది ఉద్యోగ విజయములుగా రెండునాటకము లైనవి. కాలక్రమమున అశ్వమేధ ప్రవాస జనన రాజసూయములు వెలువడినవి. ఈ క్రమమును గమనించుచో మహాభారత మంతయు నాటకములుగా రచింప వలెననెడి యూహ యున్నను ప్రప్రథమమున రసప్రధాన కథా ఘట్టములను

తీసికొని రసరూపకములుగాఁ జిత్రించినచో లోకమునం దవి ముందుగాఁ గీర్తిఁ దెచ్చుననియు, ప్రథమప్రయోగము ఫలవంతమగుచో తదితరరూపకములకు జనాదరణము లభించుట కొక చక్కని మార్గమేర్పడినట్లగుననియు భావించి కవు లీక్రమమున నాటకరచన మగించిరని భావింపవచ్చును.

మహాభారతమును నాటకములుగా మలచునప్పుడా కవులు కథనెన్నుకొనుట లోను దానిని నిర్వహించుటలోను కొన్ని మర్యాదలు పాటించినట్లు కానవగును. వానిని దిఙ్మాత్రముగాఁ బేర్కొందును.

1) రామాయణ నాటకకర్తలు వాల్మీకి రామాయణమునుండి యితివృత్తమును గైకొన్నను ఉత్తర రామాయణ కథాభాగమును వదలి రామపట్టాభిషేకము వఱకే సామాన్యముగా నాటకీకరించినట్లు - వీరును భారత కథను స్వర్గారోహణ పర్వాంతము వఱకుఁ గైకొనక అశ్వమేధ పర్వాంతము వఱకే గైకొని చిత్రింప నెంచిరి. వ్యాసోత్పత్తిని కథ కారంభముగా నిలిపిరి.

2) అధికారిక సూచ్య కథాంశములందును జెప్పఁబడని భారత కథాంశములను తిక్కన విరాటపర్వారంభమున భావించినట్లు -

ఆ.వె. "కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వ ప
ర్వార్థ యుక్తి సేయునట్టి యెడల
యత్నమించుకంతయయినను వలవదు
వలసినట్లు చెప్పవచ్చి యుండు" (విరా.ప ఆ1.ప.42)

అను నమ్మికతో ప్రేక్షకభారతకథాజ్ఞానముపై వదలవచ్చునని వారు తలంచిరి.

3) సామాన్యముగా ప్రధాన వక్తవ్యాంశముల నంకములుగా నాటకమున రచించెదరు. లాక్షణిక దృష్టిలో నంకము ప్రత్యక్ష నేతృచరితము, నానా ప్రకారార్థ విధాన రసాశ్రయము, ఏకైక దివస వృత్తము, బహు పాత్ర ప్రవేశార్హము, ఆసన్ననాయకము, విష్కంభాది సూచ్యవస్త్వంగ సమన్వితము నై యొప్పును. ఇట్టి యంకము లీయాఱు నాటకములలో మొత్తము ముప్పది యాఱు కలవు. అనఁగా భారతేతివృత్తము నంతయు నేక దివస వృత్తములగు ముప్పది యాఱు విభాగములుగా నొనర్చిరని తాత్పర్యము. ఈ పరిమిత సంఖ్యగల యంకములతో నా మహావృత్తమును నిర్వహించుట కదుంగడు శ్లాఘనీయము.

4) రంగములను ప్రవేశపెట్టలేదు కాని, కవులు తమ నాటకాంకముల మధ్యముననే పాత్రలనందఱ నిష్క్రమింపఁజేసి వెంటనే మఱికొందఱఁ బ్రవేశ పెట్టు ప్రక్రియను శూద్రకాది మహాకవుల ననుసరించి సంఘటించిరి. దీనిని కొందఱు విమర్శించిరి. దానికి పాశుపతమున సమాధాన మిట్లిచ్చియుండిరి: "అంకమధ్యమందు రంగశూన్యము కాఁగూడదని నాటక లక్షణజ్ఞులు వ్రాసి యున్నారు. దానింబట్టి ప్రకృత మట్టిది తటస్థించినది. మా శిష్యులు శంకించిరి. కాని వారికి రహస్యము తెలియదు. నిష్క్రమించు పాత్రలచేఁ బాత్రాంతర ప్రవేశము సూచితమై వెంటనే పాత్రాంతరము ప్రవేశించుచో తప్పులేదని మహా కవి యగు శూద్రకుఁడు తన మృచ్ఛకటికలో సూచించి యున్నాడు ......6 వ అంకమున ఆర్యక ప్రవేశ ఘట్టమున జూడఁదగు. అంతవఱ కక్కఱలేదు. ప్రస్తావనాంతమునఁ బాత్రప్రవేశ మెట్లగుచున్నదో గమనించినచోఁ దేలఁ గలదు....లక్ష్య జ్ఞానములేని లక్షణము వృథా![1] దీనివలన కాలహరణము లేకుం డుట, ప్రేక్షకులకు తెరపడుట లేమటలవలన విసువు జనింప కుండుట యనెడి ప్రదర్శన సౌకర్యములు కలవు. ప్రదర్శన కళా మర్మజ్ఞులుగాని యిట్టి ప్రక్రి యలు సూక్ష్మ బుద్ధితోఁ బ్రవేశపెట్టరు!

5) నాటక నామములన్నింటను 'పాండవ' పదమారంభమునందుండునట్లు వీరు సంఘటించి యొక వైలక్షణ్యముఁ బ్రకటించిరి. పాండవ జనన నాటక ప్రస్తావనలో నీ ప్రక్రియను గూర్చి సూత్రధారుని ముఖమున నిట్లు వ్యాఖ్యానించిరి:

సూత్ర:- (నటితో.) నీ కొక్కటే గుఱుతు చెప్పుచున్నాఁడను. భారత కథను దెలుఁగులో నాటకములో రచించిన వారే లేరు. ఒకవేళ నున్నను పాండవ పదచిహ్నితమగు నామముంచినవారు లేరు. ఉన్నను ప్రసిద్ధులు లేరు—

క. పారాశర్య మునీంద్రుఁడు
భారతమును వ్రాసెఁ దెలుఁగు పఱచిరి కవితా
స్వారాజ లొక్క మూఁగురు
వీరిరువురు నాటకముగ వెలయించి రిలన్.''

---

1. సారస్వత విమర్శలు - పాశుపతము - 64 పుట.

కావ్యమునకు పేరుపెట్టు మర్యాదలు పెక్కులుండగా వానిలో కవులు మహాభారత నాటకముల పట్ల నొక విశిష్ట మార్గమును మాత్రమే యను సరించి వాని సమాన మాతృకతను ధ్వనింపఁజేసిరి. రూపక ప్రతిపాద్య వస్తువు యొక్క ప్రయోజన తాత్పర్యము నధికరించి నామముంచెడి ప్రక్రియ కవులాశ్ర యించిరి. ఉదా॥ "పాండవ ప్రవాస"మును తీసికొందము. ఆ నాటకములోని ఎనిమిదంకములలోను పాండవ ప్రవాస జీవితము నాల్గంకములు మాత్రమే. పాండవ గురుదక్షిణతో నారంభమై ద్రౌపదీ స్వయంవరముపఱకుఁ గల కథయు నిందుకలదు. కాని, నాటకమున నది ముఖ్యప్రతిపాద్య వస్తువు కాదన్నమాట! అందువలన తత్తాత్పర్య మధికరింపబడలేదు. ఇట్లే పాండవోద్యోగమున శ్రీకృష్ణుని రాయబారము మొ॥ ఘట్టములందు నాయకుని ప్రయత్నము ప్రత్యక్షముగా గోచ రింపకపోయినను వ్యంగ్యముగా ముఖ్య ప్రతిపాద్య వస్త్వంగముగనే అది భాసించి వస్తువ్యంగ్యముచే నాటకపరమప్రయోజనమును ధ్వనింపఁజేయుచున్నది కావున ఉద్యోగ శబ్దమూతాత్పర్యమునకు సంకేతమగుచున్నది. ఇట్లే నాటకములన్నింటికి నన్వయించుకొనవలెను.

ఇట్టి చమత్కృతు లెన్నో తి వేం.కవుల నాటకములందు పరిశీలించినకొలఁది స్ఫురించుచునేయుండును. ప్రతిభతో కూడిన స్వాతంత్ర్యము, పాండిత్యముతో కూడిన ప్రక్రియా ప్రయోగము వారి నాటక భవన నిర్మాణమునకు పునాదిరాళ్లు.

6) నాయకుఁడు రూపకము లన్నింటియందును ధీరోదాత్తుఁడైన ధర్మరాజే. ఇట్లనుటకు పాండవనామము బాధకముకాదు. పాండవ శబ్దమునే వాడిన భారతాదుల యందును ధర్మజుఁడే నాయకుఁడు.* నాయకుఁడగు ధర్మరాజు బలవిద్యా శక్తు లనెడి సమర్థోపకరణములతో స్వప్రయత్నముగ ధర్మఫలమును సాధింప నేర్చిన సమర్థుఁడు. భారతమున ధర్మజుఁ డంగి, భీమాదు లంగములు, నాయకున కుప కరణతుల్యులు. అంగి స్వయంప్రతిభాయుతుఁడు, దైవాశ్రితుఁడు. ప్రతి నాయ కుని కందు వ్యక్తిత్వము లేదు. కర్ణదుర్యోధనులు విద్యాబలశక్తులు అనెడి యుప కరణములు. వానిని ధర్మబద్ధముగా ప్రయోగింప యజమాని లేఁడు. భీష్మాదులా యాజమాన్యమునకై యత్నించి విఫలులైరి. ధర్మసాధకములుగాని ప్రతివీర శక్తులు విశృంఖలవృత్తి ననుసరించి స్వనాశనమునకుఁ దారి తీసినవి.

* వీర రసము - అధ్యా: రత్నత్రయము - రచన: జి.వి. సుబ్రహ్మణ్యం.

ధర్మజ ప్రవృత్తియందు ధర్మమున కర్థకామము లూడిగ మొనర్చును. సుయోధనునియందు అర్థకామములు బలీయములై ధర్మమును బహిష్కరించును. పాండవ ప్రవృత్తి ధర్మరాజాధీనము. ధర్మరథస్థుఁడైనవాఁడు ధర్మరాజు, కవలు చక్రములు, హయములు భీముఁడు, సారథి అర్జునుడు, మార్గము వేదములు, వారి దొంక మహాప్రస్థానము. మార్గదర్శకుఁడు శ్రీకృష్ణుడు. అట్టి సంప్రదాయమును తి.వేం. కవులు నాటక రచనమునందును విశిష్టముగాఁ బోషించియుండిరి.

## పాండవ జననము

పాండవ జననము వస్తు ప్రధానమైన యేకాంకముల నాటకము. భారత రూపక పుణ్య తరంగిణియం దిది ప్రథమ స్నాన ఘట్టము. కురుసామ్రాజ్య విస్తారకుఁడైన పాండురాజునకు కుంతీమాద్రులవలన ధర్మరాజాదు లుదయించుట యీ నాటకమునందు ఫలము. దీని రచన మొక విశిష్ట శిల్ప మార్గమున నడచినది. స్వారోచిషమనుసంభవమువంటి 'నాయక జననమే ఫలముగా గల కావ్యము' లం దనుసరించిన శ్రవ్య కావ్య వస్తు రచనా పద్ధతి నాదర్శముగాఁ గొని పాండవ జననమునం దా శిల్పమును రూపక పరముగా ననువర్తింపఁజేయుటయే యిందు కవు లొనర్చిన విశిష్ట ప్రక్రియ. మనువుగా భాసింపవలసిన స్వారోచిషుని జీవసంపుటిలోని సర్వ లక్షణములకు హేతుభూతములైన కథలను కాలక్రమమునుబట్టి యభివర్ణించు రచనా ప్రక్రియ పెద్దన్నగారు మనుచరిత్రమునఁ బ్రపంచించిరి. అట్లే తిరుపతి వేంకట కవు లీ నాటకమున పరమ ధర్మమూర్తియు, నజాత శత్రువునగు ధర్మరాజుయొక్క సంస్కార బీజ సంపుటి ప్రాభవమున కనువైన పూర్వరంగము సిద్ధపఱచుకొఱకేగాక పరమ బ్రహ్మణ్యమూర్తులు, సత్యావతారులునగు పారాశరభీష్మాదుల జీవితగాథాలతా పరివేష్టితమై పుణ్య వాసనల కాలవాలమగు కురువంశ పీఠమునందుండి త్రిపురుషాంతర జీవ లక్షణ ప్రవాహరూపమైన ధర్మ స్వరూపసందర్శనము సేయు ధర్మజాని యంతఃకరణ ప్రవృత్తిని పాఠకునికిఁ బ్రత్యక్షము సేయుటకొఱకు పూర్వగాథల ననుక్రమమున సంధించి తెలుఁగురూపకములకొక నూతనప్రక్రియాభిక్షను ప్రసాదించిరి.

ఈ రూపక సంవిధానములో మఱియొక విశేషము కలదు. వంశాభివృద్ధికి స్త్రీ పురుషులలో క్షేత్రప్రాధాన్య వివక్షచే స్త్రీకి ప్రాముఖ్యమున్నది. కావున పుత్ర జనన ఫల ప్రధాన రూపకములందు పురుష వృత్తముకన్న స్త్రీ వృత్తమునకే

ప్రాధాన్యము హెచ్చు. అనపత్య వార్ధి నిమగ్నమైపోవు వంశనావను రక్షించి ధర్మసూత్రములఁబట్టి యొద్దుకుఁ జేర్చెడి కార్యము స్త్రీ శక్తియే నిర్వహింప సమర్థమైనది. ఏతదర్థము కవులీ నాటక ప్రస్తావనలో నీ పద్యమున ధ్వనింపఁ జేయుచునే యున్నారు—

ఆ.వె. "పేరు పూరుషునకుఁ దారసించునె కాని
కార్యనిర్వహణము కామినులది
వెన్నెలయె జగంబు వెలయింపవలెఁగాని
చంద్రుఁడేమి సేయు? జలజనయన!" అని.

ఈ దృష్టితో విమర్శించుచో సత్యవతి కుంతిదేవు లొనర్చు వంశోద్ధరణ ప్రయత్నరూపమే ఈ నాటక నిర్మాణమునకుఁ బ్రాతిపదికయని స్పష్టమగు చున్నది. ఇట్టియెడ పారాశర్యజన్మమే నాటకమున కారంభము కావలయును. పరమబ్రహ్మణ్యమూర్తియగు వ్యాసుఁడు భారత కథామణిహారమునకు సూత్రము వంటివాఁడేకాక సూత్రధారునివంటివాఁడును నగుటచే నీ నాటకారంభము బహ్వర్థ ఫలమూలమై యేతత్కర్తలగు తి.వేం. కవుల ప్రతిభను వేనోళ్ళ చాటుచున్నది.

ప్రథమాంకమునందలి వస్తువు పారాశర్య జన్మగాథ. కవు లీ కథాభాగ మును మూలాతిశాయిగా రచించిరి. భారతమునందువలె పాండవ జననమున పరాశర మత్స్యగంధులు కామవాంఛామాత్ర పరితృప్తికొఱకు ప్రాకులాడిన జీవులు కారు మత్స్యగంధి కంతరాంతరమునఁ బరాశర ప్రసాదరూప పుత్రవాంఛ బలీయమై పొటమరించినది. (ప్ర. అం. 14 పు) పరాశరుఁడు సంయోగమునకుఁ బూర్వమే వ్యాసోదయమును దివ్యదృష్టితో నుపలక్షించి నాయికకు స్పష్టపఱచి నాఁడు. భారతమున నీ పవిత్రలక్ష్యము కానరాదు. అందుచే నచ్చట వారింద్రియ తృష్ణాదూషితులు కాగా, నిచ్చట నింద్రియతృష్ణా సంయమన శాసితులైరి. అందు ఫలము యాదృచ్ఛికము, ఇందు పూర్వోద్దిష్టము. అందు నాయిక పరాశరశాప భీతిచే నాదలొప్పగించిన భీత. ఇందా పరమపావనుని సంపర్కము బహుపుణ్య ఫలరూపమని యెంచికొనిన యోగ్య. నన్నయగారిది యథార్థ సంగ్రహ కథా కథన దృష్టి. జంటకవులది విపులరసభావ వర్ణనముచే శృంగార రసపుష్టి నొందిం చెడి వర్ణనాత్మకమైన దృష్టి. ప్రశాంతమగు పరాశరచిత్తము చిత్తభవవికారము నకు లోఁగి కలఁగి క్రమముగా నింద్రియ వ్యాపారములందు వ్యాపించి విగత లజ్జావరవశమునకు నంతవఱకు నవస్థావిశేషములను సూత్రప్రాయముగా నన్నయ

భారతమునఁ బేర్కొనఁగా కవు లావ్రవడాశిక ననుసరించి, సన్నివేశ సంభాషణ చాతుర్యము వెలార్చి యంకమును విస్తృతమొనర్చిరి. పరాశర నిర్మగర్వ వచనములు, మత్స్యగంధి మనోభావవిస్తరణరూపమున నొనర్చిన పరాశరానుభావ వర్ణనములు, నాయికా నివారణోక్తులు సైతము నాయకునికి మనోజ వికారోద్దీపకములగునట్లు సంధించిన విధమును, "మృగశాబములకు" "ఈ యబల నిత్తలోదరి" అనెడి పద్యములందు భారతమున శబ్దమాత్రముగా నున్న భావస్ఫూర్తిని విస్తృత మొనర్చుటయును, మత్స్యగంధి జన్మవృత్తాంతమును పరాశరుఁడు దివ్యదృష్టిచే గనుటయును అనెడి నాటక కథాంశములు కవుల రసకావ్య నిర్మాణకౌశలమును జాటుచున్నవి.

శంతనుని వివాహము కొఱకైన భీష్మని భీషణ ప్రతిజ్ఞాధారణము ద్వితీయాంకేతివృత్తము. సత్యవతీ సంలగ్నమానసుఁడైన శంతనుని మనోభావాభివర్ణనమును, తండ్రి కొడుకుల వాత్సల్య భక్తి భావముల వ్యక్తీకరణమును, భీష్మని గురుభక్తిని, సత్యవ్రత నిష్ఠను సంభాషణరచనాచాతుర్యమునఁ బ్రదర్శించుటయు, నాటకీయ రచనానుకూలములగు మార్పు లల్పముగా నొనర్చినను భారతానుసారియై నాతి విపులమగు కథను రచించెడి నేర్పు కవులకు కరతలామలకమని యీ యంకము నిరూపించుచున్నది.

పరశురామ భీష్మల కంబా విషయమునఁ గల్గిన యుద్ధము తృతీయాంకమునఁ గూర్పఁబడినది. అధిక కథా వేగము కలదయ్యు వక్తవ్య కథాంశములుగాని, పాత్ర సన్నివేశ సంవిధాన చాతుర్యముగాని, శీలపోషణముగాని దెబ్బతినకుండ నిర్వహింపఁబడిన దీయంకము.

ఈ నాటకమునందు కడుచిన్నదైన చతుర్థాంకమున సత్యవతి వంశాభివృద్ధి నభిలషించి పారాశర్యునిఁ దనకోడండ్రయందు నియోగించు ఘట్టము కలదు. వ్యాసభట్టారకుని ధర్మదృష్టిని, మాతృభక్తి ప్రాశస్త్యము నుగ్గడించు నీ కథాభాగ మల్పమయ్యు నీ నాటక శిల్పమున కాయువుపట్టై గుణమునం దనల్పమయి భాసించుచున్నది. పంచమాంకమున కర్ణోత్పత్తి వస్తువు. ఈ గాథ భారతమునం దెనిమిదిచోట్లఁ జెప్పఁబడియున్నది. ఏ వీరుని చరిత్రముకూడ నిన్నిసారులావృత్తము కాలేదాకావ్యమున. నన్నయ ఆదిపర్వములో కర్ణుఁడు సద్యోగర్భసంజాతుఁడనియు, గుప్తజన్ముఁడనియుఁ దెల్పి, నరణ్యపర్వమున నెఱ్ఱన కర్ణునిఁ

గుంతి పదినెలలు మోసికన్నదనియు, దాని యొక్కతె యీ రహస్య మెఱుఁగు ననియు నుగ్గడించి యుండెను. సంస్కృతమునందును ఆయా చోట్ల నట్లే యున్నది. కవులీ సందర్భమున కర్ణుని సద్యోగర్భ సంజాతునిగా వర్ణించుచు చెలికత్తె యొక్కతె కుంతి కాసమయమున నండదండలుగా నుండెననియుఁ జిత్రించిరి. సూర్యుని పొందుటకు కుంతి భీతిల్లుటయు, దివాకరుఁడు త్రికాలజ్ఞుఁడై త్రికాల కథాంశముల నెఱింగించుటయు, పసికందును నీటఁబడవేయు మాతృమూర్తి హృదయము శోకించు విధము పఠితలు ద్రవించునట్లు రచించుటయు ననెడి యంశము లీ యంకమున స్వాభావిక పాత్రప్రవృత్తి చిత్రణ కుపస్కారములై సన్నివేశమును రుచిరగంభీరముగా నొనర్చినవి.

షష్ఠ సప్తమాంకములందు పాండు రాజ వృత్తాంతము కలదు. ముని శాపగ్రస్తుఁడగు పాండురాజు భార్యావిముఖుడై శతశృంగ పర్వత మాశ్రయించిన ఘట్టము పాత్రపునశ్చిత్ర వర్ణనమునకును, భార్యాభర్తల మధ్య నడచు స్వధర్మ విషయకమైన చర్చ సంభాషణ రచనమునకును, మూలమున లేని శాపమొకదానిని కల్పించి పాండవ భావి జీవిత క్లేశములకు దైవికమైన హేతువును సృష్టించుట కవుల కల్పనకును చక్కని తార్కాణములు. జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతి వచనములందును, ఋషిపుంగవుని వచస్సునందును పాండవ మహత్త్వము నభివర్ణింపఁజేయుటయుఁ నాకాశవాణినిఁ బ్రవేశపెట్టుటయు నిర్వహణ సంధియం దద్భుతరసమునకు హేతువులగుచున్నవి.

పై విషయముల నాధారముగాఁ గొని విచారించుచో నాటక కథాగ్రథనమునం దొకానొక సమాసంజితమైన సమన్వయ సూత్రము భావుకులకు గోచరింపక పోదు. పరాశర ప్రేరణచే సత్యవతి భారతేతిహాస సూత్రధారుఁడగు వ్యాసభట్టారకునకు జన్మమిచ్చి, కన్యాత్వము చెడక ధర్మగతి వివాహమాడి, శంతనుని వలనఁ బుత్రవతియయ్యు గతపుత్త్రియై కోడండ్రయందు పారాశరుని నియోగించి వంశమును నిలిపినది. ఆపై భారము కుంతి వహించినది. శాపదగ్ధుఁడగు పతి యనుమతిచే దైవప్రసాదముగాఁ బుత్త్రులఁ బడసి కావ్యనాయకునిఁ బ్రసాదించినది. కవులు సూచించినట్లు "కార్య నిర్వహణము కామిసుందే" కదా! ఆరబ్ధ కార్యమున కవాంతరములు గల్గుటయు, ద్విగుణీకృత యత్నమొనర్చినను బీజార్థము దృశ్యాదృశ్యమగుటయు, పునఃప్రయత్నముచే బీజము ఫలానుగామియై

నిర్వహింపఁబడుటయు ననెడి పంచసంధిబంధసార మిందును గోచరించు చున్నది. ఈ నాటక ప్రక్రియ ననుసరించి ముఖసంధి ప్రథమ ద్వితీయాంకము లందును, ప్రతిముఖసంధి తృతీయాంకమునందును చతుర్థ పంచమాంకములందు గర్భ సంధియు, షష్ఠాంకమునం దవమర్శ సంధియు, సప్తమాంకమున నిర్వహణ సంధియు నన్వయింపఁబడవచ్చును. కాని, రసము లేకనాయక నిష్ఠము కాక పోవుటచే నిది రసరూపకము కాదు. రసము గుణీభూతముగా నొప్పుచు వస్తువునకు వ్యంగ్యమార్గమున శోభను కల్పించుచుండుటచే నిది వస్తురూపకమనఁ దగియున్నది.

ఇందు ప్రధాన రసము ధర్మవీరము. శృంగార రౌద్ర భయానక కరుణాద్భుతములు దాని కంగములు. వంశవిచ్ఛిత్తి కాకుండ సంతతిని సంరక్షించు గార్హస్థ్య ధర్మమే ప్రధానముగా నాయికల చేతను, తత్పోషణముగా నాయకుల చేతను బరిపోషింపఁబడి నిర్వహింపఁబడుట నాటక పరమ తత్త్వమగుటచేత వీర పుత్ర సంసిద్ధి సంరక్షణలకైన ధర్మోత్సాహము వీరమనుట వేదసమ్మత మగుట చేతను* ఇందు ప్రధాన రసము ధర్మవీరమనుటయే సమంజసము.

"ఉపనాయక సంస్థాయాం ముని గురు పత్నీ గతాయాంచ।
బహునాయక విషయాయాం రతౌ తథానుభయ నిష్ఠాయాం"

"ప్రతినాయక నిష్ఠాయాం తద్వ దధమపాత్ర తిర్యగాదిగతే శృంగారేఽ నౌచిత్యం" అను సాహిత్య దర్పణకారుని మతము ననుసరించి పరాశర సత్య

---

* "వీరశబ్దం శ్రుతుల్లో కొన్ని చోట్ల పుత్రపరంగా గూడా వ్యాఖ్యాతం. తైత్తిరీయ బ్రాహ్మణంలో "వీరహా బ్రహ్మహాణి" అనేచోట వీరశబ్దం క్షత్రియవాచియని కొందరంటారని - అది పుత్రవాచకమని "వీరహాగర్భ మాత్రీ క్షత్రియవాచశ్యేతే" అనే పంక్తుల్లో భట్ట భాస్కరులు తెలుపుతున్నారు. ఋగ్వేదభాష్యంలో కొన్నిచోట్ల వీరశబ్దానికి శ్రీ విద్యారణ్యులు పుత్రవరంగా వ్యాఖ్య వ్రాశారు. "అవీరాయాశ్చ యోషితః" (మను) అని, వీరభార్యయినా వీరమాతయినా కానటువంటి స్త్రీ చేతి అన్నం తిన కూడదని మనువు నిషేధిస్తున్నాఁడు ఇక్కడ వీరశబ్దం పుత్రవాచిగా గూడా వ్యాఖ్యానం"

-అక్కిరాజు ఉమాకాన్త పండితుఁడు - పల్నాటివీరచరిత్ర- పీఠిక.

వతులను, కుంతీమాద్రుల నాశ్రయించినది శృంగార రసాభాసమని యేర్పడు చున్నది. రసాభాసమగు శృంగారము ప్రధాన రసమనుట కుదురదుగాన నిందు రసము వీరమనుటయే సమంజసము.

శృంగార మాభాసమై స్ఫురించుచున్నను, తద్రస సంబంధులగు సన్నివేశములను గూర్చుటయం దొక అనుక్రమ మిందు పాటింపఁబడినది. ధర్మార్థకామసంబంధ భేదములచే శృంగారము త్రివిధమని భరతుడు పేర్కొనెను. ఇందు పూర్వము లుత్తరములకన్న శ్రేష్ఠములు. "ఏ శృంగారమందు సాధనము వ్రత - నియమ - తపోయుక్తమై ధర్మప్రాపకమును అగునో అది ధర్మశృంగారమనబడును (అనఁగా నాయికా లాభమందు ధర్మము హేతువుగాని, సాధ్యము కాని కావలెను) ఏందు అర్థమువలన గాని, ఇచ్ఛవలనగాని, బహుప్రయోజనములనాశించిగాని స్త్రీ సంయోగ విషయకమగు రతి కలుగునో అది అర్థశృంగారమనఁబడును. కన్యావిలోభన కృతము లేదా రమ్యము, సావేగము, నిభృతమును అయిన సంయోగము కామశృంగారమనఁబడును * కథానుకూలముగా కవులీ మూఁడు విధములైన శృంగారములను ప్రవేశపెట్టి నాటకమున నొక వైశిష్ట్యమును గల్పించిరి. పారాశర్యుఁడు మునియయ్యు భవిష్యత్తు తెలిసినవాఁడయ్యు కామప్రేరితుఁడై మత్స్యగంధిని వలచినాఁడు. మత్స్యగంధిపై వలపు జనించుటకు పుత్రవాంఛ హేతువు కాదు. అది దివ్యదృష్టిచే నాపై కని పెట్టఁబడి పరాశరుని వాంఛను బలపఱచినది. అట్లే శంతనుఁడును మొదట నామెరూపును గాంచి వలచినవాఁడయ్యు బహుపుత్రి లాభవాంఛను మిషగాఁ జూపించినాఁడు. మౌలికముగా కామప్రధానమైనదే వీరిరువురి శృంగారము. పుత్త్రివాంఛ ఇరువురియందును గౌణమై భాసించి కామమునకు వన్నెఁగల్పించినది.

వ్యాసుఁడు అంబికాదులయందు నియుక్తుఁడగుట అర్థకామము. కుంతీ సూర్యుల సమావేశము గూడ అర్థకామమే కాగలదు. శాపగ్రస్తుఁడైన పాండురాజునందును కుంతీమాద్రులయందును షష్ఠాశ్వాసమున ధర్మశృంగారము నిబద్ధమైనది. యమాదులతోడి కుంత్యాదులకుఁగల సంబంధము జ్యోతిషాదులచే సువిదిత మగుటచే అర్థ శృంగారము కథాకథన ప్రక్రియయలోఁ జెప్పివైచి కథా

---

* ఆంధ్ర భరత "నాట్యశాస్త్రము" - డా॥ పో. శ్రీ. అప్పారావుగారు. 18 అ. 524 పుట.

నిర్మాణ గౌరవమునకు కవులు కాపాడిరి. అనుక్రమముగా వీనిని గాంచుచో కామార్థ ద్వంద్వ - ధర్మశృంగారము లాధికారిక వస్తువునందు ప్రయోగింపఁబడి వైవిధ్యము సంతరించి భిన్నాభిరుచులు గలవారిని సంతృప్తిపఱచుచున్నవి. శృంగార రస ప్రయోగమున రంగౌచిత్యము పాటించి చుంబనాదులు ప్రవేశ పెట్టకయే నాయికానాయకులను - లతాగుల్మాది వర్ణనముతో ప్రథమ పంచమాం కములందు తత్ప్రవేశార్థసూచన మొనర్చి నిష్క్రమింపఁజేసిరి. నిగ్రహముతో గూడిన నాటక రచనా కళయందు అనంతార్థస్ఫూర్తి వర్తిల్లుట సహజము కదా!

## పాండవ రాజసూయము

పాండవ రాజసూయ మేకాంకమగు వ్యాయోగము. యుద్ధప్రాయమగు వ్యాయోగమున పురుషులు వర్తింతురు కాన దీని కా పేరు వచ్చినది. భరతుఁడు దీని నిట్లు నిర్వచించినాఁడు:

''వ్యాయోగస్తు విధిజ్ఞైః కార్యః ప్రఖ్యాతనాయకశరీరః
అల్పస్త్రీజనయుక్త స్త్వేకాహకృత స్తథా చైవ॥
బహవస్తత్ర చ పురుషాః కవిభిః కార్యా యథా సమవకారే।
న చ తత్ప్రమాణయుక్తాః కార్యా ఏకాఙ్క ఏవాయమ్॥
న చ దివ్యనాయక కృతః కార్యో రాజర్షినాయకనిబద్ధః॥
యుద్ధాని యుద్ధాశ(థ)ర్షణ సంహ(ఘ)ర్ష కృతశ్చ కర్తవ్యః॥
ఏవం విధాస్తు కార్యోవ్యాయోగోదీప్త కావ్యరసయోనిః।....'' 18 వ అధ్యా.

ఇందు వస్తువు ప్రఖ్యాతమే. నాయకుఁడు ప్రసిద్ధుఁడే. స్త్రీ పాత్రయా లేనేలేదు. ఇందు వీరరస మంగి, రౌద్ర మంగము. ధర్మజ, భీమ్ములు నయనీతి బోధలతోడను, సహదేవ భీము లుద్ధతులై రణమున కున్ముఖులగుటచేతను, శ్రీకృష్ణుఁడు చక్రముతో సంహరించుటచేతను శిశుపాలాదుల విజృంభణమును పాండవు లణగింపఁగల్గిరి కావున నిందు బహుపురుషులు యుద్ధాభిముఖులగుట గోచరించుచున్నది. కావున సర్వాంగసంపూర్ణమయిన వ్యాయోగ మిది యనుటలో సంశయము లేదు.

ప్రాచీనులు నిరూపించిన దశరూపక లక్షణము ననుసరించి వ్యాయోగమై యొప్పెడి యీ రూపకము నవ్య లనుసరించు ఏకాంకికా లక్షణములను గూడ కల్గి ప్రాత క్రొత్తల మేలు కలయికగా రాణించినది. ఏకాంకిక నాతివిపులముగా నుండవలెను. పరిమిత సంఖ్యగల పాత్రలతో ప్రధాన విషయ మొక్కటియే నిర్వహింపఁబడవలెను. అల్పాక్షరములం దనల్పార్థ వ్యంజనప్రక్రియ యనుస రింపఁబడవలెను. ఉత్కంఠోత్కర్షతో ప్రారంభమయి వైరుధ్యమునుండి సంఘ ర్షణపుట్టి యాశ్చర్యకరముగా ముగిసినచో నేకాంకిక రక్తికట్టును. కవిశక్తినిబట్టి యేకాంకికలు సంభాషణ సామర్థ్యమువల్లనో, లేక పాత్రోన్మీలన ప్రాధాన్యము వల్లనో లేక భావచమత్కారము వలననో హృదయాహ్లాదమును గల్గించుచుండును. ఏది యెట్లున్నను రమణీయ మగు నేకాంకిక రసపర్యవసన్నము కావలసినదే. పాండవ రాజసూయమునందు పై లక్షణములన్నియు సంఘటితమై యున్నట్లు విమర్శకులు గమనించుట చాల సులభము.

ఈ రూపకమునకు శిశుపాలవధ యనెడి నామాంతర ముంచవచ్చునని కవులే సూచించియు దానిని స్వీకరింపరైరి. పాండవ శబ్దము భారతరూపకము లన్నింటియందును ప్రయోగింపవలెననెడి కవుల దృష్టియే యిందుకు కారణమని యూహించుట చాలదు. ఇది యొక విధముగా నాయకనిర్ణయ మీమాంసతో ముడి వడియున్నది. శిశుపాల వధ యన్నచో శ్రీకృష్ణుఁడు నాయకుఁ డగుట యుచిత మగును. కాని, యిందు ధర్మరాజా నాయకుఁడు కావలెను. తాను తలపెట్టిన యాగమును గురుబంధు సహృత్సహాయముతో నిరాటంకముగ నిర్వహించు నచివాయత్తసిద్ధుఁడగు ధర్మరాజిందు ఫలభాక్కు. శ్రీకృష్ణభీష్మాదులు ధర్మజుని సమర్థించెడి యుపనాయకులు; భీమాదు లనునాయకులు; ప్రతినాయకుఁడు శిశుపాలుఁడు. ఇందు ప్రతినాయక ప్రాతికూల్యమును ప్రతి పాత్రయుఁ జర్చించి తన్నివారణమునకై సామాద్యుపాయముల యత్నించి ప్రతిజ్ఞాదులతో భయపెట్టి చివఱకు మార్గాంతరములేక జన్మశత్రువైన శ్రీకృష్ణునిచే నాతని మడియింపఁ జేయుట రూపక కథా ప్రణాళిక. ఆరంభ నిర్వహణాదులు ధర్మరాజ యత్నానుకూలముగా సమన్వయించి రూపకరచన మొనర్చుటయే యిందు కవులు ప్రదర్శించిన చాకచక్యము. దానినంతయు 'పాండవ రాజసూయము' అను రూపక నామము ధ్వనింపఁజేయుచున్నది.

శిశుపాల వృత్తాంతముతో తుల్యమైన స్వీయానుభవ విశేషమొక్కటి కవులను ప్రేరేచఁగా నీరూపక రచనమునకుఁ బూనికొనినట్లు ప్రస్తావన స్పష్ట పఱుచుచున్నది. రచనాకాలక్రమమునుబట్టి చూడ నిది భారత రూపకములలోఁ చివఱిది. అసలా నాటకములలో స్వతంత్రముగా దీనిని గణించుటకు దీనికంత ప్రాధాన్యమున్నట్లు గోచరించుటలేదు. ప్రక్రియా భేదముచే నిది స్వయముగా భాసించుచున్నను నాటకములన్నియుఁ జదివినవారి కియ్యది పాండవప్రవాస నాటక చతుర్థాంకమునకు ముందుండినచో బాగుండెడిదని స్ఫురింపక మానదు. రాజసూయ మీ నాటక పరంపరలో రెండవదిగా లెక్కించుచో దీనితర్వాతి ప్రవాస నాటకమునందు కథ కురుకుమారుల గురుదక్షిణా ప్రదానముతో నారంభించుచున్నది. లేక మూఁడవదానిగా లెక్కించతమన్న ప్రవాస నాటకము ఉత్తరా వివాహ నిశ్చయముతో ముగియుచున్నది. కావున 'రాజసూయము' సూర్యగోళమునుండి విడివడి విశ్వాంతరాళములో సుదూరముగా తత్ప్రకాశము తోడనే భాసించుచున్న యుపగ్రహము విధమున (నీ యేకాంకికయు) ప్రవాస నాటకాంతర్భాగమయ్యు స్వీయ వ్యక్తిత్వముతో గణనీయమగుచున్నది. భారతేతి వృత్తముతో వ్యాయోగము రచించు ప్రక్రియ బహుశః కవులు భాసునినుండి గ్రైకొనిరని యూహింపవచ్చును.

తి. వేం. కవులు నన్నయ భారతమును జాగరూకతతో ననుసరించుచు నా గ్రంథమునే తమ రచన కొఱ్ఱబంతిగా నుంచుకొనినారని పెక్కు పద ప్రయోగములు సాక్ష్యము లిచ్చుచున్నవి.

ఉదా:. 1) "చాలునుజాలు గొల్లనికి" అను పద్యము "పురుషవిశేష విత్తముఁడు" (సభా. ద్వి. 12) అను పద్యమునకు భావానుకృతి.

2) "కృష్ణ సింహపరాక్రము" (సభా. ద్వి. 38) నన్న పదములఁ గ్రైకొని "కృష్ణ సింహ మెప్పంటికి నిద్రమేల్కనునా" యని వేసముమార్చి ప్రయోగించిరి.

3) "పూతనామారణంబు" (సభా. ద్వి. 41) అను సీసపద్యము "గోబ్రాహ్మణులం గూడు వెట్టువాఁడికి" (సభా ద్వి. 42) అను గద్యమునకును తాత్పర్యము వచనముగనే నాటకమునందు రచితమైనది.

భారతమునం దస్పష్టముగా నున్న కొన్ని కథార్థములను విషయ విభాగ దృష్టితో తేటతెల్లమగునట్లు ప్రవచించి నాటకమునందు కార్యకారణ సంయోజన సిద్ధికి కవులెంతయో కృషియొనర్చిరి. శ్రీకోపానల దగ్ధుఁడై విజృంభించు సహదేవునిని ధర్మరాజు నయోక్తులచే వారించుటయు, శిశుపాలుఁడు ధర్మజ భీష్మ భీమాదులపట్ల క్రుద్ధుఁడయ్యు వారిపై లంఘింపకుండమికిఁ గల హేతువులను పాత్ర ముఖమునఁ జెప్పించుటయు మొదలుగాగల యంశము లిందుల కుదాహరణములు.

క్రొత్త నీటితో నుబ్బెత్తుగ నెత్తునుండి ప్రవహించు సెలయేరువలె వేగవంతమైన ప్రవాహముగల్గి మార్గమధ్యమునసున్న శిలాసముచ్చయముతో దట్టించి మ్రోయు తరంగముల మృదంగ నాదముల శ్రావ్యగుణము గల్గి, కుప్పించి యెగయుచు కోలాహలము సేయు నీటి ధారల యావేశమును మూర్తి కట్టుకొని రసోచితమైన కవిత్వ లహరి ఈ నాటక క్షేత్రము నందు లాస్య మొనర్చుచున్నది. శార్దూల మత్తేభ చంపకోత్పలమాలికా వృత్త బహుళమై భావానుగుణమైన ఛందస్సౌభాగ్య మీ రూపకము సంతరించుకొనినది. కవులకీ వస్తువునందును పాత్రలయందును లౌకికానుభవ విశేష సాదృశ్యము వలన కలిగిన సహజమైన ఆత్మాభినివేశముండుటచే వీరి యీ నాటక కవిత్వ మావేశ ప్రధానమై, నాత్యలంకార శోభితమయ్యు సహజ సౌకుమార్యము వీడక రసోచిత శయ్యాసౌభాగ్యము సంతరించుకొన్నను నాటకీయ పద్యరచనమందలి సౌలభ్య శ్రవణ సుభగత్వాదులు వదలక పాత్రోచితమైన భాషణలందగించుటయందు బహు విధములైన పద్యపు టెత్తుగడలు,నడకలు,పరుష సరళాక్షర సంయోజన వైశారద్యములు మొ॥ రచనా శిల్ప సంపదలొప్ప సార్థకమై వరలినది. ఈ కావ్య శరీరమగు నితివృత్తము భారతసంబంధి యైనను దానికి చైతన్యమిచ్చు నాత్మశక్తి మాత్రము తి.వేం. కవుల ఆత్మానుభూతి యగుటచే పరాశ్రయ కవిత్వ మాలంబనముగా గొన్న ఆత్మాశ్రయ కావ్యమువలె నిది పఠితలకు సాక్షాత్కరించుచున్నది. ఇట్టి యనుభూతి కుపకరించునది ఈ నాటకమునందలి ప్రస్తావన.

ఇం దంగిరసము వీరము. అది ధర్మరాజ నిష్ఠము, భీష్మ సహదేవ భీమ శ్రీకృష్ణుల నాశ్రయించిన రౌద్రము దాని కంగము. శత్రుగతమైన రౌద్రము నాయకాదులకు విభావస్థానమై పుష్టిఁగల్గించుచున్నది.

నన్నయ విరచిత రాజసూయ ఘట్టము నందలి కథా తాత్పర్య మీనాటకమున ప్రతిబింబించినది కాని, అందలి వాక్యార్థ శిల్పము మాత్రము ఇందంత ప్రదర్శితము కాలేదు. ప్రక్రియ భేదించినను ప్రయోజనము ఫలవంతము కావలయును గదా! భారతమునందు కొట్టవచ్చినట్లు కనవడు భీష్ముని తాత్త్వికదృష్టి, శ్రీకృష్ణ పరమాత్మ తత్త్వ నిరూపణము. ధర్మజుని నయనీతి, శిశుపాలుని యుపాలంభనములోని సున్నితమైన హేతువాద దృష్టి, పాలిత దుర్ధయత్వము, వాదనకళాప్రక్రియ మొదలగు వస్తుశిల్ప విశేషములిందంతగాఁ బొడఁగట్టుటలేదు. నాటకీయత నందగించుకొనియున్న భారత భాగమునందున్న యిట్టి శిల్పసంపదను రూపకముగా రచింపఁబడిన రాజసూయమునందును బతిత యాస్వాదింప నాసపడుటలో తప్పేమియు లేదేమో! భారతమునందున్న - శిశుపాలు నుపలాలించు ధర్మజుని భాషణలోని గాంభీర్యము, వచో నైపుణ్యము, వ్యంగ్య సౌభాగ్యము, వక్రోక్తి ననుసరించి సున్నిత ప్రబోధ మొనర్చు శక్తి, తాత్త్విక వాతావరణ కల్పనము మొదలగు గుణములు ఈ నాటకమున నంతగా గోచరింపవు. "భూరిగుణోన్నతులు" "పాలిత దుర్ధయుండు" "ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే" "ఎదపక సర్వ్య మిచ్చితిమి" మొ॥ భారత పద్యములకు దీటైన వెందులో లేవు.

దీనినిఁబట్టి తి.వేం. కవులు భారతమునుండి కథాంశము మాత్రమే గైకొని దానిని తమ యిచ్చవచ్చిన యాకృతితో దిద్ది యొక వైలక్షణ్యము పాదించినట్లు తెలియుచున్నది భారతముతో పోలికలు పెట్టుకొనక విమర్శించుచో నీ రూపకము సర్వశోభాయమానముగ నున్నదనుట కెట్టి సంశయమును లేదు.

## పాండవప్రవాసము

కొన్ని మణులను కొన్ని ప్రవాళములను ఏకసూత్రమున జతపఱచి కూర్చిన హారము వంటిది పాండవప్రవాస నాటకము. ఇట్టి కూర్పు శ్రవ్యకావ్య ప్రక్రియలలో కథాకావ్యములందు బహుళముగా గోచరించును. పలువురు నాయకులు పలువిధములైన అర్థములు సాధించి చివఱకు ప్రధాన నాయకునికి వానిని నివేదించుట యనెడి వస్తు లక్షణము కలయట్టి వి కావ్యములు. ఇందు పెక్కు కథలుందును. ఏ కథ కాకథ స్వయంసమృద్ధమై వస్తువ్యంగ్యముచే కావ్య పరమ ప్రయోజనమును బలపఱచుచుఁడును. ఈ శిల్పమును రూపకకావ్య ప్రక్రియ

యందు స్థాపించి రూపొందించినవారు తి వేం. కవులు. ఇది ఏనిమిదంకముల వస్తు రూపకము.

వస్తు తత్త్వమునుబట్టి కవులు కావ్యనిర్మాణ శిల్పమును తీర్చిదిద్దుదురు కావున వీరి నాటకనిర్మాణమున వస్తుతత్వప్రాశస్త్య మూహింపవలసి వచ్చును. పాండవుల జీవితవృత్తము ప్రధానముగా మూఁడు ఘట్టముల క్రింద విడదీయ వచ్చును. పాండవ జన్మము మొదలు అజ్ఞాతవాస పరిసమాప్తివఱ కొకక్క ఘట్టము. ఇందు ప్రత్యర్థులు కల్పించు నిక్కట్టులను క్షమావీరముతో ననుభవించు ప్రవృత్తియే వారియందు గోచరించును. రెండవ ఘట్టము ఉద్యోగము మొదలు పట్టాభిషేకమువఱకు. ఇందు శత్రువులపై పగ సాధించి సార్థక ప్రతిజ్ఞలగు ప్రవృత్తి గోచరించును మూఁడవ ఘట్టము అశ్వమేధముతో ప్రారంభమై స్వర్గా రోహణము వఱకు సాగినది. ఇందు రాజ్యనిర్వహణము, ధర్మాచరణము అను ప్రవృత్తులు ప్రధానముగా గానఁబడును. ఈ మూఁడవస్థలలోను పాండవుల కొక లక్ష్యసిద్ధికై యత్నించి సాధించెడి యుత్కృటప్రవృత్తి ద్వితీయ తృతీయఘట్టము లందే కలదు మిగిలిన మొదటి ఘట్టములో కాలప్రభావమునకులోఁగి పాండవు లెప్పటికనువగు ప్రక్రియ నప్పటికట్లు యొనర్చుచు బ్రతుకుభారము నీడ్చినారు. కాని, జన్మతః జగదుత్తమ వీరులగు వారట్టి కాలమునందును వీరోచిత కార్యములు సేయకమానలేదు. పరిస్థితు లనుకూలింపనిచట్ల పగఱకు లొంగినను ఆత్మాభి మానమును గోల్పోక, అధర్మమునకు దాసోహమనక, మానవీరులై ఉజ్జ్వల భవిష్యత్తును నమ్మి ధర్మపథము నాశ్రయించినారు. వారి జీవిత ప్రథమ ఘట్టము నం దుజ్జ్వలములై భాసించెడి వీరఘట్టములే యీ కావ్యమునకు వస్తువు. పాండవ జీవితములోనే ఒక నిర్దిష్ట లక్ష్యము లేనప్పు డీ నాటక కథయందు ప్రత్యేక లక్ష్యమెట్లుండును? కావున వస్తు కావ్యముగాఁ దీర్చిదిద్దుట తప్పనిసరి యైనది.

ఈ నాటకమునఁ బ్రథమాంకమునం దర్జునాదులు ద్రుపదునిఁబట్టి గురు దక్షిణగా ద్రోణుని కిచ్చుటయు, ద్వితీయాంకమున బకాసుర వధయు, తృతీయ మున మత్స్యయంత్ర భేదమును, చతుర్థమున మాయాద్యూతము, ద్రౌపదీ వస్త్రాప హరణమును, పంచమాంకమున నర్జునుఁ దూర్వశీ శాపమునకు గుఱియగుటయు, షష్ఠాంకమున సైంధవ గర్వభంగమును, సప్తమాంకమున నుత్తరగోగ్రహణ మును, అష్టమాంకమున నుత్తరావివాహ నిశ్చయమును - అనెడి కథాంశములు వర్ణితములైనవి.

పాండవప్రవాస మను నామ మీ నాటకమునందలి ప్రధాన ప్రతిపాద్య వస్తువు నధికరించి పెట్టఁబడినది. పాండవారణ్యాజ్ఞాతవాస జీవితమునే ప్రవాస జీవిత మనుట లోకప్రసిద్ధి. ఏతద్వస్తువే యిందితివృత్తమై యుండినచో చతుర్థాంకములో నారంభమై యష్టమాంకములో ముగిసియుండెడిది. అప్పు డొక ప్రారంభ పరిసమాప్తి సంధి సంవలితమైన వస్తువుగా నది భాసించి యుండి యుండెడిదే. కవుల దృష్టి దానికి భిన్నమైనది. ప్రవాసమనఁగా పరదేశవాస మగుచో పాండవులు లాక్షాగృహ దహనానంతరము ద్రౌపది వివాహము వఱకు నజ్ఞాతవాస మొనర్చి పరదేశ వాసులైనవారే యగుదురు. అప్పటి వారి జీవితమును ప్రవాస నామార్హమగు చున్నది. కావున నా కథయు నిందుఁ బొందుపఱచినారు. దానికిఁదోడు ప్రథమాంకమున గురుదక్షిణ రూప ప్రధాన ఘట్టముఁగూర్చి సమర్థమైన ప్రాతిపదిక ననుసంధించినారు. ద్రోణుని యొద్ద విలువిద్య నభ్యసించిన కురుకుమారులలో గురుదక్షిణ సాధించిన కీర్తి అర్జునుని ద్వారా పాండవులకు సంక్రమించుచున్నది. ఇదియే ఈ యంక ప్రయోజనము. భావి జీవితమున నన్ని యిక్కట్లలో పడఁబోవు పాండవులు విక్రమసమృద్ధులయ్యు నదృష్టహీనులనియు శత్రు సంహార సమర్థులయ్యు ధర్మమునకుఁ గట్టుబడెదరనియు వ్యంగ్యముగా సమర్థింప సమర్థమైన దీ యంకము. అంతియగాక పాండవ కుటుంబినియైన ద్రౌపదిని ద్రుపదుఁడు పుత్రికగా పొంది యర్జునుని కీయ సంకల్పించుటకు హేతువును ప్రకటించునదిగా నీ యంక మింతను రాణించుచున్నది. ఈ విధముగాఁ బ్రవాస జీవితము రెండు ఘట్టములలో వ్యాపించియున్నను ఉత్తర ఘట్టమే ప్రధానముగనుక దాని నామ మధికరించి యుంచిరనుటలో విప్రతిపత్తి లేదు.

ప్రథమాంకమందలి కథను చాలవఱకు భారతమునే అనుసరించియు కవు లెడనెడ స్వీయ ప్రతిభాస్ఫోరకములగు స్వభాషణ వివరణ వర్ణనాదికములను కల్పించి రూపకమునకు మెఱుఁగులు దిద్దిరి. "ఏను పాంచాలదేశము నేలుచప్డు" "ఇరువుర మేము నన్న లోక" "ద్రుపదుఁ డయోని సంభవుఁడు" మొ॥ పద్య సంభాషణ లాయాపాత్రలయందు భావావేశముతో వర్ణించినారు. అట్లే ద్రుపదునితోడి యుద్ధము సల్పుట కొఱకైన భీమార్జునాదుల ప్రతిజ్ఞలు కవుల కల్పన కుదాహరణములై రసస్ఫోరకములుగా నున్నవి. మొత్తము మీఁద ద్రోణు నాశ్రయించిన మానసమా వీరములను సామర్థ్యముతోఁ బోషించి వీర రస శిల్పజ్ఞులని పించుకొనిరి. కాని, భారతమునందలి ప్రఖ్యాతి గాంచిన "హిరెపరయ్య" (ఆది-

6.90) అనెడి పద్యమునకు దీటైన పద్యమీ నాటకమున రాలేదు. అన్నిటనందఱు రాణింపలేరు కదా!

ద్వితీయాంకమున భీముని బలవీర నిరూపణ మతివిపులముగా నొనర్పఁబడినది. అతని యందే పూర్వస్మృతి చర్వణరూపమున లాక్షాగృహదహన వృత్తాంతము, కౌరవ దుర్ణయములు సూచితములైనవి. తేట తెలుఁగు పదములలో దీప్తరసము లొప్పించెడి కవితాగుణ మిందు తేటతెల్ల మగుచున్నది. తృతీయాంకమునం దర్జునుని యుద్ధవీర మంగిగను, భీమాదుల యుత్సాహ మంగముగను, కర్ణ దుర్యోధన ప్రతివీరరౌద్రము తత్పోషకముగను ప్రయోగించి జీవముట్టిపడు రచనలో నీయంకమును తీర్చిదిద్దిరి. భీముఁడు కర్ణు నధిక్షేపించు వచనములతి రమణీయములై యొప్పుచున్నవి. కాని, కర్ణార్జున సంభాషణములలో భారతములోని జగిబిగి యిందుఁ గానరాదు.

వస్తువునందును, పరిమాణమునందును జతుర్థాంక మీ నాటకమునఁ గడుంగడు పెద్దది. ధర్మజుఁడు మాయాద్యూతమునం దోడుటయు ద్రౌపదీ మాన సంరక్షణయు నిందుగల కథాంశములు. సహజముగా నీ ఘట్టమున నాటకీయత సమృద్ధిగా నుండుటచే దీనిని నాటకీకరించుట సులభమే. కాని, సంశ్లిష్టమైన కథా భాగ మిందుండుటచే దానిని వస్తు నాయక రసౌచిత్యాంశములం దెట్టిలోపము వాటిల్లక సంధించుట కష్టము - ఇట్టి గురుతర కార్యము కవులంపైఁ బడినది. అందువలన భారతములోని నీరసమైన ధర్మశాస్త్రాది విషయ బాహుళ్యము నత్యంత సంగ్రహపరచుచు. దీర్ఘతర గంభీర సంభాషణల తాత్పర్యము సార రూపమున సరళముగా పాత్ర ముఖమునఁ బల్కించుచు, అంగిరస పోషకములైన సంచారి భావముల ప్రతీతిని గమనించి, అవాంతర రస భావముల గుర్తించి వానిని విశిష్ట సమ్మేళన మొనర్చి నాతి దీర్ఘమగు నంకము రచించుటయు కవులిచ్చట యొనర్చి కృతార్థులైరి. పాత్ర గుణ స్వరూప పరిణామాదులు సార్థక శబ్ద ప్రయోగముచే ధ్వనింపఁజేయుటయు, ధర్మ సంఘర్షణమేర్పడినప్పుడు పాత్రలయందు వితర్కాది భావముల కనువగు ఛందోగతిని, సుపరిచిత వృత్తములందేఁ గన్పింపఁజేయుటయుఁ ఉద్వేగాది భావములందు పరుషాక్షర యుక్తములైన తత్సమ సమాసము లధికముగా వాడుటయు, ప్రాణవ్యంజనములను రీత్యాదుల కనుగుణముగఁ బ్రయోగించుటయు ననెడి యాంతర శిల్ప సౌభాగ్యము నీయంకమునందు కవులు సాధింప యత్నించిరి. ఈ లక్షణములన్నింటిని సర్వ

జన సులభ గ్రాహ్యమగు శైలియం దిమిడ్చియు మహార్థ గాంభీర్యము సదలంక రచించుట వీరి ప్రత్యేకత. ''కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్'' ''ధారుణి రాజ్య సంపద మదంబున'' (సభా. ద్వి. 233, 249) వంటి పద్యములకు ప్రతిగా వ్రాయఁబడిన పద్యములు వానిముందు వెలవెలఁబోవుచున్నవి. కాని, ధర్మరాజు జూదమున పణములుగాఁ దన తమ్ములనుంచి వారిని వర్ణించి చెప్పిన పద్యములు అపూర్వములై రసానుకూలశయ్యా సౌభాగ్యముతో నుత్తమ కవిత్వ నికషములై పాత్రల స్వరూప స్వభావ నిరూపణ సమర్థములై ప్రశంసార్హములగుచున్నవి. ''కృష్ణఁదలంచె భీతయై'' (సభా. ద్వి. 219) యని మాత్రము భారతమునందుండ దానినిఁ బెంచి మూఁడు పద్యములు కరుణ ముట్టిపడ రచించిన కవుల రసదృష్టి యిం దసదృశము.

అరణ్యపర్వ ప్రథమాశ్వాసాంతమునందలి కథ పంచమాంకము. మహా భారతమున కన్న యిది విస్తృతము. అర్జునుని యింద్రియ నిగ్రహము, గురు భక్తియు నందు ప్రపంచితములు. 'ఏకాత్రానురాగ'మగుటచే నిందు శృంగార రసాభాసము. కవులిం దూర్వశి సంభాషణయందు తమ కిదివఱకే శ్రవణానందాది కావ్యరచనమం దేర్పడిన వేశ్యాప్రాగల్భ్య చిత్రణ సామర్థ్యమును మమ్మూర్తులఁ బ్రదర్శింపఁగల్గిరి. అరణ్యపర్వషష్ఠాశ్వాసమందలి సైంధవ పరాభవ వృత్తాంతము గైకొని షష్ఠాంకమున సంగ్రహముగా కవులు చిత్రించినారు. కీచక సైరంధ్రీ వృత్తాంతము వదలిన యీ కవులు సైంధవునే అపర కీచకునిగాఁ జిత్రించి సంతృప్తిపడినారు. భీమాదుల రౌద్రరసస్ఫూర్తిచే రాణించిన ధర్మజక్షమావీరము శృంగార రసాభాసము సంగముగా గల్గి యిందు శోభించుచున్నది. ఈ నాటకము నందీ రెండంకముల కథ ప్రత్యేకాంక విభాగ గౌరవము వహించెడి అత్యవసర మేమియులేదు. ఇంతకన్న విపులమైన కథా ఘట్టములనే సూచ్యకథాంగములుగా సృష్టించిన తి.వేం. కవులు వీని నేవిష్కంభాదులతోడనో సూచించి యుండిన బాగుండెడిదే. సైంధవగాథకన్న కీచక గాథ వర్ణించి యుండినచో తెలుఁగువారికి హృదయాహ్లాద మధికముగాఁ గల్గియుండెడిది.

తిక్కన కావ్యకళా ప్రాభవమునకుఁ బుట్టినిల్లైన విరాటపర్వమందలి యుత్తరగోగ్రహణ మీ సప్తమాంకమునందలి వస్తువు. నాటకమునం దిది సంగ్రహముగఁ జెప్పఁబడినది. ఈ కథను రూపకముగాఁ జిత్రించుటలో ప్రదర్శనాను కూల్యము సంతరించుటకు కవులు కడుంగడు శ్రమకు గురి కావలసియుండును.

శ్రవ్యకావ్యమునందు కవి ఆయా యుద్ధ దృశ్యములను రమణీయ వర్ణనా నైపుణ్యముతో నిర్వహింపవచ్చును. రూపక రచయిత అప్పట్టులందు సన్నివేశ కల్పనాదాతుర్యాదులగు నెన్నియో ప్రక్రియల నాశ్రయించి కావ్యార్థములను ప్రదర్శింపవలసి వచ్చును కవులా విషయమునం దతిజాగరూకతతో మెలఁగుచు నంకమును సుసంబద్ధ ప్రణాళికపై నడిపియుండిరి. ప్రణాళిక చక్కగానున్నను కవిత్వ పాటవము నందు తిక్కనతో పోల్చినచో కొంత లొచ్చనక తప్పదు. తెలుఁగువారి ముఖసీమలయం దమరవాహినీ సదృశములై సజీవములై యున్న "సింగంబాకటితో" "వచ్చినవాడు ఫల్గుణుడు" "మోహన బాణపాతమున" మొ॥ పద్యములను, ఉత్తర కుమార ప్రతిజ్ఞలను, కురుసేనఁ గాంచినప్పు డాతఁడు పొందిన భయసంభ్రమాదులను తిక్కన భారతములోఁ జదివిన పఠిత ఈ నాటకమునందు తృప్తినిఁ బ్రకటింపఁజాలడు.

కాని, ఇచ్చట గమనింపవలసిన విషయ మొందు గలదు. ప్రతిభావంతుడైన కవి ఒక్కొకచో రచించిన ఒక్కొక్క పద్యమునకు ఒక్కొక్క ఘట్టమున నేకారణమునవైన నేమి అఖండకీర్తి వచ్చియున్నచో నట్టి పద్యము లింకెవ్వరు రచించినను పఠితల హృదయమునకు సంతృప్తి కలుగదు అది లోకసహజము. ఆ దృష్టితో కవు లాయా ఘట్టములందు ప్రతిభాహీనముగా నాటకములు రచించినారని మనము తలంపరాదు. తి. వేం కవుల రచనలను భారతముతో పోల్చి చూచునప్పుడు సామాన్యముగా కవిత్రయ ప్రసిద్ధములైనవి కవుల దృశ్యకావ్యములలో ప్రసిద్ధములు కాలేదనియు, ప్రసిద్ధిచెందిన తి.వేం. కవుల పద్యము లాయా ఘట్టములందు కవిత్రయ పద్యములకన్న రమణీయములగా నున్నవనియుఁ దెలియవలెను. హెచ్చుతగ్గులు దీనివలననే నిర్ణయించుచో గొన్నిచోట్ల కవిత్రయముకన్న వా రధికులు కావలసివచ్చును. కాబట్టి, యిట్టి విమర్శ తుల్య పరిశీలన వలనకే పరిమితమని తేలిన సారాంశము. కాగా, ప్రస్తుత మీయంకము నందీ కథలో సహజముగానున్న చైతన్యశక్తిని రూపక ప్రక్రియా నిర్వహణముతో ద్విగుణీకృత మొనర్చియు, ప్రవాహవేగ తుల్యములైన పద్య సముదాయములతో ప్రేక్షక హృదయములఁ బరవశు ద్రొక్కించియు, అర్జునుఁడు దుర్యోధనాదుల నుపాలంభించుపట్ల మూలాతిశాయిగా పద్యరచన మొనర్చియు నీ యంకమును సాఫల్యముతోడనే నిర్వహించి రనుట నిర్వివాదాంశము.

పాండవులు బయలు వెలయు కథాఘట్టము సప్తమాంకముగా తి. వేం. కవులు రచించిరి. ఇందలి కథ యతి సంగ్రహముగా నున్నది. విరటుఁడు కృతజ్ఞతాభావముతో తనంతట తానే యుత్తరను ద్రౌపదికి కోడలుగా నిత్తునని ముందుకు వచ్చుట ఇందలి విశేషము. ప్రకరణోచితముగా కథను మార్చి నాటక రచనా సౌలభ్యమును గల్పించుకొనిరి. కంకభట్టాదుల యాకృతులలో నున్నది పంచపాండవులనియు, ఉత్తర గోగ్రహణ విజయకారకుఁడు బృహన్నలయనియు తెలిసికొను విరటునితో పాటు ప్రేక్షకులును సహానుభూతినంది యీ యంక నిర్వహణమునందు అద్భుత రసాస్వాద మొనర్పఁగలరు. ఇందు మొత్తముపై పద్యములకన్న గద్యమే అధికము. విరటుఁడు కంకునిపై రోషముతో నన్న మాటలు భారతమునందున్నంత (విరా. పంచ. 253.255) అర్థవంతములు గావు. భారతమునందువలె పాండవు లిందు స్వయముగా బయటపడక ఉత్తరునిచే నెఱుకపఱుపఁబడెదరు.

## పాండవోద్యోగము

తిరుపతి వేంకటకవుల స్వతంత్ర నాటకములన్నింటిలోను మకుటాయమానమైనది పాండవోద్యోగము. తిక్కన మహాకవిగా, మహామంత్రిగా తన ప్రతిభాసామ్రాజ్యమును పండఁబారిన ధర్మనీతి వర్తనముతో నిర్వహించిన సాహిత్యక్షేత్రము భారతోద్యోగపర్వము. దానిని నాటకముగా రచించి కవిబ్రహ్మకు దీటైన స్థానము నలంకరించినారు తిరుపతి వేంకటకవులు. తిక్కన పద్యములు పండిత ముఖసీమలందే వసించుచుండ తి. వేం. కవుల పద్యములు పండిత పామర జనముఖస్థములై వర్తిలుచున్నవి. తిక్కన భారతమన్న తెలుగువారి కెంత గౌరవమో, కవుల ఉద్యోగనాటకమన్నను అంత యాదరము. ధర్మమహితరు ఒకవైపునను, రోషమయ మహితరువుమఱియొకవైపునను నిలిచి యుద్ధమనెడి ఝంఝామారుతమునకు లోఁగి రాపిడివడి కురుక్షేత్రమున గార్చిచ్చు పుట్టించి లోకప్రళయము గల్పించు భయంకర సంకటపరిస్థితిలో జగత్కల్యాణహేతుకమైన శాంతిమార్గ మన్వేషింపఁ బాండవులు శ్రీకృష్ణముఖమున గావించిన తీవ్ర యత్నమగు నీ వస్తువు భారతీయ హృదయముల కనంతకాలమునుండి శాంతి సౌఖ్యములఁ బ్రసాదించుచున్నది. మహనీయ వస్తుసంపత్తిని పోషింప మహితాత్ములగు కవిరాజులు దొరికినారు. ఆంధ్రలోకము ధన్యమైనది.

ఇందు వస్తువు పంచసంధియుతము; నాయకుఁడు ధీరోదాత్తుఁడు; అంగి రసము వీరము. ప్రాచీనాలంకారికమతానుసార మీ నాటకనిర్మాణ మెంతయు శాస్త్రబద్ధమై యొప్పుచు రమణీయసాక్షాత్కృతి నిచ్చుచున్నది. ప్రసిద్ధేతివృత్తము చేపట్టి నిర్వహించుటయే కష్టము. అందును రాజనీతియుక్తమగుచో మఱియు సంక్లిష్టము. అందును ఉద్యోగమే ప్రధానమగు నిట్టి వస్తువునం దారంభ నిర్వహణాదులను నిర్దేశించుకొని, తన్నిర్వహణ కళాకౌశలము ప్రకటింపఁగల్గుట కడుసున్నితమైన విషయము. దానికితోడు కవిబ్రహ్మ యొనర్చిన యొక సృష్టికి పునస్సృష్టి యొనర్చి, ఎందును దానికి తీసిపోకుండునట్లు గౌరవము నిల్పికొనుట అతిదుష్కరము. వీని నన్నింటిని విజయవంతముగా సాధించిన కవిద్వయ ధిషణా ప్రాభవము ప్రశంసనీయము.

ప్రథమాంకమున శ్రీకృష్ణుఁడు తన బలమును రెండుగాఁజేసి తాను పాండవపక్షవర్తియై విజయరథసారథ్యమున కంగీకరించుటయు, ద్వితీయాంక మున ధర్మరాజాదుల సందేశములఁ గైకొని శ్రీకృష్ణుడు రాయబారార్థము కురు సభకేగ నిశ్చయించుటయు, తృతీయాంకమున కురు సభలో శ్రీ కృష్ణుని రాయబారము విఫలమగుటయు, విశ్వరూప ప్రదర్శనమును, చతుర్థాంకమున కర్ణుఁడు పాండవపక్ష ప్రవేశము నంగీకరింపమియును, కుంతికి వర మొసంగుట యును, పంచమాంకమున పాండవ కౌరవ బలాబల నిరూపణము, ఉలూక రాయబారాదులును, షష్ఠాంకమున ధర్మరాజు విజయాహవాంగ నిర్వహణమును అనునవి యీ నాటక కథయం దంశములుగాఁ గూర్పఁబడినవి.

నాయక చరిత్రమే యితివృత్తము కావున నాయక చిత్తవృత్తిపై కథా ప్రవృత్తి యాధారపడి యుండును. ఇందు నాయకుఁడు యుధిష్ఠిరుఁడు. అతఁ డుభయాయత్తసిద్ధుఁ డగుటచే స్వీయప్రయత్నము వదలకఁ జేయుచు శ్రీకృష్ణ భీమాదుల సహాయముతో కార్యము సాధించెడివాఁడు. యుధిష్ఠిర శబ్దమునందే యాతని యుద్ధ వీరత్వము సుప్రతిష్ఠితమై యున్నను, అజాత శత్రువు, ధర్మరాజు ఇత్యాది నామములచే నాతఁడు లోకహితుఁడనియు, ధర్మమూర్తి యనియు ధ్రువ పడుచున్నది. అతని బుద్ధికి రాజనీతి ధర్మహితముగా స్ఫురింపదు. అట్టిం దర నాతఁ డీ నాటకమున చేయునది యుద్ధోద్యోగము. దానిఁగూర్చి ధర్మజ్ఞుల వచన మిది:

"తొలుత మూఁడుపాయంబులు గొలుపకున్నఁ
దుదిఁగదా విక్రమోద్యోగ మదియు రిపుఁడు
మత్తుఁడై యున్న నొరుచేత నొత్తఁబడిన
పీతబలుఁడైన జనునంద్రు నీతివిదులు"

"నీతి పథమున కార్యంబు నిశ్చయించి
తగవు తప్పక చేయు నతండు మీఁద
నిడుమ పొందఁడు; ధర్మంబు విడిచి చొప్పు
దప్పి కావించు నతఁడు సంతాపమందు." (భాస్కర రా. యుద్ధ.)

ఈ నియతికి ధర్మజాని ప్రవృత్తి ప్రకృష్టోదాహరణము. నయమున శత్రువు నొంచుట మొదటి పద్ధతి. ఇట్టిచో సమర్థుఁడగు రాయబారి యవసరము. ఏతన్ముఖమున నాయక యత్నము ఫలోన్ముఖమగునని తాత్పర్యము. లేక యది విఫలమగుచో మంత్రబలముచే శత్రువులందు భేదోపాయము ననుసంధింపవలెను. లేనిచో దానాదులిచ్చి సంధి కుదుర్చుకొనవలెను. దానోపాయము స్వాభిమాని యగు నాయకునియందు రాణింపదు. చివఱకు మిగులునది దండోపాయము. దాని నీక్రింది లక్షణములు ధ్రువపఱచును: 1) సామాదులు విఫలములగుట 2) రిపుఁడు మత్తుఁడై యుండుట లేక పీతబలుఁడై యుండుట 3) రిపుని కధిక బలమున్నను దానియందు సంఘీభావము కుంటువడియుండుట 4) ప్రతినాయక పక్షవర్తులలోఁగొండఱు నాయకునిపై సానుభూతిఁగల్గియుండుట 5) ధర్మము నాయకుని పట్ల వర్తిల్లుట అనునవి. ఇతివృత్తమునందు విచ్చలవిడిగాఁ జల్లఁబడి యున్న యీ యర్థములన్నియు నాయకుఁడు దండోపాయ ప్రయోగమునకు పూర్వమే విచిత్రముగా సంధించును. అట్టివి సమర్థముగా సంఘటితమయ్యెనా జయము నాయకున దనుట నిర్వివాదాంశము. కావున ఉద్యోగ ప్రక్రియాప్రధాన మగు నాటకము నందు నాయకు డిట్టి అర్థసంపది సాధించుటయే ఫలమగునని ఈ చర్చకు తాత్పర్యము. ఈ దృష్టితో సమన్వయించుచో ధర్మజుఁడు యుద్ధ మనివార్యమనియు - దండోపాయ మత్యవసరమనియు గుర్తించిన వాఁడయ్యు ధర్మనీతి ననుసరించి సామాద్యుపాయములందు యత్నమొనర్చెననియు, ప్రతి యుపాయమునకును ప్రాతికూల్యము కనుపట్టినను వానిని సాయశక్తుల నిర్జించి తత్ఫలాఫలములను తన లక్ష్యసిద్ధికనుకూలముగా త్రిప్పికొనుననియు తేలుచున్నది.

ఇచ్చట గమనింపదగిన విషయ మొకటి. రాజనీతి ననుసరించి యుద్ధోద్యోగము నందు ధర్మమునకు ఫలసిద్ధి గల్గినను కలుగకున్నను మంత్రనీతికి మాత్రము ఫలసిద్ధి కలుగవలయును. లేనిచో కార్యము ఫలోన్ముఖముకాదు. ధర్మసంపన్నుఁడైన నాయకుఁడు సామాద్యుపాయములలో ధర్మమునకు ఫలము కలుగనంత మాత్రమున దానిని వదలఁడు. అది దండోపాయమున విజయ సంసిద్ధికి ప్రబల హేతువై భాసింపఁగలదు. దీనిని ధర్మరాజు ధర్మనీతిని నన్వయించుకొనువేళ నెన్నడును మఱువరాదు.

## సంధ్యంగ సమన్వయము:

పాండవోద్యోగము వీర రస ప్రధానమగు నాఱంకముల లక్షణబద్ధమైన నాటకము. ప్రస్తావనలో శరదృతువు వర్ణితమగుటయే నది వీరరస ప్రధానమైనదని సూచన. అందు ప్రథమాంకమున ముఖసంధియు, ద్వితీయాంకమునఁ బ్రతిముఖ సంధియు, తృతీయాంక చతుర్థాంకములందు గర్భసంధియు, పంచమాంకము నందును షష్ఠాంకమున నర్జున విషాదవృత్తాంతమువఱకు నవమర్శ సంధియు, షష్ఠాంకశేషమున నిర్వహణ సంధియుఁ గాననగును. వీనినన్నిఁటియందును వీర రసమే యుత్కటముగా నిబద్ధమైయున్నది.

ఇందు నాయకుఁడు ధర్మరాజు. మహాభారత నాయక సమన్వయమే యిందువర్తించును.అనఁగా పాండవులందఱి దొక టేమాట!అదిధర్మరాజాంకితము. ఈ నాటకమునందలి యుద్యోగము (ప్రయత్నము) యుద్ధప్రయత్నము. నాటకము ప్రారంభించుటలోనే అర్జునుఁ డావిషయము స్పష్టపఱిచినాడు :

"ద్రుపదుని పంపునన్ జనెఁ బురోహితుఁ డాధృతరాష్ట్రిసూరి బల్
కపటి వినందు సంధిచెరఁగా గమకించెడుఁగాని, తప్ప దా
లపుఁబని; సర్వమున్ గదపు లావు గలందు యశోదవర్తి; యా
రిపుజనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్."

ఇందు ప్రారంభావస్థ కలదు. భావిభారత యుద్ధసన్నాహోత్సాహ మించు సువ్యక్తము. పాండవ నౌకకు కర్ణధారునిగాఁ గృష్ణుని వరించుటకై అర్జునుఁడు ద్వారక కేతెంచినాఁడు. నాటకవిస్తృతి కంతటికిని మూలహేతువగు శ్రీకృష్ణ

సారథ్యమున కిచ్చుట బీజావాపము జరిగినది దానిని సాధించి గోపాలుని 'విజయ సారథి'గాఁ బొందుటలో ముఖసంధి స్వయంసమృద్ధమగుచున్నది.

రణనీతియందు యుద్ధము దండోపాయము. ఈ నాటకము యుద్ధ ప్రదర్శన ప్రధానమైనది కాదు. యుద్ధోన్ముఖదశయే ఫలముగ గల్గినది. అనగా నిందు యుద్ధయత్నము సామాద్యుపాయ విశిష్టమై ప్రపంచిత మగుచున్నదన్న మాట! సామదానభేదోపాయము లీనాటకమున ధర్మజ గోవిందులచేఁ బ్రపంచితమైనవి. ఏ యుపాయము ప్రయుక్తమగునపు డద్దాని కనువగు ప్రవృత్తి పాండవు లందఱి యందును గోచరింపవలెను. లేకపోయినచో ధర్మరాజు ప్రయత్నము సాగదు.

"ఆలును బిడ్డ లేద్వి నృపు లాలములోఁ గడతేర కెల్ల చు
ట్టాలను రూపుమాయ కకటా! యిల దక్కెనె! దక్కనిత్తురే?
చాలును రాజ్యభారము; ప్రజల్ సుఖియించిన నాకుఁ జాలు; నేఁ
జాలకఁ గాదు చూవె; తినఁజాలను నెత్తురుకూడు మాధవా!"

అనుటలో ధర్మజుడు చల్లగా సామోపాయమును ప్రతిపాదించినాఁడు; పూర్వాపరనాయక ప్రవృత్తి నెఱిఁగినఁగాని ఈ యంశము బోధపడదు. దాని నెఱుగుట కీ క్రింది పద్యము చక్కని కీలకము:

"ఇంతకు సంధిమాట వినని వినకుండగనీ మనమ్ము ని
శ్చింత మగున్ జనంబు మనసేమమె కోరుదు రెల్లవారు సం
దింతురు వారి నిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁ గీర్తి; సా
మంత నృపాలు రందఱకు మా వ్యవసాయము తేటతెల్లమౌ."

సంధి సామదానోపాయ ప్రతిరూపమని ఈ పద్యము చెప్పక చెప్పుచున్నది. సంధి కార్యమునకొరఁబడు శ్రీకృష్ణునిపై భీముఁ డభిమానియై యల్గుట, అతనిఁ దూలనాడుట, మొ॥ వానిచే బీజము (అవాంతర కారణముచే) మఱుగుఁ పడి తత్కోపశాంతితో నది సుస్పష్టమగుచున్నది. ద్వితీయాంకమునఁ బ్రతిముఖ సంధి పరిపుష్టి నొందినది. ధర్మజుని సంధి ప్రయత్నము, యుద్ధమునకుఁ బురికొల్పు శ్రీకృష్ణుని పల్కులు ప్రయోజన విచ్ఛేదము గాకుండ బిందువను అర్థ ప్రకృతిని సంతరించిపెట్టుచున్నవి.

తృతీయ చతుర్థాంకములలో శ్రీకృష్ణుని రాయబారపుఘట్టము వర్ణితము. శ్రీకృష్ణుఁడు పాండవ దూత. ఇరుపురకుఁ గావలసిన బంధువు. అందువలన

స్వాతంత్ర్యముతో మెలఁగినాఁడు. నయమున భయమునఁ జెప్పి చూచినాఁడు. అతని మాటలు విని భీష్మాది కురువృద్ధులు, ద్రోణాది గురుజనులు, నారదాది ఋషిపుంగవులు ధర్మరాజాను బలపరచిరి. కర్ణాదులు తద్విరుద్ధముగా రారాజును బలపఱిచిరి. ఇరుపక్షములవారు వాదనలకు దిగుటతో బీజము స్పష్టాస్పష్టముగా గోచరించును. అది నాల్గవ అంకమున ప్రాప్త్యాశకు దారితీసి, సాంగముగా గర్భసంధి ప్రయుక్తమగుటకుఁ దోడ్పడినది. కురుసభను రణరంగ మొనర్చినప్పుడును, కర్ణుని పాండవపక్షపాతిగా నొనర్ప యత్నించినప్పుడును శ్రీకృష్ణుడు ప్రదర్శించిన భేదోపాయము అత్యద్భుతము! శత్రుమర్మముల నెఱిఁగి, ధర్మజాశీలమును కురుసభలోఁ జాటి యుపప్లావ్యముఁ జేరిన శ్రీకృష్ణుని రాయబారము సంధియత్నమున విఫలమైనను యుద్ధోన్ముఖమై సఫలమే యైనది. నాటకలక్ష్యమే అది!........

పంచమాంకమున అవిమర్శసంధి కలదు. బీజార్థము పాండవులయందు క్రోధ వ్యసనాదులు ఇందు ప్రదర్శితములైనవి. కర్ణు నర్ధరథుఁజేసి భీష్ముఁడు తన నవమానముచేసినాఁడని గాండివి భిన్నుఁడగుట, కురునాథుడంపిన యులూకుని రాయబారమునకుఁ బాండవులు క్రుద్ధులగుట, షష్ఠాంకారంభమున అర్జునుఁడు బంధుహింస నుద్దేశించి దుఃఖించుట మొ॥ అవమర్శసంధి బంధములే.

ధర్మజుఁడు తన 'యుద్యోగము'ను షష్ఠాంకమున సాంగముగా ప్రదర్శించెను. సంధి రాయబారముచే స్నిగ్ధమైయున్న భీష్మాదుల హృదయములను స్తుతులచే తన కనుకూలపఱుచుకొని విజయమార్గము సిద్ధపఱుచుట, యుయుత్సాదులు తనవైపువచ్చు నవకాశముఁ గల్పించుట అనునవి యుద్ధసన్నాహము యొక్క చివరిదశలు. వానిని నిర్వహించుటలో నద్భుతము ననుసంధించి కవు లాయంకమును సలక్షణముగా నిర్మించియుండిరి.

అంత నిర్వహణమునందు కానవచ్చు కొన్ని విశేషములు :

## ప్రథమాంకమున :

1) "అదిగో ద్వారక" "అరవిందాక్షుఁడు" "జలజాతాసన" అను కవుల పద్యములు అర్జునుని సౌజన్య భక్తి భావముల కాకరములై యున్నవి. ఈ భావము లు భారతమున లేనివి.

2) భారతమున "తత్కాలోచిత బహుమతిమైఁ జాల బ్రియంబిరువురకుఁ బ్రసన్నతఁజేసెన్" (ఉద్యో. ప్ర. 67) అని యుండ దానిని విస్తరించి నాటకీయ మొనర్చుటలో కవులు చూపిన ప్రజ్ఞ యసాధారణము. ఆ పట్టమునందున్న "ఎక్కడినుండి రాక" "బావా యెప్పుడు వచ్చితీవు"వంటి పద్యములు అమూల్యము లైన కల్పనలు.

3) మూలమున శ్రీకృష్ణుఁడు దుర్యోధనార్జునులు వచ్చిన కార్యముగూర్చి యిద్దఱిని పశ్నించినాఁడు. ఇచ్చట రారాజు నొక్కనినే అడిగినాఁడు.

4) "కౌరవ పాండవుల్" "ఇరువురకు" అను పద్యములు ఉద్యో. ప్ర. 60, 70, కం. పద్యములకు రమ్యానుకృతులు. అట్లే ''ఆయుధము పట్ట" ''ముందుగ వచ్చితీవు", ''అన్నియెడల", "యుద్ధ మొనరింత్రు''అను పద్యములు ఉద్యో. 72 నుండి 75 పద్యములకు భావానుకరణములు.

5) బాలుఁడగు నర్జునుని కవకాశము కల్పించు హేతువును నిరూపించుట అమూలకము, అతిరమణీయమును.

6) పాత్ర విపర్యాస చిత్రణశిల్ప దృష్టితో చూచినచో నర్జున దుర్యోధన పాత్ర మనఃప్రవృత్తి సాక్షాత్కార మొనర్ప సమర్థములగు ''నందకుమార" ''రథము నందెన్ని" యనెడి పద్యము లపూర్వము లనవచ్చును. దుర్యోధన పాత్రకు సహజమైన దురహంకారమునకు వన్నెఁ దెచ్చునది ఈ రెండవ పద్యము.

7) "అలము సేయ", "ఉన్నది పుష్టి", నీ యూష్టింభావము", "పదివేలు లెక్కయే", "గోపాలుఁడనిన'', "ఊరక చూచుచుందుము'', "సారథియంట'' అన్న పద్యములు భారతభావములకు మెఱుఁగువెట్టు భావశిల్పములు.

8) "గోపాలుఁడనిన'' ఇటువంటి పద్యములందు శ్లేషాద్యలంకార చమత్కారములను పాండిత్య ప్రకర్షతో ప్రదర్శించి కవులు ప్రేక్షకులను రంజింపఁ జేసిరి.

9) అంకాంతమున ''అంకావతార''మను నాటకాంగమును ప్రవేశపెట్టి కవులు రాబోవు అంకమునందలి కథను సూచించిరి.

## ద్వితీయాంకమున :

1) "చాలును రాజ్య భారము" అనియెడి ధర్మజ దృక్పథమునకును "సిరి నాకేందునే గ్రాసవాసో దైన్యంబులు వచ్చు నాయరయు నీ చుట్టాలకున్ (ఉద్యో. 3.12) అనెడి మహాభారత వచనములకును కొంత వ్యత్యాసము గోచరించు చున్నది. ఇందు ధర్మజుని మనస్తత్వము అతి సంక్లిష్టము. ఇది ఉద్దేశపూర్వముగా చేసిన రచనా చమత్కృతియే దానివలన నాటకమునందు వస్తు వికాసమునకు ఎంతయో యవకాశము కల్పింపఁబడినది ఒక విధముగా తదర్థ విస్తృతియే ద్వితీయాంకమునందలి కథ.

2) పైనట్లు చిత్రించియు "ఇంతకు సంధి మాట" యనెడి పద్యమున ధర్మజుని రణనీతిమంత్ర రహస్యమును స్పష్టపఱచి పాత్ర ప్రవృత్తి సమన్వయ మునకు దారి చూపించినారు కవులు.

3) అంతటితో నాగక "సౌబలేయులు సంధి కిష్టపడరేని" యన్న పద్య మున ధర్మజుని కృత నిశ్చయము స్పష్టపఱిచి యుద్ధ వీరోచిత ప్రవృత్తి కథా గతికిఁ గల్పించినారు.

4) భీముఁడు రుద్రుఁడై పల్కిన "అనుపమ విక్రమ సహాయులు", "అగ్రజుండంపుగాక" "ఒక దుర్మార్గుఁడు" అనెడి రౌద్ర రస వాక్యములు రస పుష్టికి హేతువులైనవి. భారతమున నిట్టి భావములు లేవు.

5) "పసుపుము కౌరవ సభకే జను చెట్లును" (ఉద్యో. 3.31) పద్యమును ''ఐసను పోయి రావలయు''ననెడి నాటక పద్యముతో పోల్చుచో తి. వేం. కవులు కృష్ణనిరాయబారమునకు జీవభూతమైన రాజకీయ హేతువును వ్యంగ్యముగా వ్యాఖ్యానించుచున్నా రనవచ్చును

6) భారతమున భీమునియందు రౌద్ర స్ఫూర్తి లేనేలేదు. కవులు వీరము నకు సహాయ రస సంయోజన మొనరించుకొఱకును, ద్రౌపదీ హృదయరంజన మగునట్లుగను దానిని కల్పించియుండిరి.

7) అర్జునుని సందేశమును భారతముతోఁ బోల్చి చూడ తృప్తి నీయదు. రమణీయములగు భావములఁ గొన్నిఁటిని మూలము నుండి (ఉద్యో. 3.142) గ్రహించుట మానినారు.

8) నకుల సహదేవుల ప్రతిజ్ఞలు వీరరసాలవాలములు ద్రౌపది పల్కులు మూలమున నత్యంతో త్తేజకములు. నాటకముగఁ దళ్కారము వచ్చినది కాని తేజము రాలేదు.

9) భారతమునందువలె ధర్మజుఁడు కృష్ణునితో హస్తినగరమునఁ గుంతిని దర్శించి రమ్మని చెప్పియుండినచో బాగుండెడిది.

10) "నిదుర వోచుంటివే" "కురుపతి పెన్దాదల్" "బరువు మోయగ లేని" అన్న పద్యములు భారతమునకు దగ్గఱగా నుండి తెలుఁగున ప్రజాదరణ పొందఁగల్గినవి.

## తృతీయాంకమున :

1) రాయబారపు ఘట్టమున కృష్ణ సంభాషణమున మూల సారమును బిండి రచించిరి. a) ఉద్యో. 3 - 272, 274, 279 పద్యభావముల పిండీకృతార్థము "తమ్ముని కొడుకులు" అను పద్యము. b) ఉద్యో. 3 - 283 నకు తాత్పర్యము "తనయుల వినిచెదవో" అన్న పద్యము c) ఉద్యో. 3 - 259, 260, పద్యముల భావము "చదువున్ నీతియు" అన్న పద్యము. d) ఉద్యో. 3 - 284 నకు అను కృతి "పతితులుకార"న్న పద్యము.

2) కర్ణ ద్రోణాశ్వత్థామ వికర్ణ విదురనారదాదుల భాషణములు భారత మున లేనివై కవుల ప్రతిభాజనితములై రూపకానుకూల కథాసంవిధాన మహనీయ స్ఫోరకములై, తత్తత్పాత్రమనోగుణ విశదీకరణోపకరణములై, కథాచైతన్య మూలములై, ప్రతినాయక ప్రయత్న విషయ చర్చావేదికలై వ్యంగ్యముగా కౌరవబల సమన్వయ రాహిత్యమునకు వ్యాఖ్యానములై వర్తిల్లుచున్నవి.

3) "చెల్లియొ చెల్లకో"; "అలుగుటయే యెఱుంగని"; "జండాపై కపి రాజు", "సంతోషంబున సంధి సేయుదురె" అను పద్యములు కవుల నాటక ప్రపంచ మం దెన్నికగన్న రత్నములు.సంస్కృత శాకుంతల చతుర్థాంకమునకు, అందలి శ్లోక చతుష్టయమున కెట్టి కీర్తియున్నదో ఈ నాటక తృతీయాంకము నకు, అందునను ఈ పద్య చతుష్టయమునకు అంత ప్రసిద్ధి తెలుఁగున నున్న దనుటలో నతిశయోక్తి లేదు.

4) మూలమునందున్న గరుడ వృత్తాంతాదులను వదలుటయు, ఋషులచేఁ గర్ణునికి శాపములు బెట్టించుటయు కవు లొనర్చిన మార్పులు. కర్ణపాత్ర చిత్రణమునం దీ మార్పెంతయో తోడ్పడినది.

5) గాంధారీ సంభాషణము భారతమునందుకన్న నిందు విపులము. అనునయ వాక్శిల్ప రమణీయము.

## చతుర్థాంకమున :

1) "కన్నెప్రాయంబునందు" అన్న పద్యమున కవులు కర్ణ జన్మ వృత్తాంత కథనమునం దెఱ్ఱాప్రెగ్గడ ననుసరించినారు.

2) భారతమున నొక్క సీసపద్యమునందును నొక్క గద్యమునందును చెప్పిన భావములను విస్తరించి "నీ వెఱుంగని", "అంచితులైన", "మాతృపక్షము", "వ్యంజనమున్", "ఏ సతి వహ్నియందు" అను పద్యములు శ్రీకృష్ణ పాత్రముఖమున వచించి రమణీయార్థ ప్రతిపాదక శబ్దప్రయోగమునకు చక్కని యుదాహరణములగునట్లు కవులు రచించినారు.

3) "అరయున్ నేరనివాఁడగాను" అను పద్యము ఉద్యో. 4.45 నకు అవరాకృతి.

4) "అర్జునుండోడు" అన్న పద్యములోని భావము భారతమున కర్ణుఁడు కుంతితో నన్నట్లున్నది. ఇచ్చట కృష్ణునితో ననిపించినారు.

5) "నా నేస్తము" అను పద్యమునందలి భావము ఉద్యో. 4.65, 66 పద్యములనుండి గైకొనఁబడినది.

## పంచమాంకమున:

1) రుక్మి, ఉలూకుఁడు అనువా రాక్రమముననే పాండవ, కౌరవ బలాబల నిరూపణమునకు పూర్వమే భారతమున వచ్చుచుండ నాటకము తర్వాత ప్రవేశపెట్టిరి.

2) మూలమునకు విరుద్ధముగా ఉలూకుఁడు ముందును, తరువాత రుక్మియు నాటకమునఁ బ్రవేశింతురు.

## షష్ఠాంకమున:

1) భారతమున నర్జున విషాదయోగమునకు పూర్వమే ధర్మజాఁడు పాద చారియై కురుసైన్యమువైపు నడిచెనని యుండ నాటకమున దాని తరువాత సంఘ టించిరి. దానివలన సంధ్యంగవిభజన సౌలభ్య మేర్పడుటయేగాక నిర్వహణము నందు భోషింపఁబడఁదగు నాశ్చర్యభావక్రమ వికాసమున కిది కొంత తోడ్పడ గలిగినది.

2) గీతార్థబోధమును తిక్కన దృష్టినే యాదర్శమునం దుంచుకొని కడు సంగ్రహముగా ముఖ్య ప్రతిపాద్యబోధకమై యొప్పునట్లొనరించి రసపోషణమున కును, కథాగమన వేగమునకును తోడ్పడిరి.

3) భీష్మ ద్రోణాదుల కభివందనము ధర్మజాఁడు సంస్కృతమునం దొనర్చుటయు, నవి కందపద్యములందు రచించుటయుఁ బ్రయోగ వైశిష్ట్యము.

4) భరత వాక్యమున కర్ణునికి దప్ప అందఱికి మంగళమని చెప్పుట యొక విచిత్రము.

లక్షణభాగ మటుంచి పాత్రల మనఃప్రవృత్తులఁ గాంచినను ఈ నాటక మున వీర రసస్ఫూర్తి గాంచని యుత్తమపాత్ర లేదు. అనఁగా స్త్రీ, బ్రాహ్మణ భటాదులే యుత్తమపాత్రలుగా పరిగణింపబడరని దశరూపక తాత్పర్యము. ధర్మరాజు 'మెత్తని పులి' వలె యుద్ధయత్నము సాగించినాఁడు. భీముఁ డుద్ధతుఁడైనను ధర్మరాజు ననుకరించినాఁడు. అర్జునాదులు వ్యక్తిత్వముతో వ్యవహరించుచు అన్నకు బలము చేకూర్చినారు.

"ధర్మతనయుండు నడచిన దారిఁగాక మాఱుత్రోవను జనుట మా మతము గాదు" అని వారి మతము.

''అంబుదు లింకుగాక....దాటరు పాండవులన్నమాటకున్''

అనెడి భీముని భీషణవచనములందును,

''సారథియంట ...సంగరమం దెవఁ డాగ జాలెడిన్''

అనెడి గాండీవి ఠక్షుత్సాహాతిరేకములగు పల్కులందును,

"పోరికి సిద్ధమై యడుగ బోయినవారము గాన....
కరవాలమునం బడు యోగ ముండినన్"

అను నకుల వీరోక్తులందును,

"వీర యొక్కంతన నేటిమాట....మంచి క్షత్రియుల కింతే యొందు లేదెచ్చటన్" అను సహదేవుని పౌరుషోక్తులందును వీర రసస్ఫూర్తి విపులముగాఁ గాన నగుచున్నది.

కృష్ణుఁడు కురుసభలో పల్కిన పల్కులు :

"జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబున్ గొని తోలు స్యందనము మీద న్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గునుఁడు మూఁకం జెండు చున్నప్పు డొ
క్కండు న్నీ మొఱ లాలకింపడు కురుక్ష్మానాథ సంధింపఁగన్"

అనునవి - తెలుగుసాహిత్యము నిల్చినన్నాళ్ళు జెండావలె రెపరెపలాడు చుండెడివే. కర్ణుఁడు "కదనము చేయ వచ్చిరని కంది....శాత్రవ శూన్యము సేయకుండగన్" "కూడుం గుడ్డ యొసంగి ...పిడున్నాడు సిద్ధంబుగాన్" అని తన సేవాధర్మము సూతధర్మము నిరూపించుకొనినాఁడు. ప్రతినాయకుఁ డగు రారాజు మదాంధుఁడు. "పాండవులైన నుండవలె భారతవంశము నిల్చ, లేక మేముండవలెన్" అని భీష్మకరించుకొనిన దురభిమాని! "రారాజు బిరుదమునకై నిందువంశమును బలిపెట్టు అవివేకి, భువిపై నవతరించినకలి. అట్టివానిని ధర్మవీరుఁడగు ధర్మజుఁడు ధర్మమార్గమున దీకొని జయముగాంచ యత్నించినాడు. అందువలననే దైవ మాతనిపక్ష మైనాఁడు." కర్ణుఁడు శ్రీకృష్ణునితో నన్నది సత్యము:

"నిత్య సత్యవ్రతుండన నెగడు ధర్మతనయుఁడే నేల నేలంగ దగినవాఁడు
కురుపతిని గెల్తు రేనెఱుంగుదును నిక్కువముగ నీ దయచేతనే
పాండుసుతులు."

ఈ నాటకమునందు నాయక ప్రతినాయకు లిఱువురును ఉభయాయత్త సిద్ధులు. కావున వారి యుద్యోగములలో స్వీయమగు ప్రయత్నమెంత యుండునో తత్సహాయుల ప్రయత్నమెంత యుండి కార్యసాఫల్యమునకు తోడ్పడుచుండును. కురుక్షేత్ర యుద్ధ సాగరావతరణార్థము పాండవ నౌకకు కృష్ణుఁడును, కౌరవ నౌకకు కర్ణుఁడును కర్ణధారులైరి. నౌకాగతికి కీలకస్థానము కర్ణధారుఁడు. అతఁడు నాయకాజ్ఞానువర్తి. ఇట్టి సొబగి నాటకమునఁ జక్కగా నిర్వహింపఁ బడినది. పాండవ నౌకను నిష్కంటకమైన మార్గమునందు సాగునట్లు చుక్కాని బట్టుట ధర్మము. నాయక వృత్తము నాటకమైనప్పుడు నాటక కథా

గరికి గూడ నితఁడు కర్ణధారుఁ డగుచున్నాఁడు. చమత్కారమేమన - నీ నాటకమున ప్రతి యంకమునందును శ్రీకృష్ణపాత్ర చేయు విశిష్టమైన సంభాషణ మాలంబనముగాఁ గొని కథ చిలవలు పలువలుగా నల్లుకొని పోవును. ఆ ఘట్టమునం దట్టి సంభాషణ లేనిచో భావికథా ప్రవృత్తికి ప్రగతి నాస్తి యన్నట్లు పాత్రచేఁ బల్కించి కవులాతని కర్ణధారిత్వమును నాటక రచనా ప్రణాళిక యందును సుస్థాపిత మొనర్చిరి. ఉదాహరణమునకు ప్రథమాంకమున కథ పెరుగుటకు మూలబీజ ప్రాయము "ముందుగ వచ్చితీవు" అన్న పద్యము. దీని యందు అనేక కథార్థహేతువుల స్థాపనము జరిగియుండుట స్పష్టము. ఆ పద్యము లేనిచో తన సహాయమున భాగప్రశస్తియే లేదు. తాను విజయసారథి యగుటయు లేదు. చివరకు నాటకమే లేదు. అంత కింకస్థాన మీ పద్యము. ద్వితీయాంకమున బంధుహింసా భయముచే సామమార్గ మనుసరించిన ధర్మజునివలె పాండవు లందఱు శాంతచిత్తులగుదురేమోయని వారియందు వీరాగ్ని ప్రజ్వలింపఁజేసిన ప్రభంజనుఁడు శ్రీకృష్ణుడు. అట్టి ప్రవృత్తికి బీజభూతము "నాల్గు పయోధులో యనఁగ" నన్న శ్రీకృష్ణ వచనము. తృతీయాంకమున శత్రుపక్షమున నగ్గి యంటుకొనుటకు "అట్టి కులంబునం బొడమి" యన్న పిడుగే ప్రథమ కారణము. కౌరవ కర్ణధారుఁడీ సంభాషణపై నాక్షేపించును. భీష్మాదులు దానితో చెలరేగుదురు. కౌరవ సభ క్రమముగా వాగ్యుద్ధముతో రణరంగమై పోవును.

చతుర్థాంకమునందు శ్రీకృష్ణుఁడు ప్రయోగించిన భేదోపాయమునకుగుండెవంటిది "అంచితులైన బంధుగుల యందఱి ముందు" అను పద్యము. కర్ణుని లోబపెట్టు నీ పద్యార్థమే నాటక సర్వ ప్రయోజనములకు మూలాధారము. పంచమాంకమున "ముందుగ భీష్ముఁ డీల్గు నని" యందఱి కన్న ముందూహించి చెప్పి పాండవవిజయమార్గమును కన్నులకుఁగట్టించి పాండవుల నుత్సాహపఱచినాఁడు. అట్లే షష్ఠాంకమునం దర్జున విషాద నివారణోపదేశమగు "చంపెడివాఁడు కాఁడొ కఁడు'' అనెడి పద్యము పాండవ ప్రవృత్తి వీరమునకు బలమైన పోషకమై వరలినది. పరమజ్ఞానసార స్వరూపమగు భగవద్గీతార్థసార మీ పద్యము. ఇట్లే శ్రీకృష్ణుని సమయోచిత వచన రచనా ధౌరంధర్య మీనాటకమున నాయకపక్షవర్తుల పౌరుషాగ్నికిని శత్రుపక్షవర్తుల రోషాగ్నికినిమూలస్థానమై నాటకప్రవృత్తికి బహుళప్రయోజన సిద్ధిని గల్పించినది. ఇట్టి సంవిధాన విధాన నైపుణ్యము తిరుపతి వేంకట కవుల కజరామరమైన కీర్తి నార్జించి తెచ్చి, మహానాటకర్తల ప్రక్కన స్థానమును కల్పించి పెట్టినది.

తి. వేం. కవులు సాంద్రమగు భావనాతప స్సొనరించి పూర్వాపర కథార్థ సంఘటనమునందు జాగరూకమనస్కులై చక్కగ చిక్కఁగ నల్లిన పట్టు చీనాంబరమువలె నీనాటకము పఠితకు గోచరించును. మచ్చున కీనాటకమునందలి ద్వితీయ తృతీయాంక నిర్మాణ పథకమును గూర్చి యించుక చర్చింతును. పాండవదూత యగు శ్రీకృష్ణునకు ధర్మజుఁడు తన హృదయమును స్పష్టపఱిచి యాతఁడు కురుసభలో నిర్వహింపవలసిన తెఱంగు విన్నవించిన వైఖరిలో తృతీయాంక ప్రణాళికయు నిమిడియున్నది. ఒక విధముగా ద్వితీయాంకమునందలి తంత్రమునకు కార్యరూపమే తృతీయాంకము. ధర్మరాజుయొక్క యభిమతము నందలి ప్రధానాంశము లివ్వి : a) "పితామహకుంభసంభవ కృపాచార్య ప్రముఖులు వినుచుండ (బేరోలగమునఁ బుత్రశత పరివృతుఁడగు మా పెద్ద తండ్రితోడ నీవుఁ గూడ నొక్కసారి సంధివచనములు విన్నవించిన వినునేమో యని తలంచెదను'' అనుట.

b) 'సంధిమాట వినినీ వినకుండగనీ మనంబు నిశ్చింతమగున్; జనంబు మన సేమమె కోరుదురు; ఎల్లవారు నిందింతురు వారి నిర్దయము; నిన్ను నుతింతురు; మాకుఁగీర్తి; సామంతనృపాలు రందఱు మా వ్యవసాయము రేటతెల్ల మగును'' అని భావించుట.

c) తారసిలు గావుత యశంబో రాజ్యమో అని నిష్కర్షించుట.

d) కలిసియుండినచో మేము నూత్రైదుగురము; లేనిచో సహోదరులం మైదుగురమే అని కృతనిశ్చయముఁ బ్రకటించుట.

e) సభలో దుర్జయులగు కౌరవులవలన శ్రీకృష్ణున కెగ్గు కలుగునన్న భయమును ప్రకటించుట.

తృతీయాంక మీ యంశముల నన్నిటిని క్రియారూపమునఁ బ్రదర్శించును. ప్రధానాంశములఁ గొన్నిటిని చూతము :

a) కృష్ణుఁడు పితామహాదుల ముందు ధృతరాష్ట్రునితో సంధి వచనములు పల్కుట.

b) కర్ణాది వీరుల ప్రబోధములు విని దుర్యోధనుఁడు సంధి కంగీకరింపక యుద్ధమునందు కృతనిశ్చయు డగుట. సభికులగు ఋషులెల్లఱు పాండవుల ప్రయత్నమును మెచ్చి దుర్యోధనునికి కర్తవ్యము బోధించుటయు, కర్ణుని

శపించుటయు, కౌరవ నిర్దయమును నిందించుటయు కౌరవ సభ రణకూటముగా సిద్ధమగుటయు, ప్రతిపాత్రయు శ్రీకృష్ణుని రాయబారమును కీర్తించుటయు, లోకమునకు నాయకునిపై సానుభూతి యేర్పడుటయు.

c) ఇందు పాండవులకు యశ మానుషంగికము. సర్వఫలము రాజ్యము.

d) పోరికి సిద్ధమై యరుగబోయిన పాండవుల దృఢ నిశ్చయము, వా రలిగినచో నేర్పడు పరిణామములు చర్చింపఁబడుట.

e) ధర్మజుఁ డూహించినట్లు కౌరవులు శ్రీకృష్ణునిపట్ల ద్రోహముఁ దల పెట్టుట.

ఇట్టి పూర్వాపర కథార్థ సంఘటన ముత్తమ కావ్యలక్షణమని తిక్కన నిర్వచనోత్తర రామాయణమునఁ జేర్కొనెను. దానినిఁబట్టి చూచినచో తి. వేం. కవులు చతురకావ్య నిర్మాణశక్తి ద్యోతమానము కాకపోదు.

నాయక ప్రతినాయకానునాయకోపనాయక పాత్రలను చిత్రించుటలో నొక్కొక్కపాత్ర యొక్కొక్క ప్రధాన గుణమునకుఁ బ్రాతినిధ్యము వహించునట్లు చిత్రించి, మొత్తమునకు నాయక ప్రతినాయక గుణ సమగ్ర సమీకరణమును సాధించు సుస్థిర సూక్ష్మ సంవిధాన శిల్పమును కవు లిందు పాటించిరి. ఇందు నాయకుఁడు ధీరోదాత్తుఁడగు ధర్మరాజు కదా! ధీరోదాత్తుఁ డిట్లుండవలెనని లాక్షణికోక్తి:

"మహాసత్త్వోఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారః ధీరోదాత్తో దృఢవ్రతః॥ (దశరూ.)

ఈ గుణములన్నియు నొక నాయక పాత్రయందే కవు లిమిడ్చుటలేదు. మహాసత్త్వము భీమునియందు, గాంభీర్య మర్జునునియందు, స్థిరత్వము నకులుని యందు, నిగూఢాహంకారము సహదేవునియందు, మిగిలిన క్షమత్వావికత్థనత్వ ములు ధర్మజునియందును, ధీరభావ దృఢవ్రతము లందఱియందును భాసించు నట్లు చిత్రించుట గమనింపఁదగినది. భీమాదుల గుణములు ధర్మజుని కంగములై యేకరూపమున ధీరోదాత్తనాయక స్వరూపమును స్ఫురింపఁజేయుచున్నవి.

ప్రతినాయకుఁడగు దుర్యోధనుఁడు ధీరోద్ధతుఁడు. అతఁడు-

''దర్పమాత్సర్యభూయిష్ఠో మాయాచ్ఛద్మపరాయణః।
ధీరోద్ధత స్త్వహంకారీ చల శ్చండో వికత్థనః॥ (దశరూ.)

అతనియందును నీ గుణములన్నియు నొక్కట భాసింపవు. దర్పమాత్సర్య భూయిష్ఠుఁడు రాజరాజు; మాయాచ్ఛద్మవరాయణుఁడు శకుని; అహంకారియు, వికత్థనుఁడునగువాఁడు కర్ణుఁడు; చపలుఁడు, చంచలుఁడు నైనవాఁడు దుశ్శాసనుఁడు. ఇట్లు ప్రతినాయకుఁడు సహాయుల గుణసముదాయమును పొంది యేకోన్ముఖముగా ధీరోద్ధతుఁడయి భాసించును. అనునాయకోపనాయకపాత్రకల్పన శిల్పమర్మజ్ఞులుగాని ఇట్టి సూక్ష్మమార్గ మనుసరింపరనుట నిర్వివాదాంశము.

నాటకములో నితర పాత్రలను కల్పించుటయందు కవులు పెక్కు చమత్కారములను ప్రదర్శించియుండిరి. అందు ప్రధానమైనది.సమాంతరములయ్యు కించిద్భేదప్రవృత్తులతో నొప్పారు పాత్రద్వయముల నొక్కొక్కజట్టుగా గల్పించుట. కాళిదా సనసూయాప్రియంవదలను, శారంగరవ శారద్వతుల నిట్టి సూత్రములపైననే నిర్మించి విశిష్ట కీర్తి నార్జించియుండెను. తత్సంస్కారముల వలనగాని లేక కథావసరముఁబట్టిగాని యిట్టి ప్రక్రియను సద్వినియోగపఱచిన కవు లభినందనీయులు. అట్టివారిలో నిందు.భీష్మ ద్రోణు లటువంటివారు. వీరిరువురును ధర్మపక్షపాతులే కాని, యొక విషయమును నిర్వహించునప్పుడు భీష్మని కున్న నిదానము, పలుకుటలోని సౌకుమార్యము, మిత్రసమ్మితముగా నుపదేశించెడి నేర్పు, గాంభీర్యము ద్రోణునియం దంతగా గోచరింపవు. కించిద్వేగప్రవృత్తియు, వాక్కాఠిన్యమును, చెప్పఁదలచినది సూటిగా బాణము వేసినట్లు చెప్పుట, ఆవేశము ద్రోణునియందుఁ బొడకట్టును.ఇట్లు కొన్ని గుణములందు వేఱువేఱయ్యు నొకే మూసలో పోయఁబడినవారివలె, జంటవీడులవలె భాసింతురు. ఇట్లే ధర్మబద్ధమైనచో తండ్రుల మతమును సమర్థించు నశ్వత్థామా వికర్ణులును, ఋషులలో జాబాలి జామదగ్న్యులును మనకు తృతీయాంకమున గోచరించెదరు. ప్రవృత్తులు వేరైనను అవివేకమునందు సములైన ఉలూక రుక్మలు కూడ నిట్టివారే. ఇంతియ కాక కౌరవులలో వర్తించుచు వారిలో కలియక వేఱుగా లెక్కింపఁదగు విదురుని పాత్రయు, పాండవుల కొఱకు కర్ణుని బలిపెట్టుకొన్న కుంతియు నీటిలో తైలబిందువులవలె మనకు ప్రత్యక్షమగుచుందురు. త్రికరణములకుఁ బొత్తు కుదరని ధృతరాష్ట్రుని పాత్రయు, బడబాగ్నివంటి రహస్యములను గుండెలలో దాచిన దుఃఖసముద్రమువలె నబ్బురము గల్పించెడి గాంధారియు ప్రవాహ వేగమునకు కొట్టుకొనిపోవు వృక్షరాజములవలె పతితలకు సాక్షాత్కరించెదరు. కలహప్రియుఁడగు నారదుఁడు శాంతికాముడై సహజవిరుద్ధముగా గోచరించును. ఈ విధముగా

నటుపాత్రల స్వరూప స్వభావ నిరూపణమునందును, ఇటు గుణముల కాకృతి కల్పనము చేయుటయందును నేర్పుఁ జూపించిన తి.వేం. కవులు సవ్యసాచు లనుటలో నతిశయోక్తి లేదు.

జంటకవులీ నాటకమున నొనర్చిన పద్యచమత్కృతు లనంతములు. మచ్చున కొకటి రెండు :

1) నాట్య రహస్య మెఱిఁగిన తి.వేం. కవులు అభినయానుకూలములగు పద్యములను రచించుట యందు సిద్ధహస్తులు. మచ్చునకు :- "అదిగో ద్వారక యాలమందలవిగో" అను పద్యమును గైకొందము. ద్వారకకు గనుమేఱ దూర మున నున్న యర్జునుఁ డీ పద్యము నారంభించి పదవిన్యాసము నభినయించుచు దేవకీనందను నంతిపురము జేరువఱకు తాను గాంచిన విశేషములను క్రమముగా నావేశముతో నభివర్ణించుచు - (ద్వారక - ఆలమంద - కోట - అగడ్త - రథ్యలు - యాదవులు- యదుసింహాని మేడ - గజశాలలు - అశ్వశాలలు) నొక పరిణామ విధానశిల్పమును పాటించియుండిరి. మహాకవు లిట్టి శిల్పములు శ్రవ్యకావ్యము లందు వాడిరి. ఉ॥ నన్నయ్యగారు దుష్యంతపాత్రను కణ్వాశ్రమమునందుఁ ప్రవేశపెట్టునప్పు డిట్టి మార్గమును జవి చూపించి యుండిరి.*

2) "జెండాపై కపిరాజు" అన్న పద్యమునందు దూరమునుండి వచ్చు చున్న రథము ప్రేక్షకుల కెట్టి క్రమమునఁ సంపూర్ణ దర్శనమిచ్చునో అట్టి విధమున స్వాభావికవర్ణన మొనర్చియుండిరి. మొదట దెక్కెము, ఆపై గుఱ్ఱములు, సారథి, రథము, రథికుఁడు క్రమముగా గోచరించుట సహ జముగాన ఆ క్రమము పాటించుటవలన వర్ణనకు స్వాభావిక సౌందర్యము సంత రింపఁబడినది.

3) సాభిప్రాయములైన పాత్ర సంభాషణల ముఖమున వస్తుగౌరవమును వ్యంగ్యముగాఁ బ్రతిపాదించుచు నప్పుడప్పుడు కవులు వాక్చమత్కారముఁ గల్పించుచుందురు. ఉదా॥ కర్ణుఁడు చతుర్థాంకమున—

---

* కొందఱు నటులు "అదిగో ద్వారక" అను పద్యము వేదికపై నిలువఁ బడి చదువుచు నభినయించుట చూచితిని. వారికి యభినయ రహస్యము బోధపడలేదని విచారించితిని. ఒక చలనచిత్రమునందుకూడ ఈ పొరపాటే అభినయ విశేషముగా పాటించుట శోచనీయము.

మ. "మనమా పార్థుల వంకకుం జనదు కర్మంబెట్టిదో! సారె చె
ప్పిన లాభం బిక లేదు కీర్తికయి పృథ్వీనాయకుల్ పోరి చ
చ్చినఁజాని; మ్మిది భారతావనికి సుశ్రీ దెచ్చి దృష్టాంతమై
చనుఁగా కెల్లెడ మేటిసత్కవుల వాదాశుద్ధికిన్ మూలమై."

భావికాలమున మేటికవులకు మేటి కావ్యవస్తువు దొరకుటకొరకై కర్ణుఁడు పాండవ పక్షమునకు రాఁదలఁచలేదని యిచ్చట వ్యాఖ్యానించుట నిజముగా హాస్యాస్పదము కాగలదు. అందులోని కవుల ఆత్మీయతను గాంచి హర్షింపవలసినదే!

గురువులు, శిష్యులు తమపైఁదలపడి వాగ్యుద్ధమునకు సిద్ధపడగా నయాది యుపాయములతో నుద్యోగించి, విజయలబ్ధిని సాధించిన తి.వేం. కవుల కీ పాండవోద్యోగవిజయ నాటకములు స్వీయచరిత్రకు పరోక్ష వ్యాఖ్యానము లగునేమో! మహాకవుల వాక్కులందలి ధ్వనికి మేరలెక్కడివి?

## పాండవ విజయము

కురుక్షేత్ర యుద్ధఫలము 'పాండవ విజయము.' ఇరుపక్షములు యుద్ధ ప్రవృత్తిలో మసలిన చరితము యుద్ధపంచకమున విపులముగ వర్ణితమై యున్నది. ఈ నాటకమున కది వస్తువు. అందు యుద్ధవీరము ప్రధాన రసము. యుద్ధ పంచక విభాగ మొక విచిత్ర కథానిర్మాణ రహస్యమును ప్రవచించుచు పాండవ వీరుల యుద్ధ పాటవమును చాటుచున్నది. పాండవులకు ధృష్టద్యుమ్నుఁడు సర్వ సేనాని. సౌప్తిక పర్వమువఱ కాతఁడు సజీవుఁడై యుండును. కౌరవులకు నలుగురు సేనాపతులు మారిరి. వారి నొక్కొక్కరిని సంహరించుట కొఱకై వేర్వేఱుగా పాండవులు చేసిన యత్నములను నిరూపించుటయే ఒక్కొక్క పర్వము యొక్క ప్రయోజనము క్రమముగా క్షీణించు కౌరవ వీర నివహ మొక వైపును, కొంత తఱిగినను మూలబలము చెదరని పాండవ బలమును మఱియొక వైపును గాంచెదము. తుల్యపరిశీలనదృష్టితోఁ బరిశీలించినచో ప్రతితకు నాయకుని విజయసాధన సామర్థ్యము వ్యక్తము కాకపోదు. సౌప్తిక పర్వమున నశ్వత్థామ రౌద్రమూర్తియై పాండవబలమును హతమార్చి కసిదీర్చికొన్నను, తచ్ఛిరోరత్న సాధనరూపమున పాండవు లాతనిపై దెబ్బతీసి విజయసమేతులై యొప్పియుండిరి. శత్రుశేష మప్పటికిగాని నిశ్శేషము కాలేదు. కావున సంపూర్ణ విజయము సౌప్తికపర్వ ద్వితీయాశ్వాసమునందు పాండవులు పొందిరని చెప్పవచ్చును.

యుద్ధ పంచకమందలి కథను నాటకముగా వ్రాసి, పాండవ విజయమని కవులు పేరిడిరి. యుద్ధాదు లాధికారికవృత్తమునఁ బ్రయోగ నిషిద్ధములు. వీర రౌద్రాదులు ప్రయోగానుకూలములు గావు. అనఁగా యుద్ధకాండలో క్రియాత్మకమైన కథాప్రవృత్తికి ప్రయోగ యోగ్యత నాటకమున నంతగా లేదన్నమాట! కాగా, వాగ్రూపమైన యుద్ధ ప్రవృత్తి యీ నాటకమునం దధికముగా గోచరింపక తప్పదు. వీర రౌద్ర రసస్ఫోరకములగు సంభాషణాదులు విశేషముగాఁగల కథా భాగము లెన్నుకొని కవులు వాని నాధికారికముగా నొనర్చి రచించి మిగిలిన కథయంతయు సూచ్యవస్తు ప్రక్రియలతో సాధింపవలసి వచ్చును. ఇందు మొదటి ప్రక్రియ యందు నాటకీయత రసపోషణము అధికముగా నుండుటకు వీలున్నది కాని రెండవదానియం దంత లేదు. ఈ నాటకమునందు తి.వేం. కవులీ చిక్కుకు కొంత గురికాకపోలేదు. రసవత్తర కథా ఘట్టములు వర్ణింప బడిన ప్రథమ, తృతీయ, షష్ఠ, సప్తమ్యంకము లొక వైపు తేజోవంతములై వెలుఁగుచుండ, సూచ్య వస్తు ప్రక్రియలను ప్రధానముగా నాశ్రయించి రచించిన మిగిలిన యంకములు వానిముందు వెలవెలపోవుచున్నవి. ఇది యనివార్యము. కాని, సూచ్య వస్తు ప్రక్రియలు శ్రవ్య కావ్యమువలె భాసించి పఠితకు మాత్ర మానందము కల్గించుచుండును.

భీష్మని తృతీయ దివస యుద్ధము ప్రథమాంకమందలి వస్తువు. శ్రీకృష్ణుఁడు చక్రధారియై భీష్మునిపై లంఘించుటయు, పార్థివ ప్రార్థితుఁడై తత్ప్రయత్న విముఖుఁ డగుటయు నిందలి కథ. భీష్ముఁడు చక్రధారిని భక్తి పారవశ్యముతోఁ గీర్తించుటయు, తచ్చక్రధారణ హేతువును భీష్మ పాత్రలో వితర్క రూపమున సూచించుటయు, కృష్ణుఁడు ధర్మజునకు భీష్మునడుగవలసిన వరమును దాని తీరును సూచించుటయు, భీష్ముని హృదయము పాండవులపట్ల నార్ద్రమగుటతో నంకము ముగించుటయు ననుఘట్టము లీయంకమున కవులు కడు రమణీయముగా సామర్థ్యముతో నిర్వహించిరి. "వెనుకకుఁ బోగు" అనెడి పద్యములోని యుపమాలంకార సౌందర్యము, ''నేడుగా నాధనుర్నిగమంబు", ''దయసేయంగదవయ్య" అనెడి పద్యములందు భక్తిభావస్ఫోరక మగునట్లు పాదయమక శబ్దాలంకారము ప్రవేశపెట్టుటయు, ''చక్రము దాల్చితీవు" అనెడి పద్యమునందలి దుష్కర ప్రాస నిర్వహణముచే రచనా శిల్పము వెలార్చుటయు,

"విలయాంభోవము లీల" యనెడి పద్యమున రీతిశయ్యా సౌభాగ్యము రసోచిత ముగా సంధించుటయు, "టంకారం బొనరించె" అను పద్యమున భావావస్థ కనువైన బిందుపూర్వకాక్షరముల సంయోగము. పరుషాంతస్థ వర్ణ ప్రయోగ బాహుళ్యము నొనర్చుటయు, "చిన్నతనమున" అనెడి పద్యమునందు స్నిగ్ధ భావావిష్కార శిల్పమును ప్రయోగించుటయు వీరి రస శిల్ప సృష్టి కనల్పో దాహరణములు.

ద్రోణ పర్వమందలి కథా నాధారముగాఁ గొని కవు లీ నాటకమున ద్వితీయ తృతీయ చతుర్థ పంచమాంకములను రచించిరి. అందు ద్వితీయ చతుర్థ పంచమాంకములు చూళికాది సూచ్య కథా ప్రక్రియా బహుళములై వచన రచన మెక్కువ కల్గి, వస్తు ప్రాధాన్యముగ రచింపఁబడియున్నవి. అందును కవిత్వ మహత్వమున కెట్టి కొదువయుఁ గానరాదు. "కనకక్షోణి ధరంబుపై" నందలి యుపమాలంకారము, "శృంగమునందు" నందలి యుత్ప్రేక్షయు, "సత్యముచేతనన్" ఇగము నందలి రుచిరార్థ సూక్తియు, నిట్లే తత్తత్సన్నివేశ నిష్ఠములౌ పాత్రల సంభాషణలలోని పలుకుబడుల బిగువును పఠితల కాహ్లాదము కలిగించుచున్నవి. సూచ్యకథార్థమై ప్రయుక్తములగు పాత్రల ముఖమున కవులు కథ చెప్పించుటతోపాటియంకము లందు కొన్ని రచనా శిల్ప విశేషములను గూడ ప్రపంచించి యుండిరి. అట్టి వానినిఁ గొన్నింటి నిచ్చట సూచించెదను :

1) రణరంగము ప్రేక్షకుని కన్నులకు గట్టునట్లు వర్ణించెడి ప్రక్రియా విశేషములన్నియు నీ పాత్రల పల్కులలో ప్రతిబింబింపఁజేసిరి. సంకుల ద్వంద్వ యుద్ధాది భేదములు స్పష్టమగునట్లు కడు సున్నితముగా వర్ణించిరి. ఉదా : విశ్వావసు కృశాను లిర్వురు రెండు దిక్కుల కరిగి యుద్ధ విశేషము లన్నింటిని సమకాలముననే ప్రేక్షకుల కందించునట్లు చిత్రించుట కవుల ప్రతిభకు నిదర్శనము.

2) తిక్కన వలెనే కవులు నిత్య జీవితమునకు సన్నిహితములగు నుప మానములనే యెన్నుకొని త్రిగుణాత్మకులగు ప్రేక్షకుల కందఱకు రసప్రతీతి కల్గునట్లు పాటుపడిరి. ఉపమ, రూపకము, దృష్టాంతము, ఉత్ప్రేక్ష, పరికరము మొ॥ అలంకారములను మాత్రమే వాడి, సరళ సుందరమైన రచనకుఁ గృషి చేసిరి.

3) విషయ సంగ్రహ విభజనమునకు ప్రాధాన్యమున్న చోటను, నీరస కథాభాగ కథనమునందును, రణరంగ వర్ణనమునందును, ద్వంద్వాది యుద్ధములు ప్రవర్తిల్లెడి యోధుల నామాది విశేషములు జేర్కొనుటయందును, భయానక బీభత్స రసప్రయోగ సమయములందును వచన మధికముగా కవులు వాడిరి.

4) పాత్రల స్వరూప స్వభావ ప్రత్యక్షీకరణము ఆయా ఈ పాత్రల సంభాషణముల ద్వారా యొనర్చుట. ఉదా: "అభిమన్యుండభిమానమాన్యుడ"ను పద్యము.

5) ఒక్కొక్కచో నేకదివసవృత్తమే కాక బహుదినవృత్తములు రూపక ప్రయోగ దృష్టితో సమన్వయపఱచి యేకాంకమునందు ప్రయోగించిరి.

ఇట్టి ప్రక్రియల ననుసరించి నిర్మించిన వానిలో ద్వితీయాంకమునకు ద్రోణపర్వ ద్వితీయాశ్వాసము మూలము; చతుర్థాంకమునకు సైంధవ వధ ఘట్టము మూలము. పంచమాంకమునకు ద్రోణవధయు, నారాయణాస్త్ర ప్రయోగ ఘట్టములు మూలములు. వీనినన్నింటిని భారతముతో బోల్చిన నతి సంగ్రహములుగా నుండును. అట్లే ఉండవలయును గూడ. లేనిచో బరిమితకాలములో నాడబడు నాటకముల చేటభారతములు కావా?

తృతీయాంకమునం దభిమన్యువధఘట్టము వస్తువు. తెలుగువారి హృదయముల కతి సన్నిహితుడై, విషాదవీరుడై విఖ్యాతబలుడై, భాసించిన బాలవీరుడీయభిమన్యుడు. జంటకవుల లేఖిని ఈ యంకము రచించునెడ నమృతవృష్టి కురిసి, కథను రసార్ద్రమొనర్చి వైచినది. తెలుగువారు పాండవ విజయములో నీయంకమున కెనలేని గౌరవమిచ్చుచుందురు. ధర్మజార్జున పాత్రధారుల కిప్పట్టు గట్టిదైనను సాత్త్వికాభినయ మొనర్చి మెప్పించిన మేటినటులు ప్రజల మన్ననలకు బాత్రులగుచున్నారు. ఈ యంకములోని కొన్ని విశేషముల నిచ్చట పొందుపఱతును :

1) ధర్మజభీమునకుల సహదేవ పాత్రలచే మానయశోవీరములకుద్దీపనములగునట్లు విభావములయ్యెడి పల్కులు తేనెచిన్కులవలె తి. వేం. కవులు రచించిరి. ఉదా :-

"ధర్మ : ఇంత సేవు సమరోర్విం గ్రీడియుం గృష్ణుఁడుం దోకోకుండిన నుత్తరదే" యనువదంతిం బాపి కాపాడుమా!

వకుల : "మముఖూరులఁజే.పఁగదయ్య! నేది సంగరమునఁ గుంతిలోఁజసుత కంటెను గోడలు వీరమాతగన్."

సహ : 1) మొగ్గరంబు సొచ్చి మొనసించి పాండురూపాలు కీర్తి నిలువవలయు నయ్య. 2) "కీర్తి నిలుపం దగునయ్య కుమార! మమ్ము నా శౌరియు నన్నయున్ బరవసంబున నుల్లసమాద కుండఁగన్.

2) అభిమన్యుని ప్రతిజ్ఞ మూలాతిశాయిగా నాటకమునఁ జిత్రించినారు కవులు. "ఆకలిమాటచేపడి"; "ద్రోణులు కర్ణశల్యులు" అన్న పద్యములను ద్రోణ ద్వి 10, 11, 15 లతో పోల్చి చూచినచో నది స్పష్టము కాఁగలదు.

3) భారతమున నభిమన్యుఁడు యుద్ధసన్నద్ధుఁడగుచుండ సారథి మారు పల్కి దుశ్శకునము స్ఫురింపఁజేయఁగా - ఇందు ధర్మరాజానర్చు ఆశీస్సులోనే సందిగతముగా నపాయార్థము స్ఫురించునట్లు రచించిభావికథను ధ్వనింపఁజేయుట మూలముకన్న ముచ్చటగ నున్నది.

4) "ఆకర్ణాంతము" "తమ్మిపూరేకులు" అన్నవి యమూల్యములైన పద్యరత్నములు; కరుణరసప్రవాహతుల్యములు; విభావ పరిపోషణ సమర్థములు; కవిలోక కీర్తనీయములు. ఆ పద్యములలో నమరుద్రైన యభిమన్యుఁడు సజీవ ముతో ప్రత్యక్షమగుచున్నట్లుండును.

5) కొన్ని పద్యములు మూలమునకు ఛాయలుగా వచ్చినవి యున్నవి. ఉద్యోగ - ద్వి. 247, 248 పద్యములకు "పాపాత్ముండు" అనెడి పద్యము ఛాయానుకృతి.

6) ఈ యంక నిర్మాణ మొక వర్షాకాల దివసమువలె విచిత్రముగా శోభిల్లుచున్నది. ప్రకాశవంతమైన దివసారంభమున ముంచుకొని వచ్చినట్లు కారుమబ్బులు వ్యాపించి, కుంభవృష్టి కురిసి, పిదప గాలి తాకిడికి మబ్బులు తేలిపోవ పగలు మఱల పూర్వ తేజమును పొందినట్లే అంకారంభమునందుషః కాంతులతో వీరరసము స్ఫురించి విషాద నీలమేఘచ్ఛాయలతో క్రమముగాఁ గప్పఁబడి కరుణరసముచే కడునార్ద్రమయి, రౌద్రపవన సమీరితమై, మేఘములు

తొలంగిపోగా పూర్వసిరము ద్విగజీకృతశోభలతో భాసించుచు నింపుగొల్పుచున్నది.

7) కరండక బకోటక యుయుత్సాది పాత్రలచేత దీర్ఘ వచనములు చెప్పించినను, ముందు వెనుకలు వీరరసము మురిదియెత్తుచుండుటవలనను, ధర్మరాజాదుల కరుణమంతర్భూతమై ప్రవహించుటవలనను ఈ యంకమునందు రసస్ఫూర్తి కెట్టి యవరోధము గల్గకుండ కొనసాగినది.

8) "ఊరకుక్కలు పదివేలు చేరనేల
దాలదే వేటకై యొక్క జాగిలంబు" - ఇటువంటి పద్యములందు సిచోపమాన దోషము లున్నవను విమర్శలున్నను ప్రాచీన ప్రయోగము లిట్టివి కాననగుటచే సమర్థింప వీలును దానివెంట కలుగుచున్నది.

షష్ఠాంకమునందు కర్ణవధఘట్టము వర్ణితము. విషాద రూపక నాయకుని వంటివాఁడు కర్ణుఁడు. 'కర్ణుఁడు లేని భారత'మన్న సామెతయే వెలసినది తెలుఁగున. ప్రజాదరము నధికముగాఁ జూరగొన్న పురాణ పాత్ర కర్ణుఁడు. ఈ యంకమునందును చూళిక లధికముగా నున్నవి. కాని, కథలోని బిగువుచే వానివలన రసపుష్టికి నష్టము కలుగలేదు కాని, ప్రదర్శనమునందు మాత్రము అవి యంతగా రాణింపవేమో! అందువలననే నటకులు దాలపలు కీ సూచ్య భాగమును ప్రయోగించుట మానివేయుచున్నారు. శల్యసారథ్యము, అర్జునుఁడు ధర్మరాజు నుపాలంభించుట, కర్ణుని యంత్య దశ కవులు సామర్థ్యముతో రచించిరి. ఈ యంకమునందలి "నీ మూలమున గదా" "కొడుకుల నిర్వురన్ గనియె" "ఓదము త్రవ్వి కాచుకొని" "ఇచ్చితి నర్థికోటికి" అను పద్యములు తెలుఁగునాట ప్రేక్షకాదరణము పొందిన పద్యములలో నెన్నఁదగినవి.

ఈ నాటకమున సంధి సమన్వయ మిట్లు చేయవచ్చును. ప్రథమాంకమున ముఖసంధియు, ద్వితీయాంకమున ప్రతిముఖ సంధియు, తృతీయ చతుర్థ పంచమ షష్ఠాంకములలో గర్భసంధియు, సప్తమాంకమున నవమర్శ సంధియు, అష్టమమున నిర్వహణమును నాటకమునందు నిబంధింపఁబడినవి. కాని, ఈ నాటక పరిసమాప్తి యంత సంతృప్తి నిచ్చుట లేదు. అశ్వత్థామ రౌద్ర స్ఫూర్తితో నిర్వహణము నందుండవలసిన అద్భుత రసము కల్పింపవలె ననెడి కవుల యత్నమే యిట్టి రచనకు కారణమై యుండనోపును. దీనియం దసమగ్రత

యీ క్రింది కారణముల వలనఁ గలుగుచున్నది: (1) అష్టమాంకమున నాయక ప్రతినాయకులు యుద్ధమునం దొనర్చిన పుణ్యపాపముల చర్చ దీర్ఘముగా సాగును మూలమునందును ఇట్టిది కలదు. కాని, అందు నాయకపక్షముయొక్క ధర్మప్రవృత్తి నధికముగాఁ బఠితృ హృదయమునకు హత్తునట్లు ఆ సంఘటనమును చిత్రించుట జరిగినది. ఇందు కవులు దుర్యోధన పాత్ర చిత్రణమునం దధికాభినివేశముగల్గి సన్నివేశమును చిత్రించి నాయక పక్షమునం దంత శ్రద్ధ వహింపక నాయకుఁ డధర్మ విజయియని తాము వ్యంగ్యముగా పాత్రముఖములందు నిరూపించి*నాటకము ముగించినారు. ఇట్టిదే నిర్వహణమైనచో నాయకాశ్రితమైన రసము కవులు ప్రస్తావనలోఁ బేర్కొనినట్లు వీరము కాదు. ధర్మబద్ధముగాని యుత్సాహము వీరము కాదు. కాగా నాయకుఁ డర్థ దృష్టితో ధర్మము పాటింపకపోవుటచే నిది వీర రసాభాసమగును. దాని కప్పు డంగిత్వము లేదు. రౌద్ర మంగి కావలసి వచ్చును. కావున ఈ ముగింపు కవు లూహించిన ప్రణాళికకు మూలవిచ్ఛేదమంత్రమగుచున్నది.

2) ప్రతినాయకుఁడగు దుర్యోధనుఁడు తొడలు విరిగి పడుటతోఁ బాండవులకు రాజ్యాధికారము వచ్చినట్లే అయినను, అశ్వత్థామ సైన్యాధిపతిగాఁ బట్టాభిషిక్తుఁ డగుటతో శత్రు యత్న మంతముకాలేదని స్పష్టము దానిఫలము నాయక సర్వసైన్యవధ. నాయకుఁడు దీనికిఁ బ్రతీకార మొనర్చి తన సర్వాతిశాయిత్వమును, విజయమును నిలిపికొనినగాని నాటకమున కొక సంపూర్ణమయిన ముగింపురాదు. శత్రు నిశ్శేషమైన గాని నాయకునికి విజయము రాదు. మహాభారతమునందును సౌప్తిక పర్వద్వితీయాశ్వాసాంతమునగాని పాండవులకు విజయము సంపూర్ణముగాఁ గల్గుటలేదు. భారతమును బట్టి చూచినను ముగింపు సమర్థనీయము కాదు.

---

* కృపా: కౌరవేశ్వరా! నీవు వారికంటె సర్వవిధంబుల సుకృతాత్ముఁడవు.

గీ॥ బాంధవులతోడ సకల సంపదల తోడఁ
త్రిదివమున కేగుదువు జగద్విదితకీర్తి
వంశమూ లేక తగిన సంపదలు లేక
వారు జీవచ్ఛవంబులైనారు నేఁడు" - అష్టమాంకము, 113 పుట.

3) భరతవాక్యము కృష్ణుఁడు పల్కుట కన్న సంపూర్ణ విజయానంతరము ఏ కృష్ణుని వందివాఁడో పల్కియుండిన బాగుండెడిది.

4) పాండవాశ్వమేధ నాటకము నందలి ప్రథమాంకము నిందు చేర్చి చదివినచో నీ నాటకమున కొక సమగ్రత వచ్చును.

5) కొంద ఱిట్లు వాదింపవచ్చును: కౌరవవీరులు విజయార్థులై పాండవుల నిర్జించినట్లు ఉపక్రమోపసంహారములను బట్టి యూహింపవచ్చును గదా! అని. అది యోగ్యము కాదు. ఎప్పట్టునను నాయకుఁ డీనాటకమున ధర్మరాజే కావలెను. నాటక నామ మదియే ధ్వనింపఁజేయు చున్నది. అట్లు కాక దుర్యోధనుఁడే నాయకుఁ డన్నచో నాయకవధ జఱిగినది. రసము చెడినది. ఇది లక్షణ విరుద్ధము.

6) లేక యిది విషాదాంత నాటకముగా భావింప కొంతవలను పడవచ్చును. అందు దుర్యోధనుఁడే నాయకుఁడు కావలెను. కాని, ప్రస్తావనలో కవు లుద్దేశించిన దృష్టి యది కాదు. కావున నట్లు విమర్శించుట నేలను విడిచిన సాము కాఁగలదు.

పాండవోద్యోగ విజయములు కలిపి మొదట యొక నాటకముగనే యుండెడిదనియు, తరువాత రెండైనవనియు 'జాతక చర్య' చెప్పుచున్నది. ఎట్లైనను కళాస్రష్ట స్వయముగా సంపూర్ణముగా సిద్ధము చేసి, బయటికి చివరి సారి తెచ్చిన శిల్పమే మనకు దర్శింప యోగ్యమగును కావున తత్పూర్వ స్థితిలో నెట్టిరూపమున నున్నను మన కంత యోజింపఁదగినది కాదని నేను తద్విమర్శనము వదలినాను.

ఈ నాటకమునందలి యంగిరసమును గూర్చియును, తత్పోషణార్థమై కవులు ఈ నాటకమునఁ బ్రవేశపెట్టిన క్రొత్త మార్పును గుఱించి కొంత మీమాంస చేయవలసియున్నది. మహాభారతములోని యుద్ధ పంచకమునందు ప్రధానమైన రసము వీరమని కొందఱు, రౌద్రమని కొందఱు పండితులు భావించు చున్నారు. ప్రసిద్ధమగు నా యితివృత్తమునే గైకొని నాటకముగా రచించుచు బ్రస్తావనలో తి.వేం. కవులు-

చ. నవరసపూర పూరితము నాటక మీ యది యంచు నెంచ పాం
డవ విజయంబుఁ దెల్గున నొనర్చిరి వీరరస ప్రధానమున్''

అని, యిందలి అంగిరసము వీరముగాఁ బేర్కొని యుండిరి. నా వీరరస గ్రంథము నందును ఈ కథా ఘట్టమున నంగి రసము వీరరసమనియే పేర్కొని

యుండిని. దానిని కవుల వాక్కులు బలపఱచుచున్నవి  కాని, రౌద్రరసవాదు లిందొక యాక్షేపణఁ దెల్పుదురు. ధర్మజుడు హరిశ్చంద్రాదుల వలె వినిర్మల ధర్మము నాచరించినవాఁడు కాఁడనియు, రాజ్యలాభ మనెడి యర్థ సిద్ధికే యాతఁడు ప్రాకులాడెననియు, ఫలసాధనమునం దుపకరణ పారిశుధ్య మొక్కొకచో మవ్యస్థ మయ్యె ననియు వారి వాదతాత్పర్యము. ఈ వాదము నిలువదని నాభావము. కవు లీవాదము ననుసరింపలేదని స్పష్టము.

"తతో౽ర్థ కామయో ర్ధర్మమూలకత్వాత్ ధర్మప్రధానో వీరః" అని అభినవగుప్తపాదులు. ధర్మపురుషార్థులగు ధీరోదాత్తుల నాశ్రయించిన యుత్సాహమే వీర రస నామయోగ్యమని తాత్పర్యము. సంస్కృత మహాభారతమునందే ధర్మ లక్షణము లిట్లు చెప్పఁబడి యున్నవి:

"ధృతిః క్షమా దయా౽స్తేయం శౌచ మింద్రియ నిగ్రహః।
హ్రీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్"

అని యాజ్ఞవల్క్య స్మృతిలో అహింస, సత్యము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, దానము, దయ, క్షాంతి మొ॥ గుణముల వలన ధర్మము సాధ్యమగునని పేర్కొనఁబడి యున్నది. అట్టి ధర్మప్రవృత్తియే ప్రధానమైనది వీరమనఁబడునుగదా! అగుచో వీరరస భేదములలో యుద్ధవీరము ముఖ్యమైనదే. యుద్ధము హింసా ప్రధానముకదా! అహింసా ప్రధానమైన ధర్మము యుద్ధము వల్ల నెట్లు వర్తించును? దయాభావము, అక్రోధము, దానము, శౌచము మొ॥ గుణములు యుద్ధకాంతములోఁ బ్రకాశించుట సకృత్తు. అట్టిచో యుద్ధప్రవృత్తియే అధర్మమగుచు వీరరసనామమున కయోగ్యమగుచున్నది. అట్లగుచో యుద్ధవీరమును లాక్షణికు లేదృష్టితో గ్రహించినట్లు?

"ధర్మయుద్ధ ప్రధానో ధీరోదాత్తః" అను నియమములో ధర్మపథమన నెట్టిది. ధర్మము స్థూల సూక్ష్మభేదముచే ద్వివిధము. స్థూలధర్మమును వెనుక చెప్పితిని. స్థూలధర్మమున కెచ్చట విప్రతిపత్తి వచ్చునో అచ్చట సూక్ష్మధర్మమును ధర్మజ్ఞులు పాటింతురు అట్టివానిలో వర్ణధర్మ మొక్కటి-

"స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి।
ధర్మ్యార్ధి యుద్ధాచ్ఛ్రేయో౽న్యత్ క్షత్రియస్య నవిద్యతే."
—భగవద్గీత. 3 అ. 31 శ్లో.

అను గీతావాక్యము ననుసరించి క్షత్రియుఁడగు ధీరోదాత్తుని వర్ణధర్మ మగుచున్నది. "జగంబులు ధర్మమయంబులు. ధర్మువునకు మిక్కిలి యొండె ద్దియు లేదయినను ధర్మార్థంబుగాని ధర్మువు క్షత్రియుల కయుక్తంబ"ని మహా భారతము. (అరణ్య. ప్ర. అ. 246) ధర్మమూలకమై అర్థార్థంబగు యుద్ధము క్షత్రియులకు ధర్మమని యిప్పటికి తేలినది. దీనిని క్షత్రియ రణనీతి యనియు, బేర్కొనవచ్చును. అనఁగా న్యాయముగా తాననుభవింపఁదగిన యర్థమును సాధించుటయందు క్షత్రియుఁడు యుద్ధమును సాధనముగా - లేక - నిమిత్తముగా గైకొనునన్నమాట నిమిత్త భేదముచేత మౌలికమైన ధర్మవృత్తి యుద్ధవీరమని పిలువఁబడుచున్నది. అర్థసిద్ధికై ధర్మవిలుప్తముగా గూడ యుద్ధమును స్వీక రించెడివారుందురు. కాని, వారిది ప్రవృత్తివీర మనఁబడదు. క్రోధప్రధానమగు రౌద్రమునం దది రాణించును. వీరాంగమగు రౌద్రము ధర్మముచే శాసితమగును. యుద్ధక్రియాంతమువఱకు నిలచు నుత్కటోత్సాహము ధర్మనిష్ఠమై యున్నచో నది యుద్ధవీర మనఁబడును.

సామాన్యముగా వీరరస వాక్యములందు ప్రతినాయఁకుడు ధీరోద్ధతుఁడై రౌద్రరసాశ్రయుఁడై యొప్పుచుండును. వీర రౌద్ర రసద్వయాశ్రయుల కెల్లఱ కును యుద్ధ ముపాదేయ మగుచున్నప్పుడు యుద్ధ ప్రక్రియలలో ధీరోద్ధతుఁడు మాయావియై ధర్మభీతి లేక వర్తించునప్పుడు నాయకుఁడు ధర్మసాధకుడయ్యు దూర్తుఁడగు శత్రువును యుద్ధమునం దెట్టి ప్రక్రియతో సాధింపవలె ననెడి ప్రశ్న యుదయించును కదా! రాజ రణనీతి ప్రధానమగు యుద్ధములో మాయను మాయతోడనే సమయింపఁజేయవలెను. అట్టి పట్టులందు యుద్ధ ప్రక్రియలో విజయార్థ మవలంబించు మార్గములనుబట్టి లక్ష్యశుద్ధియు, మనశ్శుద్ధియు గల్గి ధర్మమూలుఁడగు నాయకుని నధర్మవర్తునిగా కేవలము అర్థకామిగా భావించుట యోగ్యమా? అట్లు భావించుచో ధర్మమూలమగు వీరమునకు యుద్ధమున వల సిద్ధియే లేదు.

ధర్మరాజు ధర్మముగా తనకు రావలసిన యర్థముకొఱకు దూర్తుఁడగు దుర్యోధనునితో సామాద్యుపాయములఁ బ్రయోగించి యత్నించి విఫలుఁడై గత్యంతరము లేక దండోపాయము నాశ్రయించినవాఁడు. ధర్మలుప్తి అర్థతృష్ణ రారాజు యత్నమున కాయువు పట్టులు. కావున ధర్మమూలమగు ధర్మజుని యుద్ధ ప్రక్రియ శత్రు విజయోపకారకములగు సవాంతర యుద్ధ తంత్రములం దెద్దియో

యధర్మ భ్రాంతి-"అశ్వత్థామః హతః కుంజరః" అనునట్టివి - కల్గించినను అతని ప్రవృత్తియం దది నైజముగా భాసించుటలేదు కావున నిట్టివి అధర్మములని భావింపఁబడవు తేజశ్శరీరియైన సూర్యుని శరీరమందు మచ్చలున్నను అవి యతని ప్రధానగుణమగు తేజముచే ఛన్నములై ఎట్లు ప్రకాశవంతములే యగుచున్నవో ధీరోదాత్తుని యుద్ధతంత్రములు కూడ యతని ధార్మిక వృత్తిని కల్మషపరుపఁజాలవు ఈ తత్త్వ మిట్లు గ్రహించిననే గాని యుద్ధ వీర రస కావ్య శిల్ప మర్థముకాదు. కానిచో యుద్ధ ప్రవృత్తికే వీర రస నామము తొలగించవలసియుండును. ఇది మహాభారత విషయము.

తి. వేం. కవులు మహాభారత కథలో ధర్మరాజు నెదుర్కొను నీ గడ్డు సమస్యను శస్త్ర చికిత్స వలె నొనర్చి ఆ పాత్ర కెట్టి కల్మష మంటకుండ పరిశుద్ధునిగా నొనర్చిరి. ఈ నాటక పంచమాంకమున అసత్యభీతిచే కుందు ధర్మజుని కాదనకయే శ్రీకృష్ణుఁడు భీమునిచే హిడింబను ప్రయోగింపించును. అది ధర్మజుని గొంతుకతో అశ్వత్థామ మృతుఁడయ్యెనని అరచును. ద్రోణుఁ డది విని అస్త్ర సన్న్యాస మొనర్చును. అసత్యదోషము ధర్మజుని కంటలేదు. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమున దుర్వాస శాపమును ప్రవేశపెట్టి కథానాయకుని శీలము నెట్లు కాపాడెనో అట్లే ధర్మరాజ శీలమును కాపాడి తి. వేం. కవులు వందనీయులగుచున్నారు. ఈ మార్పు నాయకులయొక్క అగ్నివంటి ధర్మశీలమును తెల్పుచున్నది. అట్టి ధర్మవీరు నాశ్రయించినది ధర్మయుద్ధ వీరము.

ఈ నాటకమునందు కవులు రసపోషణ విషయకములైన చమత్కారములు పెక్కొనర్చియుండిరి. మచ్చునకు-

1. ప్రథమాంకమునం దర్జునుని యందు యుద్ధవీరమును ప్రజ్వలింపఁ జేయుటకై శ్రీకృష్ణుఁడు చక్రము చేపట్టును. భీష్ముఁడు శ్రీకృష్ణునిఁ గీర్తించును. అనఁగా ప్రతినాయక పక్షవర్తియగు భీష్మాశ్రితమైన ప్రవృత్తి వీరము శ్రీకృష్ణాశ్రితమైనరౌద్రమునకు హేతువైనది. అది భీష్ముని నివృత్తి వీరస్ఫూర్తికి కారణమైనది. నివృత్తి వీరము సంగముగా గల రౌద్రము అర్జునుని కాలంబనమై వీరమును స్ఫురింపఁ జేసినది మిత్రరసముల పరస్పర పోష్యపోషక సంబంధ మిందులో విశిష్టముగా మేళవింపబడినవని స్పష్టమగుచున్నది

2. అభిమన్యుని యందు యుద్ధ వీరమునకు పోషకముగా యశోమాన వీరములును, శత్రువీరుల అద్భుత రౌద్రములును అనుసంధింపబడినవి.

3 ద్వితీయ తృతీయాంకాదులలో యుద్ధవీరు లొనరించు ప్రతిజ్ఞలు తెరలోఁ జదువఁబడినప్పుడు రంగముపై పాత్రలు గోచరింపవు గాన కవులు విశ్వాసము వంటి వారిచే నాపాత్రల మనోభావములయు క్రియలయు పరిస్పంద నను (Reaction) అభినందింపజేసి రసాస్వాదనమును ప్రేక్షకులకు సులభతర మొనర్చిరి.

4. వీనికిఁదోడు పాత్రల స్వభావమున కనుగుణమైన సంభాషణలు రచించుటయు, తత్తదనుకూలమగు నలంకారాదుల గ్రహించియు, రసహేతువు లగు విభావములను, తత్ఫలముగా ననుభావములను కారణకార్య సంబంధమున ననుసంధించి వర్ణించియు రసానుకూలములగు సంచార భావములఁ గల్పించియు రసపుష్టికై యెంతయు కవులు కృషి యొనర్చి యుండిరి.

పాండవోద్యోగ విజయ నాటకములు తెలుఁగునాట విజయయాత్ర చేసినవి. ఇప్పటికిని వాటి ధాటి తగ్గలేదు. ఇవి యంతగా ప్రజాదరణ పొందుటకు వారి రచనా ప్రక్రియ, కవితా శైలి ప్రధాన కారణములు. ఆ యంశములు పండితుల ప్రశంసల నందుకొనినవి. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు ఈ నాటకముల గూర్చి యిట్లనినారు:

"పేలవముగాని సుబోధత, భారముగాని యుదారత - ఇవి రెండును ఈ నాటకములకు పెట్టని నగలు. మఱియు భారతీయ వీరత్వమును ధర్మాచరణ మును ఈ నాటకములు తిరిగి జ్ఞాపకము చేయుచుండుట కూడ నాటక ప్రసిద్ధికి హేతువులు. ఇవి రంగ ప్రయోగమును మాత్రమే దృష్టిలో పెట్టుకొన్నవి కాక సాహితీ గౌరవమును కూడ సంపాదించుకొన్నవి యగుటచేత చిరస్థాయిగా నిలువ గలవనుటలో సందేహము లేదు."

## పాండవాశ్వమేధము

ఆఱంకములు గల యీ వస్తురూపకమునకు. ఇందలి ప్రధాన ప్రతిపాద్య వస్తువు పాండ వాశ్వమేధయాగ నిర్వహణమగుటచే నీ నామముంచఁబడినది. అశ్వత్థామ శిరోమణిని పాండవులు గ్రహించుట ప్రథమాంకమందును, స్త్రీపర్వము నందలి కథ ద్వితీయాంకమునందును, కర్ణుఁడు నిజభ్రాతయని తెలిసిన ధర్మ జుఁడు దుఃఖించుట తృతీయాంకమునందును; భీష్మ తను త్యాగము, గంగాశాపము

చతుర్థాంకమునను; సవనాశ్వము వెంటఁ గిరీటి యరుగుట పంచమాంకము నందును; అంతర్నాటకము, యాగ నిర్వహణము షష్ఠాంకమునందును కవులీ నాటకమున సంఘటించి యుండిరి. ఈ నాటక నిర్మాణమునందు కవులు లక్షించిన వస్తు దృష్టి నాందియందే స్పష్టముగా సూచింపఁబడినది:

ఉ॥ భారత సంగరాంతమునఁ బాండుతనూజులులందు దుఃఖపున్
భారము దీర్చి వారల కపారపు రాజ్యము నిచ్చి యుత్తరా
దారకు నేమ మూరని, పదంపడి వారల నశ్వమేధ సం
చారులఁజేయు కృష్ణుఁడు కృతమ్ము యశమ్మనిశంబు శమ్మిడున్.

దీనినిఁబట్టి చూడ ఈ నాటకమునకు ప్రధానముగా మూఁడు లక్ష్యములున్నట్లు తెలుచున్నది. అవి: పాండవులు దుఃఖభారము వీడి విపుల రాజ్యము స్వీకరించుట, వంశకర్తయగు పరీక్షిత్తును శ్రీకృష్ణ ప్రభావముచే రక్షించుకొనుట, పుణ్యయశోలబ్ధికై యశ్వమేధము చేసి, భూతల చక్రవర్తిత్వము నిరూపించుకొనుట అనునవి. బహుళ ప్రయోజన సాధనాత్మకమైనదే వస్తురూపక మనఁబడునని వెనుక తెల్పఁబడియున్నది. మొదటి నాల్గంకములందును మహా భారత పాత్రల యొక్క మంచిచెడుగులన్నియు విచారితములై విశుద్ధుఁడొక్కనాయకుఁడనియే నిగ్గుతేల్పఁబడినది. చివఱకు గంగ యిట్లు నిష్కర్షించినది:

గీ॥ "అశ్వమేధమ్ము నొనరింపు మఖిలదోష
ములు నశించు నక్కతమునఁ బుణ్యలోక
ములకు బోనేర్తు వీవు, తమ్ములకు నెట్టి
లేని నరకమ్ము దప్పనిదే నిజంబు"— చతు. 62 పుట.

సర్వపాపక్షయము అశ్వమేధమువలనఁ గల్గునని చెప్పుటచే నయ్యాగముతో నాయకుఁడు పవిత్రుఁడై భాసించునని తేలినది. మిగిలిన పాత్రలకు దోష పరిహార మార్గములు లేవని స్పష్టమైనది కదా! నాయక పావిత్ర్యము కొఱకే యజ్ఞ ముద్దిష్టమయినది. అట్టి పవిత్ర కార్యమును సాధించు నాయక వీర ప్రవృత్తియే యీ నాటక నామరూపమునఁ బతాకగా నిలుచుట యుచితమే కదా!

ఈ నాటకమున వస్తుఘటనము గుణీభూతముగా నుండు రసమును పోషించు శిల్ప మత్యంత చాకచక్యముతో నిర్వహింపఁబడినది. అశ్వత్థామ రౌద్రకృత్యము వలన పాండవు లనంత దుఃఖమునకు గుఱియైరి. శిరోరత్న సాధనముతో సధి

కొంత యుపశమిల్లినది. రణరంగ నిహతులగు వీరుల సంస్మరణము చేత నాయకాదులయందు అనంత కరుణరసము పొంగులు వారినది. అది క్రమముగా శ్రీకృష్ణ, వేదవ్యాస నారద భీష్మాదుల ప్రబోధమువలన నిలువరింపఁబడినది. ఇట్లు కొంత స్వాస్థ్యము సేకూరిన ప్రవృత్తితో పాండవు లశ్వమేధ సవన దీక్షను వహించి అర్జున మరణ పర్యంతమైన విఘ్నరాశిని శ్రీకృష్ణ సహాయమున నధిరోహించి, లబ్ధవిజయు లైరి. ఇందు నాయక ప్రవృత్తి పరిచ్ఛిన్నములగు నాయాయంకములం దాయారసముల కాలంబనమయ్యె గ్రహముగా దుఃఖాదుల నతిక్రమించివీరము నాశ్రయించినట్లుగనే వస్తువ్యంగ్యమునాశ్రయించి పఠిత హృదయము నాయక దాతాత్మ్యముతో దుఃఖ విరహితమైన ధర్మవీరమునే నాస్వాదింపఁ గల్గును. వీరమున కంగముగా నద్భుతము పెక్కుచోట్ల ననుసంధింపఁబడి, రసములగు వీర రౌద్రముల నాస్వాదింప నానుకూల్యమును సంఘటించుచున్నది. అశ్వమేధ గాథ చివరి రెండంకములందుఁ గలదు. అందు ధర్మజుని వీరము ప్రధానముగా భాసించినది అతఁ డర్జునున కిచ్చిన యాదేశమే దానికి సాక్షి:

ఉ॥ "తురగమువెంట నేగుము; చతుర్జలరాశిపరీతభూపురం
దరు లెవరున్ నిరోధ మొనర్పు; రొనర్చినచోఁ గృపారసం
బురలఁగ నప్పటప్పటికి నొప్పెడిరీతి నొసర్చు మాగ్రహ
స్ఫురణము చూపి వేగ పొరిపుచ్చకు మింతకె వచ్చి రెల్లరున్."

రాజలోకముపై ధర్మజానకున్న అపారదయాసముద్రమే ఈ పద్యము. దయావీరుఁడు యుద్ధము నాశ్రయించి నిర్వహించుట యపురూపము. రణరంగమున శత్రుకృత రౌద్రము దయావీరమునం దంతర్భూతము కావలెను. ఇవి యన్నియు నంగభూతములై వస్తు ప్రధానముగా నిర్వహించుట యిందు లక్షితము. అట్టి శిల్పములోఁ బరాకాష్ఠ నందినది యంతర్నాటక ఘట్టము. భవభూత్యాదు లిట్టి యంతర్నాటక ప్రక్రియలను తమ నాటకములందు ప్రవేశపెట్టియుండిరి. బహుశః కవులకు భవభూత్యాదు లీయంకమున నొజ్జబంతులై రనుకొనవచ్చును. వీ రనువదించిన బాల రామాయణమునందును అంతర్నాటకము కలదు. ఈ యంతర్నాటక మీనాటకమున సాధించు ప్రయోజనములఁ గొన్ని పేర్కొందును:

1) సవనాశ్వరక్షకుఁడగు నర్జునుడు నాటకమునకు నాయకుఁడు కాఁడు కాని, యతఁడు నాయక ప్రతినిధి, అనునాయకుఁడు. అతఁడు యుద్ధమునందు

గతాసువై వెంటనే లబ్ధాసువగును పంచ పాండవు లొక నాయక సంపుటిగా భావింపఁబడుచున్న యీ నాటకములో నాయక వధవంటి యిట్టి దృశ్యము నాధికారికముగాఁ బ్రదర్శింపఁగూడదు - లక్షణ విరుద్ధముగాన, తిరుగ వెంటనే బ్రతుకుచో నట్టి వధ యోగ్యమేయని కొందఱ మతము. అట్లైనను అది సూచ్యమే కావలసి యుండును. ఈ రెండు లక్షణముల అస్తిత్వమున కెచ్చటను భంగము వాటిల్లక సంతర్నాటకము నొకదానిని కల్పించి, రంగోద్దిష్టమైన వస్తువును నాటకముననే ప్రాతిభాసికముగా నిబంధించి, నాటక నిర్మాణ చమత్కారమును వెలార్చియుండిరి. ఇట్లు చేయుటవలన నాయకుఁడగు ధర్మరాజు కూడ వేదికపై నాసీనుఁడై యుండును. అతని దర్శనము నాయక మరణశంకను యుపశమింపఁ జేసి యంతర్నాటకాంతమగు అద్భుతమునందు ప్రేక్షకుని మనస్సు లీనమగు నట్లొనర్చి నిర్వహణ సంధి లక్షణబద్ధముగా కొనసాగుట కుపకారమగుచున్నది.

2) అర్జునసంతతిని కన్నులార దర్శించుటచే నాయకునకు స్వీయ వంశాభివృద్ధితోడను, వంశస్థులగు వీరమాతల యొక్కయు వీరపుత్త్రులయొక్కయు గుణగణములతోడను స్వీయకార్యనిర్వహణమునందు వారు చూపించు నేర్పును గాంచుటతోడను పరిచయముకల్గి పరోక్షముగా తన సంపత్తిని కూర్చి సంతసించుట కనువుపడుచున్నది.

3) దయావీరు లొనర్చు యుద్ధమునం దహింస ప్రధానమైనను అది పౌరుష విహీనులై వర్తించెడి వారిపట్ల రాణింపదనియు వీరులైన ప్రతిస్పర్థులాలంబనముగా నాయకుని దయాగుణము భాసించుననియు చెప్పినట్లయినది. ధర్మజునిచే నుద్దిష్టమైన యిట్టి దయా వీరప్రవృత్తి యతని ప్రతినిధి యగు నర్జునుఁడు క్రియారూపమున ప్రదర్శించిన నాయకుఁడు. తాదాత్మ్యముతో నట్టి మనస్స్థితియే పొంది పతిత కాలంబన విభావమయి రసాస్వాదనము సుకర మొనర్చును.

4) రూపకసందర్శకోత్సుకులగు సామాజికుల మనఃప్రవృత్తి నాయకునందుఁ బ్రతిష్ఠించి ఉత్తమ సామాజిక లక్షణమును వ్యంగ్యముగా బోధించినదైనది.

5) నా నృషిః కురుతే కావ్యమ్మను నార్యోక్తికి లక్షిభూతమగునట్లు మహాలక్షణవేత్తలును త్రికాలజ్ఞులును నగు కైలాస శిరోమణి భట్టాచార్యుల వారి రచనమునం దంతర్నాటకముగా నిబంధించి నిరూపించిరి.

6) 'పుత్రాదిచ్ఛే త్పరాజయ'మ్మను న్యాయము ననుసరించి, అర్జును నోడించినది పాండవసుతుఁడే యగుటచేత నట్టి పుత్రసంతతి ధర్మరాజును కాంతిమంతునిగా నొనర్చుచున్నది. అంతేగాక, అశ్వమేధ సవననిర్వహణముచే పాండవులు క్షాళితపాపసంచితులై, జితశత్రువులై, ఉదితనవ్య దివ్యతేజులై జ్యోతిః పుంజములవలె భాసించి 'నాయకః సమగ్రగుణః' అను లక్షణములకు లక్ష్యములై వరలునట్లు చిత్రించిన యీ నాటక పరంపరలో భరతవాక్యము వంటి ఈ యంకము సర్వశ్రేయోరూపముగా ముగియుటయు "మంగళముఖాని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే" అను నార్యోక్తికి చక్కని నిదర్శనమగుచున్నది,

పాండవాశ్వమేధముపై నాంధ్రదేశమున దుమారము లేచినది, రామకృష్ణకవులు దీనిపై 'శతఘ్ని' యను పేరుతో నొక విమర్శము ప్రకటించిరి! దానికి సమాధానముగా తి వేం. కవులు "పాశుపతము" అనెడి ప్రతివిమర్శను వ్రాసిరి. దానిపై మఱల "పరాస్త పాశుపత"మనెడి విమర్శ వచ్చినది, 'పునశ్చరణము' అను పేర కవులు దానిని మఱల ఖండించిరి. కావున దీనిపై విపులముగా విమర్శన మొనర్పఁబడియున్నది కావున నిఁక వేఱుగా నేమియు చెప్పనవసరములేదు.

## పండితరాజము

తిరుపతి వేంకట కవుల రూపక రచన మనెడి గంగా తరంగిణికి శ్రీవిష్ణు పాద పీఠమువంటిదీ పండిత రాజము. ప్రప్రథమ రూపకమున ప్రసిద్ధ సంస్కృత కవి జీవితము నిరివృత్తముగా గొని జంట కవు లొక విశిష్ట మర్యాదను పాటించి యున్నారు. స్వయముగా తాము కవులై యుండుటయు, జగన్నాథ పండిత రాయలు తెలుఁగు బిడ్డడై రసగంగాధరాది లక్షణ గ్రంథ నిర్మాతయై యఖిల భారత ప్రశస్తి నొంది కావ్యనాయకగుణసముపేతుఁడై యుండుటయు, దానికిఁ దోఁ డాతని జీవితరంగమున లవంగి లతా శృంగార మందగించియుండుటయును, తమ జీవితమందుండువలెనే నానా రాజ సందర్శనాములు పండితరాయ లొనరించి యుండుటయును బహుశః యీ నాటక రచనకు తి వేం. కవుల నుత్సాహపఱచి యుండవచ్చును కారణమేమైయుండినను కమనీయ కావ్యరాజ మొకటి భారతికి పారితోషికముగా నొసంగి కవులు ధన్యులైరి.

లవంగి పండితరాయల కథ జగన్నాథుని రసిక హృదయమునకు దాహ్యాణయై దేశమునఁ బ్రసిద్ధి పొందియున్నది. కాని, భూసురుఁడైన పండితరాజు

అక్బరు పాదుషా పుత్రికయు, యవన సుందరియునగు లవంగిని వివాహమై కుల భ్రష్టుఁడయ్యెనను కళంకము మాత్రమతని యందున్నది. తి వేం. కవు లీగాథను గైకొని "పరిపూర్ణగుణు"నిగా నాయకుని జిత్రింపఁదలఁచి యా కళంకమును మెళుకువతోఁ దొలఁగించి వైచిరి. గంగా లహరి పఠించుచు చివఱకు లవంగీ సమేతుఁడై గంగయందు లీనమయ్యెనని లోకమున కథ వ్యాపించియుండ దానిని కవులు మార్చి ప్రతిపక్షులందు పరితాపముఁ గల్పించి విశుద్ధ యశోమూర్తిగా నాయకుని సజీవునిగా నిలిపిరి. ఇందు గంగా లహరి నాయక పావిత్ర్య నిరూపణ మొనర్చి నాయికా నాయకులు కారణాంతరమున భూలోకవాసులయిన సరస్వతీ చతుర్ముఖులని పేర్కొని, నాయిక బ్రాహ్మణ కన్యయని తదాభిజాత్య రహస్యము నుగ్గడించి మంగళాంత మొనర్చిరి. రసానుగుణములైన యీ మార్పులతో నాయకేతివృత్తము పులుకడిగిన రత్నమువలె కాంతిమంతమై యొప్పారుచున్నది.

పండిత రాజము రస ప్రధానమగు వైదంకముల నాటకము. తండ్రి వ్రాసిన జాతక ఫలము ప్రకారము తనకు ఢిల్లీ ప్రభువుగారి కూతురుతో వివాహము గావచ్చునని యూహించి పండితరాయలు రాజాశ్రయ వ్యాజమున నక్బరుఁ జేరనుంకించుట ప్రథమాంకమందలి కథ. తనయందు లగ్న మనస్కయైన లవంగి యంపిన విదూషకునితో సంకేతస్థలమున కరుగుట ద్వితీయాంకము నందలి కథ. ప్రథమ వీక్షణము తృతీయాంకము. పండితరాయల ధారణాశక్తికి, కవిత్వమునకు మెచ్చిన పాదుషా యతని కోర్కెయగు లవంగీ వివాహమున కంగీకరించుట చతుర్థాంకము. గంగాలహరీ స్తవముతో రాయలు తన పావిత్ర్యమును నిరూపించుకొనుట పంచమాంకము నందలి కథ. నాతి సంగ్రహమును నాతి విపులమునై ప్రయోగ రమణీయమై యీ నాటకము కవుల మిశ్రకావ్య నిర్మితి కుదాహరణమై శోభించుచున్నది.

ఈ నాటక రచనమునం దొక రసరూపక నిర్మాణ దృష్టియేగాక తి. వేం. కవుల కొక విశిష్టమైన ప్రతీకార్థ (Symbolic meaning) గర్భితమైన శిల్ప నిర్మాణ మొనర్ప వలెననెడి యభిప్రాయమున్నట్లు ద్యోతమానమగుచున్నది. నాయక పాత్ర నుదాత్తముగా సృష్టించుటకై కల్పించిన కథా భాగమున నీ కావ్యార్థము ధ్వనితమగుచున్నది. "ఒకనాఁడు సరస్వతి బ్రహ్మను గాంచి 'లక్ష్మి కింత యైశ్వర్యమేల? నాకేల లే'దని యడుగుడు నాచతురాననుఁడు హేంగా 'నీకట్టి యిచ్చయేని తురుష్క కులమ్మునఁ బొడమెదవా?' యని యడుగ నంతఁ గాపె

స్త్రీ స్వభావ సులభమ్మగు చాపల్యమ్మున నొడఁబడియును 'ఆ జన్మమ్మునకు నీవ నాకు బరిగాక తీఱ'దనుడు తనకు తురుష్క కన్యాసమాగమము దొరకదు కదా యని చింతించి యామె నొక బ్రాహ్మణ వనిత కుదయించునట్లు వరము ప్రసాదించెను. కాని, ఆ బ్రాహ్మణ వనిత గర్భవతిగా నున్నప్పు డేదో యుద్ధపుటలజడిలోఁ దురుష్క చక్రవర్తి చెఱఁగొని తన యంతిపురమున నుంచును. అపైనామె ప్రసవమగును కాని, యీ గర్భ రహస్య మితరుల కంత స్పష్టముగఁ దెలియదు. ఈ విధముగా సరస్వతి యక్బరు చక్రవర్తి యంతిపురమున నుత్తమ యాభిజాత్యయై పుట్టి తురుష్క కన్యగా లోకముచే నెన్నఁబడి అపర బ్రహ్మవరాసఁదై తన కవితా మహత్త్వముచే పాదుషాను మెప్పించి తనను గోరిన పండిత రాయలను వివాహమాడును. గంగా ప్రసాదముచే వీరి యాభిజాత్య రహస్యములు లోకమునకు విదితములగును. ఇరువురును యశోవిరాజితులగుదురు. ఇందలి పూర్వజన్మ వృత్తాంత మంతయు కవి కల్పనమే.

సరస్వతీదేవి యవన ప్రభువు పంచజేరుటయందు కవులిట్లు ప్రతీకార్థ వ్యాఖ్య నొనర్చియుండిరి:

శా॥ విద్యావంతులుగూడ ద్రవ్యములనే ప్రేమింతు రాదారముల్
సద్యస్త్యాగ మొనర్తు రంటకు సరస్వత్యంబయే సాక్షి యీ
యుద్యోగమ్మునకే కదా! యవని యాటొప్పెన్ వచోమాత, యే
విద్యల్ నేర్చిన పొట్టకే? యిఁక వృథా వేదమ్ములున్ శాస్త్రముల్."

(పం. 79 పు)

ఈ పద్యమును బట్టి సరస్వతీ చరిత్రము కథకొఱకు మాత్రమే కాక విశిష్ట ప్రతీకార్థ ప్రతిపాదనకొఱకై యుద్దిష్టమైనదని స్పష్టము కదా! ఈ దృష్టితో యోజించుచో నదికొంత తెల్లమగును. సరస్వతి సారస్వతమునకు లేక కావ్యమునకు ప్రతీక. బ్రహ్మ కవికి ప్రతీక. కవి తననాశ్రయించుకొనియున్న కావ్యరచనా ప్రతిభను అర్థసిద్ధి కుపకరణముగా సిద్ధపఱచుచో నాకళ కథఃపతనము తప్పదు; కవి తన ప్రతిభతో స్వీయానుభవస్ఫోరకమగు రసకావ్య నిర్మాణము సేయఁజాలక పోవును; స్వీయానుభూతికి దూరమైన తన కవిత్వమును గూర్చి యంతఃకరణమున క్షుభితుఁడై యశాంతికి గురియగును. అర్థార్థియైన తన కవిత సమ్రాట్టుల సభాభవనములం దణఁగిమణఁగి స్వయంప్రకాశము లేక కృశించిపోవును.

కవి తాను చేసినతప్పిదము తెలిసికొని తద్విరుద్ధమైన భావములతోఁ బునర్జన్మ యెత్తి నట్లయి సభాంతరములందు బహువిధాలంకార సంశోభితయయ్యు సంపదున్మత్తుల సేవించుచు నాత్మప్రకాశము కోల్పోయిన కవిత్వమును చతురోపాయముల సాధించి యుపాయనముగా నా కవిత్వమునే గొని స్వీయ నిరంకుశ ప్రతిభా ప్రభా సంయోజనముచేత నాత్మ ప్రకాశము నిచ్చి భక్తిప్రపత్తులతో దైవార్పిత మొనర్చి రసలహరిని గంగాలహరి వలె పొంగించి శబ్దార్థ ప్రధానమైన యామె శరీరమును రసార్ద్రి మొనర్చి పూర్వతేజమును పొంది మహాకవిత్వ లక్ష్యమును సాధించును- అను గంభీరార్థమును ప్రతీకార్థశక్తిచే నిబద్ధ మొనర్పఁబడినదని తెలిసికొనుట సులభము కదా! కవిత్వోపకరణమును నిశితముగా నుపయోగించి కళాసృష్టి యొనర్చు మహాకవులకుఁ గాని యిట్టి ప్రక్రియ చేతగాని పని. మఱియు నిందు వారి కవిత్వ లక్ష్యము కూడ ధ్వనితమై యుండుననియు నీ నాటక మొక విధముగా వారియందు నిరాకారములై భాసించు కవిత్వ మహత్వ శక్తులం కొక కళాత్మకవ్యాఖ్యాన మనియు భావింపవచ్చును. బాహిరముగా వస్తువర్ణన ప్రధాన ములై తమ కవిత్వ శక్తులు నానారాజ సందర్శన కీర్తనాదులు చేసినను స్వీయ మగు రసకావ్య నిర్మాణ శక్తియంతయు నుదాత్త వస్తువర్ణనాకర్షణీయమై దేవీ భాగవతాది యుత్తమ కావ్య నిర్మాణోపకారకమై భాసించె ననెడి తి. వేం. కవుల కవిత్వహృదయము నిందు కావ్యమర్మజ్ఞులు దర్శింపకపోరు.

తి.వేం. కవు లీ నాటకమునం దొక్కొక్క యంకమునం దొక్కొక్క వస్తు విశేషమును ప్రదర్శించిరి. ప్రథమాంకమునందు భావసంఘర్షణ మౌచిత్య యుక్తముగాఁ జిత్రింపఁబడినది. తురుష్క ప్రభువులు వారి మతాచారముల గూర్చియు, హైందవ ప్రభువులు వారి మతాచారములఁ గూర్చియు గురుశిష్యుల మధ్య చర్చ కథానుగుణముగా సాగింది.

తే.గీ. "దుండగులు వారిలోఁ గల; రుండవచ్చు
మన మతమ్మునఁ బెక్కు; రజ్ఞులఁబట్టి
మతము లెల్లను దూషింప మనకు నొరుల
కును దగదు; యోగ్యులగువారిఁ గనఁగవలయు"

నను విశాల దృక్పథము కాంతాసమ్మితముగా కావ్యద్వారమున బోధించు చున్నారు కవులు. రెండవ యంకమునం దయోగ విప్రలంభము, సంభాషణ

చమత్కారము చెప్పఁదగినవి. తృతీయమున నుత్కంఠావహములగు సన్నివేశ కల్పన మనల్పముగాఁ జిత్రితమైనది. నాయికా నాయకులు సంకేత స్థలము లందు కలిసికొనుట, తద్భిన్నులైన పాత్రలు తికమకపడి కథను అంకాంతమున కుదుటపఱచుటలో పింగళి సూరన మాయూరంత వృత్తాంతమునఁ గల్పించునంత యుత్కంఠను కల్పించి కవులు కృతకృత్యులైరి. చతుర్థాంకము కవుల పాత్రోన్మీలన శక్తికి నిదర్శనము నాయికానాయకుల ప్రణయ ప్రసూనము లిందు క్రమముగా వికసించి పరస్పరము ఫలించి రసస్థాయి కందుకొనును. తృతీయాంకాంత మందభిజ్ఞాన శాకుంతల మందలి తృతీయాంకచ్ఛాయలు గోచరించును. శకుంతలా దుష్యంతుల సమావేశమున కంతరాయము గౌతమీ ప్రవేశముతో కాళిదాసు కల్పింప, నిచ్చట నాయికా నాయకుల సమాగమునకు మాతంగియను వృద్ధ పరిచారికవలన గల్పింపఁబడినది. అనౌచిత్య పరిహారార్థమై యిట్టి కల్పన మొనర్చి కవులు కాళిదాస కళాహృదయ మర్మజ్ఞు లనిపించుకొనిరి. చతుర్థాంకమంతయు రాగరంజితమై "లిరికల్" రూపకమువలె సాగించి ఆశ్చర్య ప్రధానమై నిర్వహణమును సార్థక మొనర్చుచు శుభాంతమగుచున్నది. పండితరాయ కృత సంస్కృత గంగాలహరి తెలుఁగులో ననువదింపఁబడి నాటకోచితముగా సంధింపఁబడుటయే యీ యంకమందలి విశేషము. రసానుకూలములగు నీవస్తు శిల్పము లన్నియు కావ్యాంగములై కవుల ప్రథమ రూపకము నప్రతిమాన మొనర్చుచున్నవి.

కాళిదా సభిజ్ఞాన శాకుంతలమునందు దుష్యంతపాత్ర నెట్లు యశఃపూరిత మొనర్చెనో తి. వేం. కవులు పండితరాయల పాత్రము నట్లు గావించిరి. ఈ నాటక నిర్మాణమున కంతకును మూలస్తంభము నాయకుని కీర్తియే. దానిని ప్రస్తావనలో స్పష్టముగా కవులు సూచించిరి:

1) ఇట్టి పండితరాయల యశము వినవె! - పు. 1.
2) అలరెఁ బండిత రాయలయశము వోలె
సకల లోకసంఘంబు వసంతు చెయ్యి - పు. 3.
3) .......వాని యశము రమ్యవలన మెందు - పు. 3.

కీర్తిమంతుఁడైన పండిత రాయలకు యవనకాన్యా స్వీకారదోషము కలదు. దాని వలన నాటకమున భట్టోజీ దీక్షితులవంటి పాత్రలు కల్పించి, యాతనిని బహిష్కరించినట్లు చిత్రించిరి. కాని,పతిత కంతకన్నముందే నాయికా నాయకుల

యొక్క జన్మ వృత్తాంతము తెలియును. నిర్దోషత సామాజికుల హృదయములలో స్ఫురింపించి దోషత్వము నాటకీయ సమస్యగా మాత్రమే కల్పించి, రాయల కీర్తిని రెండు రెట్లు కాపాడెను. ఈ నాటకమున నాయకుఁడు దుష్యంతునివలె నుత్తమ సంస్కారి; యంతఃకరణ పారిశుద్ధ్యము కలవాఁడు. "యస్సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనుకొనఁగల యోగ్యత కలదు కావుననే దుష్యంతుని ఆర్ష హృదయము క్షత్రియోచితమగు కన్యనే వరించినది అట్లే యిందును పండితరాయల హృదయ మనర్హ స్థానము నభిలషించలేదు. కన్య జన్మరహస్యమును విదూషకునివలన విన్న పండితరాయలు ఇట్లనును. "చెలికాఁడా! నీ మాట ముమ్మాటికి నిజమే! ఏమనిన—

చ. "పరమ పవిత్రుఁడై మిగుల పండితుఁడై తగు పేరుభొట్లకున్
వరగుణయైన లక్ష్మమ కపత్యము ఈఁ డెటు లంత్యజాతియౌ
తురక వెలందిఁ గోరెడి; విద్రవతిమానన బ్రాహ్మణజాతియే
స్థిర మిది నమ్మ నయ్యెడిని క్షేత్రమునుందగు బ్రహ్మజాతియై"

అను రాయలు దుష్యంతునికన్న నేమాత్రము తీసిపోరు. ఉత్తములపకీర్తి సహింపఁజాలరు. అందువలననే రాయలు గంగాలహరీ స్తవముతో తన మహత్త్వమును చాటికొని మహిమాన్వితుఁడని వాసికెక్కెను.

ఈ నాటకమునం దంగిరసము శృంగారము. ప్రస్తావనలోని వసంత ఋతు వర్ణనము దీనిని సూచించుచున్నది. అం దయోగవిప్రలంభముచేఁ బుష్టి చెందిన (సూచ్యమగు) సంభోగ శృంగారమిం దంగి కాగా అఖండ యశోమాన పాండిత్య కవిత్వ వీరములును, హాస్యాద్భుతాదులును అంగములై ప్రధాన రసమును పోషించు చున్నవి. పండిత రాజములోని మఱికొన్ని విశేషాంశములను ఇచ్చట పేర్కొందును:

1) సమకాలీన సాంఘిక ప్రభావము :- కవుల నాటి సంఘములోని వర్ణాంతర వివాహ విషయము, భారత సామంత రాజుల స్థితి, మతాది విషయ చర్చ మొ॥ నంశములు నాటకములో నచ్చటచ్చట చోటుచేసికొని చిత్రితములైనవి.

2) స్వీయ పూర్వానుభవసామ్యము :- నానారాజ సందర్శనాది స్వీయ చాటు పద్యములనుండి ప్రసక్తానువశముగా కొన్ని పద్యముల నున్నవి యున్నట్లు

సందర్భశుద్ధి నెఱిఁగి నాటకమునఁ బ్రవేశపెట్టుట. ఉదా॥ "ఏ భూమీంద్రునిఁ జూడబోయినను", "పురుషాయిత మొనర్చు" మొ॥నవి.

3) నాయికా నాయకులకు స్వప్నవృత్తాంతములందు జత గూర్చి నాటక ప్రయోజనము లన్నిందిని సమన్వయపఱచుట.

4) దారిద్ర్యాది వర్ణనము లింతటిస్వభావరమణీయములై యొప్పుచున్నవి.

5) పాత్రోచితమైనభాష వాడుచు నన్యదేశ్యములను గూడ విరివిగా నుపయోగించియుండుట.

6) ఇందు విదూషకుని పాత్ర కడు విచిత్రముగాఁ బ్రయోగింపఁబడినది. ఇందాతఁడు నాయకునకు గాక నాయికకు నర్మసచివుఁడగుట గమనింపఁదగినది. ఇట్లు చిత్రించుట సత్కృత్తు.

7) జాతకము మీద కవుల కున్న నమ్మకము నాయకునికిఁ గల్పించి చమత్కరించిరి.

8) అష్టావధాన ప్రక్రియలో వ్యస్తాక్షరి యన్యభాషయందు గల్పించి నను సక్రమముగా నిర్వహించు తమ ధారణాశక్తిని పండితరాయలలోఁ బ్రద ర్శించి (అది ఆ పాత్రకును సహజమైన గుణమే కావున) ఆత్మీయత నందగించు కొనిరి.

9) ఈ నాటమునందు జారీయములు, నానుడులు, సామెతలు కుప్పలు తిప్పలు. అర్థవంతమైన పలుకుబడియును, సారళ్యముపీఠని పొంకమును, నిండు దనమును, ప్రవాహవేగమును ననునవి కవి శైలీ సంపదలు.

10) పండితరాయల గంగాలహరిని తి.వేం. కవులు భావానువాద మొనర్చి యీ నాటకమునఁ గూర్చిరని తెల్పియుంటిని. కొన్ని యుదాహరణముల నిచ్చట బొందుపఱతును:

1

మూలము: శిఖరిణి :. "ఉదంచ న్మార్తాండ స్ఫుటకపట హేరంబ జననీ!
కటాక్ష వ్యాక్షేప క్షణజనిత సంక్షోభనివహాః
భవంతు త్వం గంతో హరశిరసి గంగాతనుభువః
తరంగాః ప్రోత్తుంగా దురిత భయభఙ్గాయ భవతామ్."

అనువాదము: క. హరుని శిరమ్మున గౌరి
తరుణారుణ దృష్టి శిఖల తాఁకున ఘోరం
బొరయుచు మొఱసెడి నీదగు
తరఁగలు జగదంబ! జగము దనుపుం గాతన్!" (3)

## 2

శిఖరిణి: "అనాథ స్నేహార్ద్రాం విగళిత గతిః పుణ్యగతిదాం
పతన్విశ్వోద్ధర్త్రీం గదవిదళితః సిద్ధభిషజమ్
సుధాసింధుం తృష్ణాకులిత హృదయో మాతరమయం
శిశుః సంప్రాప్తస్త్వా మహమిహ విదధ్యాః సముచితమ్॥"

సీ॥ అనదలలోన నే నగ్రగణ్యుండ నీ
హృదయంబు ప్రేమ సంపదకుఁ దావు
ఎందును గతిలేని హీనుండ నేను
దివ్యగతి ప్రదంబు నీదైన పట్టు
పడుచు లేచుచు నున్నవాఁడనే నీవు వి
శ్వోద్ధరణమ్మున బద్ధ దీక్ష
వారి బాధార్దితాంతరుండను నేను
సిద్ధౌషధంబు నీ సేవనంబు
తే గీ. తృష్ణచేఁ బీడితుఁడనే నమృతమ వీవు
నేను బుత్రుండఁ దల్లివి వీవు నిన్నుఁ
జేరవచ్చితి నెటుసేయఁ జెల్లు నట్లొ
నర్పఁగదవమ్మ! దేవి! జాహ్నవి! మదంబ! (24)

గంగాలహరి తెలుఁగునఁ బొంగిన యాశుభ ముహూర్త మెట్టిదియోగాని తి.వేం. కవులచే పంచవింశతి రూపక తరంగము లట్లే పొంగింపఁజేసినది.

## ఎడ్వర్డు పట్టాభిషేకము

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తమ సిద్ధాంత వ్యాసములో నీ నాటక ప్రాశస్త్యమును గూర్చి వ్రాయుచు "సమకాలీన ఇతివృత్తమును గైకొని తెలుఁగున నాటకీకరించినవారిలో బహుశః తి. వేం. కవులే ప్రథములు కావచ్చును" అని తెల్పియున్నారు.

క్రీ. శ. 1902వ సంవత్సరములో జరిగిన ఎడ్వర్డు పట్టాభిషేకమును పురస్కరించుకొని వ్రాసిన నాటకమిది. విక్టోరియా రాణి యనుమతిపై నెడ్వర్డు భారతదేశమునఁ బర్యటించి తిరిగి స్వదేశమునకు వెళ్ళి మహారాణి మరణానంతరము బ్రిటిషు సింహాసన మధిరోహించుటయు, నట్టి పట్టాభిషేకోత్సవమొకదానిని ఢిల్లీలో జరుపుటయు నిందలి కథాంశములు స్వభావమునుబట్టి కథలో బిగువు లేదు. దానిని కవులు అపూర్వ కల్పనలతోడను, వర్ణనావైశిష్ట్యముతోడను కల్పించి రసవత్తర మొనర్చిరి. అందు ప్రధానమైనవి రెండు. 1) విక్టోరియాస్వప్నకల్పన 2) భారతదేశమునందలి వివిధ నగరముల వర్ణనము. స్వప్నకల్పనమువలన నెడ్వర్డు పట్టాభిషేకమునకు దైవికమైన ప్రేరణమున్నదను భావము కల్పించి నాటక కథార్థమున్నిందిని యుదాత్తములొనర్పఁబడినట్లయినది. ఎడ్వర్డు భారత దేశ పర్యటన వర్ణనమునందు భారతీయ నగర వైభవములు వర్ణితములగుటచే స్వదేశవైభవములు కవులు కీర్తించినట్లయినది. స్వదేశ స్వాతంత్ర్యవాంఛాసము పేతులైన భారతీయులకి మట్టము లావేశోత్సాహములు కల్పింపకమానవు. కాని, పరదేశవాసులై మనపైఁ బ్రభుత్వము సాగించి శతాబ్దముపైగా మనలను బానిస వృత్తికి గురిచేసిన యాంగ్లేయుల ప్రభువు చరిత్రను గైకొని నాటకము రచించుటలో కవుల రాజాదరణఁ బొందగోరు దృష్టి స్పష్టముగా గోచరించుచున్నది. అది ఎడ్వర్డు ప్రభువే కానవసరము లేదు. ఆ ప్రభువుక్రింద ప్రభువెవరైనఁ గావచ్చును. సమకాలీన వస్తువగుటచే నింక సార్వకాలీనత కొఱఁత పడుచున్నది. ఇప్పుడీ నాటకము మ్యూజియములోని కళాఖండము వంటిది.

ప్రధానములగు నాంగ్లేయ పాత్రలనుమాత్రము గైకొని మిగిలినవన్నియు భారతీయములుగనే అనుసంధించి ఈ నాటకమును రచించిరి. ఆంగ్లేయపాత్రలు గూడ భారతీయపాత్రలవలెనే భారతీయభావసంస్కారములను ప్రదర్శించు చుండును. ఇందు కవుల మనఃప్రవృత్తికేగాని పాత్రల మనఃప్రవృత్తికి తావీయఁ బడలేదు. విద్యానాథుని ప్రతాపరుద్ర కల్యాణమువలె నిదియు నాటక లక్షణమునకు లక్ష్యముగా రచితమైన నాటక మనునట్లు ముఖసంధ్యాదులను కవులే యాయాచోట్ల గుర్తించిరి. కాని, యిం దన్ని సంధులుగాని, సంధ్యంగములుగాని గోచరింపవు. వైలక్షణము లెట్లున్నను ఇందు కవులు ప్రదర్శించిన కవిత్వము మాత్రము ఉదాత్త గుణసంభరితమైనదని ప్రశంసింపఁదగినది. అదియే నాటకమునకు జీవము.

మచ్చునకుఁ గొన్ని పద్యముల నుదాహరింతును:

1) విక్టోరియా రాణి వర్ణనము - భావుకతకు, చమత్కృతికి చక్కని నిదర్శనము.

ఉ॥ "ఓరి కుమార! ఏ జనకుఁ డుర్వరకుం బ్రభువయ్యెఁ జామ్మ ప
ల్కారులు 'తద్విధంబున నిలాతలనాయకి నన్నుఁ జేయఁగా
నేరవె' యన్న నవ్వి 'జననీ! యటులేని నొనర్తు' నంచు వి
క్టోరియఁ జేసెఁ బద్మభవుఁడుం జగమేలఁగఁ జేయ నిందిరన్."

మ॥ "తెలికొండన్ సగమేన నాలుగుచు నేదేవుండు మున్నుండె, న
య్యలముండే తెలిదీవిఁ బూర్ణముగ నాలై చూపునందున్న ని
ప్పులు ఖడ్గంబునఁ దాల్చెనో యను తలంపుల్గల్గియున్నారు లో
కులు విక్టోరియపట్ల నచ్చటను బెక్కు ల్మాట లింకేటికిన్."

2) ఆంగ్లేయజాతికి సహజమైన ఆత్మాభిమానమనెడి గుణమును కథా వశమున కరునేర్పుతో నెరనెర కవులు ప్రయోగించిరి. విక్టోరియా స్వప్నమునందు దివ్యపురుషుఁడొక్కఁడు కన్పించినప్పుడు భక్తిప్రపత్తులతో నామె సేవించిన దనుటకు బదులు సేవలిప్పించినదని వర్ణించుట దీనికొక చక్కని నిదర్శనము.

ఉ:- ఆ.వె. "శయ్య యొద్దనున్న చల్లని నీరంబుఁ
బ్రావనిచ్చి, మంచి సేవకులను
నేదఁదీర్పఁగఁ బనుపు సేసి, పద్మాసనంబు
లొసఁగి యిట్టులంది యెసక మెసఁగ" (ప్ర. ౬౦)

3) పోతనాదుల యనుకరణము:-

"వీఁడటే! మనరాజ్ఞి విక్టోరియాదేని కడుపుపండిన రాజకౌస్తుభంబు" అను పద్యము "వీఁడటే రక్కసి విగతజీవఁగఁ జన్నుబాలు ద్రావిన వింత బాలకుండు" అను భాగవత పద్యము (దశ. స్కం. పు. 1249) యొక్క నిర్మాణ శిల్పమును బుడికిపుచ్చుకొన్నది.

4) ధారావాహియైన శైలికి - రాజపుత్ర స్థాన వర్ణనము:

మ. లలితాకారులు శూరు లాప్తులు కృపాలంకారు లార్తావనో
జ్జ్వల విక్రాంతులు సాహసాత్మ లసమ స్థైర్యంబులో రాజపు
త్రులు పాలించెడు భూమికేగెను భవత్పుత్రుండు సోత్సాహదో
ర్బల సంపన్నుఁడు కార్యవాది కరుణాపారీణచారిత్రుఁడై. (తృ ౬౦).

5) సీస పద్యమున సంస్కృత కవనము:- క్రమ అన్వయాలంకారము.

సీ॥ అంజనాచల కూట కుంజ పుంజతతేమ
ఘూర్జర కామినీ కుంతలేమ
ద్రావిడీ వక్షోజ ధారుణీ బాగేమ
కాశ్మీర యోషి దంగ ప్రభాసు
హస్తినాపుర సతీశ స్తోత్రమాంగేమ
గౌడాంగనా ముఖాగ్ర క్షమాసు
యమునానదీ తరంగ మనోహరశిఖాసు
లాటనారీ గల్ల పేటికాసు

తే గీ. కుసుమ తల్పంతి కుందంతి కుచపటంతి
కోమలత్వంతి నీతియావకుంతనంతి
చంద్ర ఖండంతి హంసంతి చందనంతి
ప్రభ్వి విక్టోరియాంబ! తావకయశాంసి॥ (తృ.అం).

## సుకన్య

కావ్య ప్రయోజనములలో నుపదేశము ముఖ్యమైనది. కవులు సమకాలీన సాంఘిక జీవనమును గమనించి దానియందలి కొన్ని లోపములను సంస్కరింప నెంచి కాంతాసమ్మితముగా దృశ్య కావ్యోపకరణము ద్వారా ప్రబోధించిరి. "సుకన్య" యను నీ నాటకము "వృద్ధులకు కన్యల నీరాదనియు, పరోపకారులు స్వసుఖము కోరరనియు, పతివ్రతలు మాననీయలనియును, బరకాంతాసక్తి పతితవస్థానమనియును బహ్మతేజము దురుద్ధరమనియు" వ్యంగ్యముగాఁ బ్రబోధించుటకు జన్మించినది. నీతి బోధకు సాంఘికేతివృత్తముల నెన్నికొనక పురాణేతివృత్తమునే నాటకమునందు స్వీకరించుట యిందలి విశేషము. సుకన్య కథ మహాభారత భాగవతాదులందును, దేవీభాగవతమునందును కాననగును. దేవీ భాగవతాంధ్రీకరణ కర్తలగు తి.వేం.కవు లీ నాటకమును దానినుండియే గ్రహించిరని వేరుగా చెప్పనవసరము లేదు.

సుకన్య చరిత్ర వీరి దేవీ భాగవత సప్తమ స్కంధమునందు 22 వ పద్యమునుండి 158 వ పద్యమువఱకు చెప్పఁబడియున్నది. ఇది వ్యాసకృతి కను కృతి. సుకన్యోపాఖ్యానమున సహజముగా నాటకీయత వెల్లివిరిసియుండుటచే

శ్రవ్య కావ్యముగా రచించిన యా కథాభాగమును దృశ్యకావ్యముగా సులభముగా మార్చివైచిరి. అట్లు రచించుటలో దేవీ భాగవతమునందలి పద్యములను పాత్ర సంభాషణములందు యథాతథముగా వాడిరి. అందువలన నాటక రచన మరింత సులభమైనది. శ్రవ్యమును దృశ్యముగా మార్చుటలో నుత్పన్నములగు సమస్య లను వారు చాకచక్యముగా నిర్వహించుకొనిరి.

1) కథాగమనమున కనువైన క్రొత్త పాత్రలను సృష్టించుట ఉ॥ శర్యాతి భార్యా మంత్రులు మొ॥

2) సూచ్య కథార్థముల నిర్వహించుటకై మధ్యమ నీచ పాత్రలఁ గల్పించుట. ఉ॥ నారదుఁడు, ఇద్దఱు చెలికత్తెలు, ఇద్దరు బ్రాహ్మణులు మొ॥

3) ఉచితమైన యంక విభాగ మొనర్చి ఆయా యంకములు కార్యకారణ సంబంధములచే స్వయం సమృద్ధములై యుండున ట్లొకచోట కథాభాగమును మూలమునందుకన్న పెంచి వ్రాయుట. ఉ॥ తృతీయాంకమునందలి కథ.

4) మూలమునందున్న కథార్థమొకచో ప్రయోగమునం దనౌచిత్యముగాఁ దొడగట్టుచో నౌచిత్య పోషణకొఱకై మార్చుట. ఉ॥ ప్రథమాంకమునందలి కథ. మూలమునందు చ్యవన మహర్షి శాపమువలన రాజు మొదలుకొని ప్రజ లందఱకు శకృన్మూత్ర బంధనమైనదని చెప్పఁబడియుండ నాటకమునం దది మార్చఁబడినది. శీతాదిక్యమువలన సర్వావయవములు బిఱ్ఱబిగిసి పోవుట యనెడి రుగ్మతగా చెప్పఁబడినది.

5) పాత్రల కనుకూలమగుచో దేవీ భాగవతమునందలి పద్యములను యథా తథముగా గైకొనుట, లేదా కొలది మార్పులతో నాటకానుకూల్యము కల్పించి గైకొనుట, మూలమున కథాకథనముగాఁ జెప్పినచోట్ల క్రొత్త సంభాషణలను సృష్టించుట, ఎడనెడ సమకాలీన సంఘసంస్కార దృష్టితో విమర్శన మొనర్చుట యనెడి పద్ధతుల నుపయోగించుట. మూలమునందలి కథాక్రమము రూపక సన్నివేశ సంఘటనమునకై కుదురకపోవుచో వెనుకముందులు చేసి నాటకమున కొక క్రమవికాసము ననుసంధించుట ఉ॥ దేవీభాగవతమున చ్యవన వివాహానంతరము సుకన్య జీవిత విధానమును కవులు కథాకథన పద్ధతిలో చెప్పియుండిరి. వాని చివరి పంక్తులలో కొంఁడిగ సుకన్య సౌశీల్య దివ్య మహత్త్వమే సుకన్య తండ్రి యెదుట దాసిట్లు వర్తించునని ప్రతిజ్ఞ చేసినట్లు రచించిరి. దానివలన పాత్రో



న్మీలన క్రమశిల్పము నాటకమునం దేర్పడుటకు వీలైనది. మూలమునం దొక పాత్రతో పల్కించిన పల్కులు నాటకమున మఱియొక పాత్రతో పల్కించుట. ఉ॥ దేవీభాగవతమున లేని శర్యాతి భార్య పాత్రను కల్పించుటచే నా శర్యాతి మూలసంభాషణములో కొంతభాగ మామెకు పంచిపెట్టుట. అట్లే మూలమున సుకన్య తండ్రితో మాట్లాడిన మాటలను తల్లిదండ్రుల మధ్య పంచుట మొ॥ ఈ మార్పులతో ప్రయోగానుకూల్యము సంతరించుకొని సుకన్యానాటకమైదంకము లలో రసవత్తరముగా శోభించుచున్నది.

దేవీ భాగవత మూలములగు కథలలో సామాన్యముగా పరమార్థమగు శక్తి సేవా ఫల నిరూపణ మిందును కానఁబడును. చ్యవనుఁడు శక్తి భక్తుఁడు. బృహస్పతిచే మెప్పులు వొందిన యాతని మహత్తర శక్తి యంబ భక్తి వలననే కల్గినది. ప్రమాదవశమున సుకన్య యట్టి యనఘుని కపకార మొనర్చి దేశము నంతయు శక్తి కోపమునకు గురి కావించినది. కాని, సుశీలయగు సుకన్య తన తప్పిదమును వెంటనే గ్రహించి పరితపించి తత్పరిహారముగా తన సుకుమార విలాస జీవితమును ఋషి సేవకై యంకిత మొనర్చినది. పతిసేవా తపస్సుతో నామె జితేంద్రియయైనది. అశ్వినీ దేవతల ప్రలోభమునకు నైతము చెదరని యంత ధైర్యము సాధించినది. ఆమెకు కీడు నాపాదింపవచ్చిన ఆశ్వినేయులవలన మేలే కల్గించి శక్తి ఆమెను రక్షించి, భర్తను స్వురద్రూపి నొనర్చివైచినది. యజ్ఞభాగ మాశ్వినేయులకు చ్యవనుఁడు కల్పింప నొనర్చు యజ్ఞమునందు శక్తి భక్తి మహిమయే యింద్రుని దాసోఽహమనిపించినది. కావున, ఈ కథ యందతర్వాహినులుగా దేవీమాహాత్మ్య కీర్తనము, దేవీ భక్త విజయము నను కథాంశముల ననుసంధించుచు కవు లీ నాటకమును రచించిరని తాత్పర్యము.

తి. వేం. కవులు "సుకన్య" యను నామమిడుటలో నీ నాటకమునందలి నాయికా ప్రాధాన్యమును చాటినట్లయినది. ఇట్టి నాటకములందు నాయికా ప్రయత్నమువలననే నాయకుఁ డామెకు లభించుటయు, నామెవలననే యాతఁ డభ్యున్నతినందుటయు గోచరించును కావున నిందు సర్వకావ్యార్థ ప్రసారముల కును సుకన్య మనఃప్రవృత్తియే మూలమగుచున్నది కావున నట్లూహించుట అసమంజము కాబోదని భావింతును. ఈ నాటక మొక దేవాలయమగుచో నందు మూల విగ్రహము సుకన్య. తదితర పాత్రలన్నియు తత్పోషకములే, తద్భూషణ ములే. ఇట్లు చిత్రించుటవలన సుకన్య పాత్రను నిమిత్తముగాఁ గొని కవులు

లోకమునకుఁ బతివ్రతా ధర్మబోధ నొనర్చుచు కథా ప్రబోధ భాగమునను "పరోపకారులు స్వసుఖములు గోరరనియు పతివ్రతలు మాననీయులనియు" ననెడి యంశములను ధ్వనింపఁజేయుచున్నారు. శర్యాతి పలుకులలో వృద్ధులకు కన్యనీయరాదను నంశము, ఆశ్వినీ దేవతల ప్రవర్తనలవలన పరకాంతాసక్తి పరిభవ స్థానమనియు, చ్యవనుని తపో మహిమవలన బ్రహ్మతేజము దురుద్ధర మనియు కవులు సాధించియున్నారు.

ఈ నాటకమునం దంగిరసము ధర్మవీరము. ఇందు ప్రతిపాత్రయు స్వీయ ధర్మ నిర్వహణోత్సాహమునఁ బరవశు ద్రొక్కుచుండును. శర్యాతి పితృ ధర్మ, రాజధర్మములకు ప్రతినిధి. చ్యవనుఁడు తపోధర్మమునకు ప్రతినిధి. ఋషి గ్రుడ్డివాఁడగుటచే తపోధర్మభంగమగునని మాత్రమే భార్యను స్వీకరించెను గాని కామభోగము కొఱకు కాదు వారి గార్హస్థ్య జీవితము కూడ ధర్మ కర్మాచరణమగ్నమైనట్లే వర్ణితమైనది కాన నిచ్చట రసము శృంగారము కాదు. కాగా నాశ్వినేయులది శృంగారాభాసము. చ్యవనుఁ డొనర్చిన యజ్ఞమునకు మిత్ర ధర్మము, ఉపకారబుద్ధి ప్రధాన హేతువులు. ఇఁక సుకన్య విషయము చెప్ప నవసరము లేదు. భారతీయ పవిత్రతా ధర్మస్వరూప మాపాత్ర. ఇట్లన్ని పాత్రల యందును ధర్మోత్సాహము పోషింపఁబడియుండుటచే నంగిరసము ధర్మవీర మనుటయే యుచితము దీనికి పోషకములుగా కరుణము, శృంగారాభాసము, హాస్యము, రౌద్రము అనుసంధింపఁబడినవి.

ఈ నాటకమునందు కొట్టవచ్చినట్లు కనపడునది సంఘ విమర్శనము. మచ్చున కొక్కటి రెండు :

1) శర్యాతి:- (ప్రజలతో) ఏమి మీరిట్లు బాధపడుచున్నారు? నగర వైద్యులేమైరి?

ప్రజలు:- ఎందుకండి నగరవైద్యులు? వారివల్ల నేమియును లాభము లేదు. ఏవో కొన్ని నీళ్ళిచ్చి పొమ్మన్నారు. వారి కేదేని లంచమిచ్చువారికిఁగాని మంచి ఔషధము లీయరు. బీదల మెట్లీయగలము?

2) శర్యా:- ప్రజా సంక్షోభమునకుఁ బన్నువృద్ధి చేయుటయే ముఖ్య కారణము.

ఉ॥ పన్నులు వారు హాలికులు వర్తకులుంగద! వారిబోరనే
యున్నది లోకమెల్ల; వెంలొయ్యన హెచ్చొనరింత్రు వారు, దా
నన్నరులెల్లఁ బీదలయి నాఁటికి నాఁటికి సారవంతమౌ
నన్నము లేమి రోగముల కాస్పదులై నశియింపకుందురే?

ఇట్టివి సమకాలీనములయ్యు సార్వకాలికములుగా భాసించుచున్నవి కదా!

సరళ సుందరమైన శైలిలో ప్రయోగానుకూల్యము కలిగి ప్రబోధాత్మకమై, ధర్మవీర ప్రధానమై, దేవీప్రభావ నిరూపణ సమర్థమై, పుణ్యప్రదమై, రసాత్మకమై యొప్పుచున్న యేదంకముల నాటకము సుకన్య.

## అనర్ఘ నారదము

మాయాతత్త్వమును వివరించు నారదోపాఖ్యానము దేవీభాగవతమునందు ప్రసిద్ధము. దానిని గైకొని కవు లనర్ఘ నారదమనుపేర నాఱంకముల నాటకమును రచించిరి. ప్రథమాంకమున నారదుఁడు విష్ణువును మాయాస్వరూప స్వభావములను ప్రత్యక్ష ప్రమాణములతోఁ జూప నర్థించుట యీనాటకమునకు బీజము. ద్వితీయ తృతీయాంకములలో నారదుఁడు సౌభాగ్యసుందరియై తాళధ్వజుని భార్యగా గడిపిన జీవితము వర్ణితము. చతుర్థ పంచమషష్ఠాంకములలో మదయంతి యను కన్యను వరించి నారదుఁ డామెను వివాహమాడుటయు పర్వతుని శాపమునుండి విముక్తుఁ డగుటయు వర్ణితము.

ఈ నాటక ప్రధాన ప్రయోజనము మాయాస్వరూప నిరూపణము. దానిని విష్ణు విట్లు సూత్రప్రాయముగాఁ జెప్పియుండెను:

ఆ.వె. "నిన్న నున్నవాఁడు నేఁడు లేకుండుట
నేఁడి వాఁడు రేపు లేటు గనుట
ఒకఁడు సంతసించు నొక్కఁడు దుఃఖించుట
కన్న మాయయంచుఁ గలదె జగతి?" (ద్వి. అం.)

ఈ తత్త్వము నిరూపింప సమర్థములగు రెండు కథల నెన్నుకొని కవులు వానిని గుదికూర్చి యిందు రచించిరి. దేవీ భాగవతమునందు నారద మదయంతీ వివాహము ముందును, సౌభాగ్యసుందరీ వృత్తాంతము తరువాతను జెప్పఁబడియుండ నాక్రమము నిందు వ్యత్యస్త మొనర్చిరి. దానివలన నాటకమునందు వస్త్వైక్యము సంఘటింపఁబడుటలేదు కాని, సౌభాగ్యసుందరీ వృత్తాంతము మదయంతీరతిభావోద్దీపనమున కుపకరించి సార్థకమగుచున్నది. అమూలకమగు నిట్టి మార్పుతో కవులు కథా సమన్వయ ప్రతిభను ప్రకటించిరి. ఇందు మొదటి కథలో "నిన్న నున్నవాఁడు నేఁడు లేకుండుట" యనెడి మృత్యుతత్త్వమును,

రెండవ కథలో "ఒకఁడు సంతసించుటొకఁడు దుఃఖించుట" యనెడి సుఖదుఃఖ ముల స్వరూపమును, రెండు కథలలోను "నేఁటివాఁడు తేపు చేటుగనుట"యనెడి తత్త్వమును కవులు బోధించుచున్నారు ఇంతియగాక రెండవ కథలో లౌకికమగు నవాంతర ప్రయోజన ముద్దిష్టమై యున్నది. అది సంగీతాచార్యునియొద్ద వయసు వచ్చిన కన్యల నుంచరాదను నీతి ప్రబోధము.

నాటకము పౌరాణికమైనను సమకాలీనమైన కొన్ని సమస్యల నెత్తుకొని వానిని తాము నమ్మిన ధర్మదృష్టితో విచారించి తదనుగుణమైన ప్రబోధము లోకమున నొనర్చుట యనెడి వీరేశలింగము పంతులుగారి యుగలక్షణ మిందు ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. ఈ నాటకమందలి కథలు "రామవాది వర్ నవర్తితవ్యమ్'' అనెడి పద్ధతిలోఁ బ్రబోధ మొనర్చుచున్నవి. ఈ కథల వలన మాయా స్వరూపమును తెలిసికొని దానియందు వైముఖ్యము బోధించుట యిందలి తాత్పర్య మగుచున్నది. అట్లే సంగీతాభ్యాసకురాండ్రగు కన్నియల విషయము. కాని, యిందు చమత్కార మేమన, సంగీత విద్వాంసునిఁ బ్రేమించిన మదయంతి మహా పతివ్రత. నారదుఁడు చిత్తశుద్ధితో నామెను కోరినాఁడు. వివాహమాడి నాఁడు. చివరకు నాయికా నాయకు లెట్టి కష్టములకైన నెదురొడ్డి ''అద్వైత ప్రేమ''ను సాధింప సమర్థులైనారు. ఇందు మదయంతి తండ్రియగు సృంజయ మహారాజు మాత్రము -

చ. అనుభవ పూర్వకంబగు రహస్యమొకండు వచింపుచుంటి ఐ
వ్వన మలరారు మేల్మి కులబాలికల్ స్వర విద్యకంచు స
జ్జనుఁడగునట్టి గాయకుని సన్నిధి నేనియు నొప్పఁజెప్పకుం
డనఘుఁడు నారదుం డితని కన్న మఱెందును యోగ్యుఁడుండునే?

ఆ.వె. గానవిద్య కొక్కదానికే కాదు; పి
రీడు వచ్చినట్టి యెమ్మెలాఁడి
నితర పురుషునొద్ద నెందులకేనియు
నొప్పఁ జెప్పకుండు యోగ్యులార!

అని గొంతెత్తి యరచును. కవుల మతములో కన్యలు పరకీయలుగా నుండుట తగును గాని స్వీయలై స్వేచ్ఛను బ్రకటించి కులమర్యాదలు బాధింప కుండుట యోగ్యము కాదని స్ఫురించుచున్నది. మదయంతీనారదుల వివాహము ధర్మసమ్మతమగుచు, నిష్కల్మష మగుచున్నది గాన, సీప్రబోధ మంతటి శక్తి

మంతము కాదు అందువలన నారదుని యందు కాపట్యమును ప్రదర్శించిగాని, చివఱకు కన్యను త్యజించి యథేచ్ఛగా వెళ్ళినట్లుగాని చిత్రించి యట్టి లోపమును సమర్థించినచో బాగుండి యుండెడిది. కథ కొక్క చక్కని ముగింపు, నాటకారంభ నిర్వహణసూత్ర సమన్వయము కుదిరి యుండెడిది. ఇప్పటి నాటకమున నొక సమస్య సృష్టింపఁబడుచున్నది కాని,దాని పరిష్కారము సూచితమగుటలేదు. ఇఱువదవ శతాబ్దమున నిట్టి పరిష్కారములు సూచితములుగాని సమస్యలతో కూర్చిన వృత్తములుగల నాటకములు పెక్కులుగలవు. సమస్యాపరిష్కారము సంఘమునకు వదలుటయే వారి మతము. కాని, ప్రబోధ ప్రధానమగు నీ నాటకమునం దట్టి ప్రక్రియ యంత సమర్థనీయము కాదేమో!

ప్రస్తావనలోని వసంతర్తు వర్ణనము ఈ నాటకము శృంగార రస ప్రధానమని ధ్వనింపఁ జేయుచున్నది. కాని, మాయా మూలమైన శృంగారము విరక్తిచే విరిగిపోవుచున్నది. వ్యతిరేక వ్యంగ్యార్థమున విరక్తి సాధిత మగుచున్నది. ప్రథమ కథాంతమున దేవలోకమునకుఁ బోవ సిగ్గుపడిన నారదునకు సంసారసుఖము లంటగట్టుటలో చక్కని శృంగార పోషణము జరిగినది. జరదారి శృంగారము రసాభాసమని లాక్షణిక మతము. అట్టిది విభావానుభావాదులు పరిపుష్టములు కానిచోట. ఇచ్చట రసము భాసించుచున్నది. మాయా స్వరూప మొకసారి యనుభవించిన విజ్ఞానియు ఋషియు నగు నారదుఁడే మాయామోహములకు దాసోహమగుచుండ పతితల కాశ్చర్యము, అశ్వముఖుఁడైనప్పుడు హాస్యము కల్గుచున్నవి. ఇది యొక విధముగా శ్రీకృష్ణునిచేఁ గల్పింపఁబడిన మాయానాటక మగుటచే నద్భుతము ప్రధానరసమని చెప్పవీలగుచున్నది. కాని, నారదుఁడు చివఱకు సంసారము మాయామూల మని వదలియున్నచో నింక లాగుండెడిది. మాయా భోగమువలన నిర్వేదము వర్ధితమైనచో శాంతము ప్రధాన రస మయ్యెడిదే.

ఇందు నారద మదయంతీ పర్వతుల పాత్ర లున్నిలన క్రమములోఁ బోషింపఁబడి యున్నవి. నారద పర్వతపాత్రలు తుల్యభేద దృష్టితో కడు రమణీయములై భాసించుచున్నవి. నానారుచిరార్థ సూక్తులతో కవుల కవిత్వమిందెంతయు నీతిబోధకమై వర్తిలుచు, నాసూక్తులు పాత్రల ముఖమునఁ బల్కించు నప్పు డసహజత్వము కానఁబడక యొప్పారుచున్నది. వాల్మీకివలె సాదుచిత్తములతో సరోవరముఁ బోల్చిన కవుల భావన మతి నిర్మలముగా నున్నది.

క. అరసితివె? సాదుల చిత్తము
కరణిన్ స్వచ్ఛములగుచుఁ గ్రాలెడిఁ గంజా
తరజః పరిమళ పరిచితి
సురుచిరములు జలము లిందుఁ జూపఱువోగదన్!

సీసపద్యములపై శ్రీనాథ, పోతనల ప్రభావమధికము. "కలువలు కన్నులై" (ద్వి.అ. 12 పు) : "కలఁగు నూటనాటఁ గాంతాజనంబుల" అను పద్యములు వర్ణనా పాటవమునకు లాక్షణములు. మనస్తత్త్వ రహస్యములు వివరించు శక్తికి "తన మనము తెలియ" (ద్వి అం. 19 పు) అను పద్య ముదాహరణము. దుర్బోధములైన వేదాంత బోధల నరటిపండొలచి చేతనుంచినట్లు రచింపఁగలుగు శక్తి తి.వేం. కవుల కుగ్గుతో వచ్చిన విద్దె ఇందు వీరు మడికి సింగనతోఁ బోల్పఁదగినవారు. ఉ॥

గీ॥ అధిప! సంసారమను సముద్రమ్మునందు
నెవ్వరి కెవరు? రోదనమింత యేల?
యింటి కరుగుము; నౌకపై నెక్కి దాఁటు
వారి చందంబు కాదె సంసార రీతి.

## దంభవామనము

భాగవత ప్రసిద్ధమైన వామనావతార గాథ యీ నాటకమునకు వస్తువు. కవులు మత్స్యపురాణాంతర్గత, జయంతీశుక్రుల వివాహవృత్తాంతము నిందు కథానుకూలముగా ననుసంధించి మాయాశుక్రుఁడైన బృహస్పతికిని సత్యశుక్రాచార్యునికిని సన్నివేశ మేర్పఱిచి తద్విభ్యుల ప్రహసనము నొకదానిని స్వీయ ప్రతిభచే సృష్టించి యీ నాటకమును కమనీయముగా రచించిరి. ఇందు నిరర్థకమైన సన్నివేశముగాని, అనౌచిత్యహేతువగు కల్పనగాని, దుర్బోధమగు కథార్థముగాని, సడలిన యుక్తాగుణముగాని గోచరింపక సుసంబద్ధమైన శిల్పముగా గోచరించును.

"కపటియగు వామనుని చరిత్ర" యను నీ నాటకమునకు బేరిడుట సాభిప్రాయమేయని ప్రస్తావన ధ్వనింపఁజేయుచున్నది.

సూత్ర: భగవంతుఁ డెట్టివారికి సహాయుండగునో పరోపకార మొనర్చువారి తెఱఁగెట్టిదియో తెలియందగు నాటకము నేఁడు ప్రదర్శింపబడెనట!

మారి: అట్టి నాటకము తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన దంభవామనమే కదా!

సూత్ర: అవును చక్కఁగాఁ దెల్పితివి. కాని-

గీ : మాయవన్నిన కపట వామనునికన్న
నాడితప్పక మేదిని యఖిల మతని
కిడిన బలి యుత్తముండని యెన్నఁదగదె?
ధర్మమున వేఱుగలదె సత్యంబు దక్క?

అని వామనుని విషయమునఁ గొందఱు దురభిప్రాయపడియున్నారు సుమా!

మారి : అవును. ఆ విషయము నేనును నెఱిఁగినదే. ఆయూహ తమ రనినట్లు దురూహమే. దుర్మార్గులను వంచించుట కెట్టియుపాయమేని యొనర్పవచ్చును. ఎట్లేని దుష్టశిక్షణంబు కర్తవ్యంబు. "గోవులను జంపి చెప్పులను దానము చేసిన య"ట్లుత్తములకు బాధగలిగించిన దుష్టుఁ డేదో యొక విషయమున యోగ్యుఁడుగానున్నమాత్రంబున సహజ సద్గుణసంపన్నుఁడగునా?

ఇందు నాటక మన్వయించుకొను విధానము స్పష్టముగా సూచింపఁబడి యున్నది.

ఈ నాటకమున బలి నాయకుఁ డగును. ప్రతినాయకుఁ డింద్రుఁ డగును. జాతివైరముచే బలి వరగర్వియై నాకము నాక్రమించి యుద్ధవీరుఁ డయ్యెను. అపై యజ్ఞయాగాదులుచేసి కర్మవీరుఁడై దానవ్రతముఁ బూని సత్యదానవీరుఁడై శాసించెను. ఈఁత డెంత వైయక్తిక ధర్మ మాచరించినను తన రాజ్యాంగములను స్వాయత్తము చేసికొని శాసించిన వాఁడు కాఁడు. ఈ లోపమే యీతని త్రిలోకాధిపత్యమునకు తొలఁగఁదీసినది. వామనుఁడు బలిని పరీక్షించుచు "అక్కటా! యిట్టి సత్యసంధు నిట్లు సేయుట యెంత యేని దుష్కృత్యమనుటకు సంశయము లేదు. కాని, యతని యనుచరు లొనర్పు దుష్కృత్యముఁలఁజేసి యిప్పని తప్పక వచ్చినది" యని యనుట యిచ్చట గమనార్హము. నాకవిజయానంతరము రాక్షసులు దేవతోకమనం దధర్మవర్తనముతో పెచ్చుపెరిగిపోయిరి. స్త్రీ మాన ధనాదులకు రక్షణయే లేదు. దేశ మరాజకమైనది. "పన్నులు హెచ్చయ్యె భగపంతుఁడా" యను సీసపద్యమునందు ప్రజలు పలు కరగండ్లపాలైనట్లు

తెలియుచున్నది. దైవమునకే దయాభావము పొంగులువారునంత, రాక్షసులపై క్రోధాగ్ని చిమ్మునంత దురంతములను వారొనర్చిరి. ఇక నాయకుని మంత్రి యగు శుక్రుఁడా రాచకార్యము కన్న కాముక కార్యమే హెచ్చని పది వత్సరములు జయంతీప్రణయమగ్నుఁడైనవాఁడు. ఇట్టి రాజ్యాంగములతో బలి నిర్వీర్యుఁడైనాఁడు. ఇఁక ప్రతినాయకుఁడు రాజ్యమును కోల్పోయినను విజయోపకరణములను సాధింపఁ గడుంగడు సమర్థుడు. బృహస్పతి యొకవైపు పురుషకారము సిద్ధముసేయ అదితి దైవయత్నమున ఆనుకూల్యమొనర్చినది. గురుఁడు బలి హృదయము మార్చగా - వామనుఁ డదితి సంతానమై వర్ధిల్లి బలిస్థానమే మార్చినాఁడు. పురుషకారము, దైవానుకూల్యము సుసంఘటితములై సమయమునకు సిద్ధమైనవి. నాయకున కట్టివి లేవు. కాని, అతని రాజ్యధర్మలోపమునకు ఫలముగా నాకసింహాసనము గోల్పోయినను స్వీయధర్మాచరణఫలముగా ముక్తి సామ్రాజ్య పీఠము నలంకరించినాఁడు బలిచక్రవర్తి. నాయకున కిందు లౌకికమైన పరాజయము, ఆధ్యాత్మికమైన విజయము లభించినది. ప్రతిపీరున కర్థలాభము మాత్రము కల్గినది. ఈ దృష్టితో నాయక విజయమే కడుశోభాదాయకమై యాతనికిఁ గీర్తి నాపాదించుచున్నది.

బలిచక్రవర్తి పాత్రను కడు జాగరూకతతో కవులు పోషించిరి. బలి యసురుఁడయ్యు విష్ణువిరోధియని మాత్రము మనకీ నాటకమున తెలియదు. చివఱకు భగవద్దర్శనముచే సుజ్ఞానియై విష్ణుకీర్తనమొనర్చి—

"బాంధవమునకైన బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతి నయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులైయుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప!"

యను న్యాయమునఁ దత్ప్రసాదమునకుఁ బాత్రుడయ్యెను.

పతితల హృదయముల కత్యంత ఆకర్షకమైన పాత్ర జయంతి. తండ్రి యాజ్ఞచొప్పున రాజకీయోపాయముల కుపకరణముగా తనకుఁ దెలియని యొక పురుషుని వరింతునని మాటయిచ్చి వెడలి కడు నిబ్బరముగా చాకచక్యముతో శుక్రుని తన వశునొనరించుకొనిన ధీరురాలు జయంతి. ముగ్ధపోదయని యను

కొనిన సంసారము పూలపాన్పై యీ కన్నియ ధన్యమైనది. మత్స్యపురాణాంత ర్గతమైన వీరగాథ కథ కాయువు పట్టుగా కవులు సంధించిరి. మాయశుక్ర కల్పనము బృహస్పతిబుద్ధులగు కవుల ప్రతిభాఫలమే. నాల్గవ యంకమంతయు చైతన్యవంత మొసర్చినది యీ కల్పన వామనుని ప్రతిక్రియకు నాంది నాలపించినది కూడ. పంచమ షష్ఠాంకములలో బలీంద్రుని సత్య దాన వీర తేజములు శుక్రాచార్యావరోధములను నిరోధించి యుజ్జ్వలమై విశ్వాత్మునంత యెత్తు పెరిగి నిలువఁబడినది. వామనుని చేత—

"దాతలలో నేతలలో
నీతివిదగ్రణ్యులయందు నిన్నుం బోల్పన్
నా తరమె వేరొకరుని
న్నీతో సామ్యంబు చెప్ప నీకే చెల్లున్" అని కీర్తివడసినది.

నాయకుని యందు యుద్ధవీరము అధర్మ బద్ధమగుటచే వీరాభాస మగుచున్నది. దానోత్సాహ మప్రతిహతముగాఁ జెల్లుటచే దానవీరము శోభించుచున్నది. కావున నీతనిని ప్రధానముగా దానవీరుఁ డనవచ్చును. ఇచ్చట యొకటి మీమాంస్యము. దానవీర ప్రధానమగు కావ్యములలోఁ బ్రతినాయకుఁడుండడనియు, ధర్మము స్వయంప్రభా సమానముగాన నాయకునం దది ప్రకాశించుచుండుననియు కొందఱు భావింతురు. కావ్య ప్రయోజనముఁబట్టి చూచుచో దానవీరాదుల కథలలోఁగూడ ప్రతినాయకుఁలుండవచ్చునని తెలిసికొనవచ్చును.

అసలు ప్రతినాయకుని వలన కావ్యమున ప్రయోజనమేమి? నాయకుని ప్రవృత్తికి ప్రత్యర్థియై యతని కార్యమున కంతరాయములు గలిగించుటవలన నాయకుఁ డత్యంత సుస్వాదమగుచున్న తన కార్యము నపూర్వోత్కటోత్సాహముతో సాధించి వీరుఁ డనిపించుకొనును. ఇదియొక యుద్ధ వీరమునందే యుండునని భ్రమింపరాదు. దాన ప్రక్రియాదులలో గూడ నాయకుని కత్యంత దుష్కరమైన అవరోధములను గల్పించుచో నాతని దృఢ వ్రతమున కెంతయు వన్నె నేకూరఁగలదు. అట్టి పరీక్షలఁ గల్పించి నాయకుని కీర్తికిఁ బరోక్షముగాఁ దోడ్పడువాఁడే ప్రతినాయకుఁ డనఁబడును. ఇచ్చట ఇంద్ర సహాయకుడయిన వామనుఁడు ప్రతినాయకుఁ డనుటలో దోసము లేదు.

స్వాతంత్ర్య పోరాటమునందలి "వందేమాతరమ్" ఉద్యమము ఈ రచనపై ప్రభావము వేసినట్లు పొడకట్టుచున్నది. ద్వితీయాంకారంభమున "వందేమాతర" మ్మనెడి యింద్రుఁడు సత్యాగ్రహోద్యమ నాయకునిగా మనకుఁ బొడకట్టును. పరిసరకాలప్రభావముల నెంతప్రతిభావంతుఁడును త్రోసిరాజనఁజాలఁడు కదా!

## ప్రభావతీ ప్రద్యుమ్నము

హరివంశకథా ప్రసిద్ధమగు ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతమును గైకొని సంస్కృతమున తిరువనంత పురాధీశుఁడైన రవివర్మ ప్రద్యుమ్నాభ్యుదయమనెడి నాటకమును పండ్రెండవ శతాబ్దిలో రచించెను. ఆంధ్రకవి పింగళి సూరన యీ కథనే ప్రబంధముగా గల్పించెను. తిరుపతి వేంకట కవులు వీని నన్నింటిని గాంచి యుచితమైన కథా ఘట్టములతో బాలవఱకు పింగళి సూరన కథానుసారిగా నైదంకముల నాటకమును రచించిరి.

వజ్రనాభ సంహారమునకై యింద్రుఁ డొనర్చు ప్రయత్నమే యిందలి కథ. అతనికి గౌరీదేవి, శుచిముఖి, ప్రద్యుమ్నుఁడు, శ్రీకృష్ణుఁడు అను వారిందు సహాయులై వర్తిల్లిరి. ప్రయత్నమంతయు ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహముతో ముడివడి యుండుటచే తత్సాధనమును గౌరియు, శుచిముఖియు నొనర్చిరి. అపై ప్రద్యుమ్నుఁడు గదసాంబుల సహాయపడగా విష్ణు చక్రముతో రాక్షసుని సంహరించును. కావున ప్రభావతీ ప్రద్యుమ్న వివాహ మిందు పరమ ప్రయోజనము కాదు. అందువలననే కవు లిందు చెప్పదలచిన కథ దాదాపుగా చతుర్థాంకారంభమునకే పూర్తియై పోవును. ప్రతి పాత్రయు నాపై వజ్రనాభుని సంహారమునకై కృషి చేయును. ప్రభావతియుఁ దన భర్తకు ఖడ్గమునిచ్చి తండ్రిపై యుద్ధమునకు పంపగా నితరులమాటఁ జెప్పవలెనా? ప్రధాన ఫల దృష్టితో నీ నాటకము వీరరస ప్రధానమైనదనియే చెప్పవలసి వచ్చుచున్నది.

శుచిముఖిపాత్ర నాటకమునకు గుండెవంటిది. సర్వకార్యార్థములు నామెచే ననుసంధింపఁబడి నిర్వహణానుకూల్యము సంతరించుకొనును. సామాన్యముగా నీ పాత్రయందు కవి హృదయము ప్రతిబింబించుట కాంచుచుండుము. పింగళి సూరన శుచిముఖి పాత్రలో తొంగి చూచుచుండును. అట్లే యిందును దివాకర్ల తిరుపతి శాస్త్రిగారిని కోల్పోయి యొంటిగా జీవించుచున్న చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు ప్రతిబింబించి నిల్పినారు. శుచిముఖి పాత్ర కలంకారభూతములగు ప్రధాన గుణములు బుద్ధివైభవము, వాక్యవైదగ్ధ్యము అనునవియేగాక "శతావధానగరిమ" యు నిందు జోడింపఁబడినది. "బాలసరస్వతి" బిరుదము కూడ కలదట ఆ యంచకు! ఇంతకన్న వేరు కావలెనా నిదర్శనము? తమ కవిత్వాదర్శము శుచిముఖి ముఖమునఁ గవులు చెప్పించిరి. ఇట్టి పాత్రను రవివర్మ తన నాటకములో నాటక ప్రయోగానుకూల దృష్టితో వదలివేసెను. కాని, కవు లీ పాత్ర నట్లే యుంచి,

పోషించి, ప్రయోగానుకూల్యముకన్న ఆత్మాభినివేశమునే అధికముగాఁ జాటు కొనిరి.

నారదుఁడు, విదూషకుఁడు, రంభోర్వశులు ఇందు క్రొత్తగాఁ గల్పింపఁ బడిన పాత్రలు. రంభోర్వశులు ప్రభావతీ చంద్రవతీ గుణవతులకు నాట్యా చార్యలు. వారి శిష్య బోధనా శక్తినిఁ బరీక్షింప వచ్చి కొంత నాటకమాడి గద సాంబులపై చంద్రవతీ గుణవతులకు మరులు గొల్పించినవాఁడు నారదుఁడు, మాళవికాగ్నిమిత్రములోని హరదత్త గణదత్తుల శిష్య పరీక్షా ఘట్టమును దృష్టి యందుంచుకొని కవులు దీనిని కల్పించినట్లున్నారు. ఈ నాటకములో విదూష కుని పాత్ర స్వల్ప ప్రయోజనమునే సాధించినది; మఱియు శుచిముఖి పాత్రలోని కొంత భాగము పంచుకొని, ఆ పాత్రను రాణింపకుండఁజేసినది.

నాయికా నాయకుల స్వప్న కల్పన మిందొక విశిష్టతతో గూర్పఁబడినది. పింగళి సూరన ప్రబంధములో నాయికా స్వప్నమున గౌరి నాయకుని స్వరూపమును కనుకలి వినుకలులతో పరిచయము చేయును. నాయకునికి వినుకలి మాత్రముననే కల్పించును. కాని, నాటకమున నిరువురకు రెండు చిత్రములనిచ్చి కనుకలి వినుకలి రెండును కల్పించినది గౌరి. ప్రబంధమున నాయికతో నాయకుని నామము చెప్పింప, నిందు పేరు చెప్పక నుత్కంఠ కల్గునట్లు సంధింపఁబడినది. ఈ నాటకమునం దంతర్నాటక దృశ్యము ప్రేక్షకుల నావేశోత్సాహములతో నుఱ్ఱూతలూగింపఁగల చైతన్య గుణము కల్గియున్నది.

ఇందలి కవిత్వ స్వరూపమును గూర్చి కవులే శుచిముఖి పాత్రలో నిట్లనిరి:

సీ॥ అర్థ గంభీరంబులైన శబ్దముల పొం
దిక ముఖ్యముల కోవ ఠీవిగాఁగఁ
దత్తద్రసోచిత తాత్పర్య పర్యాప్తి
సురుచిరాలంకారశోభ నూన
గుణపాటవంబు దూషణ శూన్యతయుఁ బ్రౌఢ
శయ్యా చమత్కార చతురిమంబు
వ్యంగ్య మర్యాదయుఁ బ్రతిభా విభావిత
కల్పనా కౌశల్య గౌరవంబు

గీ॥ వెలయునట్లుగ నాళుకవిత్వ మల్లు
టర్యనించిరి వాణీదయా విశేష
వైభవంబునఁ గొన్ని కావ్యములఁ గొన్ని
నాటకంబులు వ్రాసిరి నవ్యపణిఠి.

ఈ నాటకమునందు పద్యములకన్న వచన సంభాషణలే యధికముగా గోచరించుచున్నవి.

## చవితి చంద్రుఁడు

గజానన విజయమను నామాంతరముగల చవితి చంద్రుఁడను నాటకము తొమ్మిదంకముల చిన్ని నాటకము. గజాసురుఁడు శివుని తన గర్భమున వసింప వరము వేడుకొనెను. వరగర్వియై యాదైత్యుఁడు నాకవాసుల బాధించెను. నారదుఁడు శివునిఁ దెత్తునని పార్వతి యెదుట ప్రతిజ్ఞచేసి నారాయణాదులను గంగిరెద్దు మేళపువారి వేషములు వేయించి యసురుని యెదుట నాడించి యతనిఁ జంపించెను. శంకరుఁడు విముక్తుఁడై యింటికి వచ్చుచు ద్వారమునొద్ద తన్నడ్డగించిన విఘ్నేశుని శిరముఁ దునిమెను ఆపై నతఁడు తన కొమరుఁడని తెలిసికొని గజాసురశిరము నాతనికిఁ దగిలించి ప్రాణము పోసెను. గుజ్జువేలుపగు వినాయకుని జూచి నవ్విన చంద్రునికి గౌరి శాపమిచ్చెను. తద్భావఫలముచే శ్రీకృష్ణుడుఁ నీలాపనిందలపాలై జాంబవంతుని నోడించి శమంతకమణిని సాధించి దానిని సత్రాజిత్తున కిచ్చివేసి కీర్తిమంతుఁడై సత్యాజాంబవంతులఁ బెండ్లాడెను. వినాయక చవితినాఁడు బాలురు ప్రదర్శించి యానందింపఁదగిన యీ నాటక మెంతయు ముచ్చటగా నున్నది.

ఇందలి కవిత్వ శైలికి నుదాహరణగా నొక్క పద్యము నిత్తును:

శా॥ "లోకాలోక గరీంద్రకందర తమోలోకంబు నేకాలమున్
లోకార్పందగునా ప్రతాపమున కీభూముల్ నివాసంబులే
లోకంబు ల్తగు నాటచోట్లనుచు నాలోకించు చందంబుగా
నాకాశాగ్రము చేరె సూర్యుఁడు సమగ్రాంశుండు భూపోత్తమా!"

మధ్యాహ్న వర్ణనమగు నీ పద్యమునందు భావౌన్నత్యము ప్రభాకరుని యంతయెత్తుగ నెగసియుండుట పఠితకు సులభముగాఁ దెలియుచున్నది.

## ప్రకరణము : వ్యసన విజయము

వ్యసనవిజయ మసంపూర్ణమగు తెలుఁగు ప్రకరణము. జూదమువలన సంఘమునకుఁగలుగు కష్టనిష్ఠురములను ఇందు చిత్రించుటయే కవుల యభిమత మైనట్లు తెలియుచున్నది. సంఘసంస్కరణాభిలాషులగు కవులు వ్యతిరేకవ్యంగ్య రూపమగు ప్రబోధము నిందు సంధించి వ్యసనాసక్తుల నీతిబాహ్యజీవితము రంగ ముపైఁ బ్రదర్శించి దానిపై నేవ గల్పించుటయే లక్ష్యముగా భావించిరనుటలో విప్రతిపత్తి లేదు.

ఈ ప్రకరణమునందు సృష్టించిన జగత్తు సుసంస్కృతులకు జుగుప్సా వహమైనది వేశ్యాలోలురు కొందఱు, పచ్చనిసంసారములను, ఋజువర్తనమును, కులాచారములను, వేదవిహితకర్మలను ద్యూతాసక్తితో గుల్ల లొనర్చినవారు కొందఱు, నిత్యోపవాసములు చేయుచున్నను మీసములకు సంపెంగనూనె రాచుకొని లేని గొప్పలు చెప్పికొనుచు ప్రగల్భములాడి పొట్టఁబోసికొనెడి బూటకపు వర్త నులు కొందఱు, ధనమున కాశపడి అనేక పాపముల కొడికట్టి, నీచప్రవృత్తి నల వఱచుకొనిన పతితులు కొందఱు, జూదము నొక వృత్తిగాఁ బెట్టుకొని మాయో పాయములతో పరుల యాస్తులను కబళించి మ్రింగు నరపశువులు కొందఱు ఈ నాటకమున మనకుఁ బ్రత్యక్షమై తమ తమ సిద్ధాంతములను తదనుసరణము నందు వారు పొందిన యనుభూతులను మన కేకరువుబెట్టి చెప్పుచుందురు. సిగ్గు విడిచి మాట్లాడెడి యా పాత్రల పల్కులు ఉత్తములకు లజ్జాహేతువులై తద్వ్యసన పరాఙ్ముఖతను వ్యంగ్యముగా బోధించును.

ఈ రూపక ముత్తమనాయకము కాదు కనుకను, వేశ్యాస్త్రీకృత శృంగారో పేత మగుటచేతను, అనార్షము, కల్పితమునైన వస్తువిం దుండుటచేతను దీనిని ప్రకరణ మనఁబడుచున్నది. వస్తు వసంపూర్ణమగుటచే కవుల సంపూర్ణ ప్రణాళిక బోధపడుటలేదు. బహుశః దైవదుర్విపాకముచే వ్యసనాసక్తులై పతితులైన యుత్త ముల కొందఱిని పశ్చాత్తప్తుల నొనర్చి పాపప్రక్షాళనానంతరము పూర్వతేజము వారికిఁ గల్పించి వ్యసనములను జయించినట్లు చిత్రింపఁదలఁచినారో? లేక-

క. "పానాసక్తులు నబలా
దీనులు మృగయులును గొంత యేగిన పిదపన్
మేనెఱుఁగుట కల దకటా
మానరు జూదరులు దాని మరణము దనుకన్"

అనియే నిరూపింపఁదలచినారో- ఎట్లైనను ప్రయోజన మొకటియే.

ఇందు ప్రధాన పాత్రంలో నొకఁడగు ''మామ'' ద్యూతము నాదిశక్తిగా పరమేశ్వరిగా భావించి, భక్తిని గుడించిన వ్యసన భక్తుఁడు. మచ్చున కితని మాటలు విన్నఁజాలును. తదితర పాత్రంన్నియు నిట్టివేయని పఠిత లూహింప వచ్చును.

ఉ॥ వందలు గోలుపోవుటయు వందలు గెల్చుట నీ యధీన మే
మందఱమున్ ద్వదీయ పరమాదర మన్నది కోరుచుంటి, మే
చందముగా నొనర్చెదవొ చాందర్శిదుఁడఁ బేకతల్లి! నా
వందనముల్ గ్రహింపుము కృపారస నీరధిలోన ముంపుమా!

ఉ॥ తాత గణించి పోసినది తండ్రి గడించిన ద్రవ్యమంతయున్
నా తరమందు ఖాడిద యొనర్చితిఁ గాఁపురముందు కొంపయున్
లాఁతుల కప్పగించితిఁ గసంబర దేమియు నీవు తప్ప; నా
కేతరి చూఁపెదో జగదధీశ్వరి యీ విపదబ్ధి దాటఁగన్.

ఇట్లే పేకతల్లిని నవవిధభక్తి మార్గములలో నుపాసించు భక్తావతంసము లిం దెందఱో గోచరింతురు. ఎవటి భక్తి కొలఁది వారి కంత ఫలము!

అధమ పాత్రం జీవితమును వృత్తముగా గైకొని కావ్య నిర్మాణ మొనర్చుట కవుల కావ్య ప్రక్రియలో నొకటి. శూద్రక మహాకవి వారికి ప్రేరణ మిచ్చి యున్నాఁడు. సమకాలీన సాహిత్య ప్రక్రియలు కూడ దానికి దోహద మొనర్చి యున్నవి. తెలుఁగున నున్న పెక్కు ప్రకరణముల వలెనే వ్యసన విజయము ప్రయోగానుకూల్యమంతగా కల్గియుండక పోవుటయు, పద్యబాహుళ్యము గల్గియున్నను సామాజికానుభూతి కవరోధమేమియు లేకుండుటయు నిందు ప్రధానముగా గమనింపఁదగిన యంశములు. కవుల యాశుకవిత్వధార యిం దావేశ తరంగిణియై ప్రకరణ క్షేత్రమంతయుఁ బరవళ్లు త్రొక్కినది.

## సౌవర్ణ పాత్రికము : వీధి

సౌవర్ణ పాత్రిక మనునీ ప్రకరణము రెండంకములలో నున్నది. విప్రనారాయణ చరిత్రమును ఏడెనిమి దంకములలోఁ బ్రకరణముగా నిర్మింపఁదలచి యారంభించినను కథయంతయు రెండంకములలో ముగిసిపోవుటచే నది యట్లే యుండిపోవలసి వచ్చినదని వేంకటశాస్త్రిగారు కథలు - గాథలులో పేర్కొని

యుండిరి. వేశ్యావాటికలో దేవదేవి సమాగమార్థియైన విప్రనారాయణునిపై దయఁ దలచి రంగధాముఁడు తన దేవళమున నున్న సువర్ణ పాత్రను వేశ్యమాతకు స్వయముగా నంపును. విప్రనారాయణునకు వేశ్యాగృహ ప్రవేశము లభించును. అపై నదియే యాతనిని దోషిగా నిరూపించినది. కథలోని ప్రధానమైన మార్పును సూచించు నట్టిదీ నామకరణము. ఉత్తమ సంస్కారులు వేశ్యాలోలులు కాగూడదను ప్రబోధమే యిందు ప్రధానము.

వీధియనురూపకముగూడ వీరిచే విద్యార్థి దశలోనే వ్రాయఁబడెను. జాతకచర్యలో—

తే.గీ. "ధాతురత్నాకరమ్ము గొంతవఱి పూర్తి
నేయుటయు కాక "వీధి"నాఁజిన్నిరూప
కంబొకటి రచియించుట గలిగె" (పూర్వ. 245.) అని తెలిపియున్నారు.

## పూర్వరంగ ప్రక్రియలు

నాటకారంభమున విఘ్నోపశాంతికై యొనర్చు పూర్వరంగాంగములలోఁ బ్రధానమైనది నాంది. దీనిచే దేవతలాదిగాఁగల సర్వులు సంతోషించెదరు. 'ఆశీర్నమస్క్రియా రూపః శ్లోకః కావ్యార్థ సూచకః నాందీతి కథ్యతే''యని భరతుఁడు నిర్వచించియుండెనని రామభట్టు పేర్కొనెను. నాంద్యంతమున స్థాపకుఁ డనఁబడు రెండవ సూత్రధారుఁడు ప్రస్తావనాంగములను నటీవిదూషక పారిపార్శ్వకులలో నొక్కరితో నిర్వహించును. కవినామ కథా సూచనములు, ప్రరోచనము, ఋతుగానము, ప్రథమపాత్ర ప్రవేశ సూచన మనెడి యంగములు ప్రస్తావనలో ముఖ్యములు. పాత్రప్రవేశ సూచనము కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవృత్తక మనెడి ప్రక్రియలతో కవులొనర్చెదరు. సూత్రధారోక్తులందు ప్రస్తుత కథను సూచించుచున్నట్టి వాక్యమును గాని దాని అర్థమునుగాని గైకొని పాత్ర ప్రవేశించుట కథోద్ఘాతము. ఇది, ఈ, ఇతఁడు అని సూత్రధారునిచే నిర్దేశింపఁబడిన పాత్రప్రవేశము ప్రయోగాతిశయము. కాలసామ్యసూచిత పాత్ర ప్రవేశము ప్రవృత్తకము.

కథా సూచన మొనర్చుట వస్తుపాత్ర బీజ భేదములచే త్రివిధముగా నుండును. ప్రరోచనమునందు ప్రేక్షకుల హృదయము నాటకము పట్ల రసార్ద్రమగునట్లు సూత్రధారుఁడు సంభాషించును. రసానుకూలముగా ఋతుకీర్తనము

వర్తిలవలెను. 'శరత్సం గ్రామసమయే - వివాహే గ్రీష్మ మాధవే" "ఏకోరసో భవే దంగీ వీర శృంగారయో ర్ద్వయోః" అని లాక్షణిక మతము. ఇట్టి నాందీ ప్రస్తావనల నిర్వహణము ప్రేక్షక దైవ హృదయానురంజనమగుటయేగాక, కవుల కవిత్వ మహత్త్వ నికషోపలమై యొప్పుచుండును. తి వేం. కవుల నాటకములందీ నాందీ ప్రస్తావనల నిర్వహణము సరసముగను, శాస్త్రీయముగను శిల్ప వైవిధ్య సంశోభితముగను జరిగియున్నది.

వీరి ప్రథమ నాటకమైన పండిత రాజమునందు మాత్రము నమస్క్రియా రూపమున నాంది గోచరించును. తదితరములన్నిఁటి యందును ఆశీస్సు రూపముగనే భాసించుచున్నది. దీనినిఁబట్టి ఆశీఃపురస్సరమైన నాందీ స్వరూపమే వీరధికముగాఁ బ్రయోగించినరని తెలుచున్నది నాందియందు వస్తు నిర్దేశము అనివార్యమని యెచ్చటను చెప్పఁబడలేదు. కాని, యట్టి దొక యాధారమై విమర్శకుల వెన్నంటుచున్నది. తి.వేం. కవులు నాందీపద్యములందు వస్తునిర్దేశమును పెక్కు విధములుగా నొనర్చిరి. నాటక కథయందలి ప్రధానాంశములు నాందియందు సూచితమగునట్లు పాండవాశ్వమేధము, ప్రభావతీ ప్రద్యుమ్నము, చవితి చంద్రుఁడు అను నాటకములందును, శబ్ద ప్రధానముగా నాటక పాత్రల, పేర్కొను రూపమున పాండవ విజయమునందును, అర్థప్రధానముగా పాండవోద్యోగమందును, భారత ప్రశస్తి రూపమున పాండవ జననము నందును, సార్థక విశేషణ ప్రయోగముచే సుకన్య, పండిత రాజము, దంభవామనము, అనర్ఘ నారదము అను నాటకములందును, సాదృశ్య వస్తు వ్యంగ్యముచే నెద్వర్డు పట్టాభిషేకమునందును వస్తు నిర్దేశమును కవు లొనర్చి యుండిరి.

పాండవ జననము, విజయము, పండిత రాజము, ప్రభావతీ ప్రద్యుమ్నముఁ అనర్ఘనారదము, ఎడ్వర్డు పట్టాభిషేకము అను నాటకములలో ప్రస్తావనను సూత్రధారుఁడు నటితో కలిసియు, ప్రవాసోద్యోగాశ్వమేధ దంభవామనాదులలో మారిషునితోఁ గలిసియు, చవితి చంద్రునిలో నటునితోఁ గలిసియు ప్రస్తావనను నిర్వహించెను. సుకన్యలో నటి తెరలోనుండి బైటకురాదు. కవినామ కథా సూచన ప్రరోచనాదులు ప్రతినాటకమునందును కవులు ప్రకరణోచితముగా నను సంధించి యుండిరి. దంభవామన అనర్ఘనారద పండితరాజాదులలో వస్తు సూచనమును, ప్రవాసాదులలో పాత్రసూచనమును, విజయాదులలో బీజ పాత్ర వస్తు సూచనాదులును గోచరించుచున్నవి. కొన్నింట కృతిపతుల యొక్కయు

కొన్నింట బ్రహ్మశ్రీ చెర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి యొక్కయు కీర్తనము గోచరించు చున్నది. పాత్ర ప్రవేశ సూచన మాయానాటకములం దిట్లు గోచరించు చున్నది.

కథోద్ఘాతము - పాండ జనన; పాం. ఉద్యో; పాం. అశ్వ; పండితరాజః ఎద్వర్డు పట్టా; సుకన్య, ప్ర. ప్రద్యుమ్న; దంతవాము-చవితి చంద్రుఁడు.

ప్రయోగాతిశయము - పాండవ ప్రవాసము.

ప్రవృత్తకము - పాం. విజయము, అనర్ఘ నారదము.

ఇందుఁ గొన్నింట కథోద్ఘాతాదులు శుద్ధములుగా గాక ప్రయోగాతిశయ ప్రవృత్తకాది లక్షణములు కొన్ని కల్గియుండి మిశ్రరూపములుగా గూడఁ భాసించు చున్నవి. వానిని పఠనావసరమున గుర్తింపవీలగును పై విభాగము చాల స్థూలమైనది.

పాండవ రాజసూయ ప్రస్తావనము ప్రత్యేకముగాఁ జర్చింపఁదగినది. సామాన్యముగా నాటక ముఖమునందు గోచరించు సంభాషణరూపమైన ప్రస్తావన కాదిది; నిర్వచన రూపమై శ్రవ్యకావ్యమువలెనున్న ఘట్టమిది. ఇది యొక పద్య కథ. 'నాగభూషణుఁడు' తన రుద్ర నాట్యమును జూడ వచ్చిన వారందరికి విష్ణు పూజా మాహాత్మ్యమును బోధించి వారిని విష్ణుసేవకు బురికొల్పెను. అందొక నాగము కాళీయ ఫణిమర్దనుఁడైన విష్ణువును పూజింప నసమ్మతిఁ బ్రకటించెను. శిష్ట రక్షణ దుష్ట శిక్షణార్థము జన్మించు విష్ణువునకు శత్రుమిత్రత్వాదు లెవ్వరి యందు బ్రత్యేకించి యుండవు కాన, సర్పకులమం దొకనిని గర్వమడఁచినంత మాత్రమున పాముల కెల్లఱకు విరోధి కాఁడనియు నతనికి నచ్చఁ జెప్పయత్నించిరి. హనుమంతుఁడు - హరిమహత్వము నుగ్గడించి ప్రయత్నించెను. పాము మనసు మారలేదు. విష్ణు ధిక్కారముచే మరణము నొందిన యొక దూర్తుని చరిత్రముఁ బ్రదర్శించినచో నతని హృదయము మారవచ్చునని పవనజుఁడు సూచించెను. వెంటనే శివానుమతి లభించెను. నందికేశ్వరుఁడు సూత్రధారుఁడై నాందీప్రస్తావనలు నిర్వహించి నాటకము ప్రదర్శింపఁజేసి చూపెను. ఇందరులో నుద్యోగ విరమణమగు సమయమున వేంకటశాస్త్రిగారికి కవి సన్మానమొనర్పఁదలెనని కొందఱు యత్నింప, నియోగివైదిక భేదములు వచ్చి, కొప్పరపు కవులైవువా రెవరో దానినిఁ బ్రతిఘటించిరట! ఈ ఘట్టము వస్తువ్యంగ్యముగా నీ ప్రస్తావనలో

ముద్రితమైయున్నది. ఇట్టి ప్రస్తావనలు ప్రయోగానుకూల్యముకన్న ప్రబోధానుకూల్యములై అధిక్షేపకావ్యరూపములై చమత్కారహేతువులై శ్రవ్యకావ్యఖండముగా రాణించుటకు వీలుండును.

భరతవాక్యములందీ కవులు సర్వలోక శ్రేయస్సు నాకాంక్షించుటయే గాక ప్రబోధాత్మకములైన సందేశములఁగూడ నిచ్చుచు ప్రక్రియా వైవిధ్యమును సంతరించి శుఖాంతనాటకములపై తమకున్న గౌరవ భావమును వ్యంగ్యముగాఁ జాటిరని చెప్పవచ్చును.

## ప్రహసనములు

సంఘ సంస్కరణ ప్రచారోద్యమ సాధనముగా ప్రహసనము నుపయోగించుటకు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తెలుఁగులో శ్రీకారము చుట్టిరి. మారుచున్న సంఘ వ్యవస్థలోఁ బ్రాతవడ్డ యాచార వ్యవహారములను, పేరుకొని పోయిన మూఢనమ్మకములను బట్టబయలు చేసి, రంగము మీఁద కెక్కించి, నవ్వులఁబాల్జేసి, సామాజికులకు వానిపై విరక్తిని గల్పించి కాంతాసమ్మితమైన ప్రబోధమును నవ్వుల పువ్వులలో నందించి వారియందు నవ్యచైతన్యమును రేకెత్తించుట కనుకూలమైన రూపకవిశేషము ప్రహసనము. వజ్రామాతమువంటి పలుకులైనను వెన్నవంటి హాస్యము చాటున విరిబంతుల ప్రేటులవలె బాధాకరములుగాక బోధాకరములై ప్రహసనములు పొల్పారుటకు వీలున్నది. అందువలననే కవుల కీనాటి సంఘసంస్కరణ కుపాదేయమైనది.

సంస్కరణప్రియులైన తిరుపతి వేంకట కవులు సాంఘిక సాహిత్యరంగములలోనున్న మూఢాచారములను విమర్శించుటకును, పాశ్చాత్య ప్రభావమువలన దేశములో నేర్పడుచున్న నవ్యభావచైతన్య ప్రవాహములో నౌచిత్య శుద్ధియు, స్వదేశీయ సంస్కృతి పరిపోషణ సామర్థ్యమును లేని కొన్ని లోపముల నెత్తి చూపి వానివలన గల్గు దుష్పరిణామములఁ దెలియఁజేయుటకును ప్రహసనమును చేపట్టిరి. కాని, ప్రహసన రచనము వీరి ప్రధానోద్దేశము మాత్రము కాదు. విశిష్టములు విభిన్నలక్షణ సముపేతములునైన ప్రహసన ప్రక్రియలు కొన్నిఁటిని సృష్టించి తమ కావ్యప్రక్రియయందును గల యభినివేశముఁ బదర్శింప యత్నించినట్లు కానఁబడుచున్నది సార్వకాలికలక్షణములు వీనియందు లేకపోవుటచేతనే కవులు ఆఱు ప్రహసనములను మాత్రమే రచించియుండవచ్చును. రచించిన వాని

యందు మాత్రము తమకాలమునకుచితమైన ధర్మప్రబోధములు నిరాఘాటముగా తమ రచనలందు ప్రపంచించి యుండిరి. ప్రతి కావ్య ప్రక్రియయందును సామర్థ్యముతోఁగూడిన సాహసము కవులయందు గమనించుచునేయున్నాము

తిరుపతి వేంకట కవులు రచించిన ప్రహసనములు ఆఱు : అవి :- 1) పల్లెటూళ్ళ పట్టుదలలు. 2) త్రిలోకివిజయము, 3) కవిసింహ గర్జితములు, 4) అపూర్వకవితా వివేచనము, 5) స్కూలు పిల్లల ప్రహసనము, 6) రసాభాసము అనునవి. వీనిలో పల్లెటూళ్ళ పట్టుదలలను. స్కూలు పిల్లల ప్రహసనమును వ్యావహారిక భాషలో వ్రాసి, కథా ప్రవృత్తినిబట్టి విషయ గాంభీర్యమును బట్టి యుచితమైనచో గ్రాంథికభాషను వదలి వ్యావహారికములో రచన మొనర్పవచ్చుననెడి భాషా సంస్కరణ దృష్టిని ప్రదర్శించియుండిరి "శ్రాద్ధమునకును దేవతార్చనమునకును ఒకే మంత్ర మనెడి" పట్టుదలను కవులు పాటింపకుండ 'పల్లెటూళ్ళ పట్టుదలల'ను గూర్చి ప్రహసనము వ్రాయుట నిజముగా మెచ్చుకొనఁదగినది కాదా?

కవులు రచించిన ప్రహసనములలోని వస్తువులు, తన్నిర్వహణ ప్రక్రియలు వేరు వేరైనను వానియందు సామాన్యముగాఁ గానఁబడు కొన్ని ముఖ్యాంశములివ్వి:

1) రసపోషణతోపాటు ప్రబోధమును సమాంతరముగా నిర్వహించుట.

2) వస్తువక్రతకన్న పాత్రవక్రతకే ప్రాధాన్యమునిచ్చుట.

3) అన్వయానుకూల వ్యతిరేకముగా మనఃప్రవృత్తిని ధ్వనింపఁజేయు పేర్లను పాత్రలకుఁ బెట్టి నామవక్రతను పాటించుట.

4) ప్రధానాంగముగా గాని, ఉపాంగముగా గాని సమకాలీన సారస్వత వ్యాసంగ ప్రసక్తినిఁ దెచ్చి విమర్శించుట.

ఇఁక నొక్కొక్క ప్రహసనమును గైకొని స్థాలీపులాకన్యాయమునఁ బరిశీలింతును

## పల్లెటూళ్ళ పట్టుదలలు

ప్రాచీనపుటాధార ప్రాశస్త్య జ్ఞానములేక, ముందుకు సాగిపోవుచున్న కాల ప్రవాహ వేగము నందుకొనఁజాలక సతమతమగుచు, అర్థహీనములయిన

కొన్ని వట్టులను గట్టిగా పట్టికొని గ్రామ సమైక్య శక్తిని భంగపఱచుచు, ఇంగువకట్టిన గుడ్డలవలె బ్రతుకుచు, క్రిందుమీఁదలగు బ్రాహ్మణ క్షత్రియ జాతుల నుద్దేశించి వ్రాసిన దీ ప్రహసనము. ఒక క్షత్రియునింటఁ జరిగిన వివాహములోఁ బిల్లవాని వైపు వారూరేగింపు బజారుకుఁ బోవునప్పుడు మంచముల మీఁద బరున్న బాపలు కొందఱు లేచి నిలువఁబడలేదన్న నెపముతో సంభావన లిచ్చుట మాని వేసిరి. ఈ విషయము బైటకు పొక్కినది. వైదికులలోఁ బట్టుదలగలవారు కొందఱు పెండ్లి పందిరి వీడి వచ్చి వైచిరి. కొందఱు ద్రొడ్డి త్రోవన వెళ్ళి రెండవ పక్షమువారిచ్చు సంభావనలను స్వీకరించిరి. సంభావను తీసికొననివారు తీసికొన్నవారిని వెలివేయ ప్రయత్నించిరి. అందఱు కలిసిరాలేదు. బ్రాహ్మణు లలో నియోగులనియు, వైదికులనియు, వారిలో శాఖా భేదములవారనియు భేదము లేర్పడినవి. పరస్పర దూషణములు, అర్జీపత్రములు, వెలివేసికొనుటలు జరిగి నవి. సంఘసంస్కర్త యొకఁడు వీరినందఱిని నయమున బోధించి యేకము చేయఁజూచెను. కాని, విఫలుఁడయ్యెను. జమీందారుగారి సాయముతో నాతఁడు దేవళములో గ్రుద్దులాడుకొనుచున్న బ్రాహ్మణులను ఒకదారికి తీసికొని వచ్చెను. స్థూలముగా నిందలి యితివృత్త మిది.

"ఏ వ్యవహారమూ తెలియకపోయినా అన్నీ తెలిసినట్లు తలదిప్పుకొనే మూర్ఖులవల్ల మా చెడ్డములక వచ్చింది" అను పుల్లయ్య మాట లీ ప్రహసనము నకు మూలాధారములు. ఆ పల్లెటూరిలో దబద్దుకు, దిద్దుఁడు, బిద్దుఁడు అనువారే యీ మూర్ఖులు. వీరిలో బిద్దుఁడు వైదికనియోగి, పొగత్రాగు మైకములో నుండు వాఁడు, పరదోష ప్రసంగనిపుణుఁడు. బూతుమాటల బుంగ. దబద్దుని దిద్దుని వెంటఁబెట్టుకొని సంస్కర్తలకు ప్రతిగా నిలువఁబడి, తన్నెదిరించినవారినెల్లఁ గల మున వెలివెట్టుచు సంతకముల పత్రముల సేకరణలు, సన్మార్గ దూషణలు, గురుతిరస్కారములు నిశ్శంకగా నొనర్చుచు సంకుచిత స్వార్థ ప్రయోజనముల సాధించుకొఱకు ఆదారపు పట్టుదలలను ఉచితముగాఁ దీసికొని బ్రాహ్మణులకును క్షత్రియులకును కులకక్ష్యలను రేపినవాఁడైనాఁడు. చైనులు స్వాభిమానము గల వైదికుఁడు. పురుషోత్తమయ్య కర్మఠుఁడైన నియోగి; గురవావధాన్లు సాదువైన నియోగి; మితభాషి; మితముగా మాట్లాడు వాఁడయ్యు నొక్కొక్క మాట ఒక్క కలహమును సృష్టింపఁగల్గునట్లు ప్రయోగింపఁగల సమర్థుఁడు; పుల్లయ్య వెంకయ్యలు నోటనాల్కలేక ఎటు చెప్పజాలక "పార్టీ"ల మధ్య నలిగిపోయెఁడి

మూగజీవులు. చట్టముగారికి బుద్ధిబలముకన్న కండబల మధికము. రఘుదేవ వర్మ సాదువైన క్షత్రియుఁడు; విఠలశర్మ ఆత్మాభిమానముగల్గి బాహ్యాచారములను పట్టుదలతోఁ బాటించు క్షత్రియుఁడు; బంధువిరోధి సంఘసంస్కర్త. ఈతఁడు గ్రామమున లేకపోవుటచేతనే బిద్దఁడు విజృంభింపఁగల్గినాఁడు. ప్రహసనోత్తరార్ధమునందు ప్రవేశించి బిందువిరోధి కథను కట్టించినాఁడు. కథలో సంస్కారణభావమున కీపాత్ర మూలము. పాత్రలను సుస్పష్ట రేఖలతోఁ జిత్రించి వారి యసమర్థతలను, బంధువిరోధిచేఁ బట్టబయలు చేయించి హాస్యము సృష్టించినారు కవులు.

ఈ ప్రహసనము ద్వారమునఁ గవులు నిరూపించిన పల్లెటూరు పట్టుదలలు ప్రధానముగా నివి: 1) పెండ్లి పిలుపులకు ఆ బజారు వారిని ముందు పిలిచి ఈ బజారు వారిని తరువాత పిలిచినారని కోపగించుట. 2) పూర్వ రాజ్యములు, ఐశ్వర్యములు పోయినను పెండ్లిండ్లలో కాళ్ళకు నీళ్లు సరిగా నీయలేదనుటవంటి అల్పహేతువులకే పెద్ద పేచీలు పెట్టుట. 3) ఇంటివద్ద ఒకసారి పిలిచినను బజారులోఁ గనపడుచో మఱల బిలువ వలయుననుట. 4) పెండ్లి యూరేగింపువారేకులము వారైనను బజారులలో నరుగుమీఁదను, మంచముల మీఁదను బరున్నవారు లేచి నిలువఁబడవలె ననుట. 5) ఏ శాఖవా రా శాఖవారికీ సంభావనలో నగ్రతాంబూల మందించవలె ననుట. 6) సంఘ సంస్కర్తలకుఁ బుట్టగతులు లేకుండ చేయవలెననుట. 7) ఊరేగింపుకు వచ్చినవారు ఇంటి వాకిలి కెదురుగా నిలువఁబడి మేళము చేయవలెను. కొలదిగా నటునిటు తప్పినను కోపగించుట. 8) దేవాలయములో 'వెలి' వేసిన పార్టీవారు, 'వేయఁబడిన పార్టీ'తో కలిసి మంత్రపుష్పము చదువమనుట. భోజన భాజనాదులు లేవనుట 9) తనకు నచ్చని వానిని బూతుల పద్దెములతో తిట్టుట. త్వంశుంఠప్రవాదములకుఁ దిగుట; తాఁబట్టిన కుందేలుకు మూఁడే కాళ్ళనుట. 10) తన గుట్టు బైట పెట్టు వానిని తిట్టుట, కొట్టుట. లోకమున బయలుగాని యెట్టి దోసమైనను చేయవచ్చుననుట మొ॥ నవి యీ ప్రహసనములోని పాత్రల చర్యల వలనఁ దెలియుచున్నవి.

కవులు పాత్రలముఖమునఁ జేసిన యుపదేశములు కొన్ని కలవు. మచ్చునకు - 1) "ఆ శాఖేమిటి యీ శాఖేమిటి బ్రాహ్మణ్యమంతా ఒక్కటే." 2) ఇంతవరకేనా మనమెందుకు కలుగజేసుకొనవలసి వచ్చిందంటే అనవసరపు

పార్టీ (Party) వల్ల వుండే నష్టమున్నూ మూర్ఖులు చెప్పినట్లు సంస్కార్లువస్తే అగౌరమున్నూ ఆయనకు బాగా తెలిసే నిమిత్తం. 3) శ్లో॥ ద్విజబాల కరీరశ్చ యంత్రితోఽయంత్రితః క్రమాత్। నరేంద్ర హోమానంచ నర్తకీ పద్ధతిం వహేత్॥ అన్న మోస్తరుగా పెద్దలు చిన్నతనంలో కూకలేసి చదువుసంధ్యలు చెప్పింపకపోవుటచేత నిట్టి దుర్బుద్ధులు పుట్టినవి.

దైనందినిక సంభాషణలలో నొక్కొక్క కులమువారు మాట్లాడు మాటలలో దొరల పరిభాషలు, చమత్కారములు, ఉదా:

"ఇవన్నీ వైదిక పరిభాషలులెండి. చూదారు కారు వైదికులు -'దేవావైలో తేజోవై ఏతత్సామగాయం' అంటారు. వీటి కర్థం మీకు తెలుసునా?"

"తెలియదు సెలవీయండి."

"దేవావై అంటే స్తోత్రం. యేలా వచ్చిందంటారా? 'దేవావై స్తోత్రమా యాత' అని యున్నది. ఈ పరిభాషకు వెనుక ముక్కకు ముందున్న ముక్క అర్థం. తేజోవై అంటే ఆజ్యం. 'తేజోవై ఆజ్యం' అని యున్నది. 'ఏతత్సా మగాయం' అంటే లేదు 'ఏతత్సామగాయన్నాస్తే' అని యున్నది 'పరిచ్ఛేదం కూడా అంత శాస్త్రీయముగా చేయనక్కరలేదు'' ఇటువంటి పరిభాషతో గూడిన సంభాషణలు. మారుచున్న సంస్కృతిలో నిట్టి చమత్కృతులంతరించి క్రొత్తవి పొటమరించు చుండును కాని ప్రాతవానిని పరిరక్షించుటయు జాతి కర్తవ్యమే.

ఈ ప్రహసన మేకాంకమయ్యు ప్రాత ప్రవేశ నిష్క్రమణ బహుళ మగుటచే ప్రయోగము కష్టతరమగును. మేళములు, ఊరేగింపులు, సావళ్ళు, బజార్లు, దేవాలయము, మొ॥ దృశ్యములన్నియు వేదికమీద ప్రదర్శించుట కడు దుష్కరమే యగును. దృశ్యాలంకారములు (Settings) లేని వేదికమీద ప్రదర్శించుట కెట్టి లోపముసుండదు.

## త్రిలోకీ విజయము

"లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీ విజయీ భవేత్" అను ఆభియోక్తి నాధారముగాగొని రచించిన ప్రహసనము త్రిలోకీ విజయము. మారుచున్న కాలపు సందులలో(బడి కొట్టుమిట్టాడుచున్న జాతిలోని పెక్కు తెగల ప్రజల గుండెలు చేయు చప్పుళ్ళు ఈ నాటకమున వినిపించుచున్నవి. ఈ ప్రహసన

కథారంగము స్వర్గము పాత్రలు స్వర్గనివాసులు, దేవ పిశాచ యక్ష కిన్నర కింపురుషాదులు. ఉపకార ప్రియుఁడను సంస్కర్త దీర్ఘోపన్యాసములతో భూలోకమునఁ గల్గిన సాంఘిక పరిణామాదులను సమీక్షించుచు దేవతలలో సంస్కరణము దేఁబ్రయత్నించును. కాని, వారు వాని ప్రథమోపన్యాసము వినినప్పుడు మాత్రము అంత సుముఖత ప్రకటించరు. కాగా, విచికిత్సలో మాత్రము పడెదరు. కవుల సమకాలీన సంఘస్థితియే యది.

ఈ ప్రహసనములో బలమైన పాత్ర "ఉపకార ప్రియుఁడు." ఇతఁడు సంస్కరణ ప్రచారయుగ ప్రతినిధిగాఁ దోచుచున్నాఁడు. అతఁడు పండ్లపొడి మొదలు పరబ్రహ్మము వఱకు ప్రచారము వలన సాధింప వలెననెడి ప్రవృత్తి కలవాఁడు; సెలయేరువలె నుపన్యాసమీయ ధాటిగలవాఁడు. అపర "జంఘాల శాస్త్రి". (కాని, ఆ పాత్రకున్న వ్యక్తిత్వము దీనికి లేదు). అధిక్షేపధోరణులు చక్కగా తెలిసినవాఁడు. సంఘములో సంస్కరణోద్యమమునందు గలుగుచున్న సంశయములకు ప్రతినిధి, సంశయాత్మ. ఇతనికి ప్రాచీన జ్ఞానము లేదు. ముందుకు పోఁజాలఁడు. మూలవైచిన గొంగళివంటివాఁడు. దానికి కారణ మతని సంశయాత్మయే. సంశయాత్మను ప్రచార సహాయకునిగా నుంచుకొని ఉపకార ప్రియుఁడు దేవయోనుల నందఱికి విడివిడిగా వారి కనుగుణమైన యుపన్యాసములిచ్చును. ఆ పాత్ర నింకను లోతుగా విచారించుచో నందు వీరేశలింగము గారనుసరించిన బ్రహ్మసమాజ మతసూత్రములు కొన్ని గోచరించును. కవులు తమ కిష్టములేని సంస్కరణముల నీపాత్ర ద్వారమునఁ జెప్పించుట, వానిని శ్రోతృపాత్రలచేఁ ద్రుణీకరింపఁ జేయుట అనెడి శిల్పములిందు పాటించినారను విషయము ప్రధానము. అయోగ్యములగు సంస్కరణములను ప్రగల్భములుగాఁ జెప్పించి వానిని అపహాస్యములఁ బాల్జేయుట యిందలి తాత్పర్యము. "జంఘాల శాస్త్రి" వంటి పాత్రను సృష్టించిన ఆ కాలమే ఈ "ఉపకారప్రియు"ని గూడ సృష్టించినది. ఆ గౌరవము కవులకుఁ దక్కినది.

## కవిసింహ గర్జితములు

స్వతస్సిద్ధమగు శక్తిలేక యెట్లో పేరు సంపాదింపనెంచి తెరచాటు ప్రయత్నములొనర్చుచు నుత్తర కుమార ప్రజ్ఞలు చేయు కుకవి కదంబముల నపహాస్యములఁ బాల్సేయుటకు రచించిన ప్రహసనము "కవిసింహగర్జితములు."

ఇది గురుశిష్య సంవాద రూపముగా నున్నది. అనధ్యయన దినములను గురు శిష్యులెట్లు సారస్వత వ్యాసంగములతో గడుపవలెనో యిందు వ్యంగ్యముగా కవులు సూచించినారు. శిష్యునకు శంక కలుగగా దానిని గురువు తీర్చినట్లు కొన్ని సంభాషణలు, గురువుదాహరించిన శ్లోక పద్య తాత్పర్య ప్రశంసా రూపములుగా కొన్ని సంభాషణములు ఇందుఁ గూర్పఁబడినవి.

మహాకవుల రచనలలో కావ్యార్థములనే గ్రైకొని వానిని తన కనుగుణముగా నన్వయించుకొని కొందఱు కుకవులు స్వీయ సిద్ధాంతములను బోషించు కొందురను విషయముతో నీ ప్రహసనము ప్రారంభమగును. గురువు కుకవుల కుమార్గములను విశదీకరించి మహాకవుల కావ్యార్థముల నన్వయించు క్రమమును శిష్యునకుఁ దెల్పును. ప్రతిభగలవాఁడు స్వోత్కర్ష యొనర్చుకొనినచో గౌరవ ప్రదముగను, అర్థవంతముగను నుండునని ప్రసిద్ధ గీర్వాణాంధ్రకవి ప్రతిజ్ఞల నేకరువుబెట్టి గురువు శిష్యునికి వివరించి చెప్పును. శిష్యునకు కుకవి బండార మవగతమగును.

దీనియం దుదాహరించిన గీర్వాణాంధ్రకవుల ప్రతిజ్ఞలు తి. వేం. కవుల కాయా భాషలలోనున్న అపార పాండిత్యముఁ జెప్పకచెప్పుచున్నవి. ఇవి పండిత పరిషత్తులలోఁ బ్రదర్శింపఁదగినది. ధ్వనిమార్గ మర్మజ్ఞులకుఁగాని యిందలి సున్నిత హాస్యము అవగతము కాదు.

## అపూర్వ కవితా వివేచనము

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ
క్తో వేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తి వానవా."

చ. "ఒకరొకరుంద్రు పీరవరు లొక్కరికొక్కరు తీసిపోరు, భూ
మికి యశమబ్బె రావణుని మెచ్చిన నం చనుకొందుమేని వా
లికి నతఁ డింత జంకె లవలేశము లొక్కటనుంచి కన్నులుం
టకుఁగని పీనులుండుటకు వినందగు నల్పుల మేమిచెప్పఁగన్."

అను ఉపదేశ మిచ్చునట్టి ప్రహసనము "అపూర్వ కవితా వివేచనము."

కవు లే విషయమైనను పట్టి బంగారము చేయఁగలరు. ఈ ప్రహసన కావ్యనిర్మాణావిష్కారమునఁగల కవుల ప్రతిభ యనన్యసామాన్యము. పురోభాగు లగు నవ్యవిమర్శకుల దృష్టులను సూదిగా, స్పష్టముగా వింగడించి వానిని నవ్వులఁ బాల్పేసి చులకనగాఁ ద్రోసిపుచ్చి ప్రాచీన కావ్యసంపదలోని కలావిలాసములను నిరూపించుట యిందలి వస్తుతత్త్వము. ప్రహసనము చిన్నదైనను పాత్ర లతి బహుళము. కావ్యలక్షణాదులను స్ఫురింపఁజేయుట యను సున్నితమైన రచనా శిల్పమును కవు లిందుఁ బాటించిరి. వివేకిని, పరిశుద్ధధార, రసజ్ఞురాలు, నిరామాట, నిర్దుష్ట, వినోదిని, మంజుభాషిణి, చంద్రిక, ద్వ్యర్థకరి - పాత్రల పేళ్లు ట్లుండును.

ఈ ప్రహసనములోఁ బాత్రలు మాట్లాడుకొను వైఖరి కొక్క ఉదాహరణము:

పరిశుద్ధధార - మా కూలంకష కవనము వినుఁడు.

కూలంకష :- మీ యెదుట వినిపించుటకే నాకు సంశయమగుచున్నది.

ఉ॥ పాఱిసఁజూచి కౌరవ నృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలమ్మునకు ఁగాఁదగునే, వివిధాస్త్ర సంపదన్
మీఱిన నీవు గల్గఁగ నమేయ పరాక్రమ నీకుఁ బాండవుల్
మాఱి తలంచు నీదగు బలమ్మును జేవయుఁ జూపు మిత్రఱిన్.

(భారతము)

పురోభాగిని :- (చెవులు మూసికొని) నారాయణ, నారాయణా! శివశివా!

కూలం :- (నిశ్చేష్టురాలగుచున్నది)

రసజ్ఞురాలు :- ఏమి, నీయభిప్రాయము ననుసరించి తెలుఁగుపదము లెక్కుడుగ నున్నపద్దెమే చదివినదే, పాపము చెవులు మూసికొంటివేమి?

పురో : ఒక్క తెనుఁగుదనము లున్నతోడనే కలిగినదా యేమి వైకుంఠము! అశ్లీలము కనపడుట లేదా? మొదటిపదమును బరికింపుడు. "శ్రీమతే పేదదేవ్యైనమః" అన్నట్లున్నది.

వివేకిని : ఎక్కడనో ఆశీర్వాదాదులలోఁ దప్ప నిట్టి యర్థము స్ఫురించుట తప్పు గాదు. అట్లయినచో నేకార్థమునే యిచ్చు పదములే మన భాషలో నడుదు.

రస : అవును. ఇట్టిదోషము గుణగ్రహణము చేయువారు పాటింపరు. ఇంతయును నిది దోషమే కాదు.

పురో :- అట్లయిన మీ యిష్టము. నాకెందుకు?

శ్లో॥ "తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన।
స్యాద్వపు స్సుందర మపి శ్విత్రేణై కేన దుర్భగమ్॥

విదే : అట్లయిన నీవిప్పుడు చదివిన శ్లోకమును దోషగ్రస్తమే. దోషములేర్పరచు వారికే యున్నప్పుడు డితరుల కుండవా?

(అపూ. కవి. 31-32 పు.)

ప్రాచీన కావ్యము లెంత గంభీరములై యున్నను, వానిని వెన్నలో వెంట్రుక లేరునట్లు దోష దృష్టితో విమర్శించుకొంద ఱిందు నిశితముగా విమర్శింపఁ బడిరి. వీరిందుదాహరించిన కావ్యములఁబట్టి చూచుచో నాంధ్ర సాహిత్యమునందు కవుల కెంత విపులమైన పాండిత్యమున్నదో స్పష్టమయి, అబ్బురపాటు గల్పింపక మానదు.

"అపూర్వకవితా వివేచనము," "కవిసింహగర్జితములు" - ఈ రెండును ఒక జాతికి సంబంధించినవి. ఇవి దృశ్యములుగాకన్న శ్రవ్యములుగనే రాణింపఁ గలవు.

## స్కూలు పిల్లల ప్రహసనము

అన్యదేశ్య పదమును కావ్యనామమునం దిముడ్చు కవుల విశాల దృష్టికి ప్రహసననామము పతాకవలె నున్నది. నియోగి సుబ్బారావు, వైదికి అవధాన్లు, శ్రీవైష్ణవ శంకరరావు అనెడి విద్యార్థులమధ్య జరిగిన సంభాషణమే ఈ ప్రహసనము. పాశ్చాత్య వ్యామోహము వలన సంఘాచార వ్యవహారములలోను, సాంఘిక మనస్సులలోను గల్గు వెఱ్ఱి మొఱ్ఱి మార్పులును, తారతమ్య జ్ఞానములేని సంబోధనములును, ప్రాచీనాచార మర్యాదల నెఱుఁగనివారొనర్చు విమర్శలును

దేశౌన్నత్యమునకు హేతువులు కావని చెప్పుట ఈ ప్రహసన ప్రయోజనము. విద్యార్థులను పాత్రలనుగఁ దీసికొనుటవలన పైఁజెప్పిన మార్పుల కన్నింటికిని మూలము విద్యా విధానమునందే కలదనియు, విద్యార్థి దశలోనే వానికిఁ బ్రాతిపదికలు పడుచున్నవనియు, సంస్కరణ మచ్చటి నుండియే జరుగవలెననియు కవులు సూచించుచున్నట్లున్నది. వీరి ప్రహసనము లన్నిఁటిలోకన్న చిన్నది ఇది.

వీరి ప్రహసనములందలి కథా ప్రయోగ ప్రవృత్తినిఁ బరిశీలించుచోఁ బ్రధానముగా రెండు విధములు కానఁబడును: 1) చలనాత్మక సన్నివేశములతో గూర్పఁబడినవి. ఉ॥ పల్లెటూళ్ళ పట్టుదలలు. 2) స్థిర సన్నివేశములతోఁ గూర్పఁబడినవి. ఉ॥ మిగిలినవన్నియు. భాషావిషయకముగా గ్రాంథిక వ్యావహారిక భాషలుపయోగించినవని ద్వివిధము. విషయదృష్టితో సాంఘిక సారస్వతములనియు నేర్పడుచున్నవి.

"పల్లెటూళ్ల పట్టుదలలు" పఠిత హృదయములకు సూటిగా దాకి కడుపుబ్బ నవ్వించును. తదితరములు పఠిత బుద్ధిని చక్కిలిగింతలువెట్టి చిఱునవ్వులు నవ్వించును.

# ఆశుకవిత్వము

సీ. "శతమంట కవనమ్ము సల్పు సంగతియన్నఁ
గరతలామలకమ్ము గాదె మాకు;
అష్టావధాన కష్టావలంబన మన్న
'నంబి కొండయ దండనంబు' మాకు;
ఆశు ధారా కవిత్వాడంబరంబన్న
'నల్లేరుపై బండి నడక' మాకు;
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
షడ్రసోపేత భోజనము మాకు;
తే.గీ. వ్యర్థమగు వాదము లొనర్చు నట్టి వారి
దంబ మణఁగించు టాపోశనంబు మాకు...."

కవిత్వము చతుర్విధమని ప్రాచీన లాక్షణికుల మతము. వానిని విశదీక రించుచు కొందఱు అవి - ఆశు, మధుర, చిత్ర, విస్తరకవిత లనియు; కొందఱు ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వము లనియుఁ బేర్కొని యుండిరి. ఇందు మొదటి విభాగమే సమంజసముగా నున్నది. చిత్ర కవిత్వమునందు బంధ, గర్భ కవిత్వము లంతర్భాగములుగా గైకొనవచ్చును. అట్లగుచో సంగీత ప్రధానమగు మధుర కవితకును, మహాకావ్య కవిత్వమగు విస్తర కవితకును సార్థక్యము కల్గును. ఆశుకవిత్వము ప్రత్యేక విభాగముగా నందఱిచే నొప్పుకొనఁబడినది.

సంగీత సాహిత్య స్వరూపములఁ గూర్చి "ఏకమాపాత మధుర - మన్య దాలోచనామృత"మ్మనెడి యభియుక్తి ప్రసిద్ధమైనది. ఇందు సాహిత్యము కవిచేఁ గడుంగడు గాఢముగా భావితమై రసాప్లుతముగా సృష్టింపఁబడి, పఠితకు నాలో చించు కొలఁది రుచు లూరు నర్థగాంభీర్యము నందించునని తెలుచున్నది. అట్లు కావ్యము చెప్పవలె నన్న కవికి తగినంత ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస సంపద, స్వాతంత్ర్యము, తగినంత కాలవ్యవధానము కావలసివచ్చును. సహజ కవిత్వ ధారాసంపన్నుఁడైన కవి కభ్యాసమున్నచోఁ గవిత్వావేశమువలన కావ్య మల్పు

కాలమునందే రచించు శక్తి సాధించును. కవి తన బ్రతుకే కవిత్వముగా జీవించుచో నాతఁడు దర్శించు ప్రకృతి విలాసమంతయు, భావించు కల్పనా జగత్తంతయు నాతనియందు కవితాస్ఫూర్తినే వహించి, యాతని హృదయమును తదావేశముతో తరంగిత మొనర్చుచుండును. అట్టి యనుభూతి నందిన కవిముఖ వినిర్గత శబ్దజాలమంతయు రమణీయార్థ స్ఫోరకమును అయి, ఛందోలాస్య మొనర్చు కవితాలహరియై ప్రకాశించుచుండును. ఇట్లవ్యాజానందోత్సాహముతో కవి ఛందోమయముగాఁ బల్కువాక్కు ఆశుకవిత్వమనఁబడును. వేములవాడ భీమకవి, వేమన, శ్రీనాథుఁడు, అల్లసాని పెద్దన, రామరాజభూషణుఁడు, పింగళి సూరన, తెనాలి రామకృష్ణుఁడు, చరికొండ ధర్మన, గుణపవరపు వేంకటకవి, రఘునాథ భూపాలుఁడు, రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ, మాడభూషి వేంకటాచార్యులు మొ॥ ప్రాచీన ఆంధ్రకవు లాశుకవిత్వ మరంద ధారాధర మూర్తులే!

చతుర్విధ కవిత్వములలో మధుర కవిత్వము సంగీత ప్రధానము. ఆశు, చిత్ర విస్తర కవిత్వములు సాహిత్య ప్రధానములు. సహజముగా నీమూఁడిటిలో నాశువు ప్రతిభకును, చిత్రకవిత వ్యుత్పత్తికిని, విస్తరకవిత రెండిటికిని ప్రాధాన్యము వహించునట్లు స్ఫురించినను, లాక్షణికు లాశువునందు కొన్ని విచిత్ర ప్రక్రియలను ప్రవేశపెట్టి, తత్పరిధివలయమును పెంచినట్లు కానఁబడుచున్నది. స్వచ్ఛమైన ఆశువునకు వేమన పద్యము లుదాహరణములు. కవి భావమునుండి సహజోద్భవములై, నిరాడంబరములై, అంతఃప్రకాశముతో తేజరిల్లునట్టివి ఆశువులు. మహాకవిత్వ దీక్ష యొకచేతను, ఆశుకవిత్వ వ్రతము మఱియొక చేతను బట్టి సాహిత్య రంగమున విహరించెడి కవిసవ్యసాచుల చేతులలోఁబడి ఆశువు పెక్కు గడుసుపోకడలు నేర్చుకొనినది.

"ఏకపాద, త్రిపాద, కఠినప్రాస, విషమ సమస్యాపూర్తులు వ్యస్తాక్షరీ సంఘటిత పద్యములు, ఇష్టదేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, అష్టావధానంబులు. ఘటికాశత గ్రంథకల్పనయు, ఆకాశ పురాణంబులు, అని తత్కాలోచితాతి త్వరితగతిని రచింపఁబడునవి ఆశువు"లని లాక్షణికులు. ఎన్ని కఠిన నియమములున్నను వేగముగఁ జెప్పఁబడుటయే ఆశుకవిత్వ ప్రధాన లక్షణము దీని నొక సాహిత్యకళగాఁ బోషించినారు గీర్వాణాంధ్రకవులు. అట్టి కవులలో నాంధ్ర గీర్వాణాశుధారా కవితావధానులై తెలుఁగున నీప్రక్రియకు

ప్రాచుర్యము గల్పించిన మహాత్ములు తిరుపతి వేంకటకవులు. ప్రాచీన ఆశు కవులుండిరి కాని తి వేం. కవులవలె జాతినంతయు కవిత్వావేశముతో నుఱ్ఱూత లూగించి, కళామయ మొనర్చిన కవులు 'నభూతో నభవిష్యతి.'

పైఁ జెప్పిన ఆశుకవిత్వ నిర్వచనముఁబట్టి దానిని రెండు విభాగములుగా నొనర్పవచ్చును. అవి : 1) అష్టావధానము - దీని కంగములుగా సమస్యా పూరణము, వ్యస్తాక్షరి, ఆకాశపురాణాదులు చేరును. 2) శతలేఖిన్యవధానము లేక ఘటికాశత గ్రంథకల్పము అనునవి. ప్రాచీన కవులలో నష్టావధాన కవిత్వ రచన మంత కానరాదు. కాని, అందు సమస్యాపూరణాదులు మాత్రము బహుళముగా గోచరించుచున్నవి. ఇక శతలేఖిన్యవధానమునకు కొంత ప్రాచీన చరిత్ర కానఁబడుచున్నది. కవుల వాక్యములలో—

సీ॥ చిత్రభారతము రచించి మించిన జరి
కొండ ధర్మందను కొండ నుండి
వసుచరిత్రము వ్రాసి వాసి కెక్కిన రామ
రాజభూషణు వాగ్ఝరమ్ము గ్రమ్మి
మూఁడర్థముల కావ్యము నొనర్చు నెల్లూరి
రామవకవి వచోహ్రదము నింపి,
యపర పండితరాయలౌ వేంకటార్యు
వాదాస్రవంతితో వచ్చి కలిసి,

గీ॥ వటలి తిరుపతి వేంకటేశ్వరుల గిరులఁ
మూలమునఁ దీర్థరాజమై యొలిఁ గదలి
కరిగెడి శతావధాన దివ్యస్రవంతి
[కేది సంగాత ముప్పార యేదిలోఁద]

—అత్యద్భుత విమర్శనము.

కొండలు దిగి భువికి నడిచి వచ్చిన అవధాన కవితానిర్ఝరిణి తి. వేం. కవిగిరుల స్పర్శచే పుణ్యతీర్థమై వరలిన దని చెప్పుట వలన తత్కవిత్వమున కత్యంత మహత్త్వము గల్పించినది కవులే యని స్పష్టమగుచున్నది కదా!

ఆశుధారాకవిత్వమునందు రసస్ఫూర్తి యుండదనియు, సారవంతముగా రచన ముండదనియు పండితులు భావింతురు. అప్పకవియే యిట్లనినాఁడు—

తే॥గీ॥ 'ఆశుధారా కవిత్వమ్ములందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేకయుండుఁగాన
నెంత చర్చించినను బద్యమంత సార
వంతమగుఁ గాన నిలుకడ వలయుఁ గృతికి.'

ఇదియుఁ గొంతవఱకు నిజమే. కాని, పట్టి వ్రాసిన కవిత్వము కంటె రసవత్తర మైన పద్యము లాశుకవిత్వమున లేకపోలేదు. సంఖ్యకు మాత్రము తక్కువ. ఇట్లేర్పడుట కొక కారణమున్నది. ఆశుకవిత రెండు విధములు. అవి: 1) ఇతరు లడిగిన విషయములు నియమశృంఖలలో నొదిగి చెప్పెడి కవిత. లేక అవధానకవిత్వము.కవి తనంతటతానావేశముతోఁ దనకునచ్చిన విషయముపై జెప్పెడి కవిత-లేక-చాటుకవిత్వము అని. ఇందు రెండవ విధమున రసస్ఫూర్తి కల్గుటకు వీలున్నది. అందువలననే "ఆశుధారా కవిత్వమ్ము నందుకొంటిమేని యతిసాతికలు దండమిడ్చి తీరు"నని కవులు గుండెదిటవుతో వ్రాసికొనినారు. కవి సమర్థుఁడగుచో నన్నియంశములును అతని యందు రాణించియే తీఱును. "క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే."

తిరుపతి వేంకట కవులు తామాచరించిన అవధానముల కిట్లు లక్షణ మేర్పఱచుకొనిరి:

1. శతలేఖిన్యవధానము :-

శ్లో॥ "తత్తన్నామనవ మానసాదృతతమం వృత్తంతథావస్తు చ।
స్వీకృత్య ప్రథమం శతాయ సరయం తత్పాదమేకం వదేత్।
భూయః శ్రైర్నచబోధితః క్రమవశా త్పాదత్రయం కీర్తయే
దేవన్నామ శతావధాన మథచే త్పద్యాని సంకీర్తయేత్."

2. అష్టావధానము ;-

శ్లో॥ "కావ్యోక్తిః కవితోక్తి రంచితకళా విద్విస్సహాభాషణం।
పౌరాణోక్తి రమందలౌకికగిరో వ్యస్తాక్షరోక్తి స్సమం।
ధీమద్భిశ్చ తురంగ ఖేలనమథో సంఖ్యేయ పుష్పాకయో।
యస్మింత్స్యాద్యుగప త్తదేవకృతినా మష్టావధానాభిదం."

కవు లీయేర్పాటు స్థూలదృష్టితో నేర్పఱిచినదేకాని నెల్లూరు, వేంకటగిరులలో జరిగిన యవధానములలో నింతకన్న కష్టతరములైన వానినిఁ బాటించియుండిరి.

అంతటితో నాగక సహస్ర లేఖిన్యవధానమునకైనను తాము సిద్ధమై యున్నట్లు ప్రకటించి యుండిరి.

మ॥ "ఒకనూటే యననేమిలెక్క? వినుఁడోహో! పండిత శ్రేష్ఠులా
రా! కడున్ వేగమె వేయిమంది కయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
శుకవిత్వం బొనరించ నేరుతుము శ్రీశూలి ప్రియా మానసీ
య కటాక్షమ్మునఁ దగ్గకాలమును మాకర్పించి కూర్చున్నచోన్."
(శతావ సార. 33 పుట)

అవధాన విద్య దాక్షిణాత్యులయందును కలదు. కాని, దానికిని దీనికిని చాల భేదమున్నది. "మన అవధానము నూఱుగురికిఁ గవిత్వము జెప్పుట. వారు నూఱు పను లేవో చేయుట; అందులోఁ గవిత్వము కడు స్వల్పమే యుండును. బాగుగ పరిశీలించిన మన యష్టావధానము వారి శతావధాన పదమున కర్హమైన"దన వచ్చును.

భట్టుమూర్తి, మాడభూషి వేంకటాచార్యులు మొదలగు ప్రాచీనావధాన కవులు శతావధాన మార్గము సృష్టించి పెట్టినను, జంటకవు లేకముగా శతావ ధానము లొనరించు పద్ధతికి తి. వేం. కవులే ఆరంభకులని యొప్పుకొనక తీరదు. పూర్వశతావధానము లెక్కడనో రాజ సభలలో మాత్రము పండిత సమ్ముఖమున సకృత్తుగా జరుగుచుండెడివి. అవధానులను మెచ్చుకొని బిరుదము లాపరిషత్తు లిచ్చుచుండెడివి. తి.వేం. కవు లట్లుగాక ఆ పండిత పరిషత్తులను రాజసమ్ముఖము లందే గాక ప్రజా సమూహ మధ్యమునను సమముగా సమావేశపఱచి అవధాన చాతుర్యము వెలార్చి అందర కబ్బురము కల్పించి, తద్విధమైన ఆశుకవిత్వ మున కెనలేని ప్రచారముఁ దెచ్చిపెట్టిరి. పాశ్చాత్య భాషా ప్రభావముచే నాగరకుల యం దంతరించుచున్న మాతృభాషాభిమానమును, లుప్తమైపోవుచున్న ఆంధ్ర కవిత్వ నిర్మాణ రసాస్వాదనాసక్తులను కవులు అవధాన విద్యతో వెలికి లాగి పునరుజ్జీవింపఁ జేసిరి. వారి అవధానములు విని కవులైన వారు తెలుఁగు నాఁట వేల సంఖ్యలో నున్నారు. వారివలె జంటకవులుగా నవధానములు చేయుట యొక కళగా సాధించి మెప్పులందిన కవకవు లెందరో తలయెత్తినారు. ఇట్టి సాహిత్య చైతన్యమును కల్పించిన వారి యవధానములు సాహిత్య చరిత్రలో నొక నూతనా ధ్యాయమును తెరచినవనుటలో విప్రతిపత్తి లేదు. కవితకు ప్రజాశక్తినిఁ గల్పిం చిన కళ వీరి యవధాన విద్య.

## శతలేఖిన్యవధానములు-లేక-శతావధానములు

నూర్గురు సభలో పంక్తిగాఁ గూర్చుండి యొకరి తరువాత నొకరు అవధానిని తన యిచ్చవచ్చిన విషయముపై నొక వృత్తములో కవిత్వము సెప్పుదని యడుగుచుండ నాతఁడు ప్రతియొక్కనికిని వరుసగా నాయా పద్యముల ప్రథమ పాదములను ముందుఁ జెప్పి, తరువాత క్రమముగా రెండవ, మూఁడవ, నాల్గవ పాదములను ముగించి, ఆ పద్యముల నవధానాంతమునందు కోరిన క్రమమునఁ జదువవలెను. ఇది యొక్కఁ డొనర్చిననే మన కాశ్చర్యము గొల్పును కదా! మఱి తిరుపతి వేంకటకవులు—

చ॥ "ఒక చరణం బితండు మఱియొక్కటి నేను మఱొక్కటాతఁడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగాఁ
బ్రకటతరాశు ధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య! 'నూ
టికి సెల' గయ్య! నిక్కమిది దెబ్బది మాటలు సెప్పనేటికిన్?"

ఉ॥ "చెప్పెద మొక్కమాట కడు చేవఁ దలిర్పఁగ నో నృపాగ్రణీ!
గుప్పిరిమేనిఁ బద్యముల గుంపుల నర్జునుఁ డాహవమ్ములో
గుప్పలుగాఁగ బాణములు గుప్పినరీతిగఁ నెవ్వఁడేనిఁ దాఁ
జెప్పఁగలాఁడె "వ్రాతు" ననిʔ చెప్పినఁ జేయమె శృంగభంగమున్."
—నానారా. సం. పూ. 54, 55 ప.

అని ప్రతిజ్ఞ చేసి యవధానము లొనర్చియుండిరి. కవు లిద్దఱైనను కవన మొక చేతిపై నడచినట్లుండుట వీరి యభేద దృష్టికి చక్కని దృష్టాంతము. అందువలననే కరద్వంద్వమున నేయగల్గు అర్జునుని శరలాఘవముతో తమ కవితను పోల్చుకొని తమ భావనావ్యక్తి యొక్కటియయ్యు ద్విముఖముగా నది కవిత్వ ధారారూపమున వచ్చుచున్నదని ధ్వనింపఁజేయుచున్నారు.

శతావధానము సామాన్యముగా నాల్గు దినములలోఁ గాలపరిమితి పదునారు గంటలు మొదలు ఇఱువదినాలుగు గంటల లోపుగా నుండి ముగియునట్లు చూచుచుందురు. అందద్భుతముగా గోచరించు కొన్ని యంశములు—

1) అవధానము నాల్గురోజులు నడిచినను నది సమాప్తి యగునంతవఱకు వర్ణనాదు లవధానికి మరపురాకుండుట.

2) ఒకానొక విషయ మేదైన స్ఫురింపక పోవుచో నవధాని యిష్టదేవతా ప్రార్థన రూపముగా నొక యాశుపద్యమును సాగదీయుచు నద్దానిని జ్ఞప్తికి దెచ్చుకొనుట

3) వర్ణనావిషయము లన్నియు నవధాని కిచ్చిన తర్వాత పృచ్ఛకులు తమ తమ స్థానములు మార్చుకొన్నను వారి వారి వర్ణనములు వారికే తప్పకుండ చెప్పుట, పృచ్ఛకు లవధాని చెప్పిన పద్యములలో వరుసఁ దప్పించుకొని, అక్కడక్కడ నేవైన పద్యపాదములను గాని కోరుచో వానిని దప్పక చెప్పుట.

4) శతావధానమును సంపూర్ణముగా నొకఁడుగాక యిద్దరు నిర్వహించుట.

5) అవధానము నిర్వహించుచు చమత్కారముగా కొన్ని ఛలోక్తులను కవితలో చెప్పి సభను రంజింపఁజేయుట. కాని, ఇది నియమము కాదు.

అవధానశక్తి కవులకు శక్త్యుపాసనాదుల వలన రాదు. అందులకు బుద్ధి బలము, సహజమైన యాశుధారయు, దానితోపాటు ధైర్య స్థైర్యములును పైని శాస్త్రజ్ఞానాధిక్యమును ఆవసరము. అందును నాశుధారయు, ధైర్య స్థైర్యములును, బుద్ధిబలమును అతి ప్రధానములు. ఇఁక దైవకృప మానవ యత్నీకృత కార్యము లన్నింటను గావలసినదే! అవధానికి సర్వశాస్త్ర పరిజ్ఞానము కూలంకషముగా నుండుట యసంభవము. సర్వజ్ఞుఁ డెవ్వఁడును కాఁజాలఁడు. కవిత్వ శక్తికిఁ దోడు కొన్ని శాస్త్రములందు మాత్రమే పరిచయముండి యుండును (గాని ఎవ్వరును సర్వజ్ఞులు కారు). తి. వేం. కవులకు శబ్దలక్షణ శాస్త్రములు కరతలామలకములు. తదితర శాస్త్రములు సుపరిచితములు. కవిత్వము వీరి శ్వాస నిశ్వాసములు.

సామాన్యముగా నవధానములం దవధానికి పృచ్ఛకులు యమకింకరుల వంటి వారుగా నుందురు. ఇందులకు బహుశముగా వారియందు గోచరించు నిర్దాక్షిణ్య ప్రవృత్తియే కారణము. ఎవ్విధముననైనను అవధాని ఏకాగ్రతను గారియవెట్ట యత్నించుటకే కొందఱు యత్నింతురు. చతుర్విధ కవిత్వాంశము లైన బంధగర్భచిత్ర కవిత్వములు సెప్పుదని యవధానులను వేధింతురు. అశువులో నట్టి ప్రక్రియలు నిర్వహించుట దుస్సాధమైన విషయము. తి.వేం. కవులు వేంకటగిరి యవధానములో బంధచిత్రాది కవిత్వమును గూర్చి యడుగు పృచ్ఛకుల గూర్చి యిట్లనియుండిరి:

ఉ॥ వీనులవిందు సేయఁగల విద్య కవిత్వము; దాని కెంతయున్
మానస మన్య కార్యముల మగ్నముగాక చెలంగగా వలెన్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగు కాలమం
దైనను, బంధచిత్ర కవితాదులు సెప్ప నతిప్రయాసమౌ;
గాన సువృత్త వర్ణనలుగా రచియింపఁ దటంచుఁ గోరుఁడో
మానవులార! మీరు మతిమంతులు, దీని నెఱుంగకుందురే?
వాననె కోరు హాలికుఁడు పైరు ఫలింపఁగ, నంతె కాని యెం
తో నినదమ్ముతో, బిఱుగు లుప్పతిలం బరఁగోరునే? "యతి
స్థానము గాని వెట్టి నవధానమునం దెటు లాచతుర్విధా
నూన కవిత్వముల్ సలుప నూకొనుటౌ!" నని శంకనొంద "తె
లైనను బంధచిత్ర కవితాదులు సెప్పు" మటంచు రక్కటా?
సూనము తన్మరంద రసచోర మధువ్రతపాద ఘాతమున్
మానుగనైచు నంచనెడి మాటలు విందుముకాని యెచ్చటన్
గానము దుష్టపక్షి పదఘాతము నైచునటన్నమాట; లు
త్తాన శయాను ఱొమ్మున నధర్మముగా బరువెత్తినట్లు, "బం
ధానఁ గవిత్వ మల్లు మవధానమునం"దన మర్త్యకోటి నె
వ్వానికి శక్యమౌను? కలవాడికి వాణికిఁగాక; పెద్ద "లా
నౌ"నని సర్వపండితు "లహో" యనఁగోరుఁడు, తప్పుత్రోవలన్
మానసమీవి గైకొనుట మంచిదికాదు యథార్థపుంగతిం
బూనిన మీకు మాకు మన భూపతికిన్ యశ మప్రమేయమౌ."

వస్తు వల్పమై వర్ణనకు విస్తృతమైన వృత్తము నిచ్చియు, శ్లేషకవిత నిచ్చియు, సామ్యముల సంధించుమనియు, అనుప్రాసాదులను, అచ్చతెలుఁగు పద్యములను, సంస్కృత వృత్తములో తెలుఁగు కవితలను కోరియు, కల్పనలిచ్చి పద్యమున నల్లుమనియు, సంస్కృతాది భాషలందు శ్లోకములు చదివి వాని నాంధ్రీకరింపుఁడనియు, తెలుఁగు పద్దెములను సంస్కృతీకరింపుమనియు పృచ్ఛకులు కోరుచుండుట సామాన్యముగా నవధానములందు గానఁబడుచున్నది. మచ్చునకు శతావధానసారమునఁ బేర్కొనఁబడినవానిఁ గొన్ని యిచ్చట నుదాహరింతును:

పకోడి మీఁద చంపక మాలావృత్తము (పుట 11); పచ్చిమిరపకాయ మీఁద సీసపద్యము (పు. 13); కిరసనాయిల్ మీఁద స్రగ్ధరావృత్తము (పు. 13); చీపురుపుడక మీఁద కందపద్యము (పు. 15); పొడుముకన్న చుట్ట కొంచెము నయమనుదానిపై సీసపద్యము (పు. 16); మీసములవలని నష్టములపై సీస పద్యము (పు. 35); పకోడీమీఁద ఉత్సాహవృత్తము (పు. 68); సూదిమీఁద ఉత్సాహవృత్తము (68 పు.); సూదిమీద ఉత్పలమాలావృత్తము; నశ్యముమీఁద శార్దూల విక్రీడితము (69 పు ); బైసికిల్ మీఁద శార్దూల విక్రీడితము (71 పు.); గ్రామఫోన్ మీఁద మందాక్రాంతా వృత్తము (79 పు ); నూపురము మీఁద స్రగ్ధరావృత్తము (77 పు.); చెదపురుగు మీఁద శార్దూల వృత్తము (83 పు.); నల్లిమీఁద కందము (87 పు.); దోమకాలుమీఁద మహాస్రగ్ధరావృత్తము (83 పు.); పిల్లి పెంపుమీఁద సీసపద్యము (97 పు ); రెల్లుపూతమీఁద నచ్చతెలుఁగులో మందాక్రాంతావృత్తము (97 పు.); కందిలోని పాపనుగూర్చి విచకిలితావృత్తము (98 పు.) క్రొత్తగా ముండమోసిన జవ్వని యేడుపు గూర్చి సీసము (98 పు.); బిడాలముపై మందాక్రాంతావృత్తము (102 పు.); చీమముల్లుపై సీసపద్యము (102 పు.) - ఇట్టి పెక్కులు గలవు. మఱియు శ్లేషకవిత్వమునకు భాగవతుల హరిశాస్త్రి గూర్చి శ్లేష (13 పు.) హంస పరమహంస శ్లేష (76 పు.) హంస సూర్య శ్లేష (79 పు.) ద్రౌపదీకృష్ణార్థములందు శ్లేష (81 పు.) మొ॥నవి ఉదాహరణములు. ఒకచో "జడ వెనుక నుండుటకుఁ గల కారణమేమి" యను ప్రశ్నకు సమాధానము పద్యమునఁ జెప్పుమనుటయు, వేణుగోపాలుని గూర్చియు శివకేశవుల గూర్చియు నచ్చ తెలుఁగులో వర్ణింపుమనుటయు (83, 90 పు.), చంద్రుని మణితోఁ బోల్చుమనుటయు, హరిశ్చంద్రుని శ్రీరామ అప్పారాయనితో సామ్యము జెప్పుమనియు గోరుట; ప్రబోధ చంద్రోదయములోని "లక్ష్యం లక్ష్య" అను శ్లోకమునకు (40 పు.) "యఃకౌమార హరః" (43 పు.); యాచింతయామి" మొ॥ శ్లోకముల కనువాదములు చెప్పుమనుట; ఏకపాదసమస్య నిచ్చి శేషపద్యమును బూరింపుమనుట. 'గోలుకొండ, పూలదండ, మాలకుండ, క్రొత్తముండ" అను పదములు పాదారంభములుగా నుంచి రామాయణార్థమునఁ బద్యము చెప్పుమనుట; 'అమర - భ్రమర - సమర - కౌమర" అనునవి మధుకైటభ యుద్ధ పరమునను (45 పు), "అలక - పలక - కలిక - గిలక" అనునవి ద్రౌపదీపరముగను (100 పుట.) ముక్తపదగ్రస్తముగనిడి పద్యములు చెప్పుమను

టయు మొదలగు చిక్కుప్రశ్నలు ఎన్నో వేసియుండిరి. కవులు వానినన్నింటిని సామర్థ్యముతో నిర్వహించిరి. ప్రతి యవధానసభయందును—

సీ॥ "శతఘంట కవనమ్ము సల్పు టిట్టిది యొక్క-
తెలిసె నే!"దనిలోన నులుకువారు;
"మొదటఁజెప్పిన పాదమును విస్మృతియు లేక
చెప్పిరే"యని ప్రీతిఁ జెందువారు;
"ఇది యబ్బెసమె" లేక యే దేవుకరుణయో
గురుకృపయో యంచు గొణఁగువారు,
"కాదిది యుచ్ఛిష్ట గణపత్యుపాసనా
ఫల"మంచు లోలోనఁ దలఁచువారు,

తే.గీ. "బ్రైణిను శక్తియ యిది" యంచుఁ బల్కువారు
"పూర్వజన్మ సుకృత"మని పొగడువారు
నైరి సభనున్నవారు శతావధాన
మరసి తిరుపతి వేంకటేశ్వరు లొనర్ప" (51 పు.)

పృచ్ఛకులలో సరసులైనవా రుత్తమమైన అంశముల నెన్ని, యుచితము లైన వృత్తములలో వర్ణింపఁ గోరుచుండిరి. కవులు తమ కవిత్వ శక్తిని గుప్పించి యప్పట్టుల రసవత్తర కవిత్వముఁ జెప్పుచునుండిరి. అట్టివి తి.వేం. కవుల అవ ధానములం దసంఖ్యాకములు. మచ్చునకుఁ గొన్నిటిఁ బేర్కొందును:

1) శ్రీరాముని వర్ణనము సీసపద్యములో (కాకినాడ శతావధానము):

సీ॥ శ్రీమద్ధరణి జాత సీమంతినీ మణీ
హాస ద్విగుణిత ప్రభాఢ్యకుండు;
నమిత నిర్జర సంఘ కమనీయ మకుట సం
ఘటిత రత్నప్రభా కలితపదుఁడు
మహిత మసృణపటీమాలాకలిత గంధ
వాసిత దిక్చక్ర వాశకుండు
ఖండితాపర శత్రుమండలమణిగదా
దండమండిత భుజాదండకుండు

తే గీ. భాను వంశాబ్ధిసోముండు; వరగుణుండు
నైన శ్రీరామచంద్రుం డనంతకృపను
సకల సంపత్సమృద్ధులఁ జక్కనిచ్చి
ధరణి రక్షించు నాచంద్రతారకముగ.'' (శత. సా. 1 పు)

కూర్చుండి పట్టుపట్టి వ్రాసిన శ్రీనాథ శృంగారనైషధమందలి నిషధేంద్రు వర్ణనమున కీ కవిత్వ మెందును తీసిపోలేదనుట నిర్వివాదాంశము

## 2

"హంస సూర్యయో శ్లేషః" శిఖరిణీ వృత్తములో. (నూజివీడు శతా.)

శ్లో॥ "సరోజై స్సంబంధం వ్రజతి భజతే సత్పథగతిం
సదా ప్రీత్యాధత్తే కుసుమశరసూనం తమనఘం
పదం రక్తం ధత్తే సుదృగుపకృతిం దాపితనుతే
తతో హంసో నూనం భవతిఖలు హంసో యతివిభో!" (79 పు)

ఏ శ్లేషకవిచక్రవర్తి కవితకును తీసిపోని దీయాశుకవనము.

## 3

రంగనాథునిపై మత్తకోకిలలోఁ జెప్పిన కవిత:

"రంగనాయక మాశ్రయే గుణరంగ మంగళ సుందరం
మంగళాస్పద మంఘ్రిసంభవ గంగ మద్భుత సంగరం
నంగహీన జగానుషంగ ధురంగతం చతురంగితం
సంగతం సతతం శ్రియారుచిశృంగ మింగిత వేదనం" (78 ప.)

అనుప్రాసాది శబ్దాలంకార వైచిత్రియం దందెవేసిన చేయియని ఈ పద్యమును స్పృశింపఁగనే తెల్పుచున్నది.

## 4

"సంధ్యారాగ వర్ణనము'' (బందరులో):

సీ॥ వారుణీ కామినీ ఫాలభాగంబునఁ
బొల్పొందు కుంకుమ పూఁత యనఁగ;
చక్రవాకి మనస్సరసిజంబునఁ జొరఁ
బారు సంతాపాగ్ని వారమనఁగ;

నస్త్రాద్రిపై నేగు నరుణు నర్ఘము వెట్ట
నేగు పద్మిని యనురాగమునఁగ,
కాలమాయావిచేఁ గాల్చిపెట్టిన గురు
స్ఫురదయోమయములౌ కఱుకు లనఁగ
తే గీ. సంజ కెంజాయ చెన్నారె సర్వభూసు
రాధికులు సంధ్యవార్చఁగా నాపగాస
మీపముం కేగి రుత్సాహ మింపుగొల్పు
మెల్ల మెల్లనఁ జీఁకటు ల్మెండుకొనఁగ" (శరా.సా. 14 ప.)

ఈ కవిత భావమునందును, భాషయందును, అలంకార వైచిత్రియందును ఏ ప్రబంధ వర్ణనమునకును తీసిపోదు.

## 5

'శివకేశవ స్తవము' (అచ్చ తెలుఁగు కవిత) - (బందరు శరా. లో):

సీ॥ రాల్చె నెవ్వాఁడు కెందమ్మి దందంబోలె
నెదుటొమ్మపై నిరులిచ్చు దాన;
మ్రింగె నెవ్వాఁడు నేరెడి పండు చందానఁ
గడలిలోఁ బుట్టిన కాఱువిసము;
పూనె నెవ్వఁడు వెన్నముద్ద కుద్దిగఁ గేలఁ
దెల్ల సంచుల నించు నల్ల సంకు;
అనె నెవ్వఁడు మల్లె యలరుగుత్తుల పేరు
పోల్కిగా మెడనిండఁ బున్కదండ;
గీ॥ వే వెలుంగుల దొరయును రే వెలుంగు
నెవని కన్నులు నిప్పుగ న్నెవని నెక్క
దట్టి మున్నిది యల్లుఁడు; నట్టి మంచు
కొండ యల్లుండు మీఁకుఁ గోర్కుల నొసంగు. (91 ప.)

ద్రాక్షాపాకమున, సరళాచ్ఛ పదముంతో, ధార కుంటువడకుండ ఏ పాదమున కాపాదము విరుగుచు నొక సౌందర్యము గల్గునట్లు క్రమాన్వయాలంకార సంశోభితమై యొప్పెడి యీ సీసము పొన్నగంటి తెలగనార్యుని కవితతో దీటై నిలచుచున్నది.

కవుల శతావధానములలో నీరసమైన కవిత్వము లేదని నా మతము కాదు. కాని 'నీరసము'ని త్రోసివేయకపూర్వము కవులయందు ఆ కవిత్వ విమర్శనమునకుఁ దగిన సహృదయత మనము ప్రకటించి చూచినచో నట్టి కవితయుఁ గొంత చమత్కారాధానముగా నుండుటలో ననుమానముండదని నా యభిప్రాయము. ఉదా॥ దారముగురించి కవిత చెప్పుడన చెప్పిన పద్యమిది:

క. హారములు గ్రుచ్చుకొనుట కు
దారములగు వస్త్రములను దగఁగుట్టుట కా
ధారమగు దారమును నే
వారేనియు మేటియనుచుఁ బలుకఁగవచ్చున్." (68)

ఇది రసవంతమని పండితు లొప్పుకపోవచ్చును. వస్తువే నీరసమైన దారము. అడిగినవానిది తప్పుకాదా? దానినిఁగూర్చిన వర్ణనము రసవంత మెట్లగును? అదియు నొక కందములో. అయినను "రమ్యం జుగుప్సిత ముదార మథాపినీచం...." అను శ్లోకార్థమునుబట్టి కవులీ నీచవస్తువు నుదారముగాఁ బ్రదర్శింప యత్నించిరి. ఈ పద్యశక్తి 'ఉదార, ఆధార' శబ్దములయందు నిబంధించి, 'దారము' అనెడి శబ్దములోని ప్రథమ ద్వితీయాక్షర పౌనఃపున్యము వలన నొక అందమును గల్పించినారు. ఊరక చిఱుగుపాతలు కుట్టుట కుపయోగపడునదియైనచో దారమును పద్యములో చెప్పినట్లు "ఏవారేనియు" "మేటి" యనుచు పలుకరు. "ఉదార" వస్త్రములు కళాహృదయముల నాకర్షించును; రసికులచే ననుభవింపఁబడును. అవి చినిగినప్పుడు నిజముగా నందఱకు బాధయే. ఒక శిల్పఖండము పగిలిపోయినంత బాధ కలుగును. దానిని మరల "తగన్" అమర్పవలెను. పగిలిన చిహ్నము కానరాకుండ యథాపూర్వ ముగా నమర్పవలెను. దాని కాధారమైనప్పుడు మాత్రమే దారమందఱిచే 'మేటి' యనిపించుకొనును. సహృదయులు! నీరస కావ్యమునందైనను స్వారస్య మిట్లు గోచరింపకపోదు. ఇంతకుఁ జెప్పవచ్చిన దేమియనఁగా, తి. వేం. కవులకుఁ బృచ్ఛకు లుత్తమమైన అంశముల నిచ్చినప్పుడు మహాకావ్యములందలి కవితా గౌరవమున కేమాత్రముఁ దీసిపోకుండ కవిత్వము చెప్పియుండిరి. నీరసమైన అంశముల నిచ్చినప్పుడు వానిని సాధ్యమైనంత అర్థవంతముగను, చమత్కారా ధానముగను నావిష్కరింప యత్నించిరి. ఇదంతయు నాశుకవిత్వమున వేగ వంతముగ నొనర్పఁబడినదన నాశ్చర్యము కాదా? అందువలననే.

చ॥ "ఇతర కవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటి కెన్ని పె
ద్దతనము గాంచి చిత్తమును దన్పునొ, మే మవధాన సంగత
స్థితిగని యాశుగా రచన చేసిన పద్యములందుఁ జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కఁగనుండు నసంశయమ్ముగన్"

అని వారు గొంతెత్తి చెప్పినప్పుడు - మనము తలయూపి యంగీకరింతుము.

## అష్టావధానము

చ॥ అరయఁగ మే మొనర్పఁగల మష్టవధానము దానిరీతి నే
ర్పఱచి వచింతు; మెట్లనినఁ బండిత సమ్మతిగాఁ గవిత్వ మెం
దఱడిగిరేని యందఱకుఁ దప్పులు చొప్పడకుండ నాంధ్రమం
దు రహిని దేవభాషను సుదుష్కర కల్పన లొప్పఁజెప్పి, యెం
దరయినఁగాని కష్టపు విధమ్మున నెన్నిఁటినైనఁగాని య
క్కరము లొసంగరేని యవి గైకొని తప్పక చెప్పి, యంతఁబో
కరయము మీఱ లౌకిక ప్రకారముగా వచియించువారికు
త్తరము లొసంగి, మీఁదను ముదంబలరన్ జదరంగమాడి, కొం
దఱకు గురుత్వమూని పఠనమ్ములఁ జెప్పి, పురాణగాథలన్
దురమొనరన్ బఠింపఁగ నెదుర్కొని యర్థము చెప్పి, పుష్పముల్
గరమును వీపుపై విడువఁగా సరిగా గణియించి, ఘంటికల్
నెఱయఁగఁ గొట్ట వానిని గణించి, నిషేధమొనర్చునట్టి య
క్కరముఁబు మాని పద్యములు గల్పనచేసి మనోహరమ్ముగా
విరచన సేయనేర్తుము...." —నానారా.సం.వృ. 144 ప.

అష్టావధానమునం దెనిమిదిమంది అవధాని నొకేసమయమున నతనితో సంభాషించుచు నతని ధారణమును, చిత్తైకాగ్రతను చెదరఁగొట్ట ప్రయత్నించుచున్నను తాను నిగ్రహించుకొని యవధానము నొకేదినమున నిర్వహింపవలసి యుండును. కవులు పేర్కొనిన అష్టాంగములు - 1) పండితు లడిగిన యంశములపై గీర్వాణాంధ్రములో కవిత్వము చెప్పుట, 2) వ్యస్తాక్షరి, 3) లౌకిక ప్రసంగము, 4) చతురంగఖేలనము, 5) కావ్యపాఠము, 6) పురాణ కథనము, 7) పుష్పములనుగాని, ఘంటికా నినాదములనుగాని లెక్కించుట, 8) నిషిద్ధాక్షరి. ప్రథమాంశములో నొక్కరడిగిన యంశములపైననే కవనము చెప్పఁబడు

చుండును. అదియు సమస్యాపూరణము, కల్పన, వర్ణన రూపములలో నుండును. ఎనమండుగురు కవితను కోఱవచ్చుననెడివా రున్నారు. అప్పుడొక్కొక్క చర ణము చొప్పున అందఱకు ముందు చెప్పి అట్లే వరుసగా నొక్కొక్క చరణము చొప్పున నాల్గుపాదములు ముగింపవలసి యుండును. కాని, అప్పుడు దానిని అష్టావధాన మనుటకన్న పంచదశావధానమనుట మేలేమో! ఈ పద్ధతి అంత యోగ్యమైనదికాదు. చతురంగఖేలనము రాని యెడల చీట్లపేక యాడుటయుఁ గలదు. పుష్పగణనాదులకుఁబదులు గణితమును గైకొను అవధానులున్నారు. వైద్యజ్యోతిషాది శాస్త్రములను గైకొనెడి వారున్నారు. కొందఱు కావ్యపాఠమును వదలి మఱియేదైన అంశమును గైకొనుచుందురు. ఒక్కొక్కచో న్యస్తారియు నిందు గైకొనుట కలదు ఏ పద్యములలోనైనను ఏ పాదమునందైనను వృత్తగణ భంగముగాకుండ ఒకటి, లేక రెండు లేక మూడక్షరణములుగల మాటలు ఉంచినచో వానినిఁ గల్పుకొనుచు అవధాని యిచ్చిన విషయమును పూర్తిజేయుట న్యస్తాక్షరి. కొన్నిచోట్ల పురాణకథనమునం దాకాశపురాణము చెప్పఁబడును. ఈయఁబడిన యొక కథాంశమునుబెంచి యొక రమ్యమైన ఆశుకావ్యముగాఁజెప్పుట ఆకాశపురాణము. ఇట్లాయాయవధానుల యిష్టానుసారము మొత్తమున కెనిమిది యంగములతో నీయవధానము చేయఁబడును.

అష్టావధాన కళాంగము లన్నియు కవిత్వమునకు సంబంధించినవి కావను విషయము గమనింపఁదగినది. వ్యస్తాక్షరి, లౌకిక ప్రసంగము, చతురంగాది ఖేలనము, కావ్యపాఠము, పుష్పగణనాదులు కవిత్వాంశ లేనివి. ఇఁక మిగిలిన- కవిత, నిషిద్ధాక్షరి, దత్తపది, ఆకాశపురాణము మొ॥నవి కవిత్వాంశ కల్గినవి. తి. వేం. కవులు తాము నిర్ణయించుకొనిన యంశములేకాక యెడనెడ ఆకాశ పురాణము, వ్యస్తాక్షరులఁగూడ నొనర్చి యుండుటచే నొక్క "గణితము" తప్ప అన్ని ప్రక్రియలను "జంటకవులు"గా వారు సాధించినారని యేర్పడుచున్నది.

అష్టావధానములోఁ బ్రధానముగా నాకర్షించునది సమస్యా పూరణము. ఈ అంశము శతావధానాష్టావధానముల రెండింటి యందును కలదు. పూర్వ మేరాజసభ కొక కవి యేగినను అతని కీ సమస్యాపూరణ మొక సమస్యగా నెదు రయ్యెడిది. కవి దీనిని నిర్వహించుటకు మంచి భాషాపాటవము, ఆశుకవిత్వధార, లోకజ్ఞానము, బహుభాషా పాండిత్యము, నవనవోన్మేషశాలినియైన ప్రతిభ, వాక్చ మత్కృతి ఛందోలక్షణ పరిజ్ఞానము అత్యవసరము. తి. వేం. కవులు పూరించిన

సమస్యలు లెక్కలేవు. శ్రద్ధవహించిన వారెత్తి వ్రాసిన కొన్నిమాత్రమే ఇప్పుడు లభ్యమగుచున్నవి. కొన్ని సమకాలీనుల ముఖసీమలయందే నివాసము చేయు చున్నవి. సమస్యలఁ బూరించుటలోఁ గనవచ్చుఁ గొన్ని చమత్కృతులకు కవుల కవితలనుండి యుదాహరణము లిచ్చట చూపింతును:

## 1

వృత్తమునందలి చతుర్థపాదము సమస్యగా నీయఁబడగా. పూర్వముంద దగిన మూడు పాదములను చమత్కారజనకముగా పూరించుట. ఇది సర్వసామాన్యము. ఉదా:- ఆంధ్రమున:

సమస్య: "కలువ కంటికి కుంకుమ గరళమయ్యె."

పూరణము: "ఎలమి సాంబుని కర్ధమై యెసఁగు కతన
హర తృతీయాంబకాగ్ని ధూమాళిరేఖ
మల్లనల్లన సోఁకిన నద్రిపుత్రి
కలువకంటికిఁ గుంకుమ గరళమయ్యె"

ఉదా: సంస్కృతమున:

సమస్య: "ప్రాతః పశ్చిమ పర్వతే దినమణిః పూర్వాచలే చంద్రమాః"

శ్లో॥ ధాత ర్మేరుమహీంద్ర లంఘనధియా విన్ధ్యాద్రినా సర్వతో
వ్యాప్తం వ్యోమతలం, దివేతిచ నిశేత్యస్తం ప్రతీతిర్గతా
దూరేనైవ మయాపి సత్యముతనో సత్యం "గతేవానరే
ప్రాతః పశ్చిమ పర్వతే దినమణిః పూర్వాచలే చంద్రమాః."

## 2

సమస్య అనుచితమైన అర్థము నిచ్చుచుండ పూర్వపదాంత శబ్దముతో కలిపి తదనౌచిత్యమును దొలఁగించుట.

సమస్య: "సతి సతిఁ గలయంగఁ బుత్రసంతతి కలిగెన్."

పూరణము: అతి కుతుకం బలరారఁగఁ
జతురత మెఱయంగ మదనశాస్త్ర విధమునన్
వితతంబగు తన సౌధవ
సతి సతిఁ గలయంగఁ బుత్రసంతతి కలిగెన్.

## 3

సమస్యలోని మొదటి సమాసమును విరుగగొట్టి పూర్వార్ధమును పూర్వ పాదములోని వాక్యములో నిరికించి చమత్కారము జనింపఁజేయుట.—
సమస్య. "వటబీజములంతలేని వనితకుచంబుల్."

క. చటులాక్షి వయసుముదురని
మటమట నీకేలఁ మధ్యమ వయస్సుఁట, యో
విట! కొబ్బరి బొండాల్ గా
వట; బీజములంతలేని వనితకుచంబుల్. (75 పు. శ.సా.)

## 4

ఛందోనిబంధనము.-"సూర్యుఁడుదయ శిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెన్".-
దీనిని కందపద్యముగఁదప్ప నేపద్యమునందైన పూరింపవలెనను పృచ్ఛకుని నియతివలన తేటగీతిలో పూరించిరి.

తే.గీ. "గ్రహణదినమైనకతమునఁ గటకనంబు
సలిపె రాహువొ కేతువో గిరికుఁదయ్యుఁ
గార్యతరమున నట్టులే 'సూర్యుఁ డుదయ
శిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెన్' దశముగ. (92 పు. శ.సా.)

## 5

ఇచ్చిన సమస్యను మధ్యకు విరిచి (సభంగశ్లేష) విశేషార్థము కల్పించుట:
"సంధ్యావందన మాచరింప వలదా? చౌశీతిబంధమ్ములన్"

శా॥ వింధ్యాద్రిప్రతి నొప్పు బల్కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పఁగ లేక వెఱ్ఱివలె నీలామంచి యీ రాత్రిన్
వంధ్యంజేసెదు; కాముకేళియనఁగాఁబాండిత్యమా? లేక నీ
సంధ్యావందనమా? చరింపవలదా చౌశీతిబంధమ్ములన్?" (శ.సా. 19పు)

## 6

ఒకే సమస్యను రెండు విధములుగా సమర్థించుట:
"ప్రియాసురతం నోర్ఘురి కామతంత్రే"

1. "సఖే మయి ప్రీతిభరాలసాఽపి
రుదంత మాలోక శిశుం మృగాక్షీ
తదా మనో యచ్ఛతి భాగ శస్త్రత్
ప్రియాసుఖం నోర్ఝతి కామతంత్రే".

2. "షండః పుమాన్ కశ్చన భాగ్యశాలీ
వృణాతు కాంతాశ్శతశోఽభిలాషాత్
గృహస్థమేనం రచయంతు వాతా
ప్రియాసుఖం నోర్ఝతి కామతంత్రే"

నిషిద్ధాక్షరి అవధానుల పాండిత్యమునకు నికషోపలము వంటిది. దీనిని నిర్వహించుటలో నేకాక్షర నిఘంటు జ్ఞానము, సంస్కృతాంధ్ర భాషాజ్ఞానము, ప్రతి అక్షరము చెప్పునప్పుడు రెండు త్రోవల నాలోచించి చెప్పెడి ముందుదృష్టి కలిగియుండవలెను. అక్షరములను నిషేధించుట రెండు విధములు : 1) ఒక్కొక్క పంక్తి యందు రాగూడని యక్షరముల పట్టిక నాయా పాదము నారంభించుటకు పూర్వము నిషిద్ధ మొనర్చినచో నవధాని వానిని వాడక ఆయా చరణములు చెప్పుట నిషిద్ధాక్షరిలో నొక పద్ధతి. ఉదా :- శ్రీరామ పట్టాభిషేకము వర్ణింపుడని ప్రథమ పంక్తిలో టవర్గ తవర్గాక్షరములను పృచ్ఛకుఁడు నిషేధించె ననుకొందము.

కవులు - శ్లో : శ్రీ జ్యాకాంక భువి ప్రభావరుచిరాః కైకేయికాగర్భ జ

పృచ్ఛకుఁడు : ద్వితీయ చరణమున "తవర్గాక్షములు, సహళలు" నిషిద్ధము.

కవులు : ప్రష్ఠాః పార్శ్వ భువి ప్రకృష్ట జనకాః కీర్త్యాగ్రగణ్యాః పురః.

పృచ్ఛ : తృతీయ చరణమున "కవర్గాక్షరములు, సరళాక్షరములు" నిషిద్ధము.

కవులు : అన్యేదాపి విభీషణ ప్రభృతయ స్తత్రాపి తత్రస్థితాః.

పృచ్ఛ : "కచటత వర్గములలోని స్థిరాక్షరములు" నిషిద్ధము.

కవులు : శ్రీరామస్యతదాముదా విజయతే పట్టాభిషేకోత్సవః

- శ.సా. పూర్వ. 20 పు.

ప్రత్యక్షరమునకు ఒక యక్షరము నిషిద్ధ మొనర్చుట రెండవ పద్ధతి. సామాన్య పండితుఁ డెవ్వఁ డైన యీ స్థానమునఁ గూర్చున్నచో నవధానికి

నిషిద్ధాక్షరి ముగించుట తేలికయే గాని అవధాన కళా మర్మజ్ఞుడు కూర్చున్నచో నవధానికి దుష్కరమగు ననుటలో సందేహము లేదు. తి.వేం. కవుల నిషిద్ధాక్షరి కుదాహరణము :

శ్లో॥ యత్ర శ్రీపో మతోనో సౌ కామ్యో రామో గురుస్సదా।
తన్నత్వం మందరాం నూత్నం కౌజం భాగం పంగంత్రగం."

ప్రత్యక్షర నిషిద్ధాక్షరి పై రెండు పద్ధతులలోఁ గష్టమైనది. కొందఱు పద్యము తుదిపఱకు ఒకటి రెండు పాదములకును ప్రత్యక్షర నిషిద్ధము వర్తింపఁ జేసికొందురు. పిండికొద్ది రొట్టె.

ఆకాశ పురాణము చెప్పుట యొక చమత్కారము. ఆశువుగా నొక ఖండ కావ్యకృతినే అల్లవలసి వచ్చు నీ యంశమున. ఉదా॥ వెంకటగిరి యవధానము నందు శ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపాలుని రామేశ్వర యాత్రా ప్రబంధ మిందుల కొక యుదాహరణము. ఇందు ముప్పదినాలుగు పద్య గద్యములున్నవి. కవుల వ్యుత్పత్తి యిందు పరిమళించినది. నెల్లూరు అవధాన ములో జర్మనీగాథ నొకదాని నిచ్చిరి. మఱియొక అవధానములలో బైబిలులోని యొకగాథ యివ్వఁబడినది. వీనినిఁ బ్రత్యేకముగా గణింపుచో నర్థవంతములగు లఘుకావ్యము లగుననుటలో సంశయము లేదు.

న్యస్తాక్షరి యన్నను, దత్తపదియన్నను ఒకటియే. పృచ్ఛకుఁడిచ్చు పదములతోఁ గూర్చి కవన మల్లవలె నిందు. ఉదా॥ "అలక-పలక-కలక-గిలక'' ద్రౌపదీపరమందు-

చ. అలకలు తుమ్మెదల్ పటియు నయ్యబాలామణి చెక్కు వ్రజపుం
బలక పసందుగాఁ దనరు, వాతెఱ మంకెనపూవు సొంపులుం
గల కరియాన ద్రౌపదికిఁ గల్గునె యచ్చట నల్వచెయ్యి చే
గిలకల నీరు తోడువని కేవల మయ్యది రాజ్ఞికృత్యమే.''

(శ.సా 100 పు.)

బట్టతలకుమ మోకాలుకును ముచ్చటగా ముడివేయఁగం కవుల ప్రబంధ కల్పనానైపుణ్యమీ ప్రక్రియలో నభినందనీయము.

కవిత్వ ప్రసక్తి లేకపోయినను అవధాని చిత్తైకాగ్ర్యమును బట్టి చూచునది వ్యస్తాక్షరి. "వ్యస్తాక్షరి యనఁగా ఏ భాషలోనైనను ఒక వచనములోనివి కాని

పద్యములోనివి కాని మాటలకు సంఖ్యలువేసి వరుస వెంబడిని గాకుండ చెల్లా చెదరుగా ఒక్కొక్కమాటను దాని క్రమ సంఖ్యతో సహా కాగితపు ముక్కలమీద వ్రాసి, తి.వేం. కవులు అష్టావధానము చేయుచున్న సమయములో నప్పుడప్పు డిచ్చుచు రాఁగాఁ జివరకు నాయామాటలను తిన్నగా కూర్చి యొప్పగించుట. చెన్నపట్టణములో (మద్రాసులో)

(1) యిష్ - వైజ్ - నిష్ట్ - వాస్ - సోర్ - యెస్ - బిడాయిటెన్డు-డాస్ - యిష్ - యిష్ - సో - ట్రవరిష్ - బిస్ - అయెన్ - మెర్క్స్ - హాస్ - యెల్బెన్ - లైటెన్ - డాస్ - కంపెట్ - సూర్ - జౌస్ - డెన్ - అను జర్మనీ భాషయు;

(2) "యూయం - తత్ర - సిడౌన్ - తథాపి - వెరివెల్ - తస్మా - న్మయాయా - శశీ -
నోగోసార్ - మదరాసు - కాయకరితం - హింగేందు - బాయేందునం -
నింగత్పూరయ - నింగికూడ - విడుదల్ - నీవాఁడనంటిం - గదా -
కిస్వాస్తే మయిబోల్తా హం - ఆజి - సునో - తక్సీర్ న - మేరే - ఉపర్."

అని నానాభాషలలోని మాటలతోఁ గూర్పఁబడి "మిసలేనియస్ బలే శ్లోకమ్" అను నామధేయ మీఁదగిన శార్దూల విక్రీడిత రూప శ్లోకమును.

(3) హిందూ హైస్కూలులో ప్రధాన సహోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ ముత్తు అయ్యరుగారు వీరిశక్తి సర్జునుని బాణవర్షముతోఁ బోల్చి వర్ణించుచు నూతనముగా రచించిన-

"అట్టావదానిగళ్ - శెయ్యవల్లే" - మెన్ - ద్రవైపుహాందు-
తట్టామలేశిలర్ - తత్రశిప్పార్ - విల్లతన్ - శరంబోల్-
ఎట్టేపుహాంద్రు - పిన్నెట్టెట్టెంగివరై - యొప్ప-
ముట్టాదు - శెయ్యవల్లారిల్లై - యింద - మెయిబిలత్తై".

అను ద్రావిడ భాషాశ్లోకమును వ్యస్తాక్షరి కొఱకు ఉపయోగింపఁబడగా నా మహాప్రవీణులు క్రమమయిన రీతిని జెప్పిరని వ్రాసినచో వీరల సామర్థ్యమును* వేఱఁజెప్పవలెనా? అల్లనాఁ డెన్నఁడో పండితరాయ లేకసంధాగ్రాహియై పరభాషలో విన్న సంభాషణ నొప్పగించెనన్నది పుక్కిడి పురాణము కాదని ముమ్మూర్తుల జగన్నాథపరావతారులగు తి వేం. కవులు నిరూపించి రనవచ్చును.

---

* శతావధానసారము - అనుబంధము - పు. 120.

అనంత పాండిత్య ప్రాభవమునఁ దిరుపతి వేంకటకవులు ఒనర్చిన శతావధాన అష్టావధానములు సంస్కృతాంధ్ర పండిత దిగ్గంతులచే వేనోళ్ళఁ గీర్తింపఁబడినవి. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్." మచ్చునకు అప్పటి రాష్ట్ర ఆస్థానకవీంద్రులగు శ్రీ కాశీ కృష్ణమాచార్యులుగారి ప్రశంస లివి:

సీ॥ పట్టుమం చొకగీతపద్యమ్ము వ్రాయరా
దా యేమి నోరు లేదాయెఁ గాని;
ఆశుధార యటన్న నసలె మాచేతఁగా
దా యేమి ధార లేదాయెఁ గాని;
అవధాన తంత్రంబులందు మా బుద్ధిపో
దా యేమి మేధ లేదాయెఁ గాని;
వాఙ్ముఖమున మాదు వక్త్ర మించుక సాగ
దాయేమి మాట రాదాయెఁ గాని;

గీ॥ మాకు" నను కొను పండితు ల్మహిని నెంద
రో కలరుగాని యీ మేలుపోక లుట్టి
పడఁగ నవధాన మొనరించువారు గలరె?
ధరణిఁ దిరుపతి వేంక టేశ్వరులు దక్క.

—శతా. సా. అనుబంధం. పుట 149.

## నానారాజసందర్శనము

సీ॥ చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణుల సభల్
పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాల వెంబడిఁ
బడవలె పడరానిపాటులెల్ల
వినఁగావలెను పూర్వవిద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస

తే.గీ. కవులు కవులన్నమాత్రాన కవులుగారు
ఎంత భారమ్ముగలదొ కవీశ్వరులకు
నెఱుఁగకుందురె మీవంటి నృపతిమణులు
శ్రీమదానంద గజపతి క్షితిపతేంద్ర!

దేశాటనములేని కవి ప్రతిభ నిల్వయున్న నీరువలెఁ గొంత కాలమునకుఁ జెడిపోవును. నూత్న నిశితానుభూతులు కవి మేధను పదనువెట్టి సాహిత్యరోచిస్సులను బ్రసరింపఁజేయును. వ్యుత్పత్తి యిట్టి ప్రవృత్తివలననే యేర్పడును. వ్యుత్పత్తిలేని కవిత గట్టి పునాదిలేని భవనము వంటిది. తి. వేం. కవులు కవిత్వనైపుణ్యమును, పాండిత్యమును కష్టపడి జీవితములో పోరాడి సంపాదించిరి. దానిని దేశము యొక్క నలుమూలల వెదఁజల్లిరి. అందువలననే ప్రజాకవులు కాఁగల్గిరి. రాజాస్థానములను పేదవారి ముంగిళ్ళను సమముగా దర్శించినది వీరి కవితా సరస్వతి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మాటలలో-"తిరుపతి వేంకట కవులు ప్రౌఢపండితప్రభు సభలలోనేగాదు, బాలపామరజారచోరాదుల గోష్ఠులలో గూడ కవితా చమత్కారములను గల్పించి, సత్కారములను బడయఁగలరు. వేంకటశాస్త్రిగారికి లల్లాయిపదములు పాడ వేడుక. కొల్లాయిగుడ్డలు వాడ వేడుక. వారికి భాషాడంబరము గిట్టదు. కనుకనే వారి కవితాకన్య జనముద్దుగా వెలసినది. సమయస్ఫూర్తి, హాస్యయుక్తి, ప్రయుక్తి చమత్కారము, వేంకటశాస్త్రిగారికి అజానజమగు నలవాటు. ఇట్టివారు నూటేండ్లకు ముందు నడిమింటి మంగశేశ్వర శాస్త్రిగారు ఒకరని వింటిని. బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి గారినిఁ గంటిని. వేంకటశాస్త్రిగారి చమత్కారము లనేకములు. ప్రాచీనాంధ్ర కవులలో ప్రబంధములకంటె శాశ్వతములగు నట్లు చాటు రచనలు సాగించిన వాఁడు శ్రీనాథుఁడు అతని చాటు రచనలు నేటికిని ఆంధ్ర రసికుల నాలుకలపై నాట్యమాడుచున్నవి. వర్తమానాంధ్ర కవులలో నట్టివారు మన తిరుపతి వేంకటేశ్వర కవీంద్రులు." శ్రీనాథుఁడు నానారాజ సందర్శన మొనర్చెను. కలగూర గంపవలె పెక్కువిషయములపైఁ గవనము నాశువుగాఁ జెప్పెను. తిరుపతివేంకట కవులును మఱల నా కవిరాజువలెనే నా రెండు మార్గములందు నడిచి చాటు కవితకు తెలుఁగున మఱల ప్రాణము వోసిరి.

"సత్కులీనుల సరసుల సజ్జనులను
సన్నుతించుట కవులకు సహజగుణము". (నా. నారా. పూ.ప. 133)

కావున కవులు నానారాజ సందర్శన మొనర్చినారు. అందును అర్థదిర్థ ముగా నెదురువద్ద వానినెల్ల యింద్రుఁడనియు, చంద్రుఁడనియు ముఖస్తుతి చేయు లేదు. కవితకు రాజపోషణ మనూచానముగా వచ్చు నాచారము బ్రిటీషు ప్రభుత్వ మునకు గులాములై యున్న సంస్థానాధీశులు దేశీయభాషాపోషణమునందు శీత కన్ను ప్రదర్శించు చుండిరి. పండితు లాంధ్ర గీర్వాణ కవితాభేదము కల్పించు కొని పరస్పర మీర్ష్యాగ్రస్తులై కవిత కవ్వపడఁ దెప్పించుచుండిరి. దేశభాషలు ప్రాత నియమాలను శృంఖలాలుగా తగిలించుకొని స్వీయలోపములు గుర్తింప లేక, పరగుణ గ్రహణము చేయలేక క్రమముగా జీవచైతన్యమును గోల్పోవుచు పాశ్చాత్యుల యొత్తిడిలోఁబడి నలిగి పోవుచుండెను. కవు లీకాలమున దేశక్షేమా ర్థమై నానారాజాస్థానముల దర్శించి, అవధాన కవితతో లోకము కన్ను తెర పించి, ఆ స్థానములందు బంధింపఁబడి పోషణలేక కృశించుచున్న భారతికి స్వాతంత్ర్యము కల్పించిరి. దురహంకారులగు అపర "డిండిమభట్టు"ల నెంద టివో కంచుఢక్కలు పగులఁగొట్టించి, బిరుదములు లాల్చి, గజముల నెక్కి దిగ్విజయ యాత్రలు చేసిరి. సరసుఁడైన రాజానే దర్శించిరి; సౌమ్యముగా నతి నందించిరి; మన్నింపనిచో మెత్తగా మందలించిరి; పెడచెవినఁబెట్టుచో పెట్లన చెంపపెట్టువలె నధిక్షేపించిరి; సుముఖులైనచో గుణకీర్తనమొనర్చిరి; మ్రొక్కినచో నాశీస్సుల వర్షించిరి; గౌరవించి కోటికొన్నచో "ఋణముగాకుండునట్టి" కృతిని బహుమానముగా నొసంగిరి.

సీ॥ పరదేశ సంపాదన రతి మీకు నరేంద్ర!
పరదేశ సంపాదనరతి మాకు;
లన దుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర!
లన దుత్తమ పదాభిలాష మాకు;
సకల మర్త్య శ్లోకసక్తి మీకు నరేంద్ర!
సకల మర్త్యశ్లోక సక్తి మాకు;
మనుమార్గ వర్తనం బనువు మీకు నరేంద్ర!
మనుమార్గ వర్తనం బనువు మాకు;

ఆ.వె. మీకు రాజపదము మాకును గవిరాజ
పదము కల దిఁకెందుఁ గొదువలేదు
గాన సామ్య మిచ్చి మానించఁదొప్పదే?"—నానా. సం. పు. 26.

అని సమానమైన హోదాతో తలవంచక రాజుల ముందుకు వెళ్ళినారు గాని తి.వేం. కవులు 'భిక్షాందేహి'' యని దైన్యము పూనలేదు.

చ॥ "వినుమొకమాట చెప్పెదము వీనుల కింపుగ - నెల్లవారలన్
గని వినుతింపఁబోము, పదిగంపల కెంపులొసంగఁగాక; లే
దని వినుతింపమానము రసాధికులన్; గవితామతల్లికిన్
ధనము ప్రధానమా? రసికతాధికతా సుఖతల్ ప్రధానమా?''

అన్నది వీరిదృష్టి. (నానా. వృ, 132)

ఆస్థానాధీశులను దర్శించు సందర్భమున వీరిచేఁ జెప్పఁబడిన కవిత్వ మంతయు నాశువు కాదు. అర్జీలలోని కవనము కాగితముపై వ్రాయబడినదే అయినను ఛత్రిన్యాయముతో నవియు చాటువులుగనే యిందు భావించుచున్నవి. రాజాస్థానములందుఁ జెప్పఁబడిన కవిత్వములోఁ గొంత సేకరింపఁబడి "నానారాజ సందర్శన''మను గ్రంథముగాఁ బ్రచురితమైనది. దానియందలి చాటువులలోని వస్తువైవిధ్యమును గమనించుచో స్థూలముగా నీక్రింది విధముగ నుండును:

1) కవు లొక యాస్థానమునకు వెళ్ళి తదధీశున కొక అర్జీ వ్రాసికొనుట. అందు ఆత్మనివాసమును, గురువును, ఆత్మపాండిత్య కవిత్వశక్తి, ఆగమన కారణము, రాజయశోగుణకీర్తనము మొ॥ అంశములు ప్రధానముగా నుండును.

2) ఒక అర్జీ ఫలింపనిచో రెండు మూడు అర్జీలను బెట్టుట; ఆనాఁటి రాజుల కవిపండిత వైముఖ్యము, స్వస్థాన పండిత దుర్బోధలకు చెవియొగ్గుట అనెడి గుణము లిందు బ్రదర్శితము లగుచుండును.

3) అర్జీ విననిచో విసకటఁ జెందుట; కవు లాసమయములందుఁ బడిన కడగండ్లు; సాహిత్యపోషణము లేని రాజాస్థానములఁ గాంచి సరస్వతీమూర్తులగు కవులు పడెడి నిర్వేదము ఈ యంశమున స్పష్టమగుచుండును.

4) రాజదర్శనమైన వేళ యెదుట నాతని గుణములఁ గీర్తించుట - సమస్యలు పూరించుట - సంస్కృతాంధ్రానువాదము లొనర్చుట - సారస్వతముపై నభిమానము ప్రకటింప వేడుకొనుట - తమ శక్తిఁ బరీక్షించి ఆస్థాన గౌరవ మినుమడింపఁజేసి,కవితాగౌరవమును లోకమునకుఁ జాటి చెప్పఁదని అభ్యర్థించుట- పండితులలోని గుణదోషముల నిరూపించి వారిని సహృదయత్వము సాహిత్య రంగమున వ్యాపింపఁజేయుఁడని వేడుకొనుట, విననిచో ధిక్కరించి చెప్పుట మొ॥లగు నంశములతో కవిత లల్లిరి.

5) కిర్లంపూడి, విజయనగరము, గద్వాల, బొబ్బిలి మొ॥ నాస్థాన ప్రభువులపైఁ జెప్పిన పద్యసంచయములు లఘుకావ్య గౌరవము నందుకొనున ట్లున్నవి. భావనాశక్తి, అలంకారసౌభాగ్యము, ధారావాహితయైన శైలియు కవితలో ప్రధాన గుణములు. ఉ॥ బొబ్బిలి రాజావారి పట్టాభిషేక వర్ణనము.

6) ఒక్కొక్కసారి సూటిగా రాజదర్శనము గానివ్వుడు రాజబంధువులను రాజమిత్రులను పురోహితామాత్యవర్యుల నాశ్రయించి, వారి ద్వారమున రాజాను సందర్శించుట - సభ జరుపకయే పారితోషిక మెట్టిదిచ్చినను స్వీకరింప ననంగీ కారముఁ దెల్పుట.

7) ఆత్మకవిత్వ లక్షణములు, కావ్యరచనాచరిత్రలు ప్రసక్తానువశముగాఁ దెల్పుట.

8) పెక్కుఱు పండితులను, దేశనాయకులను, కళాకారులను, వివాహ ములను, పండిత పరిషత్తులను, సభలను, దేశములను, నాటకాదులను, పట్టాభి షేకోత్సవములను, మహాపురుషుల నిర్యాణములను వా రెవనెవ వర్ణించిన పట్టు ములు పెక్కులు కలవు.

9) మాలికావృత్త రచన మిందు ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగిన యంశము. అల్లసాని పెద్దనాదులు సాధించిన యీ కవిత్వకళను కవులు "నల్లేరుపై బండి" వలె నడిపించినారు. ఈ గ్రంథ మొక్కదానియందే నలుఁబదికిఁబైఁబడ్డ మాలికా వృత్తములున్నవన్న వారు చెప్పిన వెన్ని యుండవచ్చునో కదా! ఇందులో కడు పెద్దది రమారమి శతపాద విస్తృతమై యొప్పారుచున్నది. (మైలవరపు జమీందారుపైఁ జెప్పినది). కిర్లంపూడి జమీందారుపై దండకము గూడ చెప్పుట గమనింపఁదగినది.

10) ప్రాచీన కవుల శైలులకు దీటగు కవిత నల్లిచెప్పుట, అప్పచ్చ టచ్చట చెప్పిన కవితను తర్వాత కావ్యములలో నెక్కించుకొనుట, చాటు కవిత్వ చమత్కారములు పెక్కులు ప్రదర్శించుట అనునవి వీరి కవితకు సౌందర్య వైవిధ్యమును సంతరించిపెట్టుచున్నవి.

పైఁ జెప్పిన అంశముల కన్నింటికి నుదాహరణములఁ జూపింపఁ బూను కొన్నచో గ్రంథము విపులమగును కావున, చివరి యంశమునకు మాత్రము కొన్ని యుదాహరణములఁ జూపించి, మిగిలినవి సహృదయులకు వదలివైచెదను.

## 1

శతకములో ననుసరించు "నిందాస్తుతి" యను పద్ధతి కుదాహరణము : ఆత్మకూరు జమీందారును గవులు నిందాస్తుతి యొనర్చుట:

సీ॥ నీమీఁదఁ గృతి చెప్పి నిను నుతించిన కృష్ణ
మాదార్యవరుఁడు సన్న్యాసియయ్యెఁ;
నీదు సంస్థాన పండితుఁడైన యల శ్రీని
వాసార్యవరుఁడు ప్రవాసియయ్యెఁ;
నీ గాయకుఁడ నంచు జోగియై రామవా
దార్యుఁ డూరూర యాచనకుఁ దిరిగె;
నీ కింపవేల్పైన యాకుర్మతి స్వామి
యడవిగుట్టల నంగలార్పఁ దొడఁగె;

తే గీ. నెఱిఁగియును నీకుఁ గృతినిచ్చు గురుమనీమ
లరయఁ దిరుపతి వేంకటేశ్వరులె కాక
నీదు లోప మొక్కింతయు లేదు నమ్మ
మాత్మకూరు పురీరాజ! యతులతేజ! - నానా. సం. ఉ. 205 ప.

## 2

మను చర్త్రిలోని "తీర్థ సంవాసు లేతెంచినారని విన్న" అన్న పద్యపు పట్టుబడిలో నడచిన పద్యము :-

సీ॥ పండితుం డనెడి శబ్దము కర్ణపథమందుఁ
బడిన మాత్రన పిల్వఁబంపు నతనిఁ
బంపి యాతని కెంత పాండితీ పటిమంబు
గలదొ యంతయును దాఁగలయఁజూచుఁ
జూచి యాఁతడు తన్నుఁ జూడనేమి ప్రసక్తి
గల్గెనో యట్టి సంగతుల నడుగు
నడిగి యాతని కోర్కె కధికమ్ముగా నిచ్చి
యును "గొంచె మిచ్చితి" ననుచుఁ గుందుఁ

తే.గీ. గుంది తిరిగియు నిచ్చు ద్విగుణము గాఁగ
నిచ్చి మరలయు నిచ్చు నిట్లిచ్చి యిచ్చి
మఱల నిచ్చును మఱియు నిచ్చు మఱియు నిచ్చు
నహహ! గోపాలవిభు వదాన్యత్వ మహిమ. (నానా.పూ. 7 ప.)

## 3

రామరాజ భూషణుని "ఒక దాయ ననపాయ పికగేయ సముదాయ" (ద్వి. 7) అను పద్యము నందలి గమకమును గైకొని సమాసమును పాదాంతమువఱకు నడపెడి చమత్కారము:

సీ॥ ఒక దాయ వికచాంబుజ కదాకచికదాక
చకికా చడాఘ్నానుజన్ములొప్ప
నొక దండ మరిచండిమ కరండ నఖండ
మండన పండితోద్దండు లొప్ప
నొక ప్రక్క శుక తజ్జనక నాకు జనకనా
కకవీంద్ర సమకవి ప్రకర మొప్ప
నొకచోట సకల వాగ్విలసన ప్రముఖల
ద్వంది మాగధ జనుల్ వఱలుచుండ

తే.గీ. నిండు పేరోలగమ్మున నుండు నిన్నుఁ
బండువుగఁ జూచు భాగ్యమ్ము పండె మాకు
నిపుడు, శ్రీ రాజగోపాల కృష్ణ యాచ
భూప బహదర్! మహారాజ! భూరితేజ! —నానా. పూ. 12 ప.

## 4

"వాసనలేని పూవు - బుధవర్గములేని పురంబు" అన్న పద్యపు బాణీలో నడచిన మఱియొక పద్యము.

ఉ॥ స్థైర్యము లేని చిత్త, మవధాన మెఱుంగని సత్కవిత్వ, మౌ
దార్యములేని హస్తము, యథార్థత లేని రసజ్ఞ, మంది మా
ధుర్యములేని గానము, మృదుత్వము లేని వచఃప్రసంగ మై
శ్వర్యములేని భోగము, నసారము లియ్యవి దంతిభూవరా!
—నానా. పూ. 39.

# 5

"సరిగమపదనిస''లలో బద్యము మూఁడు పాదములు నడపుట:

క. "మాపసమా నీ పాగమ
గాపసమా మాపథాప గాగమని సమా
మాపన మీపసగని గా
దా! పరిపరి తుష్టిచెందె నానందనృపా!" —నానా. పూ. 92

ఇట్టివి పెక్కులు చాటుకవితలోఁ గుప్పలు తెప్పలు.

# 6

"మందారమకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబువోవునే మదనము లకు'' అను పోతన పద్యమునకు స్వరూపానుకృతి:

సీ॥ "పంకగంధావాప్తిఁ బరఁగెడి సూకరం
బరుగునే? పన్నీటి సరసులకును,
నింటఁ బ్రబగల్భమ్ము లెంమిఁ బల్కెడి బంటు
చేరునే? రణఘోరసీమలకును,
గోటరమ్ముల మ్రగ్గు గుడ్లగూబల పిండు
లాసచేయునె? ప్రాతరాతపముల,
కనక వరతాంగనాలోలుఁ దరుగునే
కాశ్యయోధ్యాప్రయాగ గయలకును,

తే.గీ. ద్విజగణోత్తమ కవిరాజదీప్తమైన
సభకుఁ గుందలి చేరునే? చనిన శిరము
నెత్తునే? వంచుకొని మూల నిరుకుఁగాని
రమ్యతరకీర్తి! వేంకటరత్నమూర్తి!

# 7

"వసుచరిత్ర"లోని "తమ్ములు పదానుజన్ములై" అను సీసగీతికి సంస్కృతము:

శ్లో. జఘన రమాయాశ్చక్రః
పాల్యంకింవా కనిష్ఠ సముదాయః।
తత్పాదక నీయాన్ కిమ్
ప్రసవాని తదీయ నఖరశిశవః కిమ్? —నానా. పూ. 44 ప.

## 8

"వర్ణభేద'' మాత్రముచే సీసపద్య పాదభాగములను పౌనఃపున్యముగా రచించి శ్లేషయమకమును ప్రయోగించుట—

సీ॥ ప్రాసాద నిర్మాణ శక్తి మీకు నృపాల!
ప్రాసాది నిర్మాణ శక్తి మాకు!
సాదువృత్తి విధాన సక్తి మీకు నృపాల!
సాదువృత్త విధాన సక్తి మాకు;
నవ రసా సంపాదన రతి మీకు నృపాల!
నవరస సంపాదన రతి మాకు;
సరస సద్గుణ గణాసక్తి మీకు నృపాల!
సరస సద్గణ గణాసక్తి మాకు!

ఆ వె. మీకు యాచ బిరుదు మాకును యాచక
బిరుదు గలదు; వర్ణ భేదమాత్ర
ముండె దీని నెన్న కొనఁగు మీ, వేంకట
కృష్ణ యాచ భూప! యిపుడు సమత. —నానా. సం.పూ. 42 పు.

## 9

నానారాజ సందర్శనములోని పద్యముల నాయా సందర్భములందు కావ్యములందును వాడుకుకొనినారు. ఉ॥ "పరదేశ సంపాదనరతి" అనెడి సీసము పండితరాజనాటక చతుర్థాంకమునఁ గైకొనఁబడినది.

## 10

కవు లాత్మప్రాభవమును గూర్చి చెప్పికొనుట:
"ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కఁబెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగొనినారము నీవలనన్ సరస్వతీ!"
—నానా. సం. పూ. 247

"అభినవ రామలింగ బిరుదాంకుఁడ నా కవనంబు నందు నీ
యభిజపుగాండ్లు తప్పులిడ నర్హులె? కాదని తప్పుదిద్ద మా
యుభయుల లోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక యీర్ష్యచే
నభము భుభమ్మునుం దెలియ కార్చెడి దేబెలు మాకు లెక్కయే."
—(చె. వేం. శాస్త్రిగారి పద్యము) నానా.పూ. 161.

"వితతాశ్మీయ శతావధాన కవితా విద్యా పయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృత రసప్రీతాఖిలాంధ్రక్షమా
ధృత రజ్యద్రసికావతంస కృతవందిస్తోత్రమాలావిభూ
షితు మా వేంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపంబునన్."
—(తి.తి. శాస్త్రి గారి పద్యము) శతా. సా.ఉత్త. 98 పు.

చ. తిరుపతి యెన్నుగాఁగ గడిదేటిన శిమ్య లనేకు లొప్పమైఁ
బొరిఁబొరి రోజుచున్ దనదు పొంతను బెబ్బులి పిల్లలట్లు చూ
పఱులకుఁ దోఁచఁ గేల నొక పాటిది బెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసు"ఁజూపెడిఁ జూడుఁ డోబుధుల్.
—చె. వేం. శాస్త్రి - శతా. సా. ఉత్త. 105 పు.

చ. తిరుపతి వ్యాఘ్రమై బయలు దేటిన శిమ్యలు గున్నయేన్గులై
వరలఁగఁ దేఱఁగాఁదగిన వారలు బెబ్బులి పిల్లలెల్ల మా
ర్జురు కపికుర్కురమ్ములయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధానమను "సర్కసు" చూచితివమ్మ శాంకరీ!
—తి. శా. - శతా. సార. ఉత్త. 105 పు.

## కలగూరగంప

నానా సమయములలోఁ బెక్కుచోట్ల చెప్పిన చాటుపద్యములు కొన్నిఁటిని కూర్చి యొనర్చిన సంకలన గ్రంథము "కలగూరగంప." ఇందలి వైవిధ్యమును గని సంతసించుట ముఖ్యమైనది. శ్రీరంగేశ్వర, శ్రీకృష్ణ స్తుతులు కృత్యారంభ పద్యములవలె రమణీయార్థ స్ఫోరకములై వరలుచున్నవి. శతకమునకువలె "వేంకటేశ్వరా!" యను మకుటముతో వేంకటేశ్వరస్తుతి యొప్పారుచున్నది.

"ఓ జగదీశ్వరమ్మ" అను మకుటముగల్గిన ఎనిమిది సీసపద్యములు విభిన్నము లైన విచిత్రపు నడకలతో నలరారుచున్నవి. జ్ఞానబోధాత్మకములగు కందములు, తేటగీతలు, ఆఁటవెలఁదులు వెరసి ఇరువది యెనిమిది పద్యములు. అప్పయ దీక్షితులవారి వైరాగ్య శతకము ననువదించిన సంస్కార మీపద్యములందు గుబాళించుచున్నది. ఆదిశంకరులు, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, నారాయణదాసు, రవీంద్రనాధ ఠాకూరు, దాదాబాయి నౌరోజీ మొ॥ వారివంటి యుత్తమగుణులను గీర్తించి వీరారాధన మొనర్చిరి.

ఆంధ్రమహాకవి ప్రశంస, ఆంధ్రకవులు అన్న శీర్షికలు ఆంధ్ర సాహిత్యములోని ప్రసిద్ధ కవులపైఁ జక్కని విమర్శ. చతుర్థాంధ్ర మహాజన సభలోఁ జదివిన పద్యములు ప్రబోధకవితా హారమునకు మణిపూసలవంటివి. అందులో రాష్ట్రగానము వినిపించినది. ఆంధ్ర సాహిత్య పరిషత్తుపై వ్రాసిన పద్యము లందును రాష్ట్రప్రబోధము కలదు. దశావతార వర్ణనము వైష్ణవ శతక కావ్యములలోని వర్ణనల కొజ్జబంతులు. శ్రీ సర్పవరపు భావనారాయణస్వామిపైఁ జెప్పిన పద్యములు శబ్దాలంకార సంశోభితములు; అనుప్రాస, అంత్యప్రాసలు పాదించిన సీసపద్యముల నడక దీర్ఘ సంస్కృత సమాసములతోఁ గడు రమ్యముకై ప్రౌఢముగా నున్నవి. చంద్రోదయాది వర్ణనములు, వివిధార్థసూక్తి రచనా నైపుణ్యము పెక్కు చాటువులు చాటుచున్నవి. 'ఒక ప్రశ్న' అను శీర్షిక గల ఖండకావ్యము వద్దాది సుబ్బారాయ కవిత్వ విమర్శనము, మత్తేభ శార్దూలములలో రచన, కుకవిత్వ నిరసనము, నిజావధాన పాండిత్య ప్రశంసయు నిందు గోచరించుచున్నవి. తప్పు లెన్నుటయే ముఖ్య విమర్శగాఁ బెట్టుకొన్నవారిని నిరసించుట యిందలి వస్తువు "శ్రీరంగేశ్వర నీవుదక్క మఱి వేరేలేరు దిక్కెవ్వరున్" అను మకుటముతో వ్రాసిన శ్రీరంగేశ నవరత్న మాలిక చక్కని తెలుగుఁ పలుకుబడులతో, జాతీయములతో నొప్పారుచున్నది. 'మఱ్ఱిచెట్టు, తుమ్మచెట్టు, అశ్వత్థ వృక్షము' అన్నవి సరసమై యున్నవి పింగళి లక్ష్మీకాంతముగారి కిచ్చిన ఆశీస్సులు, వద్దాది సుబ్బారాయుని కిచ్చిన "సూక్తి కథానిధి" బిరుద ప్రశంస, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి గండపెండర గౌరవము, హరి నాగభూషణము గారి కిచ్చిన ఆశీస్సు - మొ॥నవి సమకాలీన జీవిత ఘట్టములకు రసవద్వ్యాఖ్యానములు. ఇంకను పెండ్లిండ్లయందును, ఇతరశుభసందర్భములందును జెప్పిన పద్యములు కుప్పలు తెప్పలు. కవిత్వము వారి శ్వాస నిశ్వాసయే యైనప్పుడు పద్య పంక్తికి లెక్కయేమిది?

ఇట్టి విస్తృతమైనట్టియు, వైవిధ్యముతోఁ గూడినట్టియు నాటకవిత్వము చెప్పి, చాటుకవులై, అవధానులై, మేటి బిరుదములుగొని తెలుఁగునాఁడును కవితా సుధాసేచనముచే నార్ద్రి మొనర్చిన మహాత్ములు తిరుపతి వేంకటకవులు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మాటలలో—.

చ॥ "పుడమినిఁ బెక్కు సత్కవులుఁ బుట్టిరి ముట్టిరి సత్కవిత్వపున్
దొడిమలు, వెళ్ళపిళ్ళ కవితతోఁ* దులఁదూగెడివారె? వానలోఁ
దడియనివారు మద్గురువధానస్మృదూక్తి మరంద ధారలో
గడుగనివారు మా కెచటఁ గానఁగరా రిలఁ దెల్గునాఁడునన్."

---

* దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు దివంగతులైన తరువాత వ్రాసిన పద్యమిది. ఒక్కరి పేరున్నను జంటకవులనియే లెక్కింపవలె నిచ్చట.

# అధిక్షేప కావ్యములు

ఉ॥ "దోస మటంచెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము 'రెండు భాషలకు మేమె కవీంద్రుల' మంచుఁ దెల్పఁగా
రోసము గల్గినన్ గవివరుల్ మము గెల్వఁడు గెల్తురేని యా
మీసము దీసి మీ పదసమీపములన్ దలలుంచి మ్రొక్కమే?"

-నా. రా. సం. పూ. 179 వ.

లోకములో మానవుఁడు తనకు నచ్చని సిద్ధాంతమునుగాని, వ్యక్తినిగాని గర్హించును లేక అధిక్షేపించును. అతని సంస్కారమును బట్టియు, అవకాశమును బట్టియు నీ యధిక్షేపము ముఖాముఖిగాఁ గాని అన్యాపదేశముగా గాని జరుగవచ్చును. పేరుపెట్టి అధిక్షేపించినచో నది రోషామర్షావేశాదులకు దారితీయవచ్చును. ఆ కీడును మాపుకొనుటకు సున్నితమైన మనఃప్రవృత్తి కల్గినవాఁడు తా నధిక్షేపింపఁదలఁచుకొన్న వ్యక్తిగుణములను మఱియొక వస్తువునం దారోపించి కథలల్లి పరోక్షముగా వ్యంగ్యమార్గము ననుసరించి తన కసిని దీర్చికొనును. అట్టి పరిస్థితి యొక కవికిఁ దారసిల్లినచోఁ బైఁజెప్పిన రెండు ప్రక్రియలలోను తిట్టుకవిత- అధిక్షేప కావ్యమువలె రూపొందును. అందు ముఖాముఖి వివదించుచు నధిక్షేపించు కవితను వివాదకావ్యమని యందురు. ఉదా॥ గీరతము, గుంటూరుసీమ మొ॥నవి. అన్యాపదేశమున నధిక్షేపించు కవిత నధిక్షేప కావ్యములని యందురు. ఉదా: బిడాలోపాఖ్యానాదులు. ఇందు మొదటి ప్రక్రియకన్న రెండవ ప్రక్రియ కడు సున్నితమైనది, కల్పనా చమత్కార మహిమాన్వితమైనది. ఆంగ్లాది సాహిత్యములం దిట్టి సాహిత్య ప్రక్రియను సెటైరు అని అందురు. దానిలోఁ బెక్కు నుద్గ్రంథములే వెలువడినవి. 'గలివర్సు ట్రావల్సు' దాని యుత్కృష్టోదాహరణము. అందలి వ్యంగ్య వైభవము అనన్యసామాన్యమైనది. అట్టి సాహిత్య శాఖ యింకను తెలుఁగున నభివృద్ధి కావలసి యున్నది.

అధిక్షేపము వ్యక్తిగతమనియు, సిద్ధాంతగతమనియు, జాతిగత మనియు ముత్త్రైవిధ్యముగా విభజింపవచ్చును. తనకు విరోధియైనవాని నొక్కని గాని,

కొందఱను గాని ఉద్దేశించినవి వైయక్తికాధిక్షేపములు. విరుద్ధమత, రాజకీయ, సాహిత్యాది సిద్ధాంతముల నవహేళనము చేయునట్టివి సిద్ధాంతాధిక్షేపములు. ఒకజాతియందున్న సాంఘికాచారవ్యవహారములను గర్హించునట్టివి జాత్యధిక్షేపములు. ఈ మూఁడు విధములు వివాద, అన్యాపదేశములందును గానవచ్చును. ఈ ప్రక్రియాత్రయమునందు ప్రపంచ సాహిత్యములలో జాత్యాధిక్షేపమునకు గౌరవము హెచ్చు. మూఁడింట దీనికే శాశ్వతత్వ మధికము సామాన్యముగా నీకవిత్వమునందు నిందాగర్భితమైన భావసముదాయ మధికముగా నుండును కావున దీనిని తిట్టుకవిత యనియు పండితులు వ్యవహరింతురు. సంస్కృతమున వాంఛానాథుఁడు (కుట్టికవి) రచించిన మహిషశతకము; ఆంధ్రమున పిండిప్రోలు లక్ష్మణకవి రచించిన 'రామణదమ్మీయము' అనునవి యిట్టి కవితకు ప్రసిద్ధోదాహరణములు. మఱల తిరుపతి వేంకటకవులు రచించిన గీరతాదుల కట్టి ప్రశస్తి తెలుఁగు సాహిత్యమునఁ గలదు.

## వివాద కావ్యములు - గీరతము

తి. వేం. కవులు కవిత్వపీఠమునకును, మానపీఠమునకును మూర్తిగట్టినవారు. తెలుఁగునాట నాకవుల కఖండమైన కీర్తి లభ్యమైనది. శిష్యవర్గ మేర్పడినది. వారి ధవళయశస్సును చూచి యోర్వఁజాలని కవులు కొందఱు వారిపైఁ గువిమర్శలు ప్రారంభించిరి. అసత్యములను నిర్భయముగాఁ బత్రికలలో వ్రాయఁజొచ్చిరి. దూషణల వఱకు కథలు పెఱిగినవి. పరోక్షముగా నధిక్షేప కావ్యములు రచింపఁబడి ప్రసరింపఁబడినవి. ఇట్టి దుమారమునకు కారకులైన వారిలో మొదట నెన్నఁదగినవారు వేంకట రామకృష్ణ కవులు.[1] ఆ జంట కవులు వేంకట శాస్త్రిగారి శిష్యులు అయియుండియు గురుదూషణమునకు దిగినందులకు సహింపఁజాలక రెచ్చి, తదపకీర్తి నివారణము కొఱకును, లోకమున నిట్టివారికి గుణపాఠ మొకటి చెప్పుటకును, నీతి బోధించుటకును అధిక్షేప సాహిత్యమును సృజించి - గీరతము - అను గ్రంథమున సంపుటీకరించిరి. దీని కాంధ్రదేశమున నెనలేని కీర్తి వచ్చినది; వేదముగా వర్ణించినవా రున్నారు దీనిని.

---

1. మొదటివారు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు - 1883 - 1939.
రెండవవారు వేదుల రామకృష్ణ శాస్త్రిగారు - 1889 - 1918.

శ్లో॥ గిర్షు యేతు రతాస్తే వై గిరతాః పరికీర్తితాః॥
తానుద్దిశ్యకృతం కావ్యం గిరతం పరిచక్షతే॥.

అని గిరత శబ్దమునకు వ్యుత్పత్తి కవులే చెప్పియుండిరి. కావ్యరచనావసరము నుద్దేశించి యిట్లు వ్రాసిరి:

తే గీ. "ఎన్ని తిట్టులు తిట్టిన నెరదసైచి
శిష్యు బాగునకై కృషిసేయు టొప్పు
నీ! వినఁ దటంచు విసువును జెందఁదగదు
యత్నమొనరింప ఫలియించు నంద్రు బుధులు.

క. ఒక శిష్యుని కొక దేశికుఁ
డకలంకము తత్త్వవిద్యయందుఁ బ్రవేశం
బు కలుగకుండుటకుఁ జింతిలి
[1]యొక నాటక మతనికొఱకు నొగి రచియించెన్.

క. ఈ గిరతమును నటులే
బాగున కేర్పడిసదంచుఁ బండితు లెఱుఁగం
గాఁగల రన్యుల నమ్మరి
కై గా దిద్దాని రచన యచలాధిపతీ!

క. ఓ విబుధవరేణ్య! మామము
లో విషయము లెన్నిలేవు లోఁతరసినచో
నేవిషయమందుఁ దేలెది?
శ్రీవిభు చరితంబె యిందు శిష్యహితంబే?

క. మునుపల కృష్ణద్వైపా
యను కతనన వెలసె భారతామ్నాయము నేఁ
డును నల కృష్ణద్వైపా
యను కతనన వెలసె గిరతామ్నాయమ్మున్.

1. ఇదియే ప్రబోధ చంద్రోదయమని ప్రతీతి.

క. భారతము నాటకమ్ములు
గా రచియించితిమి మున్ను గైకొను మిదిగో
గీరతము గీరతులకు న
నారత మానంద మిడు ఘనారవము క్రియన్.

మ. పితృదేవుల్ మఱి మాతృదేవులును నే విద్వాంసు లాచార్యులై
వతులౌ ప్రాజ్ఞులు వొల్చు సత్పథల సంభావించి తన్మానసా
హృతికై భారతభారతీ విమలవార్ధి స్ఫారధారాభిసం
భృత గంభీర వచః ప్రబోధితులనై యిక్కావ్యముం గూర్చెదన్."

—గీరతము

సారతర నీతిబోధమునందును, ప్రాచీన గురుశిష్య ధర్మప్రబోధము నందును, భారతామ్నాయమువలె గీరతము ధర్మాగమ మని సమకాలీనులు మెచ్చుకొనియుండిరి. దీనియందును భారతమునందువలె "ప్రతిపర్వ రసోదయ"ము నిచ్చు పర్వములు కలవు. అవి నాలుగు ప్రధానమైన విభాగముల క్రింద నొదిగియున్నవి. అవి: 1. అధిక ప్రసంగ దమనము 2. గురుదక్షిణ 3 విగ్రహారాధన 4. లోకాభి రామాయణము. ఇందు మొదటి రెండు విభాగములలోను పర్వ విభాగము కలదు.

అధిక ప్రసంగ దమనములో 1) వాసిఁగన్న పర్వము 2) ఈశ్వరవేరు పర్వము 3) జీలుగుబెండు పర్వము 4) మేకు బిగింపు పర్వము 5) శాంతింపు పర్వము 6) మందలింపు పర్వము 7) ఇతిహాస పర్వము 8) దైవత పర్వము 9) విద్వత్పర్వము 10) కాకరపత్రి పర్వము 11) సభాపర్వము 12) చవ్వట్ల పర్వము 13) శాఖాచంక్రమణ పర్వము 14) పాశుపత పర్వము 15) ఉప సంహార పర్వము - అనునవి గలవు.

"గురుదక్షిణ'' విభాగములో 1) ఆశీర్వచన పర్వము 2) సూర్యరాయ పర్వము 3) సంబుద్ధి పర్వము 4) బందరు పర్వము 5) సమృద్ధి పర్వము 6) బ్రహ్మగురు పర్వము 7) ఆత్మవైభవ పర్వము 8) గీరత ప్రశంసా పర్వము 9) సంకీర్ణ పర్వము 10) మంగళ పర్వము అనునవి కలవు. పర్వ మందలి యితివృత్త కథన హేతువు నధికరించి ఆయా పర్వనామములుఁ చేఁ

బడినవి. ఉదాహరణమునకు 1) వానిఁగన్న పద్యము. వేంకట రామకృష్ణకవులు తిరుపతి వేంకట కవులను వెక్కిరించిన పద్య మిది:

శా. "ప్రాసంబున్ యతియున్ విరుద్ధగతి శబ్దంబుల్ ప్రయోగించుచున్
మీసమ్ముల్ మెలివెట్టి 'మా కుపమ మేమే' యంచు నెందున్ దుర
భ్యాసం బొప్పఁగ నుండువారు కవులై పద్యమ్ములం జెప్పినన్
'వానింగన్న కవీశ్వరుల్' సభలలో వర్ణింతురే వారలన్?"

ఇది వారి వివాదమున కెల్ల మూలమైన పద్యమని వేంకటశాస్త్రిగారే పేర్కొని యుండిరి. మొదటి పాదమున వేంకట రామకృష్ణ కవులు రచించిన "శతఘ్ని" ధ్వనింపబఁడుచున్నది. అది పాండవాశ్వమేధముపై విమర్శ. రెండవ చరణము "దోసమటం చెఱింగియును" నన్నకవుల పద్యముపైఁ జేసిన వ్యాఖ్య. నాల్గవ చరణమున నంతకు నాల్గు మాసములకు పూర్వము వేంకటశాస్త్రిగారి గురుత్వ గోపనముం గూర్చి యడిగిన ప్రశ్న కిచ్చిన ప్రత్యుత్తరము. దీనిలోని 'వానిం గన్న కవీశ్వరు' లన్న పదమును గైకొని శిష్యుని నిట్లు మందలించిరి:

శా. "వానింగన్న కవీశ్వరుం' డయినఁ గావచ్చున్ గుడుంగూర్చి 'కా
కి! సీ! హు'ష్షని 'శృంగభంగ'మని 'హీహీ' యంచు 'హూ'యంచుచున్
'మీసా'లంచును వెక్కిరించునదె! యేమీ కాంమాహాత్మ్య! మే
మీసద్బుద్ధి! కృతజ్ఞతాగరిమ మేమీ! వేంటచేశ ప్రభూ!"

2) తిరుపతి వేంకటేశ్వరులకు వేంకటరామకృష్ణులు ఈశ్వర వేరులని తాము ప్రకటించుకొనిరి. దానికి సమాధానముగా తిరుపతి శాస్త్రి గారు వ్రాసిన కమ్మ యీశ్వర వేరుపద్యము "మేము కావించిన సభకు రండు; మీరీశ్వర వేరులో జీలుగు బెండ్లో తేంగల''దని తిరుపతి శాస్త్రిగారి సవాలు!

3) "శాకవి కాచపాత్రల మొగంబులు మూయఁగ జీల్గు బెండ్లమే" అని రామకృష్ణ కవుల సమాధానము. అంతటితో నాగక తిరుపతి శాస్త్రిగారిపై దుదుసుగా నొక విసు రిట్లు విసిరినారు:

చ. "గురుఁడని శిష్యుఁడంచు నొక కొంత చమత్కృతిఁ జూపి వేంకటే
శ్వరుఁడు సహించెఁగాని యిఁక సైఁపఁడు తిర్పతియంచుఁ బల్కెదీ
వరయఁగ వేంకటేశ్వరుని యాదరణంబునఁగాక తిటకన్
దిరుపతి మార్గ మిట్టిదని తెల్ప నెఱుంగ నెవండు గోరెడున్?"

4) తిరుపతి శాస్త్రిగారు సమాధాన మిట్లు వ్రాసెను: "బెండ్ల మనంగ నౌదురు; కవి ప్రకరంబులంకెల్ల నూఱు వేలేండ్లకునైనఁ గాఁగలరె యీశ్వర వేరులు?" అని తిరస్కరించుచు.

ఉ. తిరుపతిచేత వచ్చెనొ యతిప్రతిభా మహిమంబు వేంకటే
శ్వరునకు; వేంకటేశ్వరుని వల్లనె చెందెనొ యామహత్త్వముల్
తిరుపతి; తద్వివేకము నిలింపులునైన మెఱుంగ రింతకుం
దిరుపతి వేంకటేశ్వరులం దేఁకువ కాకవు లందనేర్తురే? - గీర. 10 పు.

శ్రీ ఓలేటి వేంకట రామశాస్త్రి వేంకట శాస్త్రిగారి శిష్యులని తేల్చి చెప్పిన పద్యము—

సీ॥ ఇంజరం బొక సాక్షి యేనాము దా సాక్షి
పల్లెపాలెంబు తానెల్ల సాక్షి;
యిపుడు నీవున్నట్టి యీ పిఠాపురి సాక్షి,
యేలూరు సాక్షి నీ యిల్లు సాక్షి;
వల్లూరు నృపతి శ్రీభాష్యకారులు సాక్షి,
నూజివీడ్రామచంద్రుండు సాక్షి;
మంజువాణీ ప్రెస్సు మానేజ రొక సాక్షి,
శంకరుం డాతని సాని సాక్షి;

తే.గీ. మధున పంతుల సూరయ బుధుఁడు సాక్షి
యయ్యనము నన్న సాక్షి సుబ్బయ్యగారు,
సాక్షు లున్నారు పద్యంబు చాల దింక
వేంకటేశ్వరు శిష్యుఁడవే నిజంబు. (గీర. 11 పు.)

ఇట్లే తదితర పద్యములన్నియు నాయాహేతునామకములై యొప్పుచు వాద ప్రతివాద రూపములై వరలుచున్నవి. గీరత ప్రథమ భాగముననే గ్రంథ విషయక సర్వాంశములు సూత్రప్రాయముగాఁ బ్రతిపాదితమైనవి. తదితర భాగము లాయావిషయముల వివరింపు మాత్రమే. కవులు పేర్కొనినట్లు "ఎన్నాళ్ళు చదివినను నాయాగ్రంథ భాగములయందు 1) శిష్యుఁడు గురు ద్రోహము చేయుట తప్పు. 2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది శిష్యుఁడుగాని వేఱొక విధమువాఁడు కాఁడు. 3) పైగా నతఁడు కృతఘ్నుఁ

దగుచోఁ జాలింపక వదరుఁబోతు వ్రాతలు, అసత్యములు, అపవాదులు లోసగు నవి ప్రకటించుట మొట్టమొదలే తప్పు అను నియంతములుదక్క వక్తవ్యాంశ ములు గానరాదు'' (గిర. గురుదక్షిణ. ఉపోద్ఘాతము).

రామకృష్ణకవులు తిరుపతి వేంకటకవులను వెక్కిరించుట కనుసరించిన మార్గములలోఁ గొన్ని యిట్లు కలవు:

1) 'కోకిలకాకము' (పద్యాత్మకము) 'కాకవ్యాసము' (వచనాత్మకము) అను నన్యాపదేశ కావ్యములు తిరుపతి వేంకటేశ్వర కవుల నుద్దేశించి రచించుట- 'గురుదక్షిణ' యందు కవులీ విషయమును విమర్శించి యుండిరి.

2) కాకరపర్తి యవధానములో జరిగిన యల్లరిని గూర్చి పద్యాత్మక మగు ''శృంగభంగ''ముగా వ్రాసి తమ బంధువగు చర్ల వేంకట చలపతి శాస్త్రిం పేరఁ బ్రచురించుట ...దాని సత్యాసత్యముల చర్చయే కాకరపర్తి పర్వమువఱకు కవులచే నొనర్పఁబడినది.

3) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రామకృష్ణ కవులకు"సతీర్థ్య సంప్రార్థనము" వ్రాసివంప, వారు తమ శిష్యులలో నొకనిచే 'ప్రభాకర పరామర్శము'ను వ్రాయించి పంపిరి. ఈతఁడే తరువాత ''పాణిగృహీతా శ్రవణానంద శృంఖల'' యను పేర నొక విమర్శను వ్రాసెను దానిపైఁ గవులు ''శృంఖలా శ్రుటీ కరణ''మను పేరఁ బ్రతివిమర్శ వ్రాసి, అపూర్వశాస్త్ర విషయములను ప్రపంచించియుండిరి ఈ విషయములన్నియు "గురుదక్షిణ"లోఁ జర్చింపఁ బడినవి.

4) రామకృష్ణకవులు "పాండవాశ్వమేధము"పై శతఘ్నియను విమర్శను ప్రకటించిరి. దానికి ప్రతిగా తి. వేం. కవులు 'పాశుపత' మను పేర విమర్శ వ్రాసిరి. దాని కెదురు పరాస్తపాశుపతము అనెడి విమర్శనము వెలువడినది. 'పున శ్చరణము' అనుపేర దానిని కవులు తిరిగి ఖండించిరి.

5) రామకృష్ణకవులు 'తిరుపతి వేంకటేశ్వరార్థ శతకము' అను అన్యాప దేశ శతకమును తి. వేం. కవుల నుద్దేశించి వ్రాసిరి. వానియందలి పద్యభాగ ములఁ బేర్కొనుచు తిరుపతి వేంకటకవులు వాని నధిక్షేపించుట విగ్రహారాధన లోని యితివృత్తము. ఉ॥

"తిరుపతి పీఠి వేఱొక ప్రదేశముఁ జేరితివేని నీ
పరపతి యెంత యున్నదియొ పైఁబడుఁ దిర్పతి వేంకటేశ్వరా!''
—రా. కృ. కవులు.

"తిరుపతి వేంకటేశ్వరుని తేజమునన్ యశమందె" నంచుమ
న్నటిముటి వ్రాసి; తిప్ప దిటు లందుకు భిన్నముగాఁగ వ్రాసి; తే
మటితివా? బుద్ధి కిద్వదెనా? "మాదిగమంచపు'' కుక్క మోయెదో
యెఱుఁగఁగరాదు; సంకరము లీవు లిఖించునుదుల్ కుమారకా!
"తిరుపతి వేంకటేశ్వరుల తీరది యర్భక! చంద్రచంద్రికా
స్ఫురణము భాస్కరాతప విభూతి జ్వలజ్వలన ప్రభాదురం
ధరమునుగా నెఱుంగుదురు తజ్ఞులు; మోటకులో, యెటేనియుం
దిరిగెడివారి నాలుకలు తెగ్గునుగావు సుమీ కుమారకా!"
—గీర. వి.గ. 150, 151.

ఈ భాగమున రచించిన పెక్కంటియందు పురాణ కావ్యాదులలోని కథార్థ సూచనలు గ్రహింపఁబడినవి

6) రామకృష్ణకవులు 'రామకృష్ణ మహాభారత'మను పేర తి. వేం కవులపై నసత్యకల్పనలతో నొక కథాకావ్యము రచించిరి. ఆ అభూతకల్పనలను తిరుపతి వేంకటకవులు 'లోకాభిరామాయణము'లో విమర్శించి, సత్యాసత్యముల నిరూపించిరి. "రామకృష్ణమ + హాభారతమని' అవహేళన చేసిరి.

7) ఇంతియగాక కథలు - గాథలలో 1) భీష్మబ్రహ్మచారి I.134; 2) పిష్టపేషణము I.614; పునఃపేషణము I; పాడిన పాటే; ఆంధ్ర భోజుఁడన నేమి? III.1 మొదలగు వ్యాసములన్నియు రామకృష్ణ కవులను విమర్శించినవే.

## గుంటూరు సీమ

రామకృష్ణ కవులతో గల్గిన వివాదము గీరత గ్రంథ రచనకు హేతువైనట్లే 'గుంటూరు సీమ'కు కొప్పరపు కవులు కారకులైరి. కొప్పరపు కవులు మొదట తి. వేం. కవులపై భక్తిప్రపత్తులు కలవారయ్యు నియోగి - వైదిక కక్షను సాధింపనెంచి విరోధము పూని పైపెచ్చు అసత్య ప్రచార మొనర్చి యపయశముఁ గల్పింప యత్నించిరి. కొప్పరపు కవులు కడు వేగముగా నాశు

కవితను నడపఁగల్గినవారయ్యు నవధానములందు తి వేం. కవులంత ప్రసిద్ధి పొందినవారు గారు. పాండిత్యమునందు వీరికన్న తి. వేం. కవులు మిన్న యగుటయే దానికి గారణము. వారి నుద్దేశించి వ్రాసిన గుంటూరుసీమ గ్రంథములో దెల్పఁబడిన సారాంశము లివి :

"1. పండితాపండితులకు వివాదము సమంజసము కాదు.

2. నిజము నిడివిమీఁద దేలక మానదు.

3. శాఖాభిమానమును బురస్కరించుకొని పెద్ద పెద్దల అనుచితపుఁ గార్యములను సహింపఁగూడదు. అది పెద్ద తప్పు.

4. కవులకుఁ గల స్వాతంత్ర్యము ముందు మనముగాని, మన యుద్యోగములు గాని యాగజాలవు. దాలనే దాంవు.

5. కవి యనఁగా నెట్టివాఁడో ప్రాజ్ఞులకుఁగాని ప్రతి మనుజునికిఁ దెలియ వలసి యుండదు. సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్!"

గుంటూరు సీమలోఁ గొప్పరపు కవులను డీకొనుటకు తి. వేం. కవుల పక్షమున వారి శిష్యులు నిలువఁబడి పాండిత్య కవిత్వ వీరములఁ బ్రదర్శించుట మెచ్చుకొనఁదగినది. తి. వేం. కవులు గుంటూరు సీమలోఁ బొందిన విజయాదుల వర్ణించు పట్టము లావేశము కల్పించునట్లు చిత్రింపఁబడినవి. వేమవరశతావధానమును గూర్చి కొప్పరపు వేంకటకవు లొనర్చిన రభస యంతయు నొక వచన గ్రంథమైనది. గుంటూరు సీమ పూర్వరంగము వెలువడుసరికి ఇద్దఱి నడుమ రిజిష్టరు ఉత్తరములు నడచినవి. డామేజి దావాల వఱకు వచ్చినది. ఎవరెన్ని యన్నను కొప్పరపు కవుల మాటలు వమ్మైనవి. ఏ దేశమందైనను కవుల కవుల మధ్య కలహ మేర్పడినచో సారస్వతపు కవిలె కట్ట పెరుగును. వారిరువురి ధర్మమాయని లోకము కొన్ని యపూర్వ శాస్త్ర విషయాదులు నేర్చుకొనును. కాని, పరస్పర కక్షలతో పండిత లోకము రెండుగా చీలును. ఎట్లైనను చివ ఱకు తి. వేం. కవుల కాంధ్రదేశము "బ్రహ్మరథము" పట్టినది.

## చెళ్ళపిళ్ళ జయంతి

ఇవి యిట్లుండ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి, వారి గురువగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి వాదేర్పడినది. బొబ్బిలి పట్టాభిషేక సందర్భమున

నా రాజుపై నొక నైయాయికుఁడు పద్యముల రచింప వాని నీర్ష్యతో కృష్ణమూర్తి శాస్త్రిగారు 'సకళంకము' లని పేర్కొని, యవి మంటలో పారవేయఁదగినవని నిందించిరి. తి.వేం కవు లిట్టి పద్ధతిని గర్హించిరి. అపై శాస్త్రిగారు తి.వేం. కవులంచే రచింపఁబడిన ''బొబ్బిలి పట్టాభిషేక'' మను చిన్న కావ్యమును విమర్శించుచు ''ఇందు ప్రతి పద్యమునందును వెదకినచో రెండువేల తప్పులకు తక్కువగా నుండవని చెప్పవచ్చు''నని పేర్కొనిరి. శాబ్దికమైన దోషము లాకావ్యమున నేతె చూపించిరి. అవి భారత కవిత్రయ సమ్మతములేయని కవులు నిరూపింప, నాభారత ప్రయోగములను గూడ గర్హించిరి. అట్టి ప్రయోగములు కృష్ణమూర్తి శాస్త్రిగారి కృష్ణభారతమందును కలవని కవులు నిరూపించిరి. ఉ॥ ''మనుజాల విప్రుండు'' అనునది భారతమున లేఖక ప్రమాదమని కృష్ణమూర్తి శాస్త్రిగారు దిద్దఁబూనినారు. కవులు దానిని 'త్రిలింగ లక్షణ శేషకర్తయు, గుప్తార్థ ప్రకాశికా కర్తయు దిద్దక యాపదము నట్లే గ్రహించియుండుటను నిరూపించిరి. మఱియు ''ఆర్యపెర్మ్యల రెడ్డెయ్య'' అను ప్రయోగము శ్రీపాద వారి భారతమునఁ జూపించిరి. వారు దానిని దిద్దయత్నించిరి. పిమ్మట ''నాదు చిత్తమ్మొప్పున్ భక్తియుక్తులను సంధానించెదిన్ విప్రులన్''అనెడియు, "ధేనువులన్ గామధేనువుగను" అనెడు ప్రయోగములను వా రసత్ప్రయోగము లనగా, "నడిపించు'; 'వలెన్' లోనగు ప్రయోగములను వారి భారతమునందే కవులు చూపించిరి. అంతియకాక-

మ. "ప్రకృతంబున్ వినుమయ్య! భారతకవి బ్రహ్మయ్యగా ర్వాడినా
రొకచో సప్తమికిన్ ద్వితీయ, అది యెంతో చిన్న సూరయ్యగా
రికటాక్షానకు దూరమంట; ఇది యేరే విన్న రాట్నంపు రా
క కెటో బండిని దప్పికొమ్మనుటయే కాదే కవీంద్రాగ్రణీ!"

-జయంతి. పుట 4.

అను పద్యములందలి కవుల భారత ప్రామాణ్య బుద్ధియు, ఆంధ్ర వైయాకరణుల అసమగ్ర దృష్టిని విమర్శించు విశాల దృక్పథమును మెచ్చుకొనఁదగినవి. కృష్ణమూర్తిశాస్త్రిగారు ''చెక్కపిళ్ళ చెరలాట'' మను విమర్శను కవులపై సలిపిరి. తి వేం. కవులు దానికిఁ బ్రతిగా సంస్కృత శ్లోకరూపముగు "క్షమాపణమ్'', తెలుఁగున అవసరనైవేద్యము, మహానైవేద్యము, మహదైశ్వర్యాభివృద్ధి లోనగు వ్యాసము లెన్నియో రచించి, వారు తప్పులన్నవాని నొప్పులుగా నిరూ

పించియుండిరి. ఇరువురిమధ్య వివాదములు పెరిగి, దేశములోని పండితులకు విసువు జనించువఱకు సాగినవి. వేంకటశాస్త్రిగారు జయంతి రామయ్య పంతులుగారిని మధ్యవర్తిగా నుంచి సంబోధించుచు, వారి కంకితముగా "జయంతి'' యను పద్యగ్రంథమును రచించిరి. అందు శాస్త్రిగారు చేయుచున్న విమర్శల విధమును ఖండించుచు నందలి సత్యాసత్యములను దేల్చి చెప్పుడని ప్రార్థించినారు. జయంతి రామయ్యపంతులుగారిచ్చిన గంభీరమైన తీర్పు ఈ గ్రంథమునకుఁ బీఠికగా ముద్రించిరి శ్రీపాద శాస్త్రులవారు కవులతోపాటు జయంతి వారి ప్రామాణికత్వమునుగూడ అవహేళనముచేసి, "తనవి తప్పులుకావని వెఱ్ఱి కుక్కను గంగిగోవును జేసినట్లు'' ''మహానైవేద్య''మను పేరుతో కొంత చేతగాని సమర్థనలు చేసి ప్రకటించి, దానినే—

క. యేల్త్రాదని సూరన్ననె
యెల్త్రావని నేనునంటి యెంకయ్యయుఁ దా
నెల్త్రాదనె యది తప్పని
తేల్త్రది యయ్యా! 'జయంతి' తెలుపఁగదయ్యా!"

వంటి వైఖరిలో రచించిరి. ఆపై శ్రీపాదవారు విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షమును విమర్శించిరి. వేంకటశాస్త్రిగారిపై దావా వేసినప్పుడు వారు గురువుతో గ్రుద్దులాట కూడదని 'క్షమాపణ' జెప్పుకొనిరి. కాని, ఆ మంత్రము విశ్వనాథవారిపట్ల సాగలేదు కోర్టులో విశ్వనాథకే విజయము లభించెను. వేంకట శాస్త్రిగారు శిష్యుని సమర్థించుచు వ్యాసములు వ్రాసిరి. ఇట్టి మత్సరగ్రస్తమైన వాతావరణమును గాంచి సమకాలీన పండితులే కొందఱు ఏవగించుకొనిరి. ఉదాహరణమునకు: ''పండితుల మని పేరుపెట్టుకొని బండబూతులు తిట్టుకొనుట పాండిత్య లక్షణమా? భాషకు గౌరవమా?.... శిష్టులు చెవిఁబెట్టరాని సజ్జనులు నోట వచింపరాని వాక్యములు విజృంభింపఁజేయుటయే పండిత లక్షణమైనచో అట్టి పాండిత్యమున కొక్క నమస్కార"మని గాండీవ మను పత్రికలో నొకసారి శ్రీ నండూరి బంగారయ్యగారు రచించియుండిరి.

శాస్త్రిగారికిని, తి వేం. కవులకును మధ్య నిట్టి కావ్యవిమర్శలతోపాటు గురుశిష్యసంబంధ కాలపరిమితిపైనను, చదివిన గ్రంథము లెవ్వియను నంశము మీఁదను గూడ వివాదమేర్పడినది. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు వేంకట శాస్త్రులవారి గురువులలో నొకరు. వారివిషయము జాతకచర్యలో నిట్లు వ్రాసియుండిరి:

"అచట శ్రీపాద వంశజుఁ డనఘమూర్తి
కృష్ణమూర్త్యాఖ్యసుకవివరేణ్యునొద్ద
మొదలిడి కుమారసంభవమునను రెండు
సర్గలు పఠించె మూఁడు మాసములలోన"

"అంత మేఘ సందేశ కావ్యమును మొదలు
వెట్టి చదువుచు నుండంగ విఘ్నకార
ణంబుదయమందె, శ్రేయోవలంబనమున
కనుపదం బంతరాయమ్ము లలరుఁ గాదె." -జాత. పూ. 44; 51.

ఇది యిట్లుండ కృష్ణమూర్తి శాస్త్రిగారు వేంకట శాస్త్రిగారు ఎక్కడ గాని చదువని మాఘ కావ్యము తమ యొద్ద చదివినట్లును, సంవత్సర కాలముకన్న నధిక కాలమే వారికడ శుశ్రూష చేసినట్లును వ్రాసిరి. పై జాతక చర్యలోని వృత్తాంత మసత్య మౌనేమో యనుశంకతో తి.వేం. కవు లా విషయమున వారితో వివదించిరి. "శ్రీకృష్ణమూర్తి శాస్త్రులవారి వద్దనే నేను మాఘము చదివినచో వారి పిమ్మట గురువులు కాజలూరు గ్రామములోని మా గురువును చామర్లకోట గురువుగా రొకరును పిల్లంక వల్లెపాలెపు గురువు లిరువురును వెరశి యార్గురు నాకేమియుఁ జెప్పలేదని నేను జాతక చర్య దిద్దుకోవలసిన ప్రసక్తి కలుగునని తాత్పర్య"మని వేంకటశాస్త్రులుగారు పేర్కొనిరి. (జయంతి 43 వ పుట)

మ. "మఱియింకొక్కటి చెప్పెదన్ విను కదున్ మర్యాదగా నేను గు
మ్మరి కామయ్యను గూడ మద్దెలగురున్ మన్నించి, శ్రీపాద స
ద్గురు నామమ్మును గప్పిపుచ్చెదనె! యీ దోసమ్ము నా నెత్తిపై
గురుఁడెట్లో వులుమన్ యతింపెడిఁ గనుండో తండ్రి! యెట్లున్నదో!"
(జయ. 44 పు.)

అన్న పద్యము వేంకటశాస్త్రిగారి యకళంక గురుభక్తికి నిదర్శన మనఁ దగియున్నది.

తి.వేం. కవుల ప్రత్యర్థు లెల్లరు వారి యన్యోన్యమును జెడగొట్టుటకు నేదోపాయములు వన్నినవారే. రామకృష్ణ కవులు 'వేంకటేశ్వరుఁడు లేనిదే తిరుపతికి విలువ యెక్కడిది?' యనియు, కృష్ణమూర్తి శాస్త్రులవారు "తిరుపతి శాస్త్రితో కలిసియున్నపుడే వేంకటశాస్త్రి ప్రభ" యనియు వ్రాకుచ్చిరి. వారి

తారతమ్య పరిశీలనముఁజేయుచు జయంతిలో వేంకటశాస్త్రిగారిట్లు వ్రాసి, వాదుకు దిగరైరి—

మ॥ "గురుఁ డా వెంకటరామకృష్ణులకుఁ దగ్గుంగాని దుష్కల్పనా
సరణిన్ హెచ్చఁడు వారి ధోరణుల నాస్వాదించుచో వేంకటే
శ్వరు సిద్ధించిన యద్దె, నే నిచట నీషత్తేని వాదింప, దు
ష్కర మీకల్పన యొజ్జయాత్మకె యెఱుంగన్వచ్చుఁదత్త్వం బికన్."

(జయం. 27 పు.)

ఎవరెన్ని భేదోపాయముల యత్నించినను తి. వేం. కవుల స్నేహ మవిచ్ఛిన్నమై వర్ధిల్లినది. "అపూర్వకనితా వివేచన" ప్రహసనమందు సూచించిన కువిమర్శన పద్ధతులన్నిటికిని ఈ ప్రత్యర్థుల వాదపద్ధతులే మూలము లని చదువరులు గ్రహింపఁగలరు. ఇద్దఱు ప్రసిద్ధకవులు వివాదమునకు దిగుట దేశదౌర్భాగ్య మైనను, పరస్పర కావ్యవిమర్శవలన శాస్త్ర రహస్యములు కొన్ని సాహితీలోకము నకు తెలియుటయే లోకమునకు గల్గు నొక మహోపకారము.

తి. వేం. కవులు రచించిన వివాదసాహిత్యమంతయు నిదర్శనాత్మక ప్రమాణములతో బలపఱచఁబడియున్నది. పత్రికాప్రకటనలు, లేఖలు. వ్యాస ములు, ఖండనమండన గ్రంథములు మొ॥నవి వీరి రచనలలో నుదాహరింపఁబడిన ప్రమాణ గ్రంథములు. ఆంగ్ల సాహిత్యమున నట్టి ప్రమాణముఁగొని వాని నాధా రముగా సత్యనిరూపణ మొనర్చుచు చరిత్రవ్రాయు సంప్రదాయము కలదు. అట్టి దానిని Documentary Evidence అందురు Documents of English History or English History from Original Sources అను గ్రంథము ఈ శాఖకు ప్రసిద్ధోదాహరణము. తెలుఁగున నిట్టి శాఖను ప్రథమ ముగా నావిష్కరించిన గౌరవము తి. వేం. కవుల కబ్బుచున్నది.

వివాదము మానవునిలోని రజఃప్రవృత్తికి మాఱురూపము. అది కవియందు ప్రజ్వలించినప్పుడు వీరరౌద్రాదిపరుష రసము లతని కవితయందు పొంగులు వారి ప్రకాశించును. తి వేం. కవుల వివాద సాహిత్యమునందు భావోద్వేగము, అమర్షావేశము, ఉత్సాహాతిశయము అను మూడు గుణములు ముప్పిరిగొన్న కవిత్వధార ఉరంగమువలె తరంగలించుచున్నది. ఆవేశమునకు తోడు భావాను

గుణమైన శయ్యాలంకారరీతిసౌభాగ్యము, రచనా చమత్కృతులు వారికవితకు వైవిధ్యము సంతరించుచు, వివిధ ప్రవృత్తులు గల పఠితల నలరించుచున్నవి. వారి మహాకావ్యములవలెనే వివాద కావ్యములును ప్రజాదరణ పొంది, సమకాలీన సాహిత్యరంగమును పాలింపఁగల్గినవి. ఈ కావ్యములందలి కొన్ని రచనా చమత్కృతులను ఇచ్చటఁ బేర్కొందుము.

## 1

శతకములందుఁ బద్యాంతమునఁ గన్పడెడి మకుటప్రాయమగు పద సముదాయము పద్యారంభమున ననుసంధింపఁబడిన పద్యము లొక్కచో నధిక సంఖ్యలో గాననగుట: ఉ॥ గీరతములోని మందలింపు పర్వమున "శాంతింపుండని రాయబారమవురా!" అను ప్రారంభము గల యైదు పద్యములు, లోకాభి రామాయణములో "అంతుల్ మానఁడు తిర్పతి ద్విజుఁడు" అను ప్రారంభముగల యిరువది యొక్క శార్దూలవృత్తములు మొదలగునవి. ఉ॥

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నీరంధ్రా వివేకాన్విత
స్వాంత భ్రాన్త నిరంతరానృత వచః ప్రక్రాంత దుష్కల్పనా
ధ్వాంత క్రాంత కుకావ్య నవ్య రవి దివ్యద్భవ్యతేజోంచితా
హంతాదంతుర వాక్ప్రబాణకల నీహమ్మార్ప కేనాఁటికిన్. (119)

ఓజోగుణప్రధానమైన రచన కిది చక్కని యుదాహరణము.

## 2

శబ్దశాస్త్ర పారగులగు కవులు తచ్ఛాస్త్ర మర్మములతో చమత్కృతులు గల్పించిన నేర్పి పద్యమునఁ గాననగును:

సీ. బావకు శాబ్దిక జీవత్వ మెటులబ్బె?
తన కెట్టు లబ్బె ప్రాథమిక పదవి?
అణుమాత్రముంగాని యవధానమున కెట్టు
లత్యద్భుతపు బిరుదనుమతించు?
తలమీఁది వార లెందఱొ కవీశ్వరు లుండఁ
గోరు నీతండు పెండేరమెట్లు?
పేరేది! యూరేది! పెంపేది! సొంపేది!
ఘంటాశతం బేది? కవన మేది?

తే.గీ. ఏదనీ! వేద యీ కవు! లేద సూర్యు!
దేద ఖద్యోతములు! నీకు నింతమాత్రఁ
దెలియఁ దేనియుఁ జూడుమా, దేశమాత
పత్రిక వదించు నివ్వారి పాటవంబు.

(గిర - మందలింపు పర్వ. 118 ప.)

## 3

తెలుఁగుపద్యమున సంస్కృతమునఁ బ్రసిద్ధమయిన కావ్యమునందలి యొక శ్లోక తాత్పర్యము నొక కొంత యనువదించి మిగిలిన భాగము పఠిత పాండిత్యముపై వదలివేయుట - ఉ॥

మ. ఎఱుఁగంజాలరు బుద్ధిమంతు లనిరో! యిందింది పూజారులం
దఱవంజొత్తురు విజ్ఞులం బలెనె; యౌరౌరా! బాణున్ యశ
స్కరు నేమంచుఁ దనూభవుండు వొగడెన్ గాదంబరీ కావ్యమున్
సరిగాఁ గన్నులు రెండు విప్పి కని చర్చన్‌జేయనుస్పష్టమా."

—గిర. మంద. 216.

ఇందు ప్రసక్తమగుచున్న శ్లోకమిది:

శ్లో॥ అర్యం యపర్చతి గృహే గృహ ఏవలోక॥
పుణ్యైః కృత కృయత ఏవమయాఽత్మలాభ॥
పృష్టాచ యేనచ కథేయ యనన్య శక్యా।
వాగీశ్వరం పితరమేవ తమానతోఽస్మి. (కాదంబరి)

## 4

''అరాతి'' శబ్ద పౌనఃపున్యమువలని చమత్కారము:

ఉ. "రాతి కరాతివైరి, వలరాతిని దేవుఁడె యున్నచోఁ బురా
రాతి కరాతివైరివి, భరంబది మైమయిఁబోవ దమ్మరా
రాతి కరాతివైరివి, పురాతన విజ్ఞులు రోసినట్టి దీ
భూతి మతంబు; దీనఁ బరభూతియు వక్త్రవిభూతియున్ జెడున్."

—గిర. విగ్రగ. 47.

## 5

సభంగ శ్లేష కుదాహరణము:

చ. తిలకము లేనిమోము పితృదేవత లాదటఁజూచి యక్కటా!
తిల+కము మాకు సున్నయని తిట్టి శపింతురటం చెఱుంగరే!
తిల+కము=తిలోదకము. —గిర. విగ్ర. 48.

## 6

శ్లేషయమకములకు—

సీ॥ భోగినీరతుఁ డయ్యె, భోగిసీరతుఁ డయ్యె
భోగినీరతుఁడె యప్పుణ్యమూర్తి!
విభ్రమద్గతియయ్యె, విభ్రమద్గతియయ్యె
విభ్రమద్గతియె యవ్విష్ణుమూర్తి!
అచలానుగతుఁడయ్యె, నచలానుగతుఁడయ్యె
నచలానుగతుఁడె నయ్యచల మూర్తి!
శృఙ్గ సఙ్గతుఁడయ్యె, శృఙ్గ సఙ్గతుఁడయ్యె
శృఙ్గ సఙ్గతుఁడె యాజిష్ణుమూర్తి!

తే.గీ. సానుగతుఁడయ్యె, నతఁడు దాసానుగతుఁడె
వేశపరుఁ డయ్యె, నాతఁ డావేశపరుఁడె;
తీరహితుఁడయ్యె; నాతఁ డాతీరహితుఁడె;
ఏ మెఱుఁగు దీనఁగల భావ మెద్ది జనుడు?
—గిర. విగ్ర. 121.

## 7

ప్రసాదగుణమునకు, ఉపదేశమునకు ఉదాహరణము:

చ. "తెలుఁ గల సంస్కృతమ్మునకుఁ దీయని చుట్టము; సంస్కృతంబో యా
తెలుఁగునఁ గల్పుకున్నయెడఁ దీపి జనింపదు చప్పనౌ; నటుల్
కలియవలెన్ నియోగులును గ్రందుగ వైదికు లట్లుగానిచోఁ
గలిగెడు నష్ట మెవ్వరిదొ గాంచఁగలేదె ప్రపంచ మంటిరా!

## 8

'నేటి నేటి' మార్గము ననుసరించి తమ కవితా నిరంకుశత్వము చాటుట :

సీ॥ "ప్లీడర్లమా? కాము, లియ్యేలమా? కాము,
ధనికులమా? కాము, ధన్యులార!
అర్థులమా? కాము, వ్యర్థులమా కాము,
ప్రభువులమా? కాము ప్రథితులార!
దీనులమా? కాము, మానులమా కాము
మౌనులమా? కాము మాన్యులార!
కృద్ధులమా? కాము, బద్ధులమా? కాము
వృద్ధులమా? కాము వేత్తలార!

గీ. కవుల మిప్పటి 'రూల్సు'కు కట్టుబడము
మునులు 'పండితరాయాది' కవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన
లక్ష్యపెట్టము మాకు వల్లభులు లేరు!

—గుంటూ - ఉత్తర. 63 పుట.

ఇట్టి చమత్కారములు లెక్కకు మెక్కులై యున్నవి గాని, గ్రంథవిస్తర భీతిచే విజ్ఞులకు వదలుచున్నాను.

## అన్యాపదేశ కావ్యములు

తిరుపతి వేంకటకవు లన్యాపదేశ కావ్యరచనా ప్రక్రియయందు చక్కని లఘుకృతులం దొమ్మిదింటిని రచించిరి. గురుశిష్యులతో తమ కేర్పడిన వివాదములు, నానారాజసందర్శన సమయములందును, అవధానములందును ఏర్పడిన వాదులును, స్వీయగ్రామమున దమ కేర్పడిన కొన్ని తగాదాలును ఈ రచనలకు కారణములైన ట్లూహింప వీలగుచున్నది. వారి రచన లివి:

1. బిడాలోపాఖ్యానము.
2 శనిగ్రహము.
3. గ్రామసింహము.
4. వ్యాసనిష్కాసనము.

5. మల్లేశ్వర విజ్ఞప్తి.
6. దైవతంత్రము.
7. రాసభకుమారుఁడు.
8. సంగదోషము.
9. అత్యద్భుత విమర్శనము.

## 1

బిడాలోపాఖ్యానము రామకృష్ణకవుల కృతఘ్నతాభావము నుద్దేశించి వ్రాసిన వైయక్తికాన్యాపదేశ కావ్యము. కావ్యారంభ పద్యమునందే ఆ యర్థము స్పష్టము :

చ. "మును భవభూతి చెప్పె గురుముఖ్యుఁడు మూర్ఖునకున్ మనీషికిన్
తన పరిపాటి తెల్పు, నది తద్జ్ఞుఁడు లోఁగొను మూర్ఖులోఁగొనన్
జనఁడు; మొగంబు నద్దమది జక్కఁగలోఁగొనుఁ, గుండ పెంకు లోఁ
గొన దది దేనిలోప మనుకోఁదగునో జగమే యెఱింగెడిన్."

తిరుమలగుహలో రెండు పులులు వేంకటేశ్వరదయాధిగతోజ్జ్వల పౌరుష భరితలై ఒక పండిత సింహమును గురువుగా వరించి సేవించుచు తద్విక్రమము నభ్యసించెను. ఎదురించిన జంతువులను విదలించుచు, సర్వదిగంతములందుఁగల భూభృదిలామండలము తిరిగి యా జంటపులు లఖండ కీర్తిఁ గడించెను వాని పేరు విని ప్రజ భయపడుచుండును కాని, వానివర్తనము మిత్రజనసులభము; ఆ పులులు ఏ మృగములు వచ్చి తమ్ము వేడినను శౌర్యమర్మములు చెప్పుటకై బద్ధకంకణలై యుండెను. అందువలన కొన్ని పులిపిల్లలు, కొన్ని పిల్లిపిల్లలు కూడవచ్చి సేవించి వానివలన లాభించినవి. ఏకలవ్య శిష్యులును కొందఱు కలరు వానికి. అందు పులిపిల్లలు నేర్చినంతగా పిల్లిపిల్లలు నేర్వలేకపోయినవి. అందుల కన్యజాతి లక్షణములే కారణము:

మ. గురువై శిష్యులఁ జేరఁదీయునెడఁ దక్కుంజెయ్యువెట్లున్నదన్నఁ ద
త్పరబుద్ధిం దిలకింపఁగావలయుఁ జెప్పందగ్గ వాఁడౌనా కా
డొఁ రహస్యంబులు తెల్పియుం గలదా లేదోయంచు; నా వెంకటే
శ్వర శార్దూల మమాయకం బెఱుఁగ దీ చర్యాప్రకారంబులన్.

ఇట్లుండ నొక పిల్లి యాపులి యొద్ద నపౌరుషము నేర్వఁదలఁచి సమీపించెను. ఆ పులియు పిల్లిమేననున్న చారలను, ముందడుగులు మోపుచుఁ గూరుచుండుటయు, మీసముల చందము వర్ణసామ్యము మొ॥ లక్షణములనుజూచి యది తన శాఖలోని దని భ్రమించి ప్రేమించెను. అదియు వన్యమృగములు పులిఁకి గానుకగా నిచ్చు మాంసమెల్ల మెక్కి బాగుగా బలిసెను. కాని, పులిరాజు పౌరుషము, కంఠ గాంభీర్య మెన్నినాళ్ళు సేవ యొనర్చినను రాలేదు. ఒకనాఁడు శార్దూలము మార్జాలమును పిలిచి "నీ వోపినంత నేర్చితివి. నాశక్తి సంపద నీకు రాకున్నను చేష్టలు వచ్చినవి కావున నీ చదువు చాలించి, నీయిచ్చ వచ్చిన వనమునకేఁగి పులుల నెదిరింపక సంచరింపు" మని పంపివైచెను. ఆ పిల్లి యట్లే చేసెను. అపై నొక బాపురుపిల్లి దానిఁ తోడయ్యెను. ఆ రెండును కలిసి, యొక వనమున సంచరించుచుండ నయ్యారణ్యక మహామాత్యుఁడు గాంచి, యబ్బురపడి, రాజునకుఁ జెప్పి వానిని గౌరవముతోఁ గోటకు పిల్పించి యుంచెను. రాజు వానిని మన్నించెను. వానికి కన్నులు మీదికెక్కెను. పెద్దపులులకన్న మిన్నల మను భావ మేర్పడెను. అంతట నవి పులులకు గురువులమని చెప్పనారంభించినవి. దానిని విని తిరుపతి పులి ''గర్వంబాగుం''దని యామడ వినఁబడు సింహనాద మొనర్చెను. పిల్లుల గుండె లవిసెను. రాజునకు వాని బండారము తెలిసెను. ఆశ్రితుల విడచుట పాపహేతువని యెంచి వానిని బులులబారి పడకుండఁ గోటలో రక్షించెను. పులులను పిలువనంప నిచ్చపొడమియు, వానినిఁ బిలిపింపలేదు. ఆ రాజు ఆ పిల్లులను జూచి పులులని సంతసమందలేకను, పులులను రావించి వాదమేర్పరుపలేకను-నెదఁదలోఁ గుందుచు, పిల్లులచే నా పులులకు శరణువేడింప యత్నించెను.

లోకమున పిల్లి పులులకు గురువగు ప్రవాదము సత్యదూరమని వ్యాసుఁడీ కథను ధర్మరాజునకుఁ దెల్పెనఁట! ఇందు పులులు తి. వేం. కవులు; పిల్లులు రామకృష్ణ కవులు; రాజు పీఠికాపురాధిపతి; గురుసింహము చెర్ల బ్రహ్మయ్య శాస్త్రిలు; ప్రతాపము అవధానశక్తి, ఇట్లన్వయించుచో నీగాథ నా యిరువురి జంట కవుల మధ్య నడిచిన వివాదమని తేల్చుకొనుట చాల సులభము. ఇందలి చమత్కారము లివి: 1) ఆయా పాత్రల గుణముల కనుగుణములైన జంతువుల నెన్నుకొని అన్యాపదేశముగా సత్య గాథను నడిపించుట, 2) అచ్చటచ్చట సత్యము దేటతెల్లమగునట్లు "వేంకటేశ్వర శార్దూలము" మొ॥ మాటలు వాడుట, 3) కవులు స్వీయ ప్రతాపాది గుణముల నధికముగా వర్ణించుకొనక ప్రత్యర్థి

దుర్గుణముల నతిశయించి వర్ణించి తద్ద్వారమున తమ సాధు భావమును వ్యక్తీక రించుట, 4) ఉపాఖ్యాన శబ్దముచే తమ జీవిత బృహత్కథలో నిది యొక చిన్ని కథ యనెడి భావమును దాటుట, 5) కథ చిన్నదైనను అందు సముచితమైన సంభాషణవైచిత్రి, వర్ణనలు, మనోభావ చిత్రణము అను నంశములను విస్తరించి యుండుట, 6) సమయానుకూలముగా నీతిబోధకములగు సూక్తులను నిబంధించుట.

ఉదా: తే॥గీ॥ మార్దవము నాగరకతయు మాటనేర్పు
లేనివారింట నధికార మూనుకంటె
మార్దవము నాగరకతయు మాట నేరు
పున్న వారింట దాసుఁడై యుంట మేలు."

7) ఉపాఖ్యానము వేదవ్యాస ప్రోక్తమని తెల్పి దానికి పురాణ గౌరవము కల్పించుట, 8) ఫలశ్రుతిఁ దెల్పి పుణ్యగాథ యని సూచించుట, 9) పైఁ జెప్పఁబడిన అన్యాపదేశ గుణ విశృతిచే హాస్యచమత్కృతి పఠితకు స్ఫురింపఁజేయుట.

## 2

గద్వాల జమీందారగు శ్రీరామ భూపాలుని యాస్థానమున నొక వైష్ణవ పండితుడు తి. వేం. కవుల పై నసత్యములు రాజునకు నూఁదిపోసి రాజసన్మానమున కడ్డు వచ్చెను. అతనిఁ గూర్చి తమ జాతకచర్యలో నిట్లని వ్రాసియుండిరి:

తే॥గీ॥ 'శనియనెడి నామ మితనికి సంతరించి
యెంమిఁ జెప్పిన పద్యము లితని గుణగ
ణమ్ముల వచించుఁగాన వైష్ణవుని నితని
విస్తరింపక యింతతో విడుచుటొప్పు." జాత. పూర్వ. 450.

'శనిగ్రహము' - వైయక్తికాన్యాపదేశ కావ్యము - జనించుటకు హేతువు స్పష్టమైనది. ఇది మత్తేభ శార్దూల విక్రీడితములందు రచింపఁబడినది. శనిగ్రహ మను పేరుంచుటచే గ్రహ సంచార విషయ శాస్త్రమగు జ్యోతిషమునందలి కొన్ని విశేషములను కొన్ని పద్యములం దన్వయించునట్లు వ్రాయుటయు నక్షత్రసంఖ్య యగు నిరువది యేడు పద్యములలో నీ కావ్యము ముగించుటయు పద్యము లన్నియు "శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముం జూడుమా!" అను మకుటము కల్గియుండుటయు విశేషము. ఇందలి యొక్కొక్క పద్యమునం దొక్కొక్క దుర్గుణము వర్ణిత మగుటయు గమనింపఁదగినది. పద్య సంఖ్య విషయము -

1) అధికార దుర్వినియోగము 2) పండిత పుత్రత్వము 3) అనువంశిక సదాచారము లోపించుట 4) మహా విషయములందు లఘు దృష్టి ప్రసరించుట, మాత్సర్యము 5) కొండెములు చెప్పుట 6) వంచన, కృతఘ్నత 7) నమ్మిన వారిని మోసగించుట 8) అవివేకాశ్రిత పక్షపాతము 9) అయోగ్యుని కధికార లాభము 10) అసమర్థుని అసూయ 11) కల్మష హృదయము 12) సుకవి వైరము 13) ఈర్ష్య 14) కొండెములు చెప్పుట 15) కుకవి 16) అల్పత్వము 17) ఎఱిఁగిన విషయమును పక్కఁబెట్టుట 18) బిడుసుదనము 19) దుర్వృత్తి ననుసరించుట 20) సభ విఘ్న మొనర్చుట 21) లజ్జారాహిత్యము 22) మాత్సర్యము 23) ఈర్ష్యను పిడుమని మందలింపు 24) స్నేహబాహ్యుఁ డని నిందించుట 25) అయోగ్యతానిరూపణము 26) అల్పుని కధికార మధిక కాం ముండదనుట 27) కవులచేత తిట్టుకవిత చెప్పించిన పాడుబుద్ధి యని యతని గర్హించుట

జ్యోతిశ్శాస్త్రమును పద్య తాత్పర్యమున నన్వయింపఁబడుట కుదాహరణము—

మ. "సరసాలంకృతి చారు చిత్ర కవితాసారమ్ము మా సొమ్ము సు
మ్మరవిందాననురాణి మా జనని యౌ నాలాటి మాటోఁట్ల కం
దటికిన్ విఘ్నము సేయఁ జాలు శని యెన్న న్నీకు నింకొక్క వ
త్సరమే సుమ్ము శనిగ్రహంబ! యిఁక మా సామర్థ్యముం జూడుమా!"

"నీవు రెండు సంవత్సరముల ఆఱు మాసము లొక్కొక్క రాశి యందుఁడు వాఁడవు కావున నందు నొక వత్సరమును ఆఱుమాసములును నిదివఱకే యుక్తమగుటచే నింక నొక వత్సరమే నీవీ ధర్మాధికారము (ధనుర్లగ్నాధికారము) నందుందువు. ఆపైని నీ స్వగృహములలో నొకటియగు మకరమునకుం బోదువు. గోచారరీతిచే ధనుర్లగ్నమున జన్మించిన వారికి నీ బాధ యింకఁ ముందంత విశేషించి యుండదని రహస్యము."

తిట్టుకవిత కుచితమైన విధముగా నిందు చండాల! అవాచ్య! దుష్టా! నీచ! కులభ్రష్ట! నిర్భాగ్యుఁడా! కంకోష్ఠ! దురాత్మ! శవపర్యాయ! కుంకా! మొ॥ సంబుద్ధులు వాడుట కాననగును.

## 3

శాంత స్వభావుఁడును పరమపవిత్రుఁడుననగు నొక ఋషి యొక్క దయకుఁ బాత్రయై యొక కుక్క యుపవాసాది వ్రతముల నాతనితోఁ గలిసి యొనర్చుచుండెను. అతఁ డెచ్చటికి వెళ్ళినను తనవెంట నాశునకమును గొనిపోవు చుండెను. దానిని బాధింపఁజూచు సింహముల కెదురుగా దానికి సింహాకృతిఁ బ్రసాదించి నిలిపి, తన యోగ మహిమతో నోడించుచు నొనర్చుచుండెను. ఒకనాఁడు శరభ మృగ మెదురాయెను. శునకమును శరభముగా మార్చి ప్రయోగించి దాని నోడింపఁజేసెను. ఆపై నాకుక్క జాతి సహజమగు నల్పబుద్ధి బయలుపడ నాఋషిని జంపుటకును, తన శరభాకృతి శాశ్వతముగా నుంచు కొనుటకును యత్నించెను దాని యింగిత మెఱింగి యా ఋషి దానిని పూర్వాకృతి తిరిగి కల్పించెను. ఆపై నాకుక్క శత్రుభీతిచే నొక దాలిగుంటఁ గదలక మెదలక యుండెను.

మ.కో. "కట్టి కుక్కను గంగిగోవుగా నొనర్చు మనుష్యులన్
వెఱ్ఱులందుఁ దలంత్రు కొందఱు పిఱికిఁడుల్; మహనీయులే
వెఱ్ఱులైన జగమ్మునందు వివేకి యెవ్వఁడు? నీచులన్
బిట్టి పీఁగఁగఁజేసి వెంటనె నిక్కడంతురు నేర్పరుల్"

అను తాత్పర్యమును బోధించునది "గ్రామసింహము." గురువువలన ప్రసిద్ధుఁడై గురువు కెగ్గు తలపెట్టు శిష్యుని నుద్దేశించియే యీ గాథను కవులు వైయక్తికాన్యాపదేశ కావ్యముగా రచించిరి. గీరతము చదివిన వారికి విషయము సులభముగా నవగతము కాకమానదు.

ఈ కథా రచనము సరసమగు తెలుఁగు పదములతో దీర్ఘసమాసములు లేక మధురముగా నడచినది. నాత్యలంకారమగు నీకథ రసవంతము.

## 4

కృతజ్ఞతా గుణౌచిత్య ప్రతిపాదన ప్రధానమైనది 'వ్యాస నిష్కాసనము' భిక్ష దొరకని కారణముచేఁ గాశికను శపింపఁ బూనిన వ్యాసభట్టారకునిఁ గాంచి శివుఁడు కాశిని విడిచి పొమ్మనుట యిందలి కథాఘట్టము. శివుఁడు కోపగించుటకు మూలహేతువుని ట్లాతఁడే తెల్పినాఁడు:

మ. "పలుచోట్ల న్నను సన్నుతించి తుదకున్ ద్రాల్మాలి నానాట 'గా
రెలుచేదయ్యె' నటన్న పక్కిక నొనర్తే నన్నె నిందించు నీ
తలఁ పీ కాశిక మెచ్చునే గురులముత్వంబుల్ గనన్ జాల వీ
యిల నీవుం గవివే వివేకివె ఁవేయీవొదు నిక్కమ్ముగన్"

అని నిర్దయుఁడై శివుఁడు పల్కి, వ్యాసుఁడు రచించిన భారతము దెరిపించి, అందు కృతఘ్నోపాఖ్యానము చదివించి యతని తప్పు విప్పి చెప్పి, క్షణకాలమునఁ గాశిని విడిపో నాజ్ఞాపించెను. అతఁడు గోదావరీ తీరమున సుఖ నివాసముండి, కోటిలింగములేనియు కాశీ శివలింగమునకు దీటుకావని కళవళించుచు నివసించును. భారత రచనకు సంబంధించినది కావున నిది శ్రీపాదవారిపైఁ గల్పించి వ్రాసినదేమోయన్న అనుమానము స్ఫురించును. ఎవరిపైనైనను ఇది వైయక్తికాన్యాపదేశ కావ్యమనుట నిస్సంశయము.

రచన దుడుసు పోకడలతో, అమర్షావేశమును రూపుకట్టునట్లు నురుగులు గ్రక్కు వర్షాకాల స్రోతస్వినివలె నీ కావ్యము గోచరించుచున్నది.

## 5

తి. వేం. కవుల అన్యాపదేశ రచనం నన్నింటి యందును ప్రముఖమై మాటుగానున్న రచనము "మల్లేశ్వర విజ్ఞప్తి" వేంకటశాస్త్రిగారు బందరునుండి స్వగ్రామమునకు వెళ్ళియున్న సమయమున నాయూరిలోఁ బొడమిన యల్లరుల కారణముగా బుట్టినట్టిదీ కావ్యమని భావింపనగుచున్నది. తత్కారకులు సమకాలీన గ్రామనివాసులే. ఒక పూజారి, ఐదుగురు కుంకలు, (అందులో నొకఁడు గ్రంథ కర్త శిష్యుఁడు), గ్రామ పాచకుఁడు ఒక బ్రాహ్మణ వ్యభిచారిణి, ఒక బ్రహ్మ సమాజ మతస్థుఁడు ఇందలి పాత్రలు. గ్రంథకర్తకును కుంకలతో కలిసిన లౌకికుఁడగు పూజారికిని పంట కాలువ గూర్చి తగాదా యేర్పడగా, చివరకు కవి యాభూమిని కోల్పోవలసి వచ్చినది. గ్రామపాచకుఁ డొకఁడు కుంకలతో స్నేహము చేసి యా యేబ్రాసిని మరిగెను. అపై నావ్యభిచారిణి విషయమై నీతి గఱపిన కవిపై వారెల్లరు కారములు మిరియములు నూరిరి. బ్రహ్మసమాజ మతస్థుని యింటికి తప్పనిసరియైన కారణముచే వెళ్ళిన కవిగారు పదూవరుల నాశీర్వదించుచు చదివిన పద్యతాత్పర్యముచే నాకుంకలు, పాచకుఁడు మొ॥వారు క్రుద్ధులై కవిగారి నాపైఁ జాల్రతిప్పలు పెట్టిరి. వానిని కవి మల్లేశ్వరస్వామికి

విన్నవించుకొనినాఁడు. వారికిఁ దగిన శిక్ష లివ్వియని పేర్కొని, విధింపవలసినదని వేడుకొనినాఁడు. కవి వచోమాహాత్మ్యమువలన వారి కట్టి కడగండ్లు కల్గినవి. దైవము కవిని దయతోఁ గాపాడినాఁడు ఇది యీ కావ్యమందలి స్థూలమైన కథ.

కుంకలు మొదలైన వారొనర్చిన దుష్కృత్యములను వింగడించి చెప్పుచు చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రిగారు పీఠికలో నిట్లు పేర్కొనిరి: "1) దైవానికి అపవిత్రాన్నం నైవేద్యం చేయుట. 2) దేవాలయంలో సంధ్యాదీపం పెట్టకుండుట. 3) దేవుని ఆస్తి రాకట్ల పాల్జేసి సంచరించుట. 4) మంచివారిమీదికి రౌడీ మూకను ఉసికొల్పుట. 5) గ్రంథకర్తపై అబద్ధపు కేసుపెట్టుట. 6) గ్రంథకర్త ఆధ్వర్యవంలో నడిచే పాఠశాలలో అసహ్యపుపనులు చేస్తో ఉపాధ్యాయుణ్ణి నానాకూతలు కూసి, బడి సాగకుండా ఆటంకాలు కల్పించుట 7) గురులైన గ్రంథకర్తను అర్థమైన తిట్లు తిట్టుచుండుట 8) గ్రంథకర్త యింటిని కూల్చే నిమిత్తం ఎన్నో ప్రయత్నాలు చేయుట. 9) గ్రంథకర్త తాలూకు యింటిలోని సామాగ్రిని పగటి దొంగలై దొంగిలించుట. 10) గ్రంథకర్త వద్ద విద్యాభ్యాసము చేసే శిష్యుల్ని తిట్టుటయున్ను, కొట్టుటయున్ను. 11) గ్రంథకర్త నివాసగృహంలోనికి పందుల్ని తోలుట. 12) గ్రంథకర్త తాలూకు మూడుపశువుల్ని బలవంతంగా కొట్టి బాధించుట 13) గ్రంథకర్తను ''వెట్టివెంకయ్య''అనుట. 14) ''తరవాణీ'' అంటూ గురువైన గ్రంథకర్తను హేళన చేయుట 15) ఆశ్రమములోని ఒక వడ్రంగి భార్యతో సంపర్కం కల్పించుకొని వడ్రంగి సోదరులకు అక్రమ విరోధం సృష్టించి చివరికి భార్యాభర్తలకు సంబంధము లేకుండా చేయుట. 16) శ్రీరామచంద్రునికి ఆలయ నిర్మాణం చేసి, అందు హరిజన ప్రవేశం సంస్కారంచేసి, అంతతో తృప్తిపడక ఆ ఆలయాన్ని చివరికి పశువులశాలగా మార్చుట. 17) బిచ్చమెత్తుకొను ముష్టిదానిపై మీసం త్రిప్పి దావగొట్టి, శౌర్య ప్రదర్శనానంతరం దాని శావనార్థాలను తినుట- ఇట్లాటివేవో ఉన్నాయి. ఎంత వ్రాసినా విషయమింతే!"

సున్నితమైన కవితా హృదయము పాశవిక తమఃప్రవృత్తుల విజృంభణమున కెదురొడ్డి నిలిచి, దైవ సహాయ్యముతో దాని నధిగమించిన వృత్తమిందు కాననగును. తి.వేం కవుల కవితకు దైవసాక్షాత్కారము కల్పింపఁగల మహత్తర శక్తి యుపాసనాబలమున నేర్పడినదనుట కింతకన్న తార్కాణము అవసరము

లేదు. వీరి కైహికాముష్మిక సుఖప్రదాయిని స్వీయకవితా గంగాస్రవంతి. ఇది సాంఘికాధిక్షేపము, వైయక్తికాధిక్షేపము మిశ్రమముగా వెలసిన యపూర్వసృష్టి.

## 6

కావ్యములందు శృంగార రస ప్రయోగమును గూర్చి నవ్యులూహించెడి నిర్మాణ పద్ధతులను విమర్శించుచు వ్రాసిన సిద్ధాంతాధిక్షేప కావ్యము."అత్యద్భుత విమర్శనము" శృంగార రసము అనెడి విమర్శన వ్యాసమునందు కవులు ప్రవచించిన యభిప్రాయములనే యీ కావ్యమునందు పొందుపఱచియుండిరి. "పూర్వు లనాగరికులనియు, వారయుక్తముగా శృంగారమును వర్ణించిరనియు, నప్పుడు తగిన పరిశీలకులు లేమింజేసి యవి యట్టే నిలిచిపోయినవనియు; నేఁడంతకన్న మిన్నలగు పరిశీలకు లుద్భవించిరి గావున వారు వానిని సంస్కరించి కొన్నిఁటికి మూలచ్ఛేదమును విధించి, కొన్నిటికి నంగమాత్రచ్ఛేదన మును విధించి ప్రపంచమునకు మహోపకార మొనరింపఁ బూనిరనియు" (శృంగారర.) నవ్యుల మతము. "అపారే కావ్యసంసారే ....... శృంగారీ చేత్కవిః ...... స్వమేవతత్" - అని ప్రాచీన లాక్షణిక మతము. ప్రాచీనులు యువకులగు విద్యార్థుల మనఃప్రవృత్తి నాకర్షించి సాహిత్య క్షేత్రమున విహరింపఁ జేయుట కొఱకై ప్రథమమున పంచకావ్యములు, అపై కేవల శృంగార రసాత్మ కములగు బాణప్రహసనాదులు పఠింపఁజేసి అపై నితర రసములను బోధించి జ్ఞానవంతులుగా నొనరింపఁజేసిరి. దేవాలయ ముఖద్వారమున కామకలాత్మకమైన శిల్పమును వెలార్చి ప్రజల నాకర్షించి లోనునున్న దైవముపై మనస్సు నిల్పు నట్లొనర్చు ప్రాచీన వాస్తు శిల్పజ్ఞుల మర్మమును ఇదియే.

మ. అతిశృంగార రసాన్వితమ్ములగు కావ్యమ్ము ల్పదానేర్చు సం
స్కృత విద్యార్థులు పాడు గావు టొకఁడున్ జెప్పండు కానిప్డు సూ
నృత దూరు ల్పఠియింప నేమియగు వీ రే కావ్యముల్చూచి రే
మతిమంతున్ గుఱఁగొల్పిరక్కట! కటా! పండర్వ మిట్లుండునే?

క. శృంగార కావ్యపఠన ము
సంగున్ జ్ఞానమును నొందు చప్పని కావ్యం
బుం గనువారల కెందు నె
సంగవుపో ప్రబలమైన సాహిత్యంబుల్.

క. చదువుకొను వయసు బాల్యము
కుదురదు వేదాంత మపుడు గురుడు నుడివినన్
గుదురును శృంగారమ్మున
విదితం బది పూర్వులగు వివేకుల కెల్లన్.

తే.గీ. పొట్టు త్యజియించి తండులమ్ములు గ్రహించు
పోలికకు గబ్బములయందుఁ బొల్చు నీతి
పూర్వులు గ్రహించి రీనాఁటి బుద్ధిమంతు
లెఱుఁగ రీకర్మ మిర్వారు గురులె మనకు? (అత్యద్భుత విమర్శనము)

కాశీ పండితుని పంచాంగ శ్రవణ రూపమున నీ నవ్యశృంగార సిద్ధాంత మును కవు లధిక్షేపించిరి. దీనితోపాటు ప్రసక్తానుప్రసక్తముగా నాటి సాంఘిక దురాచారములు, పాశ్చాత్య వ్యామోహము, దేశసేవ యను పేరఁ గొందఱు చేయు దురంతములు, ప్రాచీనాదార వైముఖ్యము మొ॥ అంశములపై తమ విసురులు విసిరియుండిరి. వైయక్తికాధిక్షేపముకన్న అన్యాపదేశముగా నీ సిద్ధాంతాధిక్షేపము చేయుట చక్కని సున్నితమైన ప్రక్రియ. ఎవరి హృదయము బాధామూర్ఛితము కాదు.

దైవతంత్రము, రాసభకుమారుఁడు, సంగదోషము, పిష్టపేషణమ్ (సం), శలభాలభనమ్ (సం) అనునవి కూడ వైయక్తికాన్యాపదేశ కావ్యములే. ప్రతిపక్షులపైఁగల యాక్రోశమును కవులీ విధముగాఁ దీర్చికొని సంతృప్తిపడిరి. కవి తిట్టినను, దీవించినను కవితలోనే కదా!

ఈ యధిక్షేప సాహిత్య ఘట్టము తి.వేం. కవుల జీవిత భారతేతి వృత్తమున యుద్ధపంచకము వంటిది. మేటి వీరులగు ప్రత్యర్థులను అనేక యుద్ధ తంత్రములతో నెదుర్కొని అన్యాపదేశముగా నధిక్షేప సందేశముల నంపి, మీసములు దువ్వి, భీకర ప్రతిజ్ఞలు చేసి, వాఙ్మయ శస్త్రాస్త్ర వర్షములు కురిపించి, వ్యూహములు భేదించి, అరిమద మణగించి, కామేశ్వరీ వరదత్త కావ్యమహిమాతిశయులై, కింకవీంద్ర ఘటా పంచాననులై, సాటివారిలో మేటి కవివీరులై తిరుపతి వేంకటకవులు భాసించిరి. అధిక్షేప సాహిత్యమునకు కవు లొనర్చిన కావ్యోపహారములు కొన్ని తరములవఱకు వన్నెఁదఱుగని రత్నహారములు.

—: o :—

# వచన రచనలు

తిరుపతి వేంకట కవులు కవిత్వములోఁ దిక్కనవలె ఉభయకవి మిత్రులగుటయే కాక - వచన రచనమున ఉభయభాషావాద మిత్రులైరి. సంస్కృతాంధ్రములం దెట్లనర్గళముగా కలము నడిపిరో గ్రాంథిక వ్యావహారిక వచన రచనములందు నట్లే నిరాఘాటముగా రచన సాగించిరి. అనువాద వచన సాహిత్యమంతయు గ్రాంథికమునందును, తదితర సాహిత్యమం దధికముగా వ్యావహారికమునందును కవులు రచించినట్లు స్థూలముగాఁ బేర్కొనవచ్చును. గిడుగువారి పిడుగువంటి వ్యావహారిక వాదము జయంతి, వేదములవంటి ధీర గ్రాంథిక వాదుల నేమి చేయఁజాలకపోయినదిగాని తిరుపతి వేంకటకవులవంటి సరస కవివరుల గుండెలను కొంత కొంత ఆర్ద్రిపఱచినది. తి. వేం. కవులు మధ్యేమార్గమున నడచినవారు. గచ్ఛత్ సాహిత్యమంతయు వ్యావహారికమునందును, పఠన పాఠన సాహిత్యమంతయు గ్రాంథిక భాషయందును ఉండుట యుచితమనియు, పాఠశాలలో గ్రాంథికభాషయే యుండవలెననియు కవుల మతము. వ్యావహారిక భాషోద్ధరణ బద్ధకంకణులైన గిడుగువారి యడుగుజాడలలో నైతము గ్రాంథికభాషా ముద్రలను గుర్తించినవారు తి. వేం. కవులు. వారి సమన్వయ దృష్టి కది యొక చక్కని యుదాహరణము. పట్టినదెల్ల బంగారము చేయఁగల కవు లేభాషయం దైనను రచన చేసి పఠిత చవులూరింపఁగలరు. "కిమివహి మదురాణాం మండనం నాకృతీనామ్!"

'గద్యతిక్కన' యగు కందుకూరి వీరేశలింగము పంతులుగారు గ్రాంథిక వ్యావహారికములలో రచనల నొనర్చి తనకన్న పూర్వ మున్న గ్రాంథిక శైలిలో నెన్నఁదగిన మార్పులు తీసికొని వచ్చినారు. తెలుఁగున గ్రాంథిక రచనమునకు సారళ్యము నేర్పిన మనీషి యాతఁడే. గిడుగువారు వ్యావహారికభాషా సౌలభ్యమును గద్యమున కలంకరించి పోషించినారు. ఈ రెండును ప్రవాహ మాదుర్యగుణ మంజులమైన తి. వేం. కవుల వచన రచనా ధారలో విలీనమైపోయినవి. వీరి వచన సాహిత్యము దాదాపు మూఁడువేల పుటలు ముద్రితమై యున్నది. వానిలో ననువాదములు వదలినచో మిగిలిన వీక్రింది విధముగా నున్నవి. 1) కాశీయాత్ర,

2) సారస్వత విమర్శలు, 3) భారత వీరులు, 4) విక్రమ చెళ్ళపిళ్ళ, 5) షష్టిపూర్తి, 6) దివాకరాస్తమయము 7) కవిత్వమంటే ఏమిటి? 8) తవిటి రొట్టె 9) కథలు - గాథలు (3 సంపుటములు) మొ॥నవి. వీనిలో దాదాపు రెండు వేల పుటలకు పైగా కథలు - గాథలు అనునవి మూఁడు సంపుటములలో వెలువరింపఁబడినవి. ఇవి ఆయా కాలములలో నాయా పత్రికలలోఁ బ్రచురింపఁబడిన వ్యాసాదులు. పైవానిని విమర్శించి చూచుచో వీరి స్వతంత్ర గద్య సాహిత్య మీ క్రింది ప్రధాన శాఖల క్రింద వింగడింపవచ్చును: 1) సాహిత్య చర్చలకు సంబంధించినవి. 2) స్వీయ చరిత్రకు సంబంధించినవి. 3) ప్రసిద్ధుల చరిత్రలకు సంబంధించినవి. 4) సాంఘిక విమర్శకు సంబంధించినవి 5) వివిధ విషయములకు సంబంధించినవి. ఈ శాఖల నిర్వహణ పెద్దాని కది విశిష్ట మార్గమున నడచియుండినను అన్నింటను స్వీయానుభవ కథన మను నది సమముగా కొంత స్థాన మాక్రమించియే యుండును. ఆత్మీయతా గుణము కవుల పద్య వాఙ్మయమునందువలెనే వచన వాఙ్మయమునందును పెనవేసికొనిపోయి యొక నవ్యతా గుణము నాపాదించుచున్నది.

పై శాఖలయొక్క విశిష్ట లక్షణములను సమీక్షించుటకు పూనుకొనినప్పుడు వానిని రచించిన కవులపై ప్రభావము వేసిన ప్రాచీన చరిత్రను సమీక్షింపవలసియుండును. కందుకూరివారు తెలుఁగులో "వ్యాసము" నావిష్కరించి మూఁడు పూవులాఱుకాయలు కాయించినారు; సాహిత్య మత నైతిక సాంఘిక విమర్శాత్మకములైన వ్యాసములకు నిర్దిష్టమైన పునాదులు వేసినారు; పాశ్చాత్య వ్యాస రచనా సూత్రములను జీర్ణించుకొని తెలుఁగున నూతనముగా నావిష్కరించిన రచనా ప్రక్రియ లవి. శ్రీ పానుగంటివారి 'యుపన్యాస' ప్రక్రియ దేశము నుఱ్ఱూత లూగించినది. 'స్పెక్టేటర్' ప్రభావము ముద్రించుకొనినవి వారి "సాక్షి" యుపన్యాసములు. నిశితమైన అధిక్షేపమును హాస్యమున మేళవించి, విరుద్ధ సిద్ధాంతములను అవహేళనమునకు పాల్జేసి, వేగవంతమైన శైలిలో శబ్దాడంబరములు పొదిగి రచింపఁబడినవి పానుగంటివారి యుపన్యాస వ్యాసములు. గిడుగువారు గ్రాంథిక భాషా వాదము నెదుర్కొని రచించిన శాస్త్ర బద్ధములగు భాషా విషయక చర్చాసదస్సు లనఁదగు వ్యాసములు దేశము నాకర్షించినవి. తి.వేం. కవులకివి యన్నియు బాహ్యమైన పూర్వరంగములైనవి. ఇఁక స్వీయములగు కొన్ని సంస్కారములు కూడ ఈ రచనలకు రూపరేఖలు దిద్దినవి. వాని నీ విధముగా నూహింపవచ్చును:

1) వేంకటశాస్త్రిగారు చిన్నవయస్సులోఁ బురాణ ప్రవచనములతో సంబంధ ముండినవారు. చింతపల్లె గ్రామములోఁ బురాణ శ్రవణమున పద్య పఠనముతోఁబాటు పురాణ కావ్యార్థములను సర్వజనరంజకముగా ప్రతిభా వ్యుత్పత్తు లుట్టిపడ నుపన్యసించు విధమును జీర్ణించుకొనిరి. 2) బ్రహ్మశ్రీ చెర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి యొద్ద శబ్దశాస్త్ర పఠనావసరమందును, తదితర గురుసమ్ముఖములందు గాంచిన సాహిత్య పాఠ ప్రవచనములందును నేర్చికొనిన పఠన పాఠన కళలును వీరియం దొక విశిష్ట సమన్వయ స్వరూప మందినవి. 3) కాశీవందిరులతోడి చర్చలు, అవధానములందు వాది ప్రతివాదులతో చర్చలు. శబ్దశాస్త్ర చర్చలలో ప్రమాణముల కొఱకు భారతాది గ్రంథములను పరిశీలించిన నిశిత విమర్శనా దృష్టి. ప్రతిపాదన ప్రతిఖండన దాకచక్యమును, నానావిధ రాజకవి పండిత సామాజికులతోడి సలిపిన ప్రసంగములందలి కౌశల్యము, గంటల తరబడి ప్రవాహతుల్యముగా మాటలాడి ప్రజలను ముగ్ధుల నొనర్చు ఉపన్యాస ధోరణి వీరి గద్య రచనల కనుకూల మార్గములను సిద్ధము చేసినవి. వీరి వచన రచనలలో నీ ప్రక్రియలన్నియు సంశ్లిష్టముగాఁ బెనవేసికొని యుండును. వానిని విడమరచి పరిశీలించుచో సహృదయునికి కవుల సాహిత్య విశ్వ స్వరూపము అవగతము కాకపోదు.

దాదాపు వీరి స్వతంత్ర వచన సాహిత్యమంతయు వేంకటశాస్త్రిగారిచేతనే సృష్టింపఁబడి యున్నది. అయినను కవుల ప్రతిజ్ఞ ననుసరించి యిరువురి పేర వ్యవహృత మగుచున్నది ఇందు వారు స్పృశించిన యంశము లనంతములు. విపుల దేశాటనము, బహుశాస్త్రావలోకనము, లోకజ్ఞత, ప్రాచీన నవీన పద్ధతుల పైఁగల సమన్వయ దృక్పథము; వీరిచే నింత విపుల సాహిత్య నిర్మాణ మొన రింపఁజేసినవి. ఏద్దినము వారు సాహిత్యవ్యాసంగము చేయరో ఆద్దినము తద్దినము వలె నుండెడిదని వారు పేర్కొనియుండుట గమనించియున్నాము. ఇట్టి వ్యాసం గము 'వార్ధకము'లో మఱియు నధికమైనది. దుష్కీర్తి ప్రచారకులగు పండితు లతో చేసిన వాదప్రతి వాదములు, ఊరకయుండలేక రచించిన వ్రాతలు, కొన్ని ప్రత్యేక సందర్భములను, కొందరు వ్యక్తులనుగూర్చి వ్రాసిన వ్యాసములు బహు శమై యుండుటచే తఱచు పునరుక్తి, శాఖాచంక్రమణము, పూర్వస్మృతులను నెమరువేసికొను లక్షణము మొ॥ నవి గోచరించి ఎడనెడ విసుగు పుట్టించినను

మొత్తమునకు పెక్కుశాస్త్ర రహస్యములు, స్వీయకవితా లక్షణములు, తెలుఁగు వారి సాంస్కృతిక జీవితములోని లోతుపాతులు, సమకాలీన సంఘచరిత్ర మొ॥ విషయము లెన్నియో తెలిసికొనఁగలము. ఒక విధముగా "కథలు - గాథలు" అనెడి సంకలన గ్రంథములు పందొమ్మిదవ శతాబ్దపు చరమ పాదమునుండి యిరువదవ శతాబ్దపు పూర్వార్థమువఱకు గల తెలుఁగుదేశపు సారస్వత చరిత్ర మని చెప్పుటలో విప్రతిపత్తిలేదు.

పైఁబేర్కొనిన ప్రధానశాఖలలో నొక్కొక్కదానినిగూర్చి విశదముగా నాలోచించుచో మఱికొన్ని యంతశ్శాఖలేర్పడఁగలవు. వాని యందలి ప్రతిపాద్య విషయములన్నిఁటిని విమర్శింపఁబూనుచో మఱల నంత గ్రంథము కావలసినదే. కావున అందలి తి.వేం. కవు లనుసరించిన విమర్శన ప్రక్రియా విభాగ విధానమును గూర్చిన యంశములపై స్థాలీపులాక న్యాయముగా నించుక ప్రస్తావించెదను. వీని వచన వాఙ్మయము ప్రత్యేక సిద్ధాంత వ్యాసము (Thesis) వ్రాయఁదగినంత విపులమైనది. ముచ్చునకొక్క మొదటిశాఖను గైకొందము.

సాహిత్య చర్చకు సంబంధించిన సాహిత్యశాఖకో ప్రధాన ప్రతిపాద్య విషయమునుబట్టి యీ క్రింది యంతర్విభాగము లేర్పడుచున్నవి:

1) శబ్ద చర్చ - దీనిక్రింద ఉదాహరణకి వ్యాసములఁ బేర్కొనవచ్చును.

1) గర్భాదానం క. గా. I - 112 పు. 2) భారత భారతి I.732. 3) వఠ్ఠగింజలో బియ్యపుగింజ I.745. 4) వైకర్తన శబ్దవిచారము I.748. 5) జలతాడనము I.757. 6) 'అమవసనిసి' యన్నమాట I.764. 7) యోచన సాధువా? యోజన సాధువా? 8) ఏని శబ్ద విచారము III-380. 9) గారు శబ్ద విచారము. II.15. మొ॥నవి.

2) ఒక కవి యొక్క కవిత్వ లక్షణములఁ గూర్చిన చర్చ: ఉదా:

1) తెనాలి రామలింగని కవిత్వం. I.799 & II.854. 2) పదకవులు I.286 3) నన్నయభట్టు I.633. 4) తిక్కనగారి నైపుణ్యం. II 319. 5) పిల్లలమఱ్ఱి వారి కవిత్వం II.358 6) గిడుగా? పిడుగా? II.373. 7) బమ్మెర పోతనామాత్యుఁడు II.1. 8) బహుజనపల్లివారు III.144. 9) నాచన సోమనాథుఁడు III.349. 10) బెల్లంకొండ రామరాయ కవి III.467 11) నారాయణతీర్థులు III.542, 12) పండితరాయలు, కాళిదాసు I.963 మొదలగునవి.

3) కావ్యసమీక్ష : 1) కీర్తి-అపకీర్తి I.540, 2) రాజలక్ష్మి 1.95, 3) వేంకటనాధుని పంచతంత్రము III 278, 4) రాణా ప్రతాపసింహ చరిత్ర III 326, 5) రామాయణ కల్పవృక్షము III.449. 6) కంఠశోష III.456, 7) రామాయణ కల్పవృక్షం III.461, 8) గురుశిష్య ప్రశిష్య నాటకం III.439 మొ॥నవి.

4. తమ సాహిత్య వ్యాసములపై వచ్చిన విమర్శలకు ప్రతివిమర్శలు: 1) కవితా విప్లవం I.832, 2) కవితా విప్లవం.2 I.840, 3) కర్ణాట కలహం I.855, 4) సహృదయాః ప్రమాణమ్ I.862, 5) ఏది సాధ్యం I.867, 6) యెంకిపాటలను గూర్చి I.823. మొ॥నవి.

5) కావ్యాంగములఁ గూర్చిన చర్చ: 1) ఏది కవిత్వం 1.870, 2) ఏది కవిత్వం-2 1.891, 3) రచయితలు I.88, 4) అన్నీ కవిత్వాలేనా? I.908, 5) వింత శ్లేషలు III-396, 6) మాలిక III-404, 7) భాష III.386, 8) గ్రాంథికమా-వ్యావహారికమా? III.385, 9) భారత విశేషములు (సా. వి.) 10) శృంగార రసము (సా.వి.)

6) విమర్శన పద్ధతులు, అనువాద విధానములపై చర్చ:- ఉదా:- 1) వితాటి విమర్శనము I.348, 2) కవికన్న విమర్శకుడికి జాగరూకత ఎక్కువ కావాలి I.546, 3) ఆంధ్రీకరణ విధానం III.203, 4) భారత సంస్కరణము (సా.వి )

7) వివిధాంశములపై సాహిత్యము నుండి యువపత్తులను గైకొనుచు చర్చించుట - 1) సామెతలు I.257, 2) నాఽనృషిః కురుతే కావ్యమ్ I.264 3) కవులు భిక్షుకులేనా? I 309, 4) భారతాంధ్రీకరణ కాలపరిమితి III.436.

8) పౌరాణిక పాత్రల గురించి విమర్శనము - 1) అర్జునుఁడు III 192, 2) దుర్యోధనుఁడు III.487.

నిర్మాణశిల్పమునుబట్టి యీ యంతర్భాగములను మఱికొన్నియుపశాఖలుగా విభజింపవచ్చును. అందులో మచ్చునకొకటి రెంటిని వింగడించి చూపించెదను. శబ్ద చర్చను గురించిన వ్యాసములన్నియు నైదు ఉపశాఖలుగా వింగడింపఁ బడుచున్నవి.

1) లోకవ్యవహారమున నొకే యర్థమునఁ బెక్కు పదములు వాడఁబడు చున్నప్పుడు వాని స్వరూపమును చర్చించి అందేది యుపాదేయమో నిరూపించి చెప్పునట్టి వ్యాసములు. ఉ॥ గర్భాదానము. మొ॥

2) ప్రసిద్ధ కావ్యములందు పాఠాంతరములు నిర్ణయించునప్పుడు కవులు ఉచిత శబ్ద ప్రయోగము నెట్లు నిర్ణయింపవలెనో ఆరిపెడు చర్చ. ఉ॥ "భారత వాహినీ" శబ్దముల ప్రయోగ చర్చ, "ఏని" శబ్ద విచారము మొ॥

3) అనువాద కావ్యములందు మూలమునుండి యొక పదము ననువాదము చేయునెడల వచ్చు చిక్కులను దెల్పి దానిని గ్రహించు విధానమును సూచించు వ్యాసములు. ఉ॥ వైకర్తన శబ్దవిచారము.

4) పూర్వకవుల నామములపై వెలసియున్న చాటువులలో నొక ప్రసిద్ధ కవిచేఁ బ్రయుక్తములై యున్న శబ్దములఁ గూర్చి హేళన చేయఁబడియుండ, అట్టి శబ్దములు శాస్త్ర విరుద్ధములా? పూర్వకవి సమ్మతములా? అతని కవిత్వ గుణమునకు వ్యతిరేకములా? నిజముగా నవి కవి పాండిత్యమున కపకీర్తి దాయకములా? మొ॥ విషయములపైఁ జర్చనడిపి, వాని తత్త్వమరసెడి వ్యాసములు. ఉదా॥ "అమవస నిసి" యన్నమాటను విమర్శించిన తెనాలి రామకృష్ణయ్య చాటువసంబద్ధమనియు, అది అతఁడు వ్రాసియుండి యుండదనియు, 'అమవసనిసి' శాస్త్రసమ్మతమైన ప్రయోగమనియు నిష్కర్షించుట.

5) పరమప్రమాణమని పండితులు నమ్ము శబ్దరత్నాకరము వంటి నిఘంటువులలో దొరలిన శాబ్దిక దోషములను నిరూపించి చెప్పుట. "యోచన - యోజన" శబ్దచర్చ దీని కుదాహరణము.

ఇట్లు ప్రతి యంతశ్శాఖయు విస్పష్టమై అపై నుదాహరణాత్మకమైన రచనాశిల్ప సమీక్ష యొనర్పఁబడినచో తి. వే. కవులు తమ వ్యాసములందు ప్రదర్శించిన నిర్మాణశిల్ప వైవిధ్యము బావి విమర్శకులకు బోధపడఁగలదనియు, నది ప్రత్యేక సిద్ధాంత వ్యాసముగా వ్రాయతగినదనియు నా యూహ. కావున ఈ యంతశ్శాఖలోని యుపశాఖలను గూర్చి స్థూలముగాఁ వేర్కొందును.

## 1

పూర్వకవుల కవిత్వమునుగూర్చి చర్చ యొనర్చువేళ తిరుపతి వేంకటకవు లొకకవి కవిత్వములోని అపురూపములు, వివాదగ్రస్తములునైన అంశములను

వ్యాసములందు చర్చించుటయు, వానిపైఁ దమ నిర్ణయముఁ బ్రకటించుటయు నింము సాధారణముగా కనఁబడు రచనా ప్రణాళిక. వీరి వ్యాసములలోని కొన్ని యంశముల నిచ్చట నుదాహరించుచున్నాను.

1) అప్పకవి, చిన్నయసూరి, వ్రాసిన లక్షణ వ్యాకరణ గ్రంథములందు నిబంధింపఁబడిన సూత్రములు మహాకవుల ప్రయోగములపట్ల ఎట్లనావ్యాప్తి దోషమునకుఁ బాల్పడుచున్నవో వివరించుచు, వారి సంకుచిత దృక్పథములను విమర్శించి, శబ్ద ప్రామాణ్యమును మహాకవి ప్రయోగమును బట్టియే గమనింపఁ దగునని బోధించిరి.

2) శ్రవణసుఖమే కవిత్వ లక్షణముగా ప్రాచీనకవు లెందరో కవన మొనర్చిరని నిరూపించుచు, తత్కవిత్వ ప్రక్రియా ప్రభేదములను, వాని నిర్వహణమునందు కవి తత్త్వమునుబట్టి ప్రయుక్తములగు శబ్దార్థాలంకార రచనా విశేషములను సోపపత్తికముగా వివరించిరి.

3) శాస్త్ర మర్యాదలను, ప్రయోగ మర్యాదలను విపులముగా సాహిత్యము నుండి యుట్టంకించుచు తఱచు మహాకవి ప్రయుక్త శబ్దములను సమర్థించిరి.

4) రచన యందలి యౌచిత్యాదులను, భావ, శబ్ద, పద్య, సన్నివేశ రసాదులలోఁ జర్చించిరి.

5) కవి కాలాదులను గూర్చి ప్రసంగించి, పూర్వాపర కవి కావ్యతత్త్వ ముల నరసి, తారతమ్యదృష్టి ప్రసరించి వివరించిరి.

6) సమయానుకూలముగా స్వీయప్రసక్తి తీసికొనివచ్చి పూర్వకవుల గూర్చిన తమ యభిప్రాయములను, అపూర్వ ప్రయోగాదులు తామెట్లు వారి నుండి గ్రహించి వాడినదియు శాస్త్రచర్చలలో మేళవించి చెప్పిరి.

7) కవి బిరుదముల సార్థక్యమును నిరూపించుచు, స్వీయ బిరుదములపై జరిగిన చర్చలఁ బేర్కొని సమాధానము చెప్పిరి.

8) ప్రతిపక్షుల నిందించునప్పుడును, ప్రతిపాద్య విషయమును ప్రవచించునప్పుడును వాగ్విషయకమైన నిగ్రహము ప్రదర్శించి, వస్తు సంబంధ మైన నిగ్రహమంతగా పాటింపలేదు.

9) సున్నితమైన హాస్యము పండితైకవేద్యముగా రచనమునం దంతటను ప్రదర్శించిరి.

10) సజాతీయ విషయ సంయోజనముచే వ్యాసములను విపులమొనర్చిరి.

## 2

కావ్య సమీక్షయందు కవులు పాటించిన కొన్ని యంశముల నీక్రిందఁ బేర్కొనుచున్నాను:

1) చరిత్ర విరుద్ధమైన యంశము లేకావ్యమునందైన గోచరించుచో వానిని నిశితముగా ఖండించుట. చరిత్రకావ్యములలో రసోదంచితముగా కథ మార్పవచ్చునన్న నియమ మంగీకరించినను, రసప్రకరణ పాత్రౌచిత్యాదులు భగ్నమగునట్లు కథను మార్చినచోట విమర్శించిరి. ఉదా:- శ్రీ దువ్వూరి జగన్నాథ శర్మగారి విజయనగర ప్రభువుల చరిత్రలో బొబ్బిలియుద్ధ సందర్భమున నప్పటి విజయనగర ప్రభువులను సమర్థింపఁబూని తాండ్రపాపయ్యకు రాజహత్య దోషము నంటఁగట్టుటను కవులు గర్హించిరి. బొబ్బిలికి రాఁదగిన యశస్సును కించపఱిచిన ఆ కావ్యమును విమర్శించుట వారి సత్యనిరూపణ దృష్టి కుదాహరణము.

2) నాటకము నొకదానిని విమర్శించునప్పుడు దానియందు కవి ముఖ్య ప్రతిపాద్యముగా నేసందేశమును సంధించుచున్నాఁడో గుర్తెఱిఁగి దాని కనుగుణముగా వస్తు నాయక రస ప్రవృత్తులు కూర్పఁబడినవిధము నఱయుటయు, ఆ సందేశము నా నాటక ప్రక్రియలోఁ శిల్పవైశిష్ట్యముతో నెట్లావిష్కరింపఁబడెనో నిరూపించి మెచ్చుకొనుట. ఉదా:- "రాజలక్ష్మి" యనెడి నాటకమునందు గ్రంథకర్తయగు బండారు తమ్మయ్యగారు కులస్త్రీలు నాటకరంగముల నెక్కరాదనియు, నాటక ప్రదర్శకులలో శీలసంరక్షణముండదనియు, త్రాగు దధిక మగుననియు, మర్యాదగల కుటుంబీకులు దానికి దూరముగా నుండవలెననియు నందు బోధించిరి.

3) సంస్కృతమునుండి వేంకటనాథుఁ డనువదించిన "పంచతంత్ర"మను గ్రంథము కథానువాదమునకు చక్కని యుదాహరణముగా నున్నదని సోపపత్తికముగా నిరూపించి, అట్టి యనువాద కావ్యములలో శబ్దార్థ చమత్కృతు లెట్లుండునో బహుళాంధ్రకావ్య సాదృశ్యముతో నా గ్రంథములను పోల్చిచూచి, స్థూలదృష్టికి శబ్ద శాస్త్ర దృష్ట్యా దోషము లనిపించు ప్రయోగముల నేకరువుపెట్టి వానిని శాస్త్రమర్మజ్ఞానముతో నెట్లు సమర్థింపవచ్చునో చెప్పి, మహాకవి ప్రయోగ గౌరవమును కాపాడుచు సమీక్షించియున్నారు.

4) కవి ప్రయుక్తమైన ప్రయోగాలను గైకొని వానిని తమ విపులమైన శబ్దశాస్త్ర పాండిత్యముతో వివరించుచు, సాహిత్యమునుండి పెక్కువవత్తుల నిచ్చుట రాధాప్రతాపసింహచరిత్ర సమీక్షలో కాననగును. ఆ కావ్యకర్త దుర్భాక రాజశేఖర శతావధానిగారు.

5) కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన రామాయణ కల్పవృక్ష కావ్యారంభ పద్యమును తమ గురువుగారగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు లక్షణ విరుద్ధముగా విమర్శింప వేంకటశాస్త్రిగారు శిష్యవాత్సల్యము చొప్పన తమ గురువుల వ్రాతలను ఖండించుచు, తమ శిష్యుని కావ్యగౌరవమును కొని యాడి, కవితా ధారలో తమ కన్నను, ప్రౌఢిమలో నితర రామాయణ కవిత్వ ముల కన్నను కల్పవృక్ష కవిత మించుచున్నదని సోదాహరణముగ "రామా యణ కల్పవృక్షము", "కంఠశోష" అను వ్యాసములలో వివరించిరి. గురుశిష్య ప్రశిష్య సంవాద మొక విచిత్ర కల్పన. గురుశిష్యుఁడు చెళ్ళపిళ్ళ - ప్రశిష్యుఁడు విస్వనాథ - గురువు శ్రీపాద. గురువుగారు ప్రశిష్యునిపై నొనర్చు విమర్శ మను చితమను తన యూహను - విశ్వనాథవారు తన యొద్దకు రాగా నతనికిఁ దెల్పి నట్లు కల్పించి స్పష్టించిరి. అవ్యాజ శిష్య వాత్సల్యము, మేటికవి విమృష్టుఁడగు చుండ పడెడి యనుతాపము ఈ రచనలో మూర్తిభవించినవి.

## 3

కవులు తమకుఁ దోచిన యభిప్రాయములు పత్రికలలో వ్యాసములుగాఁ బ్రకటింప వాని నెవరైన విమర్శించుచో కథ అంతటితో నాగక కొన్ని వ్యాస పరంపరలు పెరుగుచుండుట సంభవించెడిది. ఉదా॥ "కవితా విప్లవ" మనెడి వ్యాసమున విప్లవ శబ్దమునకు నవ్యులు వాడెడి "మార్పు" అనెడి యర్థమును స్పష్టీకరించి, క్రొత్తగా పొటమరించుచున్న గేయకవిత్వ శాఖలోని అధివాస్తవి కతను విమర్శించిరి. దానిపై తర్జన భర్జనలు రేఁగినవి. శాస్త్రిగారికి రసగ్రహణ శక్తి లేదనునంతవఱకు వచ్చినది. దానికి ఓపికతో సౌమ్యముగా సమాధానము చెప్పుటకై నాలుగైదు వ్యాసములు రచించిరి. ఇట్లే యెంకి పాటలను విమర్శించిరి. విశ్వనాథ వేంకటేశ్వర్లుగారు దానిని విమర్శించిరి. దానికి ప్రతి విమర్శయే "యెంకి పాటలను గూర్చి." మిత్రుల కావ్యములైనను శాస్త్రవిషయము వచ్చునరికి నిష్పాక్షి కముగా విమర్శించు సత్యదృష్టి కవులయందీ వ్యాసములలో గోచరించును.

## 4

కావ్యాంగములం గూర్చిన చర్చలోఁ గవుల స్వీయకవిత్వ దృక్పథమును కొంత లోకమునకు విడమరచి చెప్పుట కవకాశము కల్గినది. అట్టి యంశములను గొన్నింటిని పేర్కొందును.

1) రమణీయార్థ ప్రతిపాదకములైన శబ్దములతో శ్రవణానంద మొనర్చునట్లు కవిత్వముండుట సమంజసమని వీరి మతము.

2) కవిత్వములో యమకము శ్రవణసుభగత్వము కల్పింపవచ్చును గాని రామరాజభూషణునివలె శబ్దార్థౌచిత్యము సర్వత్ర పాటించు పాండిత్య మందఱి యందును ఉండదు.

3) కవితలో యమకాదులు లేకయే సమర్థుఁడైన కవి శ్రవణానందము కల్పించును. యమకాదులు ఋత్వాది వర్ణనలలోఁ బాండిత్యస్ఫూర్తికిఁ బ్రయోగింపఁ వచ్చునని భారవి కవి మతము.

4) యమక నిర్వహణములోఁ గొన్ని 'ప్యాకేజి సరుకు'గా దొర్లు సమాసము లున్నవనియు, అవి నన్నయలో నవయుక్తకృతములుగా మొట్టమొదట వెలువడినవనియు, తరువాతి కవులు అసమాసములనే యథాతథముగా వాడికొనుటచే నవి ప్యాకేజిసరు కయ్యెననియు, అట్టివి మఱల మఱల వాడుట కవి ప్రతిభాస్ఫోరకము కాదనియు తెల్పిరి.

5) శ్లేష ద్వ్యర్థి కావ్యములలో గూడ ప్రసిద్ధమైన పద్యములు చెవులకు హాయిఁజేకూర్చునట్టివే యని తెల్పిరి. శ్లేషలు మితిమీఁచి వాఁడుచో మొగము మొత్తుననియు నిదర్శనాత్మకముగాఁ జూపించిరి.

6) ద్రాక్షాపాకము, రసప్రతీతి సుకవిత్వ ముఖ్యలక్షణములు.

7) విభావానుభావాదులు పరిమితముగా (దాదస్తము లేకుండ) వర్ణించుచు కావ్యమున ప్రధాన ప్రతిపాద్య వస్తువును కవి పోషింపవలెను.

8) ఉన్నది యుంటినట్లు రచించుచో నది కవిత్వము కాదు. భావుకత, ఇమిడిక కవిత్వమున కుండ వలసిన ముఖ్య లక్షణములలోఁ బేర్కొనఁదగినవి.

9) "లోకాదరాన్ని అపేక్షించే కవికి శబ్ద చిత్రం యేమీ సాయం చేయదు. కవిత్వానికి కావలసింది అర్థ గాంభీర్యంగాని శబ్ద గాంభీర్యం కాదు. ఆయా

గాంభీర్యం పద్యాలలోనే ఇమడ్చనక్కఱలేదు. గద్యకావ్యంలో గూడా యిముడ్చ వచ్చును." I.888 క.గా.

10) "ఛందస్సులు ఎన్నియున్నను అనుష్టుప్ఛందస్సుకు సాటి వచ్చు ఛందస్సు సంస్కృతములో లేనేలేదు. తెలుఁగులో దానికి దీటైనది ద్విపదగానే కనపడును. కాని, అనుష్టుప్పుకు సంస్కృతములోనున్న ప్రతిష్ఠ ద్విపదకు తెలుఁగులో లేదు. ఇట్లు దీనిని త్రోసిరాజనుట విచార్యము భారతమంతా ద్విపదలో వ్రాసిన బాగుండును." I.890.

(ఈ అభిప్రాయము కరు వార్థకమునందు కల్గినందులకు వేం. శాస్త్రి గారు విచారము వ్యక్తపఱచినారు.)

11) "అందరికీ ఒకే విధమైన అక్షరాలే కవిత్వానికి ఆధారాలుగా వున్నా రచనలో కొన్ని రహస్యాలున్నాయి. ఆయా పదాలు కూర్చడంలో వైలక్షణ్యం వుంటుంది. అందుచేతే అనుకుంటాను 'విచిత్ర ప్రకారా హి పదానాం ప్రవృత్తిః' అన్నాఁడు ఆలంకారిక వామనుఁడు."

12) "అచ్చంగా తెనుఁగే చెప్పతాననిగాని, అంతేకాకుండా నిరోష్ఠ్యంగా కూడా చెపుతానని కాని లేనిపోని శృంఖలాలు తగుల్చుకొని కొందఱు రచన సాగించి వున్నారు. ప్రయత్నం వినాగా అంటే సహజంగా దొర్లే శబ్దాలంకారాలు తప్ప యితర శబ్దాలంకారాలు కూడా శ్రమకు చేటేగాని కవిత్వానికి శోభను తేవు." - I.898.

13) "ఏకాక్షర ద్వ్యక్షరమయాలుగా కొన్ని రచనలు సాగించడాని క్కారణం వారివారి పాండిత్య ప్రకటనార్థంగాని అన్యంకాదు. రసజ్ఞులు వాట్లని ఆమోదింపరు. కాని, రాజులు ఆయా బంధ కవిత్వాలకు అక్కఱపడి అగ్రహారాదులిచ్చి సన్మానించి వున్నట్లు ప్రత్యక్షర నిదర్శనాలున్నాయి. యీసడించడం సులువు గాని, రచన సులువు గాదు." - I.898.

14) "నిన్న మొన్నటిదాకా రచన వ్యాకరణ సమ్మతంగా వుండాలి అనే ప్రతిబంధక ముండేది. యిటీవల ఆ ప్రతిబంధకం పూర్తిగా వైదొలంగింది. దీన్ని గురించి కీ. శే. గిడుగు పంతులుగారు స్మరణీయులు. కం. వీ. పంతులుగారి వచన రచన చాలాభాగం వ్యావహారికమేగాని, గిడుగువారి కున్నంత పట్టుదల ప్రస్తుత విషయంలో కం వీ. పంతులుగారికి లేదు. గిడుగు పంతులుగారి పట్టుదలకువున్న తాత్పర్యం త్రోసివేయదగ్గది కాదు." I.900

15) నవ్యులు వారు 'రచయిత' శబ్దమును చర్చించి - పద్యరూపముగా గాని, గద్యరూపముగా గాని హృద్యముగా నుండునట్లు ఏ కొంచెము గొప్ప రచన మొనర్చినను ఆ వ్యక్తి రచయిత యనఁబడుననియు, తాళ రాగయుక్తమైన రచన వారిపని కాదనియు నిరూపించి చెప్పిరి.

16) "రసారస విచారంపట్ల గురుత్వ శిష్యత్వ జన్యత్వ జనకత్వాదులు అకించిత్కరాల్లు యెవరేనాసరే గుణముంటే మెచ్చవలసిందే అని నా సిద్ధాంతం." I.914.

17) "పద్యరచనకు వ్యావహారిక భాష కొంత యెబ్బెట్టుగా ఉన్నా, గద్య (వచన) రచనకు గ్రాంథికంకంటే అనేకరెట్లు వ్యావహారికమే హృద్యమని కూడ నేనంగీకరిస్తాను. సంస్కృత నాటకాలలో కొన్ని పాత్రలకు సంస్కృతమూ, మఱికొన్ని పాత్రలకు ప్రాకృతమూ వాడడం పండితు లెఱిగిందే. తెలుఁగులో ప్రాకృతాన్ని వాడే పాత్రలకు వ్యావహారికం వాడుకుంటే హృద్యమని నాకు తోస్తుంది. సలక్షణమైన గ్రాంథికభాష రాని బుద్ధిమంతులు చాలామంది వుంటారు. పాపం వారు వారి అభిప్రాయాలు గ్రాంథికంగా వెల్లడించడానికి యిప్పుడు అవకాశం లేకపోతూవుంది. వ్యావహారానిక్కూడా అవకాశాన్ని కల్గిస్తే వారిని గూడా ప్రోత్సహించినట్లవుతుంది." III.392.

18) "పద్య రచనలోనేనా యావత్తూగాక అక్కడక్కడ వ్యావహారికం దొర్లితే అంగీకరిస్తే పాపం వచ్చి చుట్టుకోదనే నేను భావిస్తా." III.393.

19) "శ్లేషలో ప్రసాదగుణము, కదళీపాకములో యమకము, శ్లేష చిత్రించుట మొదలగునట్టి ప్రక్రియలు కదుప్రసిద్ధములు. 'అయితే శ్లేషకవిత్వాన్ని లాక్షణికులు ఉత్తమ కవిత్వంగా ఎందుకు అంగీకరించారుకారు?' అంటారేమో! వ్యంగ్య కవిత్వం ముందర ఇవి పనిచేయదు. అందుచేత దానికి అగ్రతాంబూలం ఇవ్వడం తప్పదు. క్రమలేకుండా అది విశేషార్థాలను వివరిస్తుంది. లోపల నిగూఢమైన భావాలను స్ఫురింపఁజేయడంలో వ్యంగ్య రచనకు అదే సాటి." III.402.

20) భారత కవిత్వ విశేషములఁ దెల్పుచు తి. వేం. కవులు కవిత్వాంశములఁ బేర్కొని వానిని సోదాహరణముగ వివరించియుండిరి. అందుఁ బేర్కొనిన కవిత్వాంశములోఁ గొన్ని: 1) ధారాశుద్ధి, 2) కూర్పు-నేర్పు, 3) ఉపలక్షణత, 4) అన్వధాకరణము, 5) విచిత్రసంబోధనము, 6) లోకానుకృతి, లోకోల్లం

షణము 7) ఏకదేశాన్వయము, 8) రూపిత వస్తుప్రాధాన్యము, 9) సాంస్కృతికా న్వయవ ప్రవృత్తి, 10) వ్యాఖ్యాన విశేష ప్రతిపత్తి, 11) అనువృత్త ప్రదారము, 12) అవివక్ష, 13) విశేషవిశ్లేషణము, 14) లోకోక్తి. 15) మిశ్రసమాస గ్రథనచాతురి, 16) విపులీకరణనైపుణి, 17) కుంచింపు. 18) భిన్నక్రమము, 19) క్రమాన్వయము, 20) ప్రయోగవైచిత్ర్యము, 21) ప్రయోగస్వాతంత్ర్యము, 22) తెలుఁగుమర్యాద, 23) విచిత్రాన్వయము, 24) నఞ్ప్రాసవిచారము మొ॥నవి. ఇట్లుదాహరించుచు పోవుచో నెన్నియో యంశములు వచ్చును. గ్రంథవిస్తర భీతిచే వానిని రసజ్ఞులకు వదలుచున్నాను.

## 5

విమర్శన పద్ధతులమీదను, అనువాద విధానముల మీఁదను కవుల యభిప్రాయములఁ గొన్నిటి నిచ్చట పొందుపఱుకును.

1) "ప్రాచీన నవీనత్వాలు కవిత్వాన్ని మెచ్చడంలో లేశము కూడా వుపకరించవు. కాని, సర్వసామాన్యంగా ప్రాచీనుల కవిత్వాన్ని అభినందించడమున్నూ, నవీనుల కవిత్వాన్ని యీసడించడమున్నూ కనపడుతుంది" - I.350.

2) "వ్యాఖ్యాత సాయశక్తులా తంటాలుపడి కవిని సమర్థించడం ఆచారం. పూర్వకాలపు విమర్శకులు కూడా ఇంచుమించు అలాగే వుండేవారు అయితే యేదైనా వ్యక్తిగతమైన దురుద్దేశం వుండి విమర్శించేటప్పుడు మాత్రం పైరీతికి కొంత వ్యతిరేకంగా ప్రవర్తించడం వుండేది. దీని కుదాహరణంగా పండితరాయ లప్పయ్యదీక్షితులవారి గ్రంథాలనీ, భట్టాజీ దీక్షితుల గ్రంథాలను విమర్శించిన పక్కీని చూడవచ్చు" - I.546.

3) "యిప్పటి ప్రాజ్ఞులయిన విమర్శకుల విధానం చూస్తే వ్యక్తిగతంగా దూషణ లేశమున్నూ కనపడదు కాని, అసలు కవి యుద్దేశాన్ని కనిపెట్టకుండా తోచినట్లల్లా విమర్శించి మహాకవుల పోకడల్ని యీసడించడం విస్తారంగా కనపడుతుంది. యిందులకు కళాపూర్ణోదయపు విమర్శనం వగయిరాలు ఉదాహరణం. కళాపూర్ణోదయం కవి నేటివాఁడుకాదు కాబట్టి విమర్శకునకున్నూ ఆయనకున్నూ వ్యక్తిగతమైన మైత్రిని గాని, ద్వేషాన్ని గాని ఆరోపించడానికి లేశమున్నూ అవకాశముండదు. కేవలం కవితా నిష్ఠమైన గుణాలూ, అవగుణాలు మాత్రమే

యీ విమర్శకులకు ఆధారం. అయితే వెనుకటి విమర్శకులకేమి, వ్యాఖ్యాతలకేమి చట్టన పూర్వ మహాకవులను కాదనడానికి సాహసం వుండేదికాదు. యిప్పటి వాళ్ళకట్లా కాదు. ఎంతటి మహాకవినైనా సరే తోటకూరలో పురుగులాగా తీసి పారేయడానికి సాహసం కలిగి వుంటూ వుంది. యిది యుక్తమైనా అయుక్తమయినా యిప్పటివారిలో బాగా వ్యాపించి ఉన్న విశేషం". I.546

4) "కవికి కవిత్వం చెప్పుకోవడం తప్పదు. చెప్పద మనక చెప్పుకోవద మన్నాను. చూదారా, కేవలం తనకు మాత్రం ఉపయోగించినా ఆతని రచనకు వైవిధ్యం లేదని వాఁడు సంతోషింప వచ్చును. విమర్శకుడి విషయమట్టిద కాదు. లోకం చూచి కూడా వప్పుకోవాలి. విమర్శనం అలా వుండకపోతే 'వాణ్ణి వెక్కిరించబోయినందుకు మంచిపని జరిగిం'దని లోకులు విమర్శకుఁడికి జరిగిన పరాభవానికి సంతోషిస్తారు. కవి తప్పులని విమర్శకుఁ డెన్ని చూపిస్తాడో అవతలి వాఁడు తిరగవద్దప్పుడు అన్నింటినీ నిలుపుకోవాలి. వకటి నిల్పుకోలేకపోయినా విమర్శకుఁడికి అది మహాపరాధమే అవుతుంది. నన్నడిగితిరా వకమాట చెప్తాను- వెక్కిరించకూడదు" - I.548.

5) "తెలిఁగించడమంటే మూలంలో వున్న ప్రతిదానికి తెలుగుపదం వచ్చేటట్టు చేయడమే అనుకోవడం కంటే అవ్యక్తత వేరే ఉండదు. ఒక్కొక్క భాషకు ఒక్కొక్క రకమైన మర్యాదలుంటాయి రూఢాలు తప్పక తెనిగించడం పెట్టుకుంటే ఈ భాషా మర్యాదలు మంటగలిసిపోతాయి. విమర్శకుడీ విషయం మనస్సులో పెట్టుకొని విమర్శన సాగించవలెను. ఇందుకు గట్టి పాండిత్యమే కాకుండా సరసమైన హృదయంకూడా వుండవలెను." III.213.

6) "దేన్నిగాని అనువదించడానికి పూనుకున్న కవి యెంతసేపూ భావాన్ని బట్టి పోవలసిందేగాని మూలంలో వుండే పదాలను బట్టి పోఁగూడదు." III.226.

7) "కవి దేన్ని చిత్రించినా దాన్ని హృదయంగమంగా చిత్రించడమే కావలసింది. మొత్తంమీఁద మాట లోఁతు సంగతు లెఱుఁగని విమర్శకులవల్ల సామాన్యకవిలోకానికి కొంత చిక్కు కల్గుతూవుంది. ఆ విమర్శకులు తమలో తాము ఏ శంకనో చేసుకొని వూరుకోక ఆ శంకలు సిద్ధాంతాలనుకొని పత్రికలకెక్కిస్తాను. వాటిని చూచి సామాన్యులు భ్రమపడతారు." III.252.

8) "పుణ్యకథలు కవికి వరలోకసుఖాన్ని కల్గించినా వాటినే పట్టుకొని ప్రేళ్లాడ నక్కరలేదు" III.252

9) ఉ॥ దిద్దకుఁడయ్య భారతము దీనిని దానిని బోలె, దాన నా
పద్దెళ మూఁడి పూర్వకవి పద్యములెన్నియొ వన్నెఁదక్కు, మీ
రెద్దియునేని దిద్దునెడ నించుక సంస్కృత భారతమ్ముపైఁ
దద్దయుఁ జూడ్కి నింపుఁడు పదంబడి దిద్దుడు హానిలేనిచో.

ఆ. వె: సంస్కృతమ్మున కిది సమమైన తెల్గు గా
దందురేమొ! నిక్కమగును, గాని
యెల్ల యెడల నట్టులేయుండ, దొక్కింత
శ్రద్ధఁగలిగి మనము చదువవలయు" - (భారత సంస్కరణ)

వివిధాంశములపైఁ గవులు వ్రాసిన వ్యాసములు, పురాణపాత్ర విమర్శనము మొ॥నవి వారి విపుల గీర్వాణాంధ్ర కావ్య పరిచయమునకు నిదర్శనములు.

సంగ్రహముగాఁ జెప్పుచు వెళ్ళినను ఇతర గాథలను గూర్చి పెద్ద గ్రంథమే యగును కావున వానిని రసజ్ఞులకు వదలి కవుల స్వీయ చరిత్రకు సంబంధించిన వ్యాసములను మాత్రము పేర్కొందును. వచన వాఙ్మయములో సగమునకు మించి తి. వేం. కవుల స్వీయ వాఙ్మయ వివాద చర్చలే వ్యాపించి యున్నవి. వానిని ప్రధానముగా నీక్రింది విధముగా విభజింపవచ్చును:

1) జంటకవుల స్నేహాదులను, రచనాదులఁ గూర్చి తెల్పెడి వ్యాసములు.

2) వేంకట శాస్త్రిగారి వైయక్తిక జీవితమునుగూర్చి తెల్పెడి వ్యాసములు.

3) నానారాజ సందర్శనములు, అవధానములు - వానిని గుఱించి వివరించి చెప్పు వ్యాసములు.

4) 'ప్రభావతీ ప్రద్యుమ్న' నాటకముపై వచ్చిన విమర్శకు సమాధానము చెప్పు వ్యాసములు.

5) పాండవాశ్వమేధ నాటకముపై వచ్చిన విమర్శకు సమాధానము చెప్పు వ్యాసములు.

6) 'శ్రవణానందము - ప్రాజిగ్జ్యోతిష' అను కావ్యములపై వచ్చిన విమర్శ కిచ్చిన సమాధానములు.

7) కొప్పరపు కవులతోడను, రామకృష్ణ కవులతోడను జరిగిన వాదుల గూర్చి చెప్పెడి వ్యాసములు.

8) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారితో జరిగిన వాదుల గూర్చిన వ్యాసములు (సంఖ్య యందివి అధికము).

9) అన్యాపదేశ పద్ధతిలో వ్రాసిన వ్యాసములు, సంవాదములు.

10) స్వీయ కవిత్వ స్వరూపమును దెల్పెడి వ్యాసములు.

11) వేంకట శాస్త్రిగారి 'కాశీయాత్ర.'

12) జంట కవులలో నొకరైన దివాకర్ల తిరుపతి శాస్త్రి దివంగతులైనప్పుడు వేం. శాస్త్రిగారు రచించిన "దివాకరాస్తమయము" మొదలగునవి.

వీనిలో కాశీయాత్రకును, దివాకరాస్తమయమునకును వ్యాసములకన్న అధికమైన గౌరవమున్నది. ఇందు మొదటిది వ్యావహారిక భాషలోను, రెండవది గ్రాంథిక భాషలోను వ్రాయఁబడినది.

## కాశీయాత్ర

కాశీయాత్ర యాత్రాసాహిత్యమున కొక మణిపూస వంటిది. పాశ్చాత్య సాహిత్యములో ఎట్టి వచన రచనలను "నవల"గా గ్రహింతురు. కొందఱు పాశ్చాత్య విమర్శకులు నవల నాఱు విధములుగా విభజించిరి. అవి : 1) Novel of Action, 2) Novel of Character 3) Picaresque Novel 4) Dramatic Novel 5) Periodic Novel 6) Chronical అనునవి.[1] అందులో Picaresque Novel గా కాశీయాత్ర చెప్పవచ్చును. Edwin Muir దీనిని గుఱించి వ్రాసిన కొన్ని యంశము లివి:

"The real aim of this form is obviously to provide a number of situations and variety of objects for satirical, humourous or critical delineation...."

"The object of the picaresque novel is to take a central figure through a succession of scenes, introduce a great number of characters and thus build up a picture of society...."

---

1. The Structure of Novel - by Edwin Muir.

"The Man who has travelled or succeded will, however, inevitably want to communicate his specially acquired knowledge as to portray his characters and in the picaresque novel, ancient and modern there is generally an attempt of to provide information such as social student or a moralist or an intelligent newspaper would give."

ఈ లక్షణములలో మూడవ అంశము నధికముగా ముద్రించుకొని దాల వలికా నవల రూపమును బోలుచున్నది. ఈ విధముగా నొక వినూత్న నవలా శాఖకు గూడ బీజములు నాటినవారగుచున్నా రనియు. నందును "ఆత్మనాయకత్వ" మనెడి విశేషము చొప్పించి రనియు నిందు తెలియఁదగిన విశేషము.

## దివాకరాస్తమయము

సహాధ్యాయియు, సహావధానియునై బహిఃప్రాణమువలె మెలఁగిన జంట కవి తనకన్న ముందు కన్నుమూసిన తిరుపతిశాస్త్రిగారిని గూర్చి పరితపించిన దుఃఖమూర్తి "దివాకరాస్తమయ"మున గోచరించును వేంకటశాస్త్రిగారి కుడి భుజము విఱిగినట్లైనది. కవలలో నొక బిడ్డ మృత్యువు వాతఁబడినట్లైనది. విశాఖనక్షత్ర ద్వయములో నొకటి రాలిపోయినట్లైనది. తెలుఁగుభారతి అనాఁడు దుఃఖించినది. జంటకవి నొంటిగాఁజేసి దివమునకు వెళ్ళిన దివాకర్లను గూర్చి "దివాకరాస్తమయ"మైనట్లు తెలుఁగు కవుల నేత్రపుండరీకములు కన్నుం దడి వెట్టినవి. వేం శాస్త్రి తమ యిరువురి యనుభవ విశేషముల నెన్నింటినో యిందు పేర్కొనుచు, స్వీయకావ్య లక్షణములు, ఉభయస్వభావ తారతమ్యములు మొ॥నవి ప్రసక్తానువశముగాఁ దెల్పియుండిరి. ఇవియన్నియు నొక ఎత్తు, తిరుపతిశాస్త్రి వియోగ దుఃఖ మొక ఎత్తు:

సీ॥ గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గ
ర్ణాట సీతారాము సాటిఁజేసి
తోడి కలార్థు లేదుర్వహా తల్వి కీ
ర్ష్య వహించి కలహమ్ము సలుపుచుండ్రు
ఎవఁ డెన్నఁడును బార మెలమి విప్పకయె
వ్యాకరణ పాండిత్య ప్రకర్ష మూనె
వాఁడుఁడు సచ్చనివాడు గరువంబు సడలింపఁ
జాలె నెవ్వాని మనీషాబలంబు

తే.గీ. ఎవఁడు నాకెక్కుఁడయ్యె నా యెడలఁ గార
ణాంతరమ్మున గురుభావ మంతరంగ
మునకె కాక వెలికిఁగూడఁ గనఁగఁజేసె
నట్టి తిరుపతి కవి దివి కరిగె నకట!

క. నాకన్న ధీబలమ్మున
నే కాదు తపోబలమున నెంతయు హెచ్చై
లోకస్తుత్యుఁడు తిర్పతి
నాకన్నన్ మున్న యెట్లు నాకము ముట్టెన్!

మ. కలలోనైన 'నతండు ముం దనుచు' 'వెన్కన్నే' నటంచున్ మదిం
దలఁపంబో మతఁ దేనుగూడ, నెటు లీతాఱ్మాఱు చేకూరెనో!
బలవంతుండె మహోన్నతంపుఁబదవిన్ బ్రాఁకంగ నర్హుండు, దు
ర్బలుఁడో కాఁడటువంటి వాఁడనుట సర్వత్రానుభూతంబకా!

ఉ. ఏఁబది దాఁటెనా, కతని కేఁబదికింక నెలల్ గొఱంత నా
ల్గాబుధ మాన్యుఁ డిందనుక నాఁగక సల్పె శతావధాన, మే
నో బహు కాలమై యొకటి నుండియు నాతనిచేత యూఁతఁ బ్ర
జ్ఞా బహుళావధానపుఁ బ్రసంగము తిప్పుచునుండి నెట్టులో.

ఉ. "ఏవల నూజివీటి సభ కేఁగితిపిన్ దిగఁ ద్రావి" యన్న కో
పాసన కాదె యొంటరిగఁ బాకరిపున్ గనఁబోయి తిప్పరో
దీనివి! తిర్పతీ! యచటి దీపులతోఁ గలహమ్ము గల్గు న
న్నైనియు నేను నీ స్మృతికి నెక్కకపోనుజుమీ; సుమిత్రమా!

తే.గీ అల దివాకరునకుఁ బోలె నస్తమయము
నుదయమును గూడ నిజమున కుండఁబోవు
నీ యశఃకాయమున కని నే నెఱిఁగియుఁ
బామరతఁ జేసి విలపింపవలసె సుఖుఁడ!

పండితలోక మిట్లు దుఃఖించినది :

కాశీ కృష్ణమాచార్యులవారు—

తే.గీ. అల్ల పాండవ విజయమ్మునందుఁ బద్య
మణిని "దగ్గఱలేరు మామ" యనుదాని
దలఁచి "హాతిర్పతీ!" యని తలఁచి కుంద
నట్టి మానవుఁ డీ ధాత్రియందు లేఁడు.

# అనువాదములు

తే.గీ. "సంస్కృతం బగుఁ బండిత సాధ్యమగుట
నెల్లరకుఁ దేటతెల్లమై యింపునింప
దాంధ్రమో దేశభాషయై యలరుకతనఁ
బండితాపండితులకు సంభావ్య మగును." —శ్రీనివాస. ఏ. ఆవ. 38 ప.

లోకమున నొక భాషలో నొకఁ డందముగా నొక విషయమును జెప్పును. పలువురు పెక్కుసారులు దానిని నోరూర చెప్పుకొందురు. ఆ భాస తెలిసిన యితరుఁ డెవఁడో దానిని వినును, ముగ్ధుఁడగును. తాను దాని నావృత్తిఁ జేయును. తన భాస వారికిఁగూడ నా పలుకు సొంపు తెలుప నాత్రము పడును. పూర్వుఁడు సెప్పిన భాస వేఱు. ఆ భాసకున్న వైలక్షణ్యముబట్టి ఆ మాటల జాతియనుగు పలుకుబడి వేరు. దాని నర్థము చేసికొను జాతి సంస్కారము వేఱు. దానిని మఱియొకఁడు తన భాసయందు తన జాతికి అర్థమగునట్లు తన పలుకుబడిలో పూర్వుని భాగము చెక్కుచెదరకుండ స్ఫురించునట్లు చెప్పవలసి వచ్చును. చెప్పు విషయము పూర్వునిదే కాని, చెప్పు విధమునందు మఱియొక భాషలో నది పునర్మథితమై నూత్నశక్తితోఁ బునస్సృష్టి చేయఁబడును. ఇది లోక ప్రసిద్ధము. అనఁగా నొక విషయము తాత్పర్యార్థస్ఫూర్తి చెడకుండ మఱియొక సారి మఱియొక భాసలోఁ జెప్పఁబడుచో దానిని అనువాద మందురని తేలుచున్నది.

ఇట్టిది సాహిత్యజగత్తునందును కలదు. రమణీయార్థ ప్రతిపాదక శబ్ద సముదాయమే కవి వాక్కు. ప్రపంచభాష లన్నింటియందును ప్రతిభావంతులగు కవులు సాహిత్యసృష్టి యొనర్చుచునే యున్నారు. ఆయా భాషలలోఁ బ్రసిద్ధిఁ గన్న కావ్యరత్నము లితర భాషాకవులు తమవారి కనువగు రీతిని ననువదించుకొనుచున్నారు. సాహిత్యములో ననువాదమునకు గార్హస్థ్యమునం దతిథి పూజనమున కున్న గౌరవమున్నది.

మఱియొక విషయము: అందఱ కన్నివిషయము లందముగాఁ దోచవు. లోకో భిన్నరుచిః కవియు లోకస్థుడే కావున నతని యభిరుచి కనుగుణములైన కావ్యములనే యతఁ డనువదించును కొందఱ కభిరుచులు స్వయముగాఁ బుట్టును. కొన్ని ప్రేరణమువలనఁ గల్గును ఎట్లైనను ఫలమొక్కటియే. అభిరుచులు కాలానుగుణ్యము లగుటచే వానిపై సమకాలీన కాలప్రభావ మనివార్యము. అట్లే తిరుపతి వేంకట కవులును కొన్ని కావ్యముల నాంధ్రమున ననువదించిరి. బుద్ధ చరిత్రము తప్ప వీరి యనువాద గ్రంథములన్నియు సంస్కృత మూలములే. అందు నాటకములు, దేవీభాగవతము కవుల స్వయం ప్రేరణచేతను, ఇతరములు పరప్రేరణము చేతను రచితములైనవి.

ఆంధ్రమునం దనువాద పద్ధతులు ప్రధానముగా మూఁడు. అవి: 1. కథానువాదము, 2. భావానువాదము, 3. శబ్దానువాదము. వానిలో పూర్వోత్తరములు శ్రేష్ఠములు. మూలకావ్య కథయందు కావ్యకర్తచే నుద్దిష్టమైన పరమార్థమును గ్రహించి దానిని స్వాయత్తము చేసికొని యా కథకు స్వీయ స్వతంత్ర ప్రతిభావిశేషముచే వన్నెలుదిద్ది పునస్సృష్టి యొనర్చుట కథానువాద మనబడును, మూలకథయందు ఒక్కొక్క నిర్దిష్ట కథా ఘట్టమునందుఁగల భావములను గ్రహించి,వానిని స్వీయ ప్రతిభా వివేకముచే వలయుచో మార్పులను, చేర్పులను, కూర్పులను ఒనర్చి మూలానుసారిగా ననువదించుట భావానువాదము. ఇందు సామాన్యముగా అనువాదకర్త ప్రతిభాదులకన్న మూల కావ్యకర్త వ్యక్తిత్వమే అధికముగా నుండును. సమర్థుఁడైన అనువాదకుఁడైనచో మూలము కన్న నొక్కొకచో నతిశయించుటయుఁ గాంచెదము. మూలమునందున్న ప్రతి పదము తెలుఁగున వచ్చుటకై యత్న మొనర్చుచు అర్థవ్యక్తిని గౌణముగా నెంచి, జాతీయతా ముద్రలేని శైలిలో మూల సహాయము లేనిదే కొన్ని పట్టులం దర్థము కానియట్లు తెనుఁగుసేయుట శబ్దానువాదము. కవి ప్రతిభ మొదటి పద్ధతిలో అతి స్వాతంత్ర్యమును, రెండవ పద్ధతిలో నియత స్వాతంత్ర్యమును, మూఁడవ పద్ధతిలో మూలదాస్యమును ప్రకటించుచుండును. తెలుఁగున కవిత్రయాదులు, శ్రీనాథాదులు, నవీన నాటకకర్తలు క్రమముగాఁ బై మూఁడు మార్గముల ననుసరించియుండిరి.

కావ్యతత్త్వమునుబట్టి యనువాద పద్ధతియు మారుచుండును. అర్థప్రధాన మైన ఇతిహాసములకు కథానువాదము సరిపడును. శబ్దార్థ సమప్రధాన్యముగం

కావ్యపురాణములందు భావానువాదము యోగ్యమగును. శబ్దాలంకారములు, శ్లేషాదులు ప్రధానముగాగల కావ్యములపట్ల శబ్దానువాదమును ఉపాదేయము. తి.వేం. కవులీ మెలకువ తెలిసినవారు కావున దేవీభాగవతమును, శివలీలలు, బుద్ధచరిత్రము అను పురాణ కావ్యములను రెండవ పద్ధతిలోను, శ్రీనివాస విలాసము, నాటకములు మూఁడవ పద్ధతిలోను రచించిరి. శబ్దానువాదమునందును అన్వయ కాఠిన్యము లేక కొలఁదిగ భావానువాదచ్ఛాయలను మేళవించి అనువదించిరి మొత్తమునకు వారి యనువాదము "భావానువాద" మార్గమునకుఁ జెందినదని భావింప వీలగుచున్నది.

శ్రీనివాస విలాస కావ్యావతారికలో కవు లనువాదముల పద్ధతుల నిట్లు తెల్పియుండిరి:

మ. తెలిఁగింపందగినట్టి వెన్వియన, నెంతే నర్థభూయిష్ఠతన్
గని యొప్పారు పురాణముల్ మఱియుఁ దత్కల్పమ్ములై యొప్పు చ
క్కని కావ్యమ్ములు నాటకమ్ములును వీఁకన్ శబ్దముల్ గుచ్చి కూ
ర్చిన కబ్బంబది తెన్గు సేయతరమే? చేయన్ రసంబొప్పునే? (45)

ఇందు శబ్దప్రధానానువాదమును గర్హించియుండుట స్పష్టము. వారే తమ యనువాద పద్ధతిని స్పష్టపఱుచుచు మఱియు నిట్లనిరి:

ఉ. ఒక్కెడఁ జక్కఁగా పదము నొక్కెడఁ జేర్చిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దున్న యటులుంచి రచించిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దాన సగముంచిన మేలగుఁ దెల్గు సేయుచో
మక్కికి మక్కి యన్నటుల మార్చిన కావ్యము శ్రావ్యమెట్లగున్?

ఉ. ఒక్క యెడ న్నమానముగ నొక్కొకచోట విశేష రీతిగా
నొక్కెడఁ దగ్గగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపఁగాఁ
జక్కఁగఁ జేసి తెల్గకవిసత్తము లాంధ్రముఁ జేయునప్పు డా
పక్కియె మేము బట్టినది పండితులార! వెసంగఁ బోకుఁడీ!
—శ్రీని. విలా. అవ. 52, 53.

ఈ పద్యములలోఁ గవులు భావానువాద స్వరూపమును స్పష్టపఱిచి యుండుట తెల్లము.

భావానువాదకులలో నగ్రగణ్యుఁడు శ్రీనాథుఁడు. అతని శృంగార నైషధ మట్టి యనువాదమే. అం దాకవి యనుసరించిన విధానమును స్పష్టపరిచినాఁడు. "భట్టహర్ష మహాకవీశ్వరుండు గవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధ శృంగార కావ్య ప్రబంధ విశేషంబున నశేష మనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, అభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, నలంకారంబు భూషించియు, రసంబు పోషించియు, ననౌచిత్యంబు పరిహరించియు, నౌచిత్యం బాదరించియు మాతృకానుసారంబుగఁ జెప్పఁబడిన యీ భాషా నైషధ కావ్యంబు" (శృం. నై. 8 ఆ - 202 ప) అని కావ్యోప సంహారమున సూచించిన విషయ విభాగము తదనువాద పద్ధతికి లక్షణసూత్ర మని చెప్పవచ్చును. పెద్దనాదులకీ యనువాద మాదర్శప్రాయమైనది. తి.వేం. కవులీ పూర్వమహాకవుల ననుసరించిరి.

పై చర్చనుబట్టి భావానువాదమునందు ప్రధానముగా గోచరించు లక్షణముల నీ క్రింది విధముగాఁ గ్రోడీకరింపవచ్చును:

1) మూలమునందలి రసపోషణ విధానము ననుసరించియే యాంధ్రమునను రసప్రచన మొనర్చుట.

2) రసానుకూలములగు నౌచిత్యములఁ గల్పించియు, మూలమునందలి యనౌచిత్యములఁ దొలగించియు, నుచితాలంకారాదులఁ బ్రయోగించియు కావ్యాత్మను దీపింపఁజేయుట.

3) మూలము నందలి భావము నుపలక్షించి యొక్కచో మూలానుసారిగను, ఒక్కొకచోఁ దద్విశేషముగను, నొక్కొక్కచో సంగ్రహముగను, ఒక్కొక్కచో నూత్నకల్పనాదులచేఁ దద్విపరీతముగను కల్పించి తాత్పర్యశక్తి కుంఠితము గాకుండ నిర్వహించుట.

4) శబ్దానుకరణమునందు మూలకర్త యభిప్రాయము స్పష్టముగా నిర్ణయించి తదర్థ ప్రతిపాదనము చెడకుండ ఆంధ్ర భాషా మర్యాదలకు, జాతీయములకు, నుడికారములకు ననువైన పదార్థ సముదాయముల నెన్నుకొని వాని నొక్కొక్కచోఁ గూర్పవచ్చును. లేక ఒక్కొక్కచో రమణీయార్థ దాయకములగు పదములను మూలమునుండి యథాతథముగా గ్రహింపవచ్చును. లేక కొన్ని పదములు మూలమునుండి గైకొని కొన్ని కవి కల్పించి జతచేర్చి వాడి విశేష

భావ సౌందర్యము గల్పింపవచ్చును. ఈ చతుస్సూత్రములు భావానువాదమునఁ బ్రసిద్ధికన్న మార్గములు.

తి. వేం. కవు లనువదించిన పద్యకావ్యము లివ్వి : 1. దేవీ భాగవతము (పురాణము); 2. శ్రీనివాస విలాసము (కావ్యము) 3. బుద్ధ చరిత్రము (సంస్కృతాంగ్లానువాదము) (కావ్యము) 4. ఆంధ్ర స్కాందము (పురాణము) 5. వైరాగ్య శతకము (శతకము) 6. రసికానందము (అముకృతి) వీనియందలి యనువాద పద్ధతులను స్థాలీపులాక న్యాయముగా విమర్శింతును.

## పద్య కావ్యములు - దేవీభాగవతము

అష్టాదశ మహాపురాణములందుఁ బంచమమును, గాయత్రీమంత్రప్రాశస్త్య నిరూపణాత్మకమును, శక్తిమాహాత్మ్య వర్ణన ప్రధానమును నగు నీ పురాణమును గీర్వాణము నుండి తెనుఁగుసేసి తి. వేం. కవులు ప్రాచీనమార్గ కవుల పద్ధతినిఁ బాటించిరి ఐహికాముష్మిక సుఖప్రదము దేవీభాగవతము.

సీ॥ జగదధీశ్వరు రూపు సారెసారెకుఁ జూపు
పరమాంజనము దేవిభాగవతము;
ముక్తి కాంతను దార్చు మూలమంత్రము నేర్పు
ప్రౌఢదూతిక దేవిభాగవతము;
కామితమ్ము లొసంగఁ గల్పద్రుమ మనంగఁ
బ్రథితమైనది దేవిభాగవతము;
దోషమ్ములను దుంపతోఁ గూడఁ దెగఁదెంప
వాడి గుద్దలి దేవిభాగవతము;

గీ. పఠనపాఠన యోగ్యంబు భాగవతము
వరమ మునులకు సేవ్యంబు భాగవతము
ఆగమాఖిలసారంబు భాగవతము
భారతికిఁ బ్రాణతుల్యంబు భాగవతము. —దేవీ. ప్ర. 36.

ఇట్టి పుణ్యకృతి ననువదించి జన్మసార్థకపఱచుకొనుటకై కవులు యత్నించిరి. దేవ్యుపాసనా బలములేనిది యిట్టి మంత్రశాస్త్ర రహస్య గ్రంథము లనువదించుట కష్టము కవుల కట్టి ఆధ్యాత్మికశక్తి యున్నది కావుననే యీ కావ్య

రచనమునందు రాణించి కీర్తిఁగాంచియుండిరి. ఈ పురాణమునకు కవుల "గురు బ్రహ్మము" కృతిపతి యగుట బంగారమునకుఁ దావి యబ్బినట్లైనది. అచంచలము, నిష్కల్మషమునైన గురుభక్తియే యీ గురు కార్యమును సాధింపఁజేసిన దనుటలో నాశ్చర్యము లేదు. భక్త పోతనవలె తాము నొక భాగవతమును అనువదించుచు నాతనివలెనే వీరును వినయగుణము విలసిల్లఁగా నిట్లనియున్నారు.

క. ఎన్ని పురాణమ్ములఁ దా
మన్నియు నాంధ్రీకరించి, యనుకంపనుగా
కున్నన్ దీనిన్ విడుతురె
నన్నయభట్టాది కవిజనమ్ములు మాకున్. (ప్ర. 16)

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్" అన్న పోతన్నగారి పద్యమునందలి భావసంస్కారమే యిందును భాసించుట సహృదయు లూహించుట సులభము. తి.వేం. కవులు రచించిన మహాకావ్యమే దేవీ భాగవతము. వారి దృష్టిలోఁ బురాణ పరివర్తనమే కావ్య నాటకాదులకన్న రసవత్తరమైనదని శ్రీనివాస విలాస పీఠిక తెల్పుచున్నది. కావున వారి రసకవిత యంతయు నీపురాణమునఁ గేంద్రీకృతమై యుండుననుటలో విప్రతిపత్తిలేదు.

అనువాదము రసవంతముగా నెట్లుండునను సంశయముండ నవసరము లేదు. అది భావ కథానువాదములలో సాధ్యమే. భావానువాదము కవిత్వ భావనకు సంబంధించినంతవఱకు కవి స్వీయమే కాఁగలదు. అట్టి స్వాయత్తమైన భావము కవిచే నావిష్కరింపఁబడునప్పుడు అనువాద శంక పొడమనే పొడమదు. దానికి కారణము కవి కావ్యరసతత్త్వములో కవిత్వావేశము పొందును కావుననే అట్టి దీపురాణమునందు తి వేం. కవుల రచనమునఁ గానఁబడుచున్నది.

ద్వాదశకాండలు కల్గిన ఈ పురాణ రచనమునందు తి.వేం. కవులతో పాటు వారికి సన్నిహితులైన మఱికొందఱు కవులు కూడ భాగస్వాములై ధన్యులైరి. నవమస్కంధమున మొదటి యైదును, చివఱి రెండు అధ్యాయములును తిరుపతి శాస్త్రిగారి కుమారులైన వేంకటావధానిగారును, నవమస్కంధ శేషమును నిశ్శంకుల కృష్ణమూర్తి శాస్త్రిగారును, ఆకొండి రామమూర్తిగారును, దశమస్కంధము వేంకట శాస్త్రిగారి పినతండ్రి కొమరులగు చిన వేంకటశాస్త్రి గారును రచించిరి ఇట్టి నవమ దశమ స్కంధములుగాక మిగిలిన గ్రంథమం

తయు తి వే. కవులు స్వయముగనే రచించిరి. ఇట్టి పురాణము బహుకర్తృక మయ్యు - భాగవతము వలెనే - ఏకకర్తృకముగానే భాసించుట గమనింపఁదగి నది. శిష్యులను గూడ తమతో పీటవేసి కూర్చుండబెట్టుకొన్న తి.వే. కవులు హాళక్కి భాస్కరునికన్నను, బమ్మెర పోతరాజుకన్నను ఏమాత్రము తీసిపోరు.

తి.వేం. కవులీపురాణ రచనమునం దనుసరించినది భావానువాద పద్ధతి. ఉదాహరణమునకు కొన్ని ఘట్టములను గైకొని స్థాలీపులాకన్యాయముగాఁ బరిశీ లింతును.

## 1

బుధోత్పత్తి ఘట్టమును గైకొని మూలముతో కొన్ని పద్యములు పోల్చి తి.వే. కవుల యనువాద విధానమును స్థూలముగాఁ బరిశీలింతము - ఉదా:

శ్లో॥ గురోస్తు దయితా భార్యా తారానామ్నాఽతివిశ్రుతా।
రూప యౌవన యుక్తా సా చార్వంగీ మదవిహ్వలా॥

శ్లో॥ గతైకదా విధోర్ధామ యజమానస్య భామినీ।
దృష్టా చ శశినాఽత్యర్థం రూపయౌవన శాలినీ॥

శ్లో॥ కామాతురస్తదా జాతః శశీ శశిముఖీంప్రతి।
సాఽపి వీక్ష్య విధుం కామం జాతా మదన పీడితా॥

శ్లో॥ తావన్యోన్యం ప్రేమయుక్తౌ స్మరార్తౌ చ బభూవతుః॥
తారా శశీ మదోన్మత్తౌ కామబాణప్రపీడితౌ॥

శ్లో॥ రేమాతే మదమత్తౌ తౌ పరస్పర స్పృహాన్వితౌ।
దినాని కతిచిత్తత్ర జాతాని రమమాణయోః॥.

—సం. దేవీభా. I స్కం 11అ. 5.9 శ్లో.

అనువాదము :

ఆ.వె. కలదు తారయనెడి కామిని యల బృహ
స్పతికి దార గుణవిదారదూర
విజితమారదార విపులకటీభార
కడుసుధార చారుకాంతిపూర॥

క॥ ఆ రామ యొక్కదినమునఁ
దారావతి యింటి కరుగ దాని యొయారం
బారసి యారసికాగ్రణి
మారశిలీముఖ విదారణ్యమాణుండయ్యెన్.

క॥ ఆ కాంత తమీకాంతుని
యాకారముగాంచి విస్మితాంతరయై యు
ద్రేకం బాఁకొని యూఁకొన
నాకామునిబారిఁ బడియె నఁట యేమందున్?

మ. ఇటు లన్యోన్య మనోనురాగముల పెంపేపార నా తారయున్
గుటిలాత్ముండగు చంద్రుఁడున్ గలిసి కోర్కుల్ మిన్నుముట్టంగ లం
పటులై సౌఖ్యము సోలుచుండిరఁట! చెప్పన్ శక్యమే దైవసం
ఘటనానైపుణిఁ యాతఁ దయ్యదియొ! యక్కంజాక్షియే యాతఁడో!
—దేవీ. ప్ర.స్కం. 216-219.

మూలమున్నదని చెప్పకపోయినచో తెలుఁగు పద్యము లనువాద భ్రాంతిని బుట్టింపవు. సహజమైన కవిత్వధార, రమణీయమైన శబ్దార్థసంపద, అనుప్రాసాది శబ్దాలంకారవైచిత్రి, మాధుర్యగుణము, నుడికారపు సొంపు అనువాద భ్రాంతి కడ్డములై నిలుచుటలో నాశ్చర్యము లేదు. ఇట్టి యనుభూతి నిచ్చుటయే యుత్తమానువాదమునకు గీటురాయి. మూలము నైదు శ్లోకములు. తెలుఁగున నాల్గు పద్దెములు. చివరి రెండు శ్లోకముల తాత్పర్యము మత్తేభ వృత్తమున నిమిడి పోయినవి. మిగిలిన మూడు శ్లోకములు మూడు పద్యములైనవి. మూలమునందలి పదమునకు పదమనువాదము కాదిది. మొదటి శ్లోకముతో మొదటి పద్యమును పోల్చిననే యీ సత్యము బైటపడఁగలదు. గురుశబ్ద మచ్చట - బృహస్పతి శబ్ద మిచ్చట; దయితా భార్యాశబ్దము లచ్చట దారశబ్ద మిచ్చట; అతివిశ్రుతాఁ, రూప యౌవనయుక్తా చార్వంగీ, మదవిహ్వలా శబ్దములు తెలుఁగున రానేలేదు. వానికిఁ బదులు కామిని, విజిత మారదార, విపుల కటీభార, కరుసుదార, చామకాంతి పూర అను పదములు చేరి పద్యమైనవి. తాత్పర్య మొకటియే కాని దానిని ప్రపంచించు విధమే వేరు. అదియొక పోత - ఇదియొక పోత. రెండు రెండు వ్యక్తిత్వములు, ప్రత్యేకతలు కల్గియున్నవి. పరిశీలించుచో మూలమున కన్న తెలుఁగున పదప్రయోగమునందు సాభిప్రాయత యధికముగా గోచరించు

చున్నది. కామిని యనుటలో నామె గుణము, విజిత మారదారాదులలో శరీర సౌందర్యమును కవులు ప్రత్యక్షీకరించుచున్నారు. "మారదార" యనుట మూడవ పద్యములో "నా కాముని బారిఁబడియె"నని వర్ణించుటకే. తారా చంద్రుల సంబంధమున గోచరించు ప్రత్యక్షపు టశ్లీలమును ఛన్నముచేసి యన్యాపదేశముగా నలంకార వ్యంగ్యమునఁ బాత్రలఁ బ్రవేశపెట్టు నేర్పిచ్చట యసమానము విపులకటీభార యను పదము రెండవ పద్యములోని "యొయారములు" ప్రదర్శించు సామర్థ్యమును బ్రకటించుటకు ప్రయుక్తము. దాని వెంటనే "కరునుదార" యనుట చమత్కారము ఉదారయనఁగా గొప్పది యను అర్థమేగాక "దాత" యనియు నర్థము కలదుకదా! పై రెండు విశేషణములను కలిపి చదువుచో నొక విధమైన భావికథార్థ సూచన రాకమానదు. "చారు కాంతిపూర" యనుట రెండవ పద్యములోని "తారానాథు"ని మురిపించుటకే. 'తార' యను శబ్దమే చంద్రునిపై లగ్నమగు హృదయమును ధ్వనింపఁ జేయుచుండ దాని గుణస్ఫూర్తినిచ్చు విశేషము జేర్చుటకే 'చారుకాంతిపూర' యనుట. ఇట్లొక పద్యము భావి పద్యములలో నిబధింపఁబడు వాక్యార్థములకు సూచ్యార్థ పద సమ్మితమై శిల్పవైభవము సంతరించుట "ముక్కికి ముక్కి" యను వాదమున కుదురదు కదా! "అతఁ డయ్యెడియొ యక్కంజాక్షియే యాతఁడో" అని వారి యభేద స్ఫూర్తిని ధ్వనింపఁ జేయుటయు, "ఏమందున్, చెప్ప శక్యమే" అని పల్కించి అశ్లీల కథార్థ ప్రకటనకు పాపశంకను పొడించు పవిత్ర పౌరాణికుని మనఃప్రవృత్తి నావిష్కరించుటయు మూలమునకు మెఱుఁగులు దిద్దుచున్నవనినచోఁ దప్పేమి కలదు? ఆటవెలఁది, మత్తేభము! వృత్తౌచిత్యము గణించుచో నీ భాగము కరునుదారము.

## 2

బృహస్పతి చంద్రునిచే నవమానింపఁబడి యింద్రునిఁజేరి, తన గోడు చెప్పుకొనెను. ఆ పల్కులలో నొక శ్లోకము.

శ్లో॥ కింకరోమి సురేశాన త్వమేవ శరణం మమ।
సాహాయ్యం కురు దేవేశ దుఃఖితోఽస్మి శతక్రతో.

—సం దేవీ. I స్కం. 11 స. 41 శ్లో.

అనువాదము :

సీ॥ అంగనామణి లేని యా్రశమంబు శ్రమంబు
భార్యలేకున్న సంపత్తి మిత్తి;
అర్ధాంగి పెట్టని అన్నంబు సున్నంబు
సహధర్మిణికిఁగాని శయ్య కొయ్యః;
గృహిణి పొందికలేని కేలిక తేలిక
యిల్లాలు లేకున్న యిల్లు ముల్లు
సహచారిణికిఁగాని సంగంబు భంగంబు
సతిఁజేతఁ బెరుఁగని సుతులు మృతులు

గీ॥ శిష్యుఁడవు గాన నీతోడఁ జెప్పుకొంటి
నాతలోదరి నిప్పించి నా మనోర
థమ్ము నాడఁ గూర్పు; మీరీతిఁ దలఁపవేని
సన్న్యసించెదఁ గాని సంసార మొల్ల" —ప్ర 237.

దాని కిది యనువాదము కాదన్నను తప్పులేదు. కవులకు రసదృష్టియే ఇందు ప్రధానము. ఉచిత విభావాశ్రయములైన భావములకే రససిద్ధి. ఇందు బృహస్పతి నాశ్రయించినది విప్రలంభము. అందు దైన్యమను భావము అధికముగాఁ బ్రదర్శిత మగుచున్నది. అట్టి భావోద్వేగము గురుశిష్య సంబంధమునకు, లౌకిక మర్యాద లకు, పాత్రగతమైన సహజ ధీరత్వమునకు, వ్యక్తిత్వమునకు లోటు రానీయ కూడదు దేవరాజ సింహాసనమున కేడుగడయైన బృహస్పతి శిష్యుని నొద్దకుఁ జేరి అతనిని "అన్యథా శరణం నాస్తి" అని కుయివెట్టి వేడుకొనుట కవులకు రుచింప లేదు.గురువున కత్యంతమైన అప్పుడు శిష్యుఁడు కనుక అతనితో 'రహస్యముగా' చెప్పుకొనినట్లును, ఇట్టి విషయము లితరత్ర చెప్పఁగూడనివైనట్టును సన్నివేశ మును కల్పించిరి. ''ఈ రీతిఁ దలఁపవేని సన్న్యసించెదఁగాని సంసార మొల్ల'' అని యనుట ఒక బెదిరింపు. ఇప్పుడు సంసారము లేనేలేదు. ఇఁక ఆయన సన్న్యసించునది యే సంసారము? సురరాజ్య మంత్రిత్వాది లౌకికకార్యబహుళమైన సంసారము! దాని నాతఁడు సన్న్యసించుచో ఇంద్రునికే సన్న్యాసమిప్పించినట్లు. 'నాకు సాయముచేసి నావలన సాయము పొందు'మను నీతి సురగురవు పాత్ర కిచ్చుట కింకము. తాను కోరుచున్నది అనల్పమైన వస్తువని సీసపద్య పాదముల నాల్గింట నిరూపించి చెప్పినాఁడు గురుఁడు. ప్రతి పాదార్ధమునందును రెండుమూఁ

దక్షరముల పౌనఃపున్యము అంత్యానుప్రాసగా నిలిచి యెనలేని యందమును, సీస పద్యపు నడకకు యొయ్యారములను గల్పించుచున్నవి. మూలమునందలి యనౌచిత్యస్ఫూర్తిని తొలఁగించి రసదృష్టితో నౌచిత్యము నాంధ్రీకరణమునఁ బ్రవేశపెట్టుట యన నిట్టిదే.

## 3

చతుర్థ స్కంధమునందలి నరనారాయణాశ్రమమం దుదయించిన అకాల వసంతర్తు మన్మథ సంరంభ వర్ణన మొనర్చిన ఘట్టములో కొన్ని శ్లోకములు. 4 స్కం. 6 అ. 1 శ్లో-7 శ్లో.

శ్లో. ప్రథమం తత్ర సంప్రాప్తో వసంతః పర్వతోత్తమే।
పుష్పితాః పాదపాః సర్వే ద్విరేఫాలి విరాజితాః॥

శ్లో. ఆమ్రాశ్చ వకులారమ్యాస్తిలకాః కింశుకాః శుభాః।
సాలస్తాల స్తమాలాశ్చ మధూకాః పుష్పితాభవన్॥

శ్లో. బభూవుః కోకిలాఽఽలాపా వృక్షాగ్రేషు మనోహరాః।
వల్ల్యోఽపి పుష్పితాః సర్వా ఆలిలింగు ర్నగోత్తమాన్॥

శ్లో. ప్రాణినః స్వాసు భార్యాసు ప్రేమయుక్తాః స్మరాతురాః।
బభూవు శ్చాతి మత్తాశ్చ క్రీడాసక్తాః పరస్పరమ్॥

శ్లో. వవర్మందాః సుగంధాశ్చ సుస్పర్శా దక్షిణానిలాః।
ఇంద్రియాణి ప్రమాథీని మునినామపి చాఽభవన్॥

శ్లో. రతియుక్త స్తతఃకామః పూరయ న్పంచమార్గణాన్।
చకార స్త్వరిత స్తత్రవాసం బదరికాఽఽశ్రమే॥

శ్లో. రంభా తిలోత్త మాద్యాశ్చ గత్వా తత్ర వరాశ్రమే।
గానం చక్రుః సుగీతజ్ఞాః స్వరతాన సమన్వితమ్॥

అనువాదము

మ. చివురుం గొమ్మలతో రసాలములు పుష్పించెన్ ద్విరేఫాళి జుం
జావు మంచున్ బ్రతిసూనగుచ్ఛముపయిం జూదం దగెన్ మించి పం
డువు గావించెను గర్ధయుగ్మములకున్ బుంస్కోకిలారావ, మ
క్కవసంతుండు తదాశ్రమావనితటిం గాలూఁదు నాలోవలన్.

క. పొగడలు తమాలములు మో
దుగులున్ దిలకాగములు మధూకమ్ములు గెం
జిగురుం బూవులతోఁ ద
న్నగమున న్నింపుం దనర్చె నయనమ్ములకున్.

సీ. లత లన్నియును బుష్పవతులై నగంబుల
 నంచితంబుగఁ గౌఁగిలించుకొనియె;
మందమ్ములై మంది గందంపుఁ దావితోఁ
 జెలరేఁగి నునుగాడ్పు లలముకొనియె;
రాలముగ్గిన పండు గాలించి మెసవ చుఁ
 గొరదమ చిల్కల దండు కూయఁ దొడఁగెఁ
బండుటాకుల మీఁదఁ బడెడి పూవులచాలు
 పండు వెన్నెల బాతి పరిఢవిల్లె;

గీ. నాలుమగలెల్ల మొల్లమౌ పూలఁ జాల
లీల నాదఁవఁగఁ జేయు నీరాలలోన
నించు విల్కాని చెయ్యి లగ్గించుకొనుచు
సంతసింపఁగ సాగిరా సమయమందు.

గీ. ఇటు వసంతుండు మున్న యచ్చటను జెలఁగఁ
బంచ బాణమ్ములు గొలసించు విల్లుఁ
దాల్చి యప్సరసలు వెన్నుఁదన్ని రాఁ ద
దాశ్రమము సేరె సుమబాణుఁ దటయుఁ దగుచు.

ఉ. ప్రాకులు మోసులెత్త గరిమ న్నెలబాల్గరఁగంగఁ గోటరా
నీక నివాసమై తగు పణి ప్రకరంబు కరంబు వేడ్కతో
నూఁకొనఁ గోకిలల్ ప్రతి రవోదయముం బొనరింపఁ బాడి ర
వ్యాకుల లీల నప్సరస లయ్యెడ రమ్యలయ స్వరంబులన్.

—చతు. స్కంద. 119 - 123 ప.

మూలమునందలి శ్లోక తాత్పర్య క్రమమును బాటింపక వివర్యాయముగా భావములు తెలుఁగున సంధింపఁబడినవి. మూల భావము పద్యపూరణకుఁ జాల నప్పుడు స్వీయ కల్పనలు కవు లిందుఁ బ్రవేశపెట్టిరి. మూలమునందలి 'గతార్ధ

పునరుక్తిని తొలఁగించుట జరిగించుట జరిగినది. అట్లు చేయుట వలనఁ దెలుఁగున క్రమవికాసాత్మక కథాకథనము, సన్నివేశ రూప సాక్షాత్కారము, ప్రకృతి పురుష పరస్పర ప్రభావ సమన్వయము అనెడి గుణము లేర్పడుటయే ప్రయోజనము. దానిని వివరింతును: మూలమున మొదటి శ్లోకములో "పుష్పితాః పాదపాః సర్వే" అనుటలో రెండవ శ్లోకము గర్భార్థమగు చున్నది. సూత్రప్రాయముగా నొకసారి చెప్పుట మఱల దానిని వివరించుట యనునది యిట్టి వర్ణనల పట్ల ఉచితముకాదు. కవులందువలన రెండవశ్లోకములోని ఆమ్రకిసలయములను వసంతాగమసంకేతములుగా ప్రప్రథమమున గైకొనిరి. తెలుఁగున మొదటి పద్యములో చిగురించిన రసాలములు - పుష్పగుచ్ఛములపై వ్రాలు ద్విరేఫములును, పుంస్కోకిలా రావములు వరుసగా వర్ణితములైనవి. ఇందలి కోకిలా రావములు మూలమున మూడవ శ్లోక ప్రథమ పాదములోనివి. "ఒక్క వసంతుఁడు తదాశ్రమావని తటిం గాలూదు నాలోవలన్" అన్న యుక్తి చమత్కారము మూలమునలేదు. వనతటియందు కాలూఁదు సరికే యింతలైనచో సాంతము వన ప్రవేశ మొనర్చినచో నికేమి చెప్పవలెను? అని భావము. రెండవ శ్లోకమునందుఁ బేర్కొనఁబడిన చెట్లివి :- ఆమ్రములు, వకుళములు, తిలకములు, కింశుకములు, సాలములు, తాలములు. గీర్వాణమున నీ పేర్లు వినునప్పుడు శ్రవణ సుఖముగా నున్నవి. తెలుఁగు చెవులకు వకుళములు, కింశుకములు అనుటకన్న పొగడలు, మోదుగులు అనుటయే యింపగును. కాగా మఱల - ఇప్ప చెట్లనుటకన్న మధూకములనుటయు, బొట్టుగు చెట్లనుటకన్న తిలకములనుటయు, చీకటి చెట్లనుటకన్న తమాలములనుటయు అందముగా నుండును. సాలతాలములం పూలకంత ప్రాధాన్యము లేదు. కావున వదలఁబడినవి. శ్రవణపేయములగు మాటల నెన్నుకొని తెలుఁగువారిని రంజింపఁజేయుటయే యీ యనువాదకుల పరమ తాత్పర్యము!

తృతీయ శ్లోక పరార్థమునుండి పంచమశ్లోకాంతము వఱకు గల భావము సీసపద్యమున నిమిడిపోవుటయేగాక రెండు చరణములు కవులు పూరింపవలసి వచ్చినది. "వల్ల్యోపి పుష్పితాస్సర్వాః...." అను చరణము సీసపద్యపు ప్రథమ పాదమైనది. "వరర్మదాఁ సుగంధాళ్చ........" యను చరణము సీసపద్య ద్వితీయపాదమైనది. నాల్గవశ్లోక మెత్తుగీత మైనది. మూలక్రమము నిట్లు మార్చుటకు మూలకారణము కవులు "ఇంద్రియాణి ప్రమాథీని ముని నామపి చాఽఽతవన్"

అను పాదమును అనువదింపఁ బూనమియే. వ్యాసుని రచనమున నొక శిల్పదృష్టి కలదు. కొండల నాలింగన మొనర్చు లతలు విభావములు కాగా తన్నగముపై దంపతుల మదనావేశముతో క్రీడ సల్పిరనియు, మందమలయానిల శీతల స్పర్శచే మౌనులు ధృతి దప్పిరనియు చెప్పుట వ్యాస తాత్పర్యము. తి.వేం. కవులు ఋషులపై గన్పట్టు వసంత ప్రభావము నుజ్జగించిరి. అట్లు వదలుట వలన నరనారాయణాశ్రమ ప్రాంత మంతయు - భారతమున కణ్వాశ్రమ మందువలె- ఋషిశక్తి ముద్రితమై కామదూరమై యున్నదని చెప్పుట కవుల తాత్పర్యము. వీరి దృష్టియు సమంజసమైనదే. మూలము నందలి ఋతువర్ణనమున నంత నిగ్రహము కానరాదు; తెలుఁగునందలి వర్ణనము సమయోచిత గంభీర భావ ముద్రితమైన నిగ్రహము కలిగినది. సీసపద్యమునందలి మూడవ నాల్గవ చరణములు రెండును కవి కల్పితములు - ఇందు ముదరఁబండి రాలనున్న పండ్ల గుజ్జు తినుచున్న కొదమ చిలుకలు చేయు రావములు, పండుటాకులమీఁద రాలిన పూల గుంపులు పంపు వెన్నెల వలె నుండుటయు, వర్ణితములైనవి. ఈ పంక్తులు కడు నౌచితీ సంభరితములు. అంతకు పూర్వమా నగమున హేమంత శిశిర ములు తాండవించినవి, వసంత మిప్పు డొక ఉప్పెనగా వచ్చిపడినది. పూర్వ ఋతు చిహ్నములు పూర్తిగా పోలేదు; వసంత చిహ్నములు ముమ్మరముగా కనఁబడుచున్నవి. పొగబారిన యింటికి సున్నము వేసినట్లున్నది యిచ్చటి ప్రకృతి. దానిని తి.వేం. కవుల ప్రజ్ఞా నేత్రము దర్శించినది. మూలమున లేని మెఱుఁగులు దిద్దనారంభించినది. పండ్లు ముదరపండి దాల రాలిపోయినవి. చిలుక లకు పండ్లగుజ్జు కఱవైనది. అందువలననే చిలుకలు పండ్లకొఱకు "గాలించుట". ఎక్కడో ఒక్క పండు దొఱుకఁగా దానిని తెచ్చి "చిల్కలదండు మూఁక ఉమ్మ డిగా" మెసవుసఁట! ఎంత సునిశిత ప్రకృతి పరిశీలనము! చిలుకలు వసంతవేళ కూయుచున్నవి. మన్మథసైన్యములో "చిలుకలదండు" మూలబలము కదా! అచ్చట మూలమున వసంతునికి ఈ బలమేదీ? ఇఁక పండుటాకులు శిశిర ఋతు చిహ్న ములు. వానిని కప్పిపుచ్చుటకై నవకుసుమములు గుంపులు గుంపులుగా వానిపైఁ బవళించుట; వెన్నెల భ్రాంతిఁ గల్పించుట! ఆ వెన్నెల భ్రాంతియే దంపతుల కూటమికి హేతువగుచున్నట్లు క్రమాన్వయమున స్ఫురించును కదా!

మూలమున మన్మథునికి లేని 'అభయత్వము' తెలుఁగున కవులు స్థాపించి నారు. నాల్గవ పద్యమున "గానం చక్రుః సుగీతజ్ఞాః స్వరతాన సమన్వితమ్" అను

చరణమే తెలుఁగున నొక యుత్పలమాలికా వృత్తమైనది "శిశుర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అను ప్రసిద్ధిని గైకొని 'పశుప్రకర" మందు ప్రవేశించినది, పాటకు మోదుల చిగిరించినవి, నాగులు పడగలు విప్పి యాడి నవి; ప్రకృతి ప్రతిధ్వనించినది అని చెప్పుటతో నా గాన ప్రభావము ప్రకృతి యందు ముద్రించి, ఋషులను కన్నులఁ దెఱపించునట్టి తీవ్ర పూర్వరంగమును కల్పించుట యిందలి తాత్పర్యము. ఋషుల శాంత ప్రవృత్తి ప్రసారమున కిది సమర్థమగు నెమరెత్తు. "అవ్యాకుల లీల" నను విశేషణము సాభిప్రాయము. శ్రవణసులభమగు జంత్రనాద సమ్మేళనము వలె - విజాతీయస్వర విరహితమైన గానము లయస్వర యుక్తమై యొప్పినదని యందలి తాత్పర్యము. ఇట్లు వివ రించుచో తెగువని కాదు. వ్యంగార్థ స్ఫూర్తి "సిడికొలఁది తామర" కదా! కవుల యనువాదము వ్యంగ్యార్థ మర్యాద నాశ్రయించినది కాని శుష్కశబ్దము నాశ్ర యింపలేదు.

## 4

తత్త్వవిషయము ననువదించుటయందును కవులు సులభమైన శైలిని వాడి, పండు నొలిచి చేతి కిచ్చినట్లు - తదర్థము అవగతమగునట్లు ప్రయత్నిం చిరి. ఉదా :

శ్లో॥ ద్వయోరభ్యాస యోగో హి బ్రహ్మసంసిద్ధి కారణమ్।
తమః పరివృతే గేహే ఘటో దీపేన దృశ్యతే॥

శ్లో॥ ఏవం మాయావృతో హ్యాత్మా మనునా గోచరీకృతః।
ఇతి యోగ విధిః కృత్స్నః సంగః ప్రోక్తో మయాధునా॥

శ్లో॥ గురూపదేశతో జ్ఞేయో నాఽన్యథా శాస్త్రకోటిభిః॥

—సప్తమ స్కం. పంచత్రిం. 61 - 63.

అనువానము :

తే॥గీ॥ "యోగమంత్రమ్ములందు నన్యోన్య సాధ
కము లగుచు బ్రహ్మసిద్ధికిఁ గారణములు
బ్రహ్మమగుపదనగును మంత్రమను దివ్వె
కతనఁ జీకటి యిండిలోఁగలశి పగిది.

తే.గీ. ఇట్టి యోగ మంత్రమ్ముల నెఱుఁగఁబడెడి
మాయచే నావృతం బాత్మ మో యగేశ!
యోగవిధి దేశికునిఁగొల్చి బాగుగ నెఱుఁ
గంగవలె శాస్త్ర పఠనమ్ము గఱపనేల?

తే.గీ. స్వ ప్రకాశంబు బుద్ధి నిష్ఠంబు బ్రహ్మ
మిందుఁ గల్పిత మీజగమెల్ల బ్రహ్మ
మరయ నేరికిఁగాదు శక్యంబు దీని
నెఱుఁగువాఁడు మృగ్యుండని యొఱుఁగుమచల". —సప్త. 930-932.

మూలమున కన్న విషయవిపులీకరణము, వివేచనాత్మకమైన పరిశీలన దృష్టి తెలుఁగునందు కానవగుచున్నది. మూలము సూత్రప్రాయముగా నుండ అనువాదము లఘువ్యాఖ్యవలెనుండుట యిందలి విశేషము.

ఇట్లెన్నియో యనువాద శిల్పముల వెలార్చుచు తి. వేం. కవులు దేవీ భాగవతాంధ్రీకరణమును నిర్వహించిరి. నన్నయ గారి ధార, తిక్కన గారి కళా విన్యాసము, శ్రీనాథుని వక్రోక్తి, పోతనగారి కొన్ని పద్యముల శైలి, పెద్దనగారి పాకము వీరి కవిత్వమునఁ బ్రతిబింబించినవి. సహజమైన చాటుకవితా సారళ్యము వీరికవితకు తియ్యందనములు కల్పించినది. వీరికి పూర్వమే శ్రీ దాసు శ్రీరామ దాసు కవిదేవీభాగవతము ననువదించెను. అతనిది భక్త్యావేశముతోఁగూడిన కవిత; వీరిది కావ్యకళా నికేతనమైన కవిత. పఠనపాఠనములందును, పారాయణాదులందును ఈ రెండు గ్రంథములు తెలుఁగుదేశమునఁ బ్రచారమందియున్నవి.

## శివ లీలలు

వేంకట శాస్త్రిగారు వార్థక్యమున శివసంబంధమైన కావ్యరచనా వ్యాసంగముఁ గల్పించుకొని యిహపర సాధనకుఁ గృషి సల్పియుండిరి. తత్స్వరూపమే 'ఆంధ్రస్కాందము - లేక శివలీలలు' దీనిప్రతి నాకు లభింపలేదు. ఇటీవలి చర్యలోఁ గవులు దీనిఁగూర్చి వ్రాసిన భాగము నిచ్చట యుట్టంకింతును. ఈ గ్రంథ రచనలో కవిగారికి ప్రోత్సాహమిచ్చినవారు ముదిగొండ వీరభద్రయారాధ్యులు.

ఉ॥ "స్కాందముఁ జూడనోపికయుఁ జాలదు చూడనులేదు వీరభ
ద్రేంద్రధరాంఘ్రిభక్తుఁ డెది యేగతిఁ జెప్పుచువచ్చె వానినే

యిందు గ్రహించి దీని రచియించితి లక్షణ లోపమెల్ల నా
యందును దక్కులోపముల యారెదులందును నుండు ధీవరుల్."

వ. వీరారాధ్యులు బహు గ్రంథములు దిలకించియుఁ బలువురు వృద్ధుల వలన నెఱిఁగియు నాయా యీగాథలు నాకు నొడివె. నేను శ్రీనాథుఁడు నైషధ రచన యందున్‌బలెఁ గొండొక స్వాతంత్ర్యంబు గైకొని రసానుగుణంబుగ నాయీ స్కాందము విరచించితి. నిందు స్కాందమున లేనివిగూడ రెండు మూఁడు గాథలు గలవు. కొన్ని యితర పురాణంబులనుండి గ్రహించినవియుం గలవని యెఱుంగునది.

క. శివుఁడే రచించెనో? నే
ను విరచనము బొనరితినో? యెఱుఁగ నాగిన్
శివలీలా కావ్యం బా
శువులో సంసిద్ధమయ్యె సూరులు వొగడన్. (ఇటీ 385.387)

షరా:. శివలీలా కావ్యము - దీనికే నామాంతరము. ఆంధ్ర స్కాందమని తెల్విడి. 'వ్రతకథలు' దీనినుండి పుట్టినదే.

ఆశువుగా నీ పురాణమును చెప్పు వృద్ధ కవీంద్రుని గాంచుచో జీవితమే సారస్వతముగా కవులు బ్రతికిరని తాత్పర్యము స్ఫురింపఁగలదు.

## శ్రీనివాస విలాసము

ఆత్మకూరు సంస్థానాధీశ్వరులగు సీతారామ నృపాలుని యాస్థాన కవియగు శ్రీమాన్ వసుదుర్గము కృష్ణమాచార్య కవివరేణ్యులచే సంస్కృతమున రచింపఁ బడిన శ్రీనివాస విలాసమను కురుమతి ప్రభువగు శ్రీనివాసుని కల్యాణోత్సవము వర్ణించు వైదార్భముల ప్రౌఢ ప్రబంధము. తి.వేం. కవులాయాస్థానమును దర్శిం చినప్పుడా భూపతి ప్రీతితో నాగ్రంథమనువదింపఁ గవులను కోరెను. కవు లంగీక రించి, రచించి యా గ్రంథతత్త్వ మిట్లుపన్యసించిరి:

ఉ॥ ఈ కవి గొప్పవాఁడనుట యెల్లరకున్ విశదంబకాని శ
బ్దాకలనమ్ము నం దితని కాదర మెక్కుడు. శబ్దకీరులం
గైకొను వారి కబ్బములఁ గన్పడు వ్యర్థములైన శబ్దముల్
చేకొను తెల్గుసేయ నవిసెప్పిన యట్లు వినంగ నేర్పునే.

ఉ॥ కేవల శబ్దముల్ దగ లగించి బిగించిన యట్టి సంస్కృతం
బేవగ విప్పి చెప్పనగు? నేమన గుర్దలు రైకలోపలం
బ్రోవిడినట్టి శుష్కకుచపొంకము బైటకుఁ బెట్టినన్ రసం
బావహిలంగ నేర్చునె? మహాకవులార యనుగ్రహింపుఁడీ!

మ॥ జతుకాష్ఠ క్రియ నొప్పు సంస్కృతపు శ్లేషల్ దెల్గుగాఁజేయ మా
మతికిన్ శక్యమటంచుఁ దోఁచ; దిఁక మా మాటట్టులుండగ ను
న్నతులై పేరునుగొన్న యట్టి యల శ్రీనాథాదు లివ్వట్టునన్
సతులర్పించిరి నిక్క మియ్యది ప్రమాణంబుల్ తదుద్గ్రంథముల్.

ఉ॥ నేరిచిన ట్లొనర్చితిమి నేరని దిప్పుదు నేర్తుమే? మఱి
వ్వారలు గాని దీని రసవంతముగాఁ దెనిఁగించిరేని య
వ్వారికి మే మొనర్చెదము వందనము ల్పదివేలు, దీనిలో
నారని దిద్దువారలకు నట్లనె మే మొనరింతు మంజలున్."

—శ్రీని. అవ. 48, 50, 51, 58.

చివటి పద్యమున నున్న ఆత్మ విశ్వాసము, కవిత్వ వీరము గాంచినచో-

క॥ శ్రవణానంద మొనర్చిన
కవులు తమరు; తమరు రసముగాఁ గవనము జె
ప్పవలయునని బోధించుట
తుని వెన్నెల చల్లఁజేయు పోలికఁ గాదే! —(శ్రీ.ని అవ. 42)

అనిన యా నృపాలుని నమ్మకము వమ్ముకాలేదని స్పష్టమగుచున్నది. 'క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాన్నోపకరణే.'

శబ్దప్రధానమగు నీ కావ్యము భావానువాదమునకు లొంగదుకావున శబ్దాను వాదమే చేయుటయైనది. అందువలన కవులు రసప్రతీతిని శంకించిరి. అది వారి వినయ గుణమును దెల్పునదియే. మూలమునందలి బింకము పొంకము ప్రౌఢతా లక్షణము చెడకుండ తెలుఁగున నిలిపిన వారి సామర్థ్యము ప్రతిపద్యము చాటు చునే యున్నది. మచ్చునకుఁ గొన్ని పద్యముల నుదాహరింతును :1

1. మూలగ్రంథము దొరుకకపోవుటచే సంస్కృతము నిచ్చట నియ్యఁజాలక పోవుచున్నాను. క్షమింప వేడెదను.

(1) సర్వ లఘు సీసము :

లలిత తురగతతి కరి కలభ వృషభ పృథుర మహిప పరిచరణ
చణ మనుజగణము
కనక మయ దళక మృగ తనురుహ వసన మరతక ఖచితరుచి
రుచిర సుకటకగణము
ధళధళ దనుసమ మణితరళ రస రభతర సరస ఘృణిమసృణిత
సుసర విసరము
సకల ఫల సురభి సుమసమనుగత తరులసదుపవననికట కలిత
సుభవన గణము

తే.గీ. లును నొసఁగు తన వితరణ మను పదమును
సరసిజ గళిత మధురస సమ కవన ఫ
ణితులఁ గవులు నుతి సలుప మితహసితవ
దన సిత కిరణుఁ డగుచు ముదము బొదలఁగ. —ప్ర. 23.

ఛందోభేదమే తెల్పుచున్నదిది మూలముకన్న విలక్షణమైనదని, కవుల ప్రతిభాజనితమని, చిత్రకవితాభద్ర సింహాసనమని యీ కవిత.

(2) అంత్యప్రాసలు గల సీసపద్యపాదము లిం దధికము. ఉదా॥

సీ॥ మారాహిత క్షీరవారాశి హీరామృ
తైరావత ప్రభా చోరకములు;
సీరాయుధ విరించి దారతారాకర
ద్దారాధర ప్రభావారకములు;
స్వారాట్కృపాణ మందార కర్పూర నీ
హారాగరాట్పుత్రిభా దారకములు;
హారాగమల్లికా హార సుదా హార
చీరాంబర ప్రభా మారకములు".....

ఇందలి ప్రాసయతియందు నాల్గు పాదములందును "రా" అను అక్షరము పాటింపఁబడుట యొక విశేషము.

(3) ప్రౌఢ వర్ణనలకు.

సీ. నిజభుజాయుగ సమున్మేష సంవర్ధితా
ఖిలశర్మ కర్మితాఖిలజనుండు;
అతిలోక నిజవిక్రమతపనోరుస్థాయి
యమునాయమాన వియత్తలుండు;
కామినీజన మనః కైరవానంద సం
ధాన నిర్వ్యాజ చంద్రాయితుండు;
కరుణాతరంగ రంగత్కటాక్షచ్ఛటా
పాలితాఖిల రాజబాంధవుండు;
తే.గీ. సకల రాజన్య సంనూత మకుటతట సు
ఘటితరత్న వినూత్న ప్రకాశమాలి
కానవీనార్క ఘృణిగణ కలితదివ్య
పాదకమలుండు సోమభూపాలసుతుఁడు. —ప్ర. 18

వ. నిజవదనసిత కిరణకిరణాయమానాపాంగతరంగి చివపాంగి కృతకన కాంగిజననిచయాంగీకృత మంగళతర మృదంగ నినదసంగత సంగీతతరంగి బహువిధారోహణావరోహణ చాతుర్యశ్రవణ సముదంచ దమందానంద సోమరోచి శ్చామరోద్వేజనోద్వేల్లిత భుజవల్లికింకరీ నికరమందస్మిత గర్వితధళధళత్కపోల రుచినిచయ విలోకన సంజాత లజ్జావనత వదనంబులు నాదగు స్తంభోపాగ్రకీలిత కాలాయసంఘటిత మూలమనతరకులాదో దేశాదో ముఖబద్ధముకుర నికరంబుల నిగనిగలమిగిలి ద్వాదశాత్ముండగు తపనీయ శరీరుండగు భగవంతుండు నాయం ద వసియించునను గర్వంబు నొందుటకు సహింపక తదధిక గౌరవంబు సంపా దింప నుంకించి నానారూపంబులు దాల్చి యంతర్గత స్వర్ణవర్ణ భగవత్స్వరూపుడై నలుదిక్కులఁ జుక్కలు గొలువఁ దోతెంచిన తాగలవగకాని ననుకరించు సకీవ స్ఫటికమణి ఘటికాఘటిత సరవిసర వలయిత స్ఫాటిక సముద్గ కనికరంబును, నంతః ప్రతిఫలిత తపనబింబంబును, బుద్బుదనికర విరాజితమ్మునునగు కదలి సదలించు నిండుపేరోలగమ్మున. —ప్ర. 18, 24.

వేంకటశాస్త్రిగారి యనువాదమును గుఱించి "ఆంధ్రీకరణ విధానం" అను వ్యాసమునం దిట్లు నుడివినారు : "ఒక శ్లోకంలో నాలుగో చరణంలో 'దిశతు సజ్జ యార్య శ్రియమ్' అని వున్నది. 'సజ్జయార్యవరుఁడు నిరులు దయచేసి మమ్ము రక్షించుఁగాక' అని దాన్ని మేము తెలిఁగించాము మూలానికి మక్కికిమక్కిగా అర్థం

చెప్పవలసివస్తే 'సఞ్జయార్యః=సఞ్జయార్యుఁడు (ఈయన గ్రంథకర్త అయిన శ్రీ వసుమర్గం కృష్ణమూదార్య కవివరేణ్యునకుఁ బరమ పూజ్యుఁడున్నూ, బంధు సముద్రుఁడున్నూ అని యెఱుఁగఁదగు) శ్రియమ్=సంపదను, దిశతు=ఇచ్చుఁ గాక'. 'ఎవరికి' అని ఆకాంక్షించుకొని తన్ను మాలిన ధర్మం వుండదు గనక 'తనకు' అనే అర్థం యిచ్చే పదం సంస్కృతంలో అధ్యాహృతమవుతుంది. యిఁక మేము తెలిఁగించిన దానిలో 'శ్రియమ్' అనే యేక వచనానికి 'సిరులు' అని బహువచనం వదదమున్నూ. 'రక్షించుఁగాక' అనేది మూలంలో లేకుండానే పదదమున్నూ మిడిమిడి జ్ఞానులకు శంకల కవకాశాన్ని కలిగిస్తాయి కాని, వారికి ముందుగానే అట్టి అవకాశం లేకుండా పీఠికలో ఆంధ్రీకరణమంటే యేమిటో, పూర్వులు యీ విషయంలో యేలా ప్రవర్తించారో తెల్పుదు చేయడంచేత వారేమీ శకింపకుండానే వూరుకున్నారు........యేదో పదం సంస్కృతంలో లేక పోయినా స్వతంత్రించి ప్రకృతానికి అనుకూలించేదైతే అనువాదకుఁడు చేర్చుకోవ దానికి యే విధమైన అభ్యంతరం లేదు. దానికి వుదాహరణం 'రక్షించుగాక' అనేది ఆశీరర్థక క్రియా పదమే అని తెలుసుకోండి - యిఁక - 'ఉన్నదున్న యటులుంచి రచించిన ముచ్చటా' అనేవానికి వుదాహరణం చూపుతాను.

తే. "మృదుళమగుగాక కఠినమై యెసఁగుగాక
సరసమగు పద్యము ముదం బొసఁగు మదికి
రసికుఁడగు వాని కొక యధరంబె మోద
మిడునె, కుచయుగ మది మోదమిడకయున్నె?"

ఈ పద్య మేశ్లోకమున కనువాదమో? దాన్ని కూడా చూపితే కాని దానికి ట్రూ ట్రాన్స్‌లేషనో కాదో (True translation) పీలు చిక్కదు. శ్లోకం యిదుగో—

శ్లో. "మృదుళం వా కఠినం వా
సరసం చే త్పద్య మాదదాతి ముదమ్
రసికస్యా ధరధళమివ
కుచయుగ మపి కిం నమోద మావహతి."

సహృదయులైన విమర్శకులు యీ శ్లోకానికి ఆ పద్యం సరియైన అను వాదమని నిర్వివాదంగా వొప్పుకుంటారు. అన్యులో, మూల శ్లోకంలో లేనిదే "మదికిన్" అని అనువాదంలో యెందుకు వుండాలనిన్నీ మూలంలోవున్న "చేత్"

అనేదానికి అనువాదంలో ప్రతిపదం యేంపడ్డదనిన్నీ శంకించదానికి మొదలు పెడతారు. అట్టివారు యతిప్రాసలు కూర్చటం మట్టుకు చేతనైనవారే అయినా అంతమాత్రమేకాదు అనఁగా కేవల కవులు మాత్రమే కాదు. విద్వత్కవులే అయినా లేదా మహావిద్వత్కవులే అయినా వారిని వ్యక్తిగతంగా లోకం ఆదరిస్తే ఆదరిస్తుందేమో గాని కవితారసజ్ఞులనే హేతువుతో వారిని ఆదరించదు."

(క.గా. III 212-214)

ఈ కావ్యానువాదమున కెంత విలువగలదో సాహిత్య విమర్శకుల కీకావ్యావతారికయు అంత ముఖ్యమైనది. తెలుఁగుకవుల అనువాద విధానమును అరటిపండొలిచి యిచ్చినట్లు ఇందు ప్రపంచితమగుటయే దానికిఁ బ్రబలహేతువు.

## రసికానందము

కాళిదాసాది మహాకవులచే రచింపఁబడిన ప్రసిద్ధ శ్లోకములకు స్వేచ్ఛానువాదరూపము రసికానందమనెడి లఘుకృతి. ఇందు నక్షత్రసంఖ్యవలె నిఱువదియేడు పద్యములు కలవు. ఆకృతికి చిన్నదైనను ఆంధ్రదేశమంతటను కవి పండిత పామరముఖస్థమై వరలిన కావ్యమిది. ఇందొక్కొక్క పద్య మొక్కొక్క గాథ. అన్నియు శృంగార రసబంధురములే ప్రధానముగా శృంగారనాయికా విభాగముల కుదాహరణములై యిందుఁ బెక్కు పద్యములు గోచరించుచున్నవి. విప్రలంభ శృంగారము ఇందధికము. మచ్చున కొక ఉదాహరణము:

శ్లో॥ కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే నచ దృశ్యతే।
బాలే! తవముఖాంభోజే దృష్ట మిందీవరద్వయమ్॥

అను కాళిదాసు ఆశువారాశ్లోకమునకు అనువాద మిది :

క॥ పూలం బూవులు పూచుట
లోలి న్వినుచుంటి కాని యెక్కడఁ జూడన్
బాల; మిది కల్యకవ యో
బాలా! మీ మోము దమ్మిపయిఁ గనిపించెన్." (18)

## వైరాగ్య శతకము

ఆదిశంకరావతారుఁడును, సుప్రసిద్ధ సంస్కృత పండిత కవియు, భాషడికోత్తముఁడు నగు అప్పయ్య దీక్షితులవారు రచించిన వైరాగ్య శతకమును

తి. వేం. కవు లనువదించి యుండిరి. పండితవృద్ధులైన కవి ఆత్మనివేదన రూపముగా, తన వేదాంత విజ్ఞాన మంతయు నిండు పరిమళించునట్లుగా రచించిన యీ శతక మనువదించుటలో కవుల జ్ఞానవృద్ధత్వము ప్రదర్శితమైనది. భర్తృహరి వైరాగ్య శతకమునకు ఏనుఁగు లక్ష్మణ కవి యనువాదము ప్రసిద్ధమై యుండుటచే నీ వైరాగ్య శతకమును జేపట్టి యుండిరట్లు భావింపవచ్చును. మూలమునందలి 101 శ్లోకములకు 101 పద్యములు తెలుఁగున వచ్చినవి. ఆంధ్రమున శతక మంతయు తేటగీతలలో రచింపఁబడి యున్నను మధ్య రెండు కంద పద్యములు వాడఁబడి యుండుట యిందలి విశేషము. అనువాదము భావానువాద పద్ధతిఁ జెందినది. ఉదాహరణమునకుఁ గొన్నిటి నిచ్చట యిత్తును:

1) అస్తి కశ్చన భిక్షుః సంగృహ్ణన్నవ్యయాని దశ।
న సమేత్యవ్యయ యుగలం యాచయా మస్తం కిమస్త్యన్యత్॥

గీ॥ అవ్యయంబులు పదియు దశావ్యయుఁడను
పేరు కలవానిఁజేసె నే భిక్షువద్ది
నతని యాచింతు మా యవ్యయద్వయంబు
నమను యనువాని నితర మనవసరంబు. (1)

2) భిక్షాప్రదా జనన్యః పితరో గురవః కుమారకాః శిష్యాః।
ఏకాంత రమణ హేతుః శాన్తిర్దయితా విరక్తస్య॥ (4)

గీ॥ భిక్షమిడు సాధ్వి తల్లి లక్ష్యమైన
తెలివియిడు సద్గురువులె తండ్రులు సుశిష్యు
లే సుతులు రహఃక్రీడకు హేతువైన
శాంతియే భార్య వైరాగ్యవంతులకును. (4)

3) తృణవద్భ్రమంతి చపలాః స్త్రీనామని చండమారుతే చపలే।
ధీరచిత్తా ఇవ సన్త స్తత్ర న కించి త్ప్రకంపంతే॥ (15)

గీ॥ వెలఁది పేరిట సుడిగాలి విసరునపుడు
చపలచిత్తులు గడ్డిపోచలు తలంప
దానియందును ధీరాత్ములైనవారు
కొండలంబోలి కదలరు కొండమైన. (15)

4) పాశోదరి మోక్తవ్యః పశుపతి దేవోపసర్తవ్యః।
సకలం వ్యతిముచ్యంతే పశవః పాశేన సంబద్ధాః॥ (83)

గీ॥ బంధ మోక్షణ జిజ్ఞాస ప్రబలునేని
పశుపతి సమీపమును జేరవలయుఁగాక
పాశములచేత బంధింపఁబడిన పశువు
తనకు దనయంత విడిపించుకొనఁగలుగునె?

అప్పయ్య దీక్షితుల వారి విపుల ప్రపంచానుభూతి, నీతి సూక్తి నైపుణ్యము, వైరాగ్యము, వేదాంతజ్ఞానము ప్రతిబింబించిన యీ శతకము ముముక్షువుల పాలిటి గురు గీత తి.వేం. కవులు గీతములలో ననువదించి దాని గురుగీతాత్వమును సార్థక్య మొనర్చినారు.

## బుద్ధ చరిత్రము

పరమ దయావిదగ్ధుఁడగు బుద్ధుఁడు జగత్ప్రసిద్ధుఁడు. భరత ఖండము నందు ప్రభవించి ఆసియా ఖండమంతటను తన దివ్యబోధ ప్రకాశముచే వెలుగులు నింపిన దివ్యజ్యోతి యీ దయామయుఁడు. అతని తర్వాతి బౌద్ధ వాఙ్మయమంతటికిని నతని చరిత్ర వర్ణనము, అతని ప్రబోధముల ప్రచారము అనెడి విషయములే పరమ ధ్యేయములైనవి. ప్రపంచ ప్రజానీకములో మూడవవంతు బౌద్ధమత మవలంబించియుండుటయే తద్వ్యాప్తికి నిదర్శనమై యొప్పుచున్నది. అట్టి విశిష్ట మతప్రవక్తయగు బుద్ధుఁడు ప్రాచ్య పాశ్చాత్య కావ్యములందుఁ గీర్తింపఁబడియున్నాఁడు. గీర్వాణ సాహిత్యములో అశ్వఘోషుని బుద్ధ చరిత్రకును, పాశ్చాత్య సాహిత్యములో నెడ్విక్ ఆర్నాల్డ్ ఆంగ్లమున రచించిన లైట్ ఆఫ్ ఏసియా (Light of Asia) కును ప్రపంచమున నధికమైన ప్రఖ్యాతి కలదు. ఈ రెండు గ్రంథముల నాధారముగాఁగొని యనువదించఁబడిన గ్రంథము 'బుద్ధ చరిత్రము.' ఏతద్రచనకు పోలవరం జమీందారు వేంకట కృష్ణరావుగారి యాదర ప్రోత్సాహములు లభించినవి.

బుద్ధచరిత్ర మొక విచిత్రమైన అనువాదము. ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన Light of Asia ను బుద్ధ చరిత్రగా మొదట కవు లనువదించిరి. కవులకాంగ్లము రామి బ్ర.శ్రీ. దావలి సూర్యప్రకాశరావు గారిచే మూలము నందలి భావము వ్రాయించుకొని దాని నాధారముగాఁగొని కావ్యరచన మొనర్చియుండిరి. కావున నిందు శబ్దానుకరణమంత యుండక భావానువాద ముండుటకే అధికావకాశము కల్గియున్నది. అపై కవులు మఱల అశ్వఘోషుని "బుద్ధ చరితము"

నుండి వీలుగుచోట్ల రసాద్యనుకూలములైన శ్లోకములఁ గైకొని యనువదించి యిందుఁ జొప్పించి యుండుటచే[1] నీ కావ్యమునకు మూలద్వయ మేర్పడినట్లయి నది. సంస్కృతముపట్లను భావానువాద ప్రక్రియే ననుసరింపఁబడినది.

బుద్ధచరిత్రము నందలి యంగిరసము దయావీరము దయా సముద్రుఁ డగు సిద్ధార్థుఁడు వార్ధక రుజా మరణాదులచే వ్యథచెందు జగత్తును గాంచి, జాలి చెంది, తత్తరణోపాయమును గూర్చి చింతించుచు సన్యస్తుఁడై, సాధకుఁడై, ధ్యానియై, బుద్ధుఁడై, ప్రబోధకుఁడై లోక కల్యాణమును సాధించిన మహావీరుఁడు. అతని చేత మొక మహా సముద్ర మగుచో నందలి జలము దయ; అందలి అలలు జ్ఞాన సాధనోత్సాహ ప్రవృత్తులు. ఆ జ్ఞాన తరంగము లుబ్బెత్తుగా లేచి ఉన్నత సిద్ధిని పొంది లోకులకు దానిని బోధించి, వారిని దరింపఁజేసి మఱల సముద్రములో లీనమైపోవును. అనగా దయావీరమునకు, జ్ఞానవీరము దీపకమని భావము. దయావీరమంగి, జ్ఞానవీరమంగము. అందువలననే కవులు—

''బుద్ధునకుఁ గల యెక్కుడు భూతదయను
గూర్చి మానేర్చుగతి నిట్లు గొంతదనుక
వ్రాసినారము'' - అని పేర్కొని యున్నారు. (షష్ఠాం. 102)

అశ్వఘోషుఁడు బుద్ధచరిత్రమును ముముక్షుభావో పేతముగా దీర్చి దిద్ది శాంతరస ప్రధాన మొనర్చినాఁడు. కాని, ఆర్నాల్డు బుద్ధదేవుని చరితను దయా ప్రధానముగా దర్శించి తదనుగుణముగా దానిని మలచినాఁడు. అందు వలననే బుద్ధచరితమునందు లేనివి, బుద్ధుని దయారస పోషకములైనవియగు. హంసప్రాణ రక్షణము, బింబిసారుని యజ్ఞపశువును విశసనమునుండి రక్షించుట, మృతబాలుని గూర్చిన కథ మొ॥ ఉపాఖ్యానములు Light of Asia లో చోటుచేసికొనినవి. అశ్వఘోషుని దృష్టి నాయకునియందు విషయవైముఖ్య ముతోఁ గూడిన ముముక్షుభావము ప్రదర్శించుట కాగా, ఆర్నాల్డు దృష్టి విశ్వ భూతదయా మూలకమైన నాయక ప్రవృత్తి దయాచోదితమైన జ్ఞానవృత్తి నాశ్రయించి దయాభావముచేతనే క్రమోన్మీలనముచెంది పరించి దయాప్రేరణచే మఱల లోకోద్ధరణ మొనర్చినట్లు గ్రహించినది. ఆత్మసిద్ధిని పొందుటతో నాఁగక లోకాభ్యున్నతి నభిలషించు బుద్ధునియం దార్నాల్డు అశ్వఘోషుఁడు

---

1. దివాకరాస్తమయము - పుట 4.8.

చూడని దయాభావోన్నతిని దర్శించి యావేశముతో వర్ణించియున్నాఁడు. వీరిలో నొకరు నివృత్తికి ప్రవృత్తి నంగముగా నిల్ప మఱియొకరు ప్రవృత్తికి నివృత్తి నంగముగా నిల్పినారు. ఇద్దఱు వారి వారి దృష్టులలో నభినందనీయులే వీరిరువురిలో తి. వేం. కవులు రస విషయమున నార్నాల్గునే యెక్కువఁగాఁ బెట్టుకొనినారనుటలో ననుమానము లేదు.

బుద్ధ చరిత్రమందలి యితివృత్తమంతయు Light of Asia ననుసరించియే వ్రాయఁబడినది. ఆశ్వాస విభజనాదులు కూడ కొన్నిఁట యథాతథముగా నొనర్పఁబడినవి. Light of Asia 8 అధ్యాయములలో (Books) రచింపఁబడఁగా బుద్ధచరిత్రము 6 ఆశ్వాసములలో ముగింపఁబడినది. కాని మూలము నందలి యే ప్రధానాంశము ఇందుఁ వదలఁబడలేదు. మూలమునందు చిన్నగానున్న ద్వితీయ తృతీయాధ్యాములను పంచమ షష్ఠాశ్వాసములను కలిపి వైచి ద్వితీయ చతుర్థాశ్వాసములుగా కవులు నిర్మించుటచే నాయాశ్వాస సంఖ్యలో వ్యత్యాసము గోచరించుచున్నది విషయ విభాగ సౌలభ్యము, విభాగమునం దొక స్వయంసమగ్రత గల్పించుట, నాతి విపులము నాతి సంగ్రహమునై యుండుట యనెడి గుణములచే తెలుఁగున నాశ్వాసవిభాగ మౌచిత్యభరితమై యొప్పుచున్నది.

Light of Asia లోని భావములుకాక సంస్కృత బుద్ధచరిత్రము నుండి కవులు దాదాపు పదిచోట్ల అశ్వఘోషుని భావములను అనుసరించి యిందు పొందుపఱిచినట్లు పరిశీలనవలన తేలుచున్నది. సంస్కృతమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థ షష్ఠాష్ట మైకాదశ ద్వాదశ త్రయోదశాధ్యాయముల నుండి రమ్యములైన కథార్థములను గ్రహించినను అష్టమ ద్వాదశాధ్యాయములను చాలవఱకుఁ దెలుఁగునకుఁ దీసికొని వచ్చిరి. సంస్కృతము నుండి యీ కావ్యమునఁ జేరిన నూతన ఘట్టములు ఈ క్రిందఁ బేర్కొనఁబడుచున్నవి: 1) కావ్యారంభమునందలి నగర వర్ణనము. 2) పురోహితనందనుఁడు బుద్ధుని కొనర్చు హితబోధ 3) మహాభి నిష్క్రమణానంతరము అంతఃపుర జనము బుద్ధ వియోగము వలన దుఃఖించుట 4) సిద్ధార్థుఁడు బింబిసారునితో 'కామనిగర్హణము' గూర్చి చేసిన యుపన్యాసము మొదలగునవి. అంతియగాక అసిత ఋషి భాషణములు, సర్వార్థసిద్ధుని జన్మ సమయమున లోకమునఁ గానఁబడిన శుభలక్షణముల వర్ణనము; పుష్పవనవిహార వర్ణనము అనునవి కవు లాంగ్లమూలాతిశాయు లగునట్లు పెంచి రచించిరి. మార విజయ ఘట్టము. సిద్ధార్థుని విద్యాభ్యాస వర్ణనము, నగర విహార సన్నివేశములు,

సిద్ధార్థుఁడు మహాభినిష్క్రమణానంతరము చెన్నుని కిచ్చు సందేశములు, అరాడ ముని తాత్త్వికోపదేశము, బుద్ధుని ధర్మబోధయు కవులు మూలములందుకన్న సంగ్రహముగా రచించిరి.

ఇట్లు రచించుటలో కవులు ప్రధానమైన రసపోషణ దృష్టి వీడలేదు. బుద్ధుని మాహాత్మ్య మతిమానుష దృష్టితో దర్శించి భక్త్యావేశముతో శాంతరసాను గుణముగా రచించిన కావ్యధార నతిమాత్రముగా గ్రహించుచు, దయాపయోధిగా ఉత్తమ సమగ్ర మానవునిగా ప్రవృత్తివీరునిగా జ్ఞాన సాధకునిగా భావించి రమణీయ ప్రకృతి రామణీయక తత్త్వ జిజ్ఞాసువుగా భావ్యకవితావేశముతో రూపొందించిన ఆర్నాల్డు కవితాధార నధికముగా ననుసరించుచు సమయోచిత స్వీయ కల్పన ప్రతిభా చైతన్యము తొడికిసలాడు రసకవితాస్రవంతిని అందు మేళవించి యీ కావ్యము నొక ప్రయాగ క్షేత్రముగా కవులు నిర్మించిరి. అందు కల్పించిన పై అంశము లన్నియు సార్థకములై రసపోషకములే యగుచున్నవి.

## 1

## కావ్యారంభమునందలి నగర వర్ణనము

ప్రాచీన గీర్వాణాంధ్ర కావ్యములు నగర వర్ణనముతోఁ దఱచు ప్రారంభమగుట యొక సంప్రదాయము. తత్సంప్రదాయ పోషణార్థమై ఈ వర్ణన మశ్వఘోషుని ననుసరించి యొనర్పఁబడినది. ఇది ఆర్నాల్డులో లేదు. ఇది భావానువాదము. అందు మూలమునందలి భావము గైకొనుచు తద్విరుద్ధముగాఁ దెలుఁగున ననువదించి స్వీయకల్పనా చమత్కృతి ప్రదర్శించుట కుదాహరణము నగర కాంతా సౌందర్య వర్ణనము.

మూలము :-

(అ) శ్లో॥ "రామా ముఖేన్దూన్ పరిభూత పద్మాన్।
దృష్ట్వాభిమాని శిశిరాంశురేవ।
సంతాప యోగా దివ వారి వేష్టుం।
పశ్చా త్సముద్రాభిముఖం ప్రతస్థే॥ (Bl.1.6)

అనువాదము :-

మ. తనపై నేస్తముగల్గు తమ్ములకు సంతాపంబు గావించు వా
రని కాంతా ముఖచంద్రులం జెనక నిత్యంబుం బతంగుండు త

ఇందలి చివరి రెండు పాదము లించుమిం చమూలకములే. మూలమున శివన శిఖరములు నిత్యోన్నతత్వ గుణ మాత్రముచే కైలాస తుల్యములగుచుండ తెలుఁగున ప్రమదము, నయము, ప్రభావము అనెడి గుణములు కూడ చేర్పఁబడినవి. మూలమున యథార్థ బుద్ధి అచేతనములగు మేఘములకు గల్గుచున్నది. అందుఁ గల ననౌచిత్యమును తొలఁగించి తెలుఁగునఁ బౌరులకు యథార్థ మనీషిత్వము గల్పింపఁబడినది. కవుల యౌచిత్య పోషణ మపార మీ పద్యమున.

## 2

## పురోహితనందనుని ప్రబోధము

సంస్కృత బుద్ధచరిత్రలో నిది చతుర్థాశ్వాసమునఁగలదు. నగర విహారమందు సిద్ధార్థుఁడు వృద్ధరోగశవాదులఁ గన్గొని సంవేగమానసుఁడై యున్న తరుణమున నగరోద్యానవనమున స్త్రీ విలాసములఁ జూడఁ బంపఁబడును. అచ్చట విషయ సుఖభోగానుకూల ప్రబోధమును పురోహితుఁడు రెండు పర్యాయము లొనర్చును. దానికి బుద్ధుఁడు సముచిత సమాధాన మిచ్చును. కవులీ పురోహితనందనుని ప్రబోధము ద్వితీయాశ్వాసమున ననుసంధించిరి. ఇం దతఁడు సిద్ధార్థుని హృదయమును వివాహోన్ముఖముగా నొనర్చుటకు ప్రబోధించును. ఆ పురోహితుని పాత్రకల్పనకు సంస్కృత బుద్ధచరిత్రము మూలమైనను కవులు దానికన్న కావ్యార్థము లధికముగా నా పాత్రవలన సాధింపఁగల్గిరి. మూలమున ప్రబోధము విఫలమై వ్యర్థమగుచుండ తెలుఁగు సఫలమై, నాయకుని వివాహమున కొప్పించినది. స్థలము మారినది. ఈ పాత్ర ప్రయోగము ప్రయోజనవంతమగుట ఇందు గమనింపఁదగిన విషయము. ఈ ఘట్టమునందలి కొన్ని యనువాదాంశములు:

అ) ఛాయానువాదము

శ్లో. అహితాత్ ప్రతిషేధశ్చ హితేచాను ప్రవర్తనమ్
వ్యసనే చాపరిత్యాగ స్త్రివిధం మిత్రలక్షణమ్. (B.4.64)

క. హితమార్గము గఱపుటయు న
హిత మార్గమునందు నడువనీకుంటయు దు
స్థితి గతియును దుర్వ్యసనా
వృతియును మరలించుటయు సుహృల్లక్షణముల్. (బు. 2.22)

ఆ) కొన్ని శ్లోకముల తాత్పర్యభావము నొక్క వృత్తమునఁ దెనిఁగించుట:

శ్లో. కామం పరమితి జ్ఞాత్వా। దేవోఽపి హి పురన్దరః
గౌతమస్యమునేః పత్ని మహల్యాం చకమేపురా॥

శ్లో. అగస్త్యః ప్రార్థయామాస సోమభార్యా చరోహిణిం
తస్మాత్తత్సదృశీంలేభే లోపాముద్రా మితిశ్రుతిః॥

శ్లో. బృహస్పతే ర్మహిష్యాంచ। జుహ్వాత్యాం జుహ్వతాం వరః॥
బుధం విబుధ కర్మాణం। జనియామాస చంద్రమాః॥

శ్లో. ఉతథ్యస్యచ భార్యాయాం మమతాయాం మహాతపాః॥
మారుత్యాం జనయామాస భరద్వాజం బృహస్పతిః॥

శ్లో॥ కాలీంచైవ పురాకన్యాం। జలప్రభవసంభవాం।
జగామ యమునా తీరే। జాతరాగః పరాశరః॥

(బుద్ధ - 4 సర్గ. శ్లో. 72, 73, 75, 74, 76)

సీ॥ జడదారి సతితోఁడ బతగూడె వేవేలు
వెంఁడులు గలవాఁడు వేల్పు ఱేఁడు;
జాబిల్లి పడతితో సరసంబు గావించెఁ
తపసి లోపాముద్ర ధర్మభర్త;
దైవతగురుని కాంతాలలామము తోడఁ
గవగూడె శిష్యుఁడై కలువఱేఁడు;
ఔతద్య ఋషి పత్నియగు మరుత్పుత్రితో
సాహస మొనరించె దేవగురుఁడు;

తే.గీ. దాస పుత్రికతోడఁ బరాశరుండు
పట్టపగలు నదీతటీ భాగమందు
దగులు గావించె; నిన్ని వింతలును దలఁప
గామమును గెల్చువారు లోకమునఁ గలరె? —(బు.ద్వి. 31)

3

## అంతఃపుర విలాపము

'అంతఃపుర విలాపః' అనెడి నామముతో నశ్వఘోషుని బుద్ధచరితమున 87 శ్లోకములు గల అష్టమాధ్యాయము బాలనలకు తెలుఁగున సంగ్రహమున

ననువదింపఁబడినదే. పునస్సమాగమాకాంక్షా విరహితులై శుద్ధోదనయశోధరాదులు సిద్ధార్థుని కొఱకై విలపించుట యింతలి యితివృత్తమగుటచే నిది కరుణరస ప్రధానమైనది. పఠితకు కరుణ మిశ్రితమైన దయాభావము పాత్రలయందు స్ఫురించునట్లు చిత్రించుట యందలి శిల్పము సజాతీయ భావపోషణమగు చుండుటచే రసపుష్టికి హేతువగుచున్నది ఇందు యశోధరా దుఃఖమతి రసవత్తర ముగ వర్ణితమై యున్నది. ఉ॥ కొన్ని శ్లోకముల యనువాదము. సర్వార్థసిద్ధుని నరణ్యమున డింపి వచ్చిన కంటకాశ్వము నుద్దేశించి విలపించుచు యశోధర యనిన మాటలు భావానువాదమునకు చక్కని యుదాహరణములు:

శ్లో॥ వరం మనుష్యస్య విచక్షణో రిపు ర్నమిత్ర మప్రాజ్ఞమయోగ పేశలమ్
సుహృ ద్బ్రువేణ హ్యవిపశ్చితాత్వయాకుతః కులస్యాస్య మహానుపప్లవః॥

శ్లో॥ ఇమా హి శోచ్యా వ్యవముక్త భూషణాః
ప్రసక్త బాష్పావిల రక్తలోచనాః
స్థితేఽపి పత్యౌ హిమవన్మహీసమే
ప్రనష్టశోభా విధవా ఇవ స్త్రియః॥

శ్లో॥ అనార్య కర్మా భృశమద్య హేషతే
నరేంద్ర ధిష్ణ్యం ప్రతిపూరయన్నివ
యదాతు నిర్వాహయతిస్మమేప్రియం
తదాహి మూకస్తు రగాధమోఽభవత్॥ (B 8 - 35, 36, 40)

ఆ.వె. తెలివిలేని స్నేహితులు గల్గుటమె కంటెఁ
దెలివిగల్గు శత్రు కులమ మేలు
మిత్ర రూపమైన శత్రువవై శాక్య
వంశ మంతరింప వచ్చితివు॥

చ. అవిరళ బాష్పపాత గమితారుణ భావములైన కన్నులున్
రవణము లుజ్జగించి నను రాణకుఁ బాసిన మేనుఁగల్గు నీ
యువిదలు నీకతంబున నలోయని యేడ్చుచు భర్తయుండియున్
ధవుఁడు గతించియుండిన యనాధల చందముఁ బొందిరశ్వమా!

చ. మగటిమి లేని యా తెలివిమాలిన కృత్యముఁజేసి యిప్పుడి
వ్వగిది నరేంద్ర సద్మ మ్రదువన్ సకిలించిన నేమిలాభ? మ

మృగరం విభూషణంబు ధృతిమంతుని దోడ్కొనిపోవువేళ నీ
మొగమున ముల్లునాటెనె ప్రబోధ మొనర్చకపోతి మమ్ములన్?
(బుద్ధ. తృ 154.156)

4

## కామనిగర్హణము

'కామనిగర్హణః' అను పేరుతో సంస్కృతమున నేకాదశాశ్వాస మశ్వఘోషునిచే రచింపఁబడెను. సన్యాసియై యున్న సిద్ధార్థునిఁ గాంచి బింబిసారుఁడు జాలిపడి సంసారసుఖములఁ గైకొనుమని ప్రబోధించెను. బుద్ధుఁడు కామనిగర్హణాత్మకమైన యుపన్యాస మొనర్చి తన కృతనిశ్చయమును దెల్పెను. ఈ సన్నివేశము సిద్ధార్థుని యకుంఠిత దీక్ష కొక్క పరీక్ష. కామనిగర్హణముచే నతని సుస్థిరమైన మనస్సంకల్పము ద్యోతమాన మగుట యీ సన్నివేశ ఫలము. జ్ఞానసిర ముజ్జ్వలమై భాసించుట ప్రయోజనము. రుచిరార్థములగు సూక్తుల నెన్నికొని యనువదించుట యిందలి ప్రత్యేకత. మచ్చునకు-

శ్లో॥ అన్ధాయ యశ్చ స్పృహయేదనన్ధో।
బద్ధాయ ముక్తో విధనాయ చాఢ్యః॥
ఉన్మత్త చిత్తాయ చ కల్యచిత్తః॥
స్పృహాం స కుర్యాద్విషయాత్మకాయ॥ (B. 11.53)

క॥ అందు నానందుఁడు, నిర్ధను
నిం ధని, యున్మత్త చిత్తునిం దృఢమతియున్
సంధింపని గతి దుర్విష
యాంధులతో మైత్రిఁజేయ ప్రాజ్ఞుఁడు గలఁడే" (బు. 4.79)

5

## అసితఋషి భాషణములు

ఆంగ్లమూలమందలి రసార్ద్రమగు పలుకులను యథాతథముగ ననువదించి గీర్వాణము నుండి యలంకార వైభవము వెలార్చెడి నాల్గైదు శ్లోకములను గైకొని యీ ఘట్టములను కవులు రమణీయముగా నొనర్చియుండిరి. ఆంగ్లానువాదమున కుదాహరణము :

"Thou art Budh
And thou will preach the law and save all flesh
Who learn the law, though I shall never hear,
Dying too soon, who lately longed to die.
(Light of Asia I.5P)

క॥ బుద్ధుఁడవై జగముల కవి
రుద్ధంబగు జ్ఞానమిచ్చి ప్రోచుచును నసం
బద్ధపు మతములఁ ద్రుంచుచు
నిద్ధచరిత నెగడఁ బుట్టితీవు మహాత్మా!

క॥ ఏ నతివృద్ధుఁడ నగుటన్
జ్ఞానము నీవలనఁ బొందఁగా నోచఁగ లే
దైనను జగమెల్లను ని
న్నాని తరించుటకు శంకయుండదు దేవా! (బు.ప్ర 108.109)

సంస్కృతానువాదమునకు :

శ్లో॥ ప్రజ్ఞాంబువేగాం స్థిరశీలవప్రాం।
సమాధి శీతాం వ్రత చక్రవాకాం।
అస్యోత్తమాం ధర్మనదీం ప్రవృత్తాం।
తృష్ణార్దితః పాస్యతి జీవలోకః॥ (B.1.71)

ఆంధ్రానువాదము.

క. వ్రతములు చక్రంబులుగాఁ
బ్రతిభ జలంబుగ, సమాధి పారంబులుగా
వితతమగు ధర్మనదినీ
రితఁడే త్రావించువాఁడు తృష్ణార్తులన్. (బు. 1. 133)

మేలిమాట లేమూలమున నున్నను వానిని గ్రహించి గ్రథించెడియున్నతా శయమే యీ విస్తృతరచనకు హేతువైయుండునని భావింపవచ్చును.

## 6

## సర్వార్థసిద్ధుని జన్మకాల శుభసూచనములు

ఈ ఘట్టమున సంస్కృతమునుండిగైకొనిన అనేక శ్లోకముల భావములను పరిమిత వృత్తములలో నిమిడ్చి రచించి యుండిరి. ఉదా:- సం.బు.లోని 2 సర్గలోని 1 నుండి 9 శ్లో. భావము - బు. చ. 1 ఆశ్వా, 125 పద్య. సీస పద్యమునందు కుదింపఁబడినది. ఆంగ్లమున నీ శుభసూచనల ప్రసక్తి సూచన ప్రాయముగా నుండ దానిని సంస్కృతాధారముగఁ బెంపు చేసి ప్రకృతిపై మహాత్ముల యాత్మప్రభావము ప్రసరించునట్లు చిత్రించెడి ప్రాచీన కావ్యమర్యాదను నిలువఁబెట్టిరని యిచ్చట చెప్పవచ్చును.

## 7

## పుష్పవన విహారము

ఇది అశ్వఘోషుని కావ్యము నుండి గైకొనిన ఘట్టము. కామవిలాసముల నుత్కటముగా నాయకునియందు ప్రదర్శింపించి చలింపని ధృతిని యతని యందు స్థాపించుట - అనఁగా పోష్యపోషక సంబంధమున సంఘటించుట యీ చిత్రణ యందలి రహస్యము. మూలమునందు విపులముగా నున్న స్త్రీ విలాస వర్ణనలను కొన్నింటిని గైకొని ద్వితీయాశ్వాసమున రచించిరి. ఉదా: ఉపమాలంకారము:

శ్లో. అథ నారీజన వృతః కుమారో వ్యచరద్వనమ్।
వానితా యూథ సలిలః కరీవ హిమవద్వనమ్॥ (B. 4 -27)

క. సరసిఁగరణీ వృతంబగు
కరివగిది పురస్సహస్రకాంతలనడుమన్
ధరణీంద్ర కుమారకుండును
గరము ప్రకాశించెఁ బుష్పకాననమందున్". (బు. ద్వి. 103)

## 8

## మారవిజయ ఘట్టము

ఆంగ్ల గీర్వాణముల ననుసరించి యీ భాగము తెలుఁగున నాతి విపులమయ్యు సారవంతమై యొప్పుచున్నది మన్మథునిదాటి కెదురొడ్డి నిర్వాణపథము

నందుకొను బుద్ధుని తపశ్చర్యకిది యుద్దీపన విభావనమై వరలుచున్నది. శృంగార రౌద్ర రసాభాసము లిందు భాసించి అంగిరసమునకుఁ బుష్టి కల్గించుచున్నవి. తపశ్చర్య ఎచ్చట వచ్చినను ఇట్టి మన్మధ పరీక్షలు సల్పి వర్ణించుట ప్రాచీనుల తపోవీర పోషణశిల్పమున కొక ప్రక్రియ. తద్రహస్య మెఱిఁగి దీనిని కథలో సముచిత స్థాన మిచ్చి కవులు పోషించియుండిరి.

9) సిద్ధార్థుని విద్యాభ్యాసము :- Light of Asia లో విపులముగా నున్న ఘట్టము సారవంతముగను, సంగ్రహముగను దెనుఁగునఁ దేఁబడినది.

10) ఇతరములు:- మూలమునందు విపులముగా నున్న పెక్కంశము లన్నియు నౌచిత్యము నెఱిఁగి సంగ్రహపఱిచి తమ కావ్యములందు రచించిరి. వానిని పఠితలు గుర్తించుట సులభము.

బుద్ధచరిత్ర మాంగ్లభాషనుండి యనువదింపఁబడినను భాష, భావము, శైలి, వేగము, స్వతంత్ర కావ్యములందు వలెనే సహజమై యొప్పారుచున్నవి. అన్యభాషాకావ్య తాత్పర్యమును ప్రతిభచే నాకళించుకొని పునస్సృష్టివలె నొనర్చిన కవులు నిజముగా నభినందనీయులు. అనువాదముతోపాటు స్వీయ కల్పనాశక్తిచే కావ్యమునం దొనర్చిన మార్పులు, చేర్చిన వర్ణనాదులలోని మార్పులు, కూర్చిన వర్ణనాదులలోని మార్పులు కొన్ని అతి రమణీయములుగా నున్నవి.

1) బుద్ధుఁ డయోనిజుఁ డని అశ్వఘోషుని కావ్యము. యోనిజుఁడని ఆర్నాల్డు. రెండవ మతము ననుసరించి కవులు కథా స్వాభావికత్వమును రక్షించిరి.

2) గర్భిణీ స్త్రీలను కాన్పునకుఁ బుట్టించికి తీసికొనిపోవు నాచారము మాయాదేవివట్ల వర్ణించి లుంబినీవన గమనమునకు చక్కని హేతువును కవులు కల్పించిరి.

3) వసంత ఋతువర్ణనమున ప్రకృతి జంతు సంతతిపైవేయు ప్రభావ ప్రాభవములను వర్ణించుచు కావ్యార్థములకును, కథా గమనమునకును తోడ్పడు నట్లు చేయుట ప్రథమాశ్వాసమున సర్వార్థసిద్ధుఁడు వసంతశోభను చూచుటకై పుర బహిర్భూములందలి వనములందు చరింప నిచ్చగించును. తత్కార్యంబు నకుఁ గారణముగా ఋతువర్ణనము చేయుట యిందు గమనింపఁదగినది. లేనిచో—

తే.గీ. "పట్టణముకన్నఁ బల్లెయుఁ బల్లెకంటె
సుపవనంబును మఱియు నయ్యుపవనంబు
కంటె వనమును మేది సౌఖ్యంబు గూర్పఁ
గలవియై యొప్పె నామని బలియు కొలఁది" (బు.ప్ర.174)

అను అమూల్య వర్ణనమునకు స్థాన మెక్కడిది? కల్పిత కావ్యార్థ సంచయమంతయు నిరర్థకముకాదని యిందు తేలిన సారాంశము.

4) నాయకుని యందు ధీరతాగుణ ముద్దీపించునట్లు స్వ్రవబుద్ధునిచే గల్పింపఁబడిన స్వయంవర పరీక్షయందు సిద్ధార్థుని పరాక్రమము రసవంతముగ వర్ణితమైనది.

5) మనోభావ సంఘర్షణకు అమూలకమైన ఉదాహరణము :

మ. ఒక కొంతేగును, సంశయించును, సముద్యుక్తత్వముంజెందు వే
ఱొక కొంతేగు, యథాస్థితింగను, నిరుద్యోగమ్ము పాటించు, వె
న్కకుఁ దోతెంచుట కిచ్చగించునట; సన్న్యాసార్థియే యౌనుగా
కకటా! యెవ్వనికేని శక్యమగునా? యర్ధాంగి వర్జించుటల్. (బు. 3.69)

6) సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములు కల్పితములై వర్తిల్లుట మఱియొక విశేషము. ఉదా: తృతీయాశ్వాసమునందలి సూర్యాస్తమయము—

శా. సిద్ధార్థుం డిఁక నేఁటి రాత్రి మొదలానింపందు సంసార మా
నద్ధ జ్ఞానమునం జగంబఖిలము న్సాధింప సన్న్యాస మ
న్న ద్ధర్మంబు వహించునంచుఁ బృథివిం జాటించి యాపై నుద
వ్యద్ధామస్థులకు న్వచింపఁ జనెనా వారాశిఁ జేరెన్వడిన్. (బు.తృ. 157)

"తరుణి ననన్యకాంత" ను పద్యము రచించిన పెద్దనప్రభావ మిందు స్పష్టము. సిద్ధార్థునికి దివ్యదృష్టి యొదవిన పిదప చతుర్థాశ్వాసమున వర్ణితమైన సూర్యోదయ వర్ణనము ప్రకృతి పురుష పరస్పర ప్రభావ నిరూపణ సమర్థమై యలరారుచున్నది.

7) బుద్ధధర్మబోధ సుధామృతమునందలి క్లిష్టతరములగు తాత్త్వికబోధలను Light of Asia ననుసరించి అరటిపండొలిచి చేతికిచ్చిన యట్లు, సరళ సుందర విస్పష్టార్థ ప్రపంచము కొట్టవచ్చినట్లు రచించుట కవుల సామర్థ్యము వేయినోళ్ళఁ జాటుచున్నది. కొన్ని యుదాహరణములు:

బుద్ధుఁడు నిర్వాణకాంక్షులకుఁ జెప్పిన నాల్గు తత్త్వములు :

a) ప్రథమ తత్త్వమున నొక్క పద్యము—

"The First Truth is of sorrow - Be not mocked!
Life which ye prize is long - drawn agony.
Only its pains abide; its pleasures are
As birds which light and fly." (Book VIII.147 P.)

చ. ప్రతి నర జీవితమ్ముఁ గడు బాముల పాలని నమ్ముఁ డుద్భవ
స్థితి మొద లెన్నియో కలుగు జీవునకుం దురవస్థ; లెన్నఁడే
నతి తర సౌఖ్య మబ్బినను నయ్యది పక్షి విధమ్మున న్రయో
ద్గతిఁగనుఁ గాని శాశ్వతము గా దది మీకనుభూతమౌ కదా!
(బు. 6 - 49)

b) ద్వితీయతత్త్వమున నొక పద్యము :

"The Second Truth is Sorrow's Cause; What grief
Springs of itself and springs not of Desire?
Senses and things perceived mingle and light
Passions quick of fire. (Book VIII - 147 P.)

తే గీ. సర్వ దుఃఖమ్ములకును దృష్టమె ప్రధాన
కారణంబు తసంతన కల్గు దుఃఖ
మెయ్యదియు నెందుఁ గానరా దింద్రియమ్ము
లర్థములును మనోవృత్తి నలమఁ జేయు." (షష్ఠా. 56.)

(c) తృతీయ తత్త్వమున నొక పద్యము :

"Then Sorrow ends, for life and Death have ceased;
How should lamps flicker when their oil is spent?
The old sad count is clear, the new is clear;
Thus hath a man content." (Book. VIII. 149 P.)

తే గీ. స్వచ్ఛముగ వెల్గి దీపంబు చమురుతోడ
న శమియించెడి చందమ్మునఁ గ్రమముగఁ బో

సంగఁ గర్మరాహిత్యంబు జన్మరహిత
తయును సమకాలమున నింత తథ్య మరయ." (షష్ఠా. 61)

(d) చతుర్థ తత్త్వమైన నిర్వాణ పథమునకుఁ గొన్ని సోపానములు చెప్పఁబడినవి. అందులో మూఁడవదానిని గూర్చిన పద్య మిచ్చట ఉదాహరింపఁ బడుచున్నది.

"The Third is Right Discourse, Govern the lips
As they were palace-doors, the king within;
Tranquil and fair and courteous be all words
Which from that presence win" (Book VIII, 150 p)

తే.గీ. "భూపతి వసించు కోట తల్పుల విధమునఁ
దమ పెదవు లెల్లపుడు మూయఁదలఁపవలయు
నెప్పుడేనియుఁ దెరచిర యేని వచ్చు
పల్కులన్నియు శాంతిమైఁ బరఁగవలయు" (షష్ఠా 6)

9) తిరుపతి వేంకటకవులు ఆయా సమయములందుచితమైన మనః ప్రవృత్తులను సుస్పష్టముగాఁ జిత్రించి నాయక పాత్రను క్రమోన్మీలితముగాఁ దీర్చిదిద్దిరి.

బుద్ధభగవానుని పవిత్ర సందేశము ఖండఖండాతరములకు వ్యాపించి, భరతఖండమున కొకవిధముగా నాసియాలో గురుపీఠమును సంతరించిపెట్టినది. నాటికి నేటికి శాంత్యహింసా సందేశములను భారతీయులు ప్రపంచమునకు ప్రబోధించుచునే యున్నారు. మహాత్మా గాంధీ బుద్ధుని కారుణ్య భావమును భారతీయులలో మరల పునరుద్ధరింపఁ జేసినాఁడు. అతనికి సమకాలీనులైన తిరుపతి వేంకట కవులు ప్రాచీన భారత వీరుని గాథను కావ్యముగాఁ గూర్చి దేశీయులకు తమ ప్రాచీన విజ్ఞాన నిధిని త్రవ్వి యిచ్చినారు. అశ్వఘోషుని బుద్ధ చరితమును మూలముగాఁగొంత నీకావ్యమును దెనింగించినారు. ఇందు దయా వీర మంగి, జ్ఞానవీర మందులకు పోషకము. శృంగారశాంతాదు లంగములు.

కపిలవస్తు పురాధీశుఁ డగు శుద్ధోదనుని పట్టమహిషి దైవసంకల్పమున గాంచిన స్వప్నము బుద్ధభగవానుని యవతారమునకు నాంది నాలపించినది. స్వాప్నికపల దర్శకులు తదర్థ వివరణము సేయుచు, ఇట్లు వ్రాకుచ్చిరి :

"ఆ పుణ్యాత్ముఁడు సార్వభౌమ పదవిం బ్రాపించి సామంత భూ
మీపాలు ర్దనుఁగొల్వ నెల్లరును మేల్మేలంచు శ్లాఘింప నా
శాపాలేశుని భంగి యీ భువనము న్పాలించుఁ గాదేని వి
ద్యాపూర్ణుండయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చున్ గృపన్." -ప్ర.70.

అం దెట్టివాఁడైనను సిద్ధార్థుఁడు ప్రసిద్ధుడే యగును. మహారాజు, ప్రజలు సమ్రాట్టు కావలెనని ఆశించిరి; దేవతలు, తపస్వి లాతఁడు జ్ఞాని కావలెనని వాంఛించిరి మహాయోగి యగు అసితుఁడు బుద్ధుని జన్మము విని కపిలవస్తు పురమునకు వచ్చి బాలుని దర్శించి—

"బుద్ధుఁడవై జగములం కవిరుద్ధంబగు జ్ఞానమిచ్చి ప్రోచుమను నసం
బద్ధపు మతములఁ ద్రుంచుచు సిద్ధచరిత! నెగడఁ బుట్టితివు మహాత్మా!"
—ప్ర. 108.

అని అతని జన్మహేతువును నిరూపించి తెల్పినాఁడు.

సిద్ధార్థునకు పుట్టుకతోడనే సూక్ష్మమైన బుద్ధి, నిశితపరిశీలనా పాటవము, లోకాధ్యవేక్షణము, దయామయత్వము నైజముగా నుదయించినవి. సర్వ విద్యా విశారదుఁడయి సర్వజీవదయామయుఁడై చరించినాఁడు. మహారాజునకు గారాబు బిడ్డఁ డగుటచే కష్టమనునది లేశమైన నెఱుఁగఁడు.

"శోకము బాధయుఁ గన్నీరాఁకలి యను శబ్దములన యతఁ డెఱుఁగుం; ద
ద్వ్యాకులత యించుకేనియు నా కరుణాకరున కెఱుక యనఁదగ దొకటన్."
—ప్ర. 144.

సిద్ధార్థుఁ డొకనాఁడు మిత్రులగు దేవదత్తాదులతో హిమవత్పర్వత పాద మున విహరించుచుండెను ఆకసమున సంచలబారులు రమ్యముగా ధవళతోరణ ములం వలె నొప్పారుచు నెగురుచుండెను. దేవదత్తుఁ డొక యంచను బాణముసఁ గొట్టెను. అది విలవిలఁ దన్నుకొనుచు సిద్ధార్థుని ముందు పడెను. దానిని గాంచిన తోడనే అతని హృదయములో వాసనాయుతముగా నున్న దయ మేల్కాంచినది.

"గిలగిలఁ గొట్టికొనఁగ నయ్యంచముం డిది యేల యిట్టు లార్తింగను? న
మ్మురలికిం బుచ్చితఁగా దే కలిగినె వేదెద్దియేనిఁ గారణమనుచున్"

"తన కాయమునం దయ్యలుఁగను గ్రుచ్చియుఁ బుచ్చియును
బుగుల్కొను నార్తిన్
దనలో నెఱింగి యనుభవమునకుం దెచ్చుకొని మిగుల మొనసిన కరుణన్."
—ప్ర. 151, 152.

అరటి పూరేకులవంటి ఆ యంచ రెక్కలను నేర్పుతో నిమురుచు, వనౌషధులఁ బూసి దాని బాధను కొంత యుపశమింపఁజేసెను. లౌకిక విషయములఁ గాంచినతోడనే తాదాత్మ్యావస్థ నొంది, ద్రవీభూతుఁడగు సిద్ధార్థుఁ డసమాన దయామయుఁడు, రసార్ద్ర హృదయుఁడు, ఉత్తమ సంస్కారి.

దేవదత్తుడు కర్కశుఁడై పక్కి నడిగినాఁడు; తనదని వాదించినాఁడు. దానికి సిద్ధార్థుఁడు "మృగయావినోదంబునం బాణహతంబగు ప్రాణి యేదేనియుఁ బ్రాణమున్నంత దనుక నాహతకునిది కా" దను న్యాయముచే నాతని వాదమును ఖండించుచు—

"దైవవిహితమైన దయకల్మి నాకు నీయంచ బ్రతుకఁజేయు నంతపాటి
యవసరంబుగల్గె, నక్కారణమున నా యదియె యిద్ది యొరుల
దగుట యెట్లు?"

అని దయావీరమును బ్రకటించెను. న్యాయాధినేతయు నట్టి ధర్మమే నిర్ణయించి ప్రపంచించినాఁడు. ఇది సిద్ధార్థుని జీవితములో లోతైన అనుభవమును దెచ్చి పెట్టి, జీవకారుణ్యమునందలి గాంభీర్యమును అతనియందు సంతరించి పెట్టినది.

తండ్రి పంపున పట్టణ దర్శనార్థ మేగిన సిద్ధార్థునకు బ్రకృతిలోని హింసాత్మక ప్రవృత్తి గోచరించినది. అది యతనిలోని అహింసాతత్త్వమును ప్రబోధించి పటిష్ఠ మొనర్చినది. అతనికి విభావములయిన దృశ్యములు:

"అఱితికాయలు గాయ నవని దున్నుచుఁ గట్టిపడుచుండు
కాసరద్వయము నొకటఁ
జెన్నుగా దున్నిన చేలలో విత్తుల వైచుచుండెడు కాఁపువాండ్ర నొకట
ఫలపుష్పవితతులఁ దులఁదూఁగి నేలకు నంటుచున్నట్టి వృక్షాళి నొకట
వాని ఫలంబుల భక్షించి సుఖియించు కీరాదిక పతత్రివార మొకటఁ
బట్టి చీమల మ్రింగెడి బల్లిని, మఱి దాని మ్రింగెడు పాము, నద్దాని మ్రింగు
వైనతేయుని, జిన్న చేఁపలను మ్రింగు పెద్దచేఁపలఁ దిను పక్షిబృంద మొకట

వానిఁబట్టి భక్షించెడి శ్యేనములను
నొకట వేఱొక్క యెడ మనుష్యులను దిను న
ఘోరులను........ .." —ప్ర. 195, 196.

జూచుటచే నాతనికి లోకమంతయు హింసాప్రవృత్తి ప్రధానమనియే స్ఫురించినది. దయాహృదయమున నిర్వేదము జనించినది. అది జ్ఞానమార్గము నావిష్కరించినది. వెంటనే శ్రీవ విచారముద్రను వహించి ప్రక్కనున్న నేరేడు చెట్టు క్రింద కూర్చుండి ధ్యాననిశ్చలుఁ డయ్యెను. ధ్యానవిఘ్నము నాపాదింప యత్నించు మిత్రులఁ గాంచి అంబరవాణి:

"ఈతఁడు పరసంరక్షణకై తా జన్మంబు నెత్తి నట్టిఁడు సుగుణా
న్వితుఁడు మహానుభావుఁడు చేతమ్మునఁ గరుణఁదక్కఁ జేర్పఁడితరమున్'
—ప్ర. 200.

అని అతనియందు సంపూర్ణదశ నొందిన దయాభావమును నిరూపించి చెప్పినది. అది యతనికి పై మెట్టున కధికారము సంతరించినది. హృదయము తత్త్వజ్ఞానార్జన కున్ముఖమైనది. కన్యాబహుమాన ప్రదానోత్సవమునకుఁ బ్రబో ధించు పురోహితసుతునితో—

"పరిణయ మొల్లక నే నస్థిరమగు సంసార మనెడు తెరువునఁ బర కాం
తరమగు తత్త్వజ్ఞానాంతరమునఁ జరియింతు" నని పల్కినాఁడు.
—ద్వి. 24.

సిద్ధార్థుఁడు ప్రకృతి విద్యార్థి. అతఁడు జీవితములోఁ బొందిన అను భూతు లన్నిఁటి నొక్క జ్ఞానముసుదప్ప - ప్రకృతినుండియే గ్రహించినాఁడు. జీవితము నాత్మోన్నత్యమునకు పరహితార్థమునకు నెట్లు త్యాగము చేయవలెనో స్వయముగా జ్ఞానవంతుఁడై నిశ్చయించుకొని అట్లే నడచి చూపి లోకమున కాదర్శవంతుఁడైనాఁడు.

అతని బ్రతుకుబాటను వెలుగుబాటకుఁ ద్రిప్పిన నిశితానుభూతులు మఱియు మూఁడు కలవు. అవి యాతఁడు కపిలవస్తు నగరమున నొంటిగా రథారూఢుఁడై వెడలుచుఁ గాంచిన వృద్ధరోగశవ దర్శనములు. అవి యతని హృదయమును వికలపఱిచి విరక్తి పథమును బట్టించినవి. దానికిఁదోడు మరు నాఁ డాతఁడు వేటకు వెడలి యొక కొండగుహలో నొక సన్యాసినిఁ గాంచి అతని వలన—

"అవని మోక్షేచ్ఛ గలవా రఖిల బంధు
పుత్ర మిత్ర కళత్రంబు పూరితమగు
సంసరణవార్ధిఁ బడకయే చనఁగవలయు
మృగకాంతారములవంక కూరు విడిచి"

అని ప్రబోధము వడయుటచే జ్ఞానేచ్ఛాగ్నికి సన్న్యాసమారుతము తోడైన దైనది. సతీవిలాసవిషయాసక్తము లగు తన యింద్రియముల నిగ్రహించి వెనుకకు మరలించినాఁడు అంతరముగా దైవప్రబోధము రింగున చెవులలో మ్రోగినది. యశోధరకు వచ్చిన కల అతని మార్గమును స్థిరీకరించినది. కాల మాసన్నమైనది. మోహపాశంబులఁ ద్రెంచి, భార్యను వదలి, చెన్ననికిఁ దన యాశయముఁ దెల్పి, కంటకము నెక్కి నిష్కంటకముగా తపోవనముఁ జేరినాఁడు. రాజగృహనగర ప్రాంతములో సన్న్యాసివేషమున సత్యజిజ్ఞాసలో మునిఁగి భైక్షుక వృత్తిలో సంగపరిత్యాగియై జీవించినాఁడు. అతని నిష్ఠనుగాంచి జనులు సర్వ సిద్ధుఁడని భావించిరి. కాని, తానొక సాధకుఁడనని వినయములోఁ బ్రతివారి తోడను తెల్పెడివాఁడు సిద్ధార్థుఁడు. పుత్రశోకార్తయగు నొక తల్లికి దుఃఖావృతమగు లోకతత్త్వమును నిదర్శనాత్మకముగా నిరూపించి చెప్పి—

"మరణంబు సర్వ సామాన్యంబు దుఃఖంబు, గాంచని వారు లోకమున లేరు
నిజ మిదియనుమాట నీయంత నీకు గో, చరముగా నీయుక్తి సలిపినాఁడ
నీదృశ దారుణ భేదమ్ములకుఁ గత, మెద్దియో తెలియఁగ నెంచి నేను
దిరుగుచున్నాఁడఁ దెలియుటకై ప్రాణ,మైనను విడుచు సాహసము కలదు"

—చరు 28.

అని తన జ్ఞానసాధనౌత్సుక్యమును బ్రదర్శించినాఁడు. జ్ఞానదీక్షను బూని సాధకునిగా ప్రాణత్యాగమునకైన నుత్సహించు సిద్ధార్థుఁడు జ్ఞానదయావీరుఁడు.

యజ్ఞపశువులు సవనములలో హననము చేయఁబడుట మొదటిసారి చూచిన అతని యెదంద యేదై పోయినది. బింబిసారనృపతి చేయు యజ్ఞమును గాంచిన గౌతముడు ఋత్విజులతో—

"ప్రాణహననంబు గడు సులభంబుగాని
ప్రాణమిచ్చుట మనకు సాధ్యంబు కాదు
ప్రాణరక్షణకై పాటుపడనివారు,
ప్రాణిపైఁ బ్రేమలేని వారలును గలరె?"

"జీవముల యాత్ర సంపూర్తి చేయకుండఁ
జంపువారికిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్చెడి చేఁతసేయు
వారలకుఁ బాపముక్తి చేకూరదెపుడు." —చరు. 51, 52.

అని ప్రబోధించి, జంతుసంహారము మాన్పించి అహింసను స్థాపించెను. బింబిసారునికి తన జ్ఞానపిపాసను గూర్చి తెల్పినాఁడు సిద్ధార్థుఁడు. అతనితో నరాడుఁదను మునిం జేరి మోక్షమార్గముఁ దెలిసికొనినాఁడు. ఆత్మ సాక్షాత్కారసాధనోత్సాహముతో ప్రయాగ క్షేత్రమునకు నడచి వెళ్ళినాఁడు. నిత్యోపవాసాదులతో దేహముఁ గృశింపఁ జేసినాఁడు; జ్ఞానసాధనలోఁ దీవ్ర తపస్సునకుఁ గడఁగినాఁడు. శుష్కదేహము జ్ఞానసాధన పటువుకాలేదు. ఈ సత్య మాతఁడు వారాంగనా వాక్యము వలన గ్రహించినాఁడు:

"బిగువుగ సారించితివేఁ, దెగుఁదంత్రులు వదలుచేసితేనిన్ సరిగాఁ
దగదు శ్రుతిగానసమముగఁ, దగుగతి సారింపు మీ చితారు లతాంగీ."
—చరు. 114.

అనునవి ఆమె పల్కులు. అవి సిద్ధార్థుని చెవులఁబడినవి. జ్ఞానవాసనలు కల్గిన అతని హృదయము నీరసమువైన అప్పలుకులనుండి మహత్తర గంభీరార్థమును సారవంతముగా నూహింపఁ గల్గినది.

"నీచుల నుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింప వచ్చుఁ దం
త్రీచయముల్ బిగించి తెగఁ దీసినచో శ్రుతిపోవు భంగిఁ గా
ర్శ్యాచరణంబు దేహమున కబ్బిన వేళలఁ దత్త్వచింతయుం
దోఁచునె? యే నెఱుంగ కిటు ఘోరముగా మెయిఁ జిక్కఁజేసితిన్''
—చరు. 117.

అని విరక్తిం జెంది సుజాత దైవదత్తముగాఁ దనకిచ్చిన క్షీరాదులను గ్రహించి తనువును జ్ఞానసాధన పటువుగా నొనర్చుకొనెను. సుజాత యిచ్చిన క్షీరసారము నుండి అతఁడు నేర్చుకొనిన పాఠ మిది:

"క్రమముగా నైక జంతుసారంబు కతన
నీ పదార్థంబు రుచ్యమై యెసఁగినట్లు
నైక జన్మంబు లెత్తి యనంతరంబ
జీవుఁడును ముక్తియను ఘనస్థితికి వచ్చు." —చరు. 139.

నని. అతని కంటఁ గానఁబడిన లౌకిక సన్నివేశములన్నియు జ్ఞాన ప్రవృత్తికి విభావములై, లోని సంస్కారములను బలియ మొనర్చినవి; అతని భావోత్కర్ష స్థితి జ్ఞానోదయాధికార మందుకొని పండి నిలిచినది.

బుద్ధగయలో బోధివృక్షమునీడ సిద్ధార్థుఁడు బుద్ధుఁడైనాఁడు. తాను పొందిన జ్ఞానానుభూతిని బింబిసారాది ప్రముఖుల కమృతోపన్యాసములతోఁ బ్రబోధించినాఁడు. శిష్యు లసంఖ్యాకులైరి చివఱకు తన భార్యాదులు కూడ శిష్యరికము స్వీకరించినారు. అతఁ డమరజీవియు, జ్ఞానపీరజ్యోతియు నయి భరత ఖండమును వెలుఁగుల నింపి, విషయ దుఃఖితుల కఖండానంద మార్గమును జూపించినాఁడు.

తిరుపతి వేంకటకవుల యడుగు జాడలలో బుద్ధ చరిత్రను తీర్చిదిద్దిన వారిలో జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు శ్రేష్ఠులు. వారి కరుణశ్రీ బుద్ధదేవుని కరుణామయ స్వరూపమున కెత్తిన కీర్తిపతాక! బుద్ధ జీవితములోని ఘట్టముల గైకొని చిత్రించిన కావ్యములలో 'సౌందర నందము' సుందరతరము! ఇంతియ గాక దొరసానయ్యగారి గౌతమబుద్ధ చరిత్ర, చిలకమర్తివారి సిద్ధార్థ చరిత్ర, పానుగంటివారి బుద్ధబోధసుధ, సన్నిధానమువారి జాతక కథా గుచ్ఛము, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి బుద్ధ పురాణము మొ॥నవి ఈ శాఖకు చెందినవి.

10) నాయకపాత్ర పోషణతోపాటు ఇతర పాత్రలను గూడ అతిశ్రద్ధతో కవులు తీర్చిదిద్దిరి. ఉదా: శుద్ధోదనుని పాత్రను గైకొందము. అతఁడు పుత్రుని విషయాసక్తునిగా నొనర్చి చక్రవర్తిగాఁ జూడవలెనని సమస్త పురుషకారము వెచ్చించి యత్నించినవాఁడు. యోగిగా మారు సూచనలు తనయునియందు తల యెత్తినప్పుడెల్ల అతని హృదయక్షోభ అంతయింత యనుటకు వీలులేదు. తత్సంఘర్షణ నాయువు పట్టువుగా చిత్రించి యాపాత్రకు కవులు జీవము పోసినారు. మూలమునందుకన్న తెలుఁగున నీపాత్ర సజీవమై సుస్పష్టరేఖలతో, వ్యక్తిత్వముతో శోభిల్లుచున్నది. ఇట్లే యశోధర పాత్రయు నుత్తమ క్షత్రియ వంశజాలుగా, సుగుణఖనిగా, సౌమ్యమూర్తిగా, భార్యగా, తల్లిగా, విరహోత్కంఠితగా, బౌద్ధ భిక్షువుగా కవులు పఠితృహృదయములకు హత్తునట్లు చిత్రించి యున్నారు.

బుద్ధ చరిత్రము ననుసరించుటలో తి.వేం. కవులు మూలము నందున్న విషయములఁ గొన్నింటిని వ్యత్యస్తము లొనర్చుటయు, కొన్నిఁటిని వదలి వేయుటయు నొనర్చియుండిరి దానివలన ప్రస్తుత కావ్యమున కెటువంటి లోపము కల్గుటలేదు కాని, వానినట్లే ఆంధ్రీకరించినచో నీ కావ్య మింకను శోభాయమాన ముగా నుండెడి దనుటలో సంశయము లేదు. అట్టివానిని గొన్నింటినిఁ బేర్కొం దును.

## 1

సిద్ధార్థుని నగర యాత్రకు హేతువులగు దేవతాప్రబోధము, చిత్రయను దాని సంగీతము అనునవి మూలమున విపులముగా వర్ణితములై యుండ కవులు తెలుఁగున సూచించి మాత్రమే వదలిపెట్టిరి. ప్రథమ నగర యాత్ర యందు సిద్ధార్థుఁడు - "పూర్ణరతోత్సవ మొప్ప నేగి కాంచె న్నరులందుఁగల్గెడు విశేషము ల న్మది కెక్కునట్లుగన్." ఇట్లు కొంతవడి వీక్షించి మరలి స్వస్థానంబున కరిగి సుఖంబుండె నని కవులు వర్ణించిరి. ద్వితీయ నగరయాత్ర యందు క్రమముగా రోగిని - శవమును - వృద్ధును గాంచినట్లు సంగ్రహముగా రచించి ముగించిరి. మూలముతోఁ బోల్చి చూచుచో నీ కథా ఘట్టములు సీరసములై యున్నవను టలో విప్రతిపత్తిలేదు మూలమున ఆర్నాల్డు కవిత్వావేశముతో నీ ఘట్టములను వర్ణించి యున్నాఁడు ప్రాకారత్రయావృత్తమైన సుందర ప్రాసాదమున నివసించు రాజకుమారుఁడు నగరి వెడలి నగరమునం దరుగిరుటకు బలమైన హేతువులే కావలయును. అందు దేవతాబోధ మొకటి. సిద్ధార్థుని చెవులలో వారి దివ్యవాణి లెల్లప్పుడు మార్మ్రోగుచుండెడివఁట! ఇది దాదాపు 50 పంక్తులలో మూలమునఁ గలదు. తెలుఁగున నిస్సారమైన యొక పద్యమై నిలచినది. ఆంగ్లపంక్తు లెంత రసవత్తరములో తెలియుటకు కొన్నింటిని చూడుడు:

"O Maya's son! because we roam the earth
Moan we upon these strings; we make no mirth,
So many woes we see in many lands,
So many streaming eyes and wringing hands"

"Yet mock we while we wait, for, could they know,
This life they cling to is but empty show;
'T were all as well to bid a cloud to stand,
Or hold a running river with the hand"

"But thou that art to save, thine hour is nigh!
The sad world waiteth in its misery
The b'ind world strumbleth on its round of pain,
Rise maya's child! wake! slumber not again''

"We are the voices of the wandering wind;
Wander thou, too, O Prince, thy rest to find;
Leave love for lore of lovers; for woes sake
Quit state for sorrow and deliverance make."

(Book III. 34 . 35 P)

ఇందులో కనీసము రెండవ, నాల్గవ పద్యములనైనను అనువదించినచో బాగుండెడిది.

2. ఇఁక రెండవది చిత్ర గానము: మూలమున చిత్ర ఒక వైణిక. ఆమె సిద్ధార్థుని విలాస మందిరములో గానమాధుర్యముతో వీణపై - ప్రేమ, మాయాశ్వము, సుమార విచిత్రాద్భుత దేవలోకనములు, అస్త్రాద్రి, సూర్యుడు సముద్రములో మునుగు దృశ్యములు మొ॥ వానికి స్వరరూపకల్పన మొనర్చి ఆలపించును. ఆ గాన గాథా శ్రవణము సిద్ధార్థునిలో లోకవైచిత్రి చూడవలె నను కోర్కెను రేకెత్తించినది. అట్టి విశిష్ట కథాఘట్టము తెలుఁగున వదలఁబడినది. బుద్ధుని హృదయములోఁ గల్గిన వితర్క మెంత మధురముగా వర్ణితమైనదో కాంచుడు:

"Then spake he, sighing' Chitra brings me back
The wind's song in the strings which that fairetale.
Give her Yesodhara, thy pearl for thanks........
There must be many we should love - how else?....
O Chitra! You that know of fairy land
Where tether they that swift steed of thy tale?
My palace of one day upon his back
To ride and ride and see the spread of the earth;
Nay, if I had you callow vulture's plumes-
The carrion hair of wider realms than mine
How would I stretch for top most Himalay,

Light where the rose-gleam on those snows
And strain my gaze with searching what is round
Why have I never seen and never sought?
Tell me what lies beyond our brazen gates?

(Book III 35-36 p.)

3) బుద్ధుని ప్రథమ నగరయాత్రలో నొక వృద్ధుని దర్శనమైనట్లును, ఆ రాత్రి వార్ధకము గూర్చి బుద్ధుఁడు క్షుభితుఁడైనట్లును, మూలమున వర్ణితమై యున్నది. శుద్ధోదనుని యేర్పాట్లలో లోపము సూచింపకుండుటకై కవులు వీనిని తీసివేసిరేమో! కాని, ఆ రాత్రి రాజునకు స్వప్నము వచ్చుటకు తగిన హేతువు గల్పింపలేకపోయిరి. దానిని వదలుట వలన కార్యకారణ పటిష్ఠములైన కావ్యార్థములు బలహీనములగుచున్నవి. వృద్ధ దర్శనము శవదర్శనానంతరము సూచించుటలో తెలుఁగు కవు లంతగా నౌచిత్యము పాటింపలేదని స్ఫురించుచున్నది.

4) ద్వితీయ నగరయాత్రకు సిద్ధార్థుఁడు రాజానుమతిని గైకొని రాత్రివేళ సార్థవాహుని వేషమున నగరమున సంచరించినట్లు మూలమున నుండ తి. వేం. కవులు వదలినారు. రమణీయ కథాకల్పన మొకటి విడువఁబడినది.

5) ద్వితీయ నగరయాత్రలో మూలములో వలెనే సిద్ధార్థుఁడు వృద్ధుని, శవమును గాంచినట్లు కవులు వర్ణించిరి గాని మూలమునందున్న రామణీయకతను తీసికొని రాజాలకపోయిరి.

కవులు వదలిన కమనీయ భావములు కొన్ని—

a) వార్ధక నిరూపణము:

"This is no other than an aged man
Some four score years ago his back was straight
His eye bright and his body goodly; now
The thievish years have sucked his sap away,
Pillaged his strength sud filched his will and wit;
His lamp has its oil; the wick burns black;
What life he keeps is one poor lingering srark
Which flicks for the finish; such is age."

b) వ్యాధులు మానవులను బాధించు విధము వర్ణించుట :

"And Channa said 'Like the sly snake they come,
That stings unseen; like the striped murder,
Who waits to spring from the Karunda bush,
Hiding beside the jungle path; or like
The lightning. striking these and sparking those
As chance may send,"

c) సిద్ధార్థుని మనస్సంక్షోభము:

"Me too this lure hath cheated, so it seemed
Lovely to live and life sunlit stream
For ever flowing in the changeless peace
Where as the foolish ripple of the flood
Dances so lightly down by bloom and lawn
Only to pour its crystal quicklier,
Into the foul sa't sea "

వీనిలోనున్న భావౌన్నత్యము, అలంకారశోభ, శిల్పవిన్యాసము, రమణీయదర్శనము, రసావేశము తెలుఁగు కావ్యమున నదృశ్యమైనవి.

ఒక్కొక్కసారి ఒక భాషలోనున్న సున్నితమైన వాక్శిల్పము భావ తీవ్రత, వ్యంగ్య గౌరవము. పలుకుబడి సొంపు, సంస్కార విశేషము మఱియొక భాషలోనికిఁ దెచ్చుట కష్టమగును కావున నాకారణముచే కొన్ని రమణీయభావములు ఆర్నాల్డు కవిత్వమునుండి తి.వేం. కవులు అనుదింపలేకపోయియుందురు.

ఉదా:- 1) ప్రథమాశ్వాసాంతమున జంబూవృక్షము నుండి వెలువడిన మాటలు—

"Let be the King's soul till the shadow goes
Forth from his heart my shadow will not shift".

ఈ పలుకులు తెలుగులో కథగా చెప్పఁబడినవి—

క. "జంబూవృక్షము రవికిర
ణాంబులపయి సోఁకకుండ నరనాథతనూ
జుంబేర్మిఁ గాచుచుండె; సు
ఖంబులు తమయంతఁగల్గఁగా జ్ఞానులకున్." (1-202)

2) దుస్స్వప్నభీతయైన యశోధర నూరార్చ సిద్ధార్థుఁడు పల్కిన పల్కులు:

"But thou take comfort; and if sorrow falls
Take comfort still in deeming if there may be
A way to peace on earth by woes of ours,
Aad have with this embrace what faithful love
Can think of thanks or frame for benison....
Too little, seeiug love's strong self is weak ...
Yet kiss me on the mouth and drink these words
From heart to heart therewith; that you mayst know
What others will not - that I loved thee most
Because I loved so well all living souls."

ఈ మాటలు తెలుఁగులో పేలవములైనవి. ఆర్నాల్డు కవిత్వము భావావేశములో నిస్సీమమగు లాస్యమొనర్చుచుండ కవుల కవిత్వము నిగ్రహాత్మకమైన నడకతో పరిమిత భావ పరిధిలో పదారులు చేసినది. ఇట్లగుటకు మూలము పరదేశభాషలో నుండి యుండుట యనియే నా భావము.

ప్రాచీన లాక్షణిక సంస్కార హృదయులైన తి. వేం. కవులు పాశ్చాత్య కవుల సమయములు రుచింపక వదలిన భావములు కొన్ని యున్నవి. సిద్ధార్థుని చూపును వర్ణించుచు ఆర్నాల్డు -

"...........Soft
"As the last smile of sunset was the look
Siddhartha bent upon his weeping wife"

అను భావము కవులు వదలిరి. చూపులను అస్తమించు దివాకరప్రకాశముతో పోల్చుట భారతీయ కవిసంప్రదాయము కాదు. ఇట్టివి పెక్కులు.

ఇట్లు చర్చించుచు పోవుచో గ్రంథము పెఱిగిపోవును. మొత్తమునకు కవుల స్వభావభేదముచే కావ్యశైలీభేదములుకూడ కానవచ్చుచున్నది ఆర్నాల్డులో వీరశైవకవుల కవితావేశము కాననగును. అతని కవిత్వము చదువుచో పతిత

కొక ఆవేశము. విద్యుత్ప్రవాహ చైతన్యము, ప్రకృతిలో తాదాత్మ్యము కలిగి, ఒక మహాప్రవాహములో కొట్టుకొనిపోవుచున్న ట్లనిపించును. అశ్వఘోషుని కావ్యము చదువువేళ మతాభినివేశము, తాత్త్వికభావౌన్నత్యము, విషయవాంఛా విరక్తి, శాంతప్రవృత్తి, ఏదో ఒక మానవాతీతమైన దైవికశక్తి కావ్యమంతయు నావరించి కథ నడిపించుచున్నదను 'మిస్టిక్' భావము కల్గి పఠిత నాశ్చర్యమగ్ను నొనర్చును. తి. వేం. కవుల కావ్యమును చదువువేళ పల్లమునకు వేగముగా ప్రవహించు తరంగిణిపై నావయెక్కి ప్రయాణ మొనర్చిన ట్లనిపించి తత్కావ్య గాంభీర్య, శీతలమాధుర్యాదులవలన పఠితకు రసానందము కల్గుచుండును. ముగ్గురివి మూఁడు త్రోవలు. ఎవరిలోనైనను కొన్ని లోపము లుండవచ్చును. కాని, అవి గుణబాహుళ్యమునందు మగ్నములై "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అను న్యాయమున కావ్యములు కాంతిమంతము లగుట కేమాత్ర మడ్డములేదు.

బుద్ధదేవుని చరిత్ర రచనకుఁ బరోక్షముగా సమకాలీన దేశపరిస్థితులు హేతువులై యుండవచ్చును. జాతిపిత బాపూజీ నాయకత్వమున భారతదేశము స్వాతంత్ర్య శాంతిసమరమునకు సిద్ధమైనట్టి తరుణ మది. ప్రతి భారతీయుఁడు బాపూజీని బుద్ధదేవునిగా భావించి యుత్తేజము వహించినాఁడు. దానికిఁదోడు ప్రాచీన భారత చరిత్రను త్రవ్వి, పూర్వవీరుల పౌరుషము లెంచి యుత్సాహము బెంచుకొనినాఁడు అట్టి జాగృతి కలిగిన సమయమున నీ కావ్యము జన్మించి "ఆశియాజ్యోతి"ని భారతీయుల ముందుంచి, అతని ప్రజాహితైకతత్పరత, దయాపారమ్యము, అకుంఠిత జ్ఞానసాధనదీక్ష, ఆత్మౌన్నత్యముతోపాటు సంఘౌన్నతి యవసరమనెడి ప్రబోధము చాటి చెప్పినది. జాతి చైతన్యము ఈ కావ్య ప్రయోజనములలో ముఖ్యమైనది.

ఈ యుగములో వెలసినవగు దొరసానయ్యగారి గౌతమబుద్ధ చరిత్ర, చిలకమర్తివారి సిద్ధార్థ చరిత్ర, పానుగంటి వారి బుద్ధబోధసుధ మొ॥ కావ్యములలో నిది ప్రకాశవంతమైన తార. పింగళి కాటూరులు "సౌందరనందము," జంధ్యాలపాపయ్యశాస్త్రి ''కరుణశ్రీ'' బుద్ధచరిత్ర కల్పించిన చైతన్య ప్రాభవము తోడనే ఉత్తమ కవిత్వముతో నావిష్కరించిరి. బుద్ధునివలె తాము కావ్య కళా పారమ్య జ్ఞానసిద్ధులై, అతనివలెనే దానిని దేశస్థులకుఁ బంచిపెట్టిన మహాత్ములు తిరుపతి వేంకట కవులు.

## నాటకములు

తి.వేం. కవులు శూద్రకమహాకవి విరచిత మృచ్ఛకటికమును, విశాఖదత్త కవి రచిత ముద్రారాక్షసమును, రాజశేఖర కవి కృతమగు బాలరామాయణమును ఆంధ్రీకరించిరి. అనువాదము చదువునప్పుడు మూలముతో నవసరము లేకయే సులభముగా నన్వయించుట వీరి యనువాదమునకు గీటురాయి. సంస్కృత భావమును జీర్ణించుకొని తెలుఁగుబాస కనువగు తీరుతెన్నులు దిద్ది, భావక్లిష్టతలేక సహజముగా స్వాతంత్ర్యముతో రచన మావిష్కరించు పద్ధతి వీరి యనువాదమున గాననగును. కొన్ని యుదాహరణముల నీ క్రిందఁ బొందుపఱతును:

1) స్వాతంత్ర్యముతో కూడిన అనువాదమునకు:

a) మూల :- దైవేన సిద్ధి రపి లంఘయితుం నశక్యా - 6వ అం. మృచ్ఛ.
అను :- "బాగ్యంబు రా మోపాలొడ్డినఁ బోవునే' - మృచ్ఛ. 6 అం.

b) సంస్కృ :- మౌర్యస్యైరపి నాథానాపి కురుతే నామైతరం శ్రీః స్తనం-"
ఆంధ్ర : "కుడిచను మోవ మౌర్యవిభు గుత్తపుఁ గౌగిటఁ జొక్కనీవుగా"
(ముద్రా. 260)

2) సరళమైన అనువాదము:

"నిర్వ్యాజాదయితే ననాన్ద్రృషునతా శ్వశ్రూషు భక్తాభవ
స్నిగ్ధా బంధుషు వత్సలా పరిజనే స్మేరా సపత్నీష్వపి।
పత్యుర్మిత్రజనే సనర్మవచనా స్నిగ్ధాచ త తద్ద్వేషిషు
స్త్రీణాం సంవననం నతభ్రు తదిదం వీతౌషధం భర్తృషు."

సీ॥ ప్రాణేశుపట్లఁ గాపట్యమూనకుమమ్మ
యాఁడుబిడ్డలఁ గూడిమాడుమమ్మ
గురుజనంబుల చిత్త మరసి వర్తిలుమమ్మ
చుట్టాలపైఁ బేర్మిఁ జూపుమమ్మ
దాసీ జనంబుపై దయను తప్పకుమమ్మ
సవతాంఢ్ర నణకువ నలుపుమమ్మ
పతిమిత్రులను గౌరవమ్ముతోఁ గనుమమ్మ
పతిశత్రువులఁగంటఁ బడకుమమ్మ

గీ॥ నగరివారికిఁ దలలోని నాల్కవోలె
దయకుఁ బాత్రమవై మంచితనము గల్గి
సాధ్యులందఱ కేలికసాని వగుచు
రవ్వమును రట్టు లేకుండ బ్రతుకుమమ్మ. (బాల. రా. చతుర్థ)

3) మూలమున కన్న వివరణమునకు :
మూలము : "త్యయ్యుత్కృష్ట బలేఽభియోక్తరి నృపేనందానురక్తేపురీ".
తెలుగు: "అభియోక్తయట చతురంగ సైన్యంబుల యభివృద్ధిగల
పర్వతాత్మజుండు" (ముద్రా. రా.)

4) మూలమున కన్న సంగ్రహ రచనకు :
సం॥ 'ప్రాకారం పరితః శరాసనధరైః క్షిప్రం పరిక్రమ్యతాం
ద్వారేషు ద్విరదైః ప్రతిద్విపఘటాభేదక్షమైః స్థీయతాం'
తెలుగు: "కోటచుట్టు భటు ల్తిరుగుదురు గాక
ద్వారముల నిల్చుఁగాక దంతావళములు (ముద్రా. రా.)

5) అనువాద పద్యములో మూలభావము మధ్యలో పూర్తికాగా శేషమును స్వయముగా కవులు పూరించుట:-

సం॥ సంసక్తైరివ చక్రవాక మిథునైః హంసైః ప్రడీనైరివ।
వ్యావిద్ధైరివ మీన చక్ర మకరైర్హర్మ్యైరివ ప్రోచ్ఛ్రితైః॥
తైస్తైరాకృతి విస్తరై రనుగతై ర్మేఘైః సముద్యన్నతైః॥
పత్రచ్ఛేద్య మివేహ భాతి గగనం విశ్లేషితై ర్వాయునా."

తెలుఁగు:

సీ॥ కలసిన చక్రవాకంబులగతి జెక్క
లల్లార్చి యెగురు రాయంచ లట్లు
జలములో తిరుగు చేపలరీతి జనపరి
క్రాంతంబులగు మకరముల వగిదిఁ
గమనీయ శృంగ జంగమ సౌధముల భాతిఁ
బరుగిడుచున్న యశ్వముల చాయ
ముట్టి పైకెత్తిన లొట్టి పిట్టల మ్రాది
గుములుగాఁ బోవు నేన్గుల విధమున

గీ॥ వాయు విశ్లేషితంబులు వారివాహ
ఖండములు పెక్కురంగులు కలవి నుదువఁ
జదలు భాసిల్లుచున్నవి దారుచిత్ర
రచనఁ గన్పించు దొసంగు వస్త్రంబు పగిది" (పం. అం. మృచ్ఛ.)

6) మూలమున శ్లోకముగానుండ తెలుఁగున వచనమగుట—

సం॥ "కృత్వైవం మనుజావతే ర్మహద్వ్యళీకం
స్థాతుం హి క్షణమపి న ప్రశస్త మస్మిన్
మైత్రేయ! క్షిపనిగడం పురాణకూపే
పశ్యేయుః క్షితిపతయో హిచారదృష్ట్యా" (మృచ్ఛ. 7 - 8 శ్లో)

తెలుఁగు : "మిత్రమా! మనమున రాజున కప్రియం బొనర్చి యచటఁ దడయఁజనదు. ఆ నిగళము నాపాడునూతఁ బడవేసిరమ్ము. కానిచో రాజులు చారచక్షువులచే గుర్తింపఁగలరు. (మృచ్ఛ. సప్త.)

## గద్య కావ్యములు

తిరుపతి వేంకటకవులు గద్యములోని కనువదించిన సంస్కృత కావ్యములు మూఁడు. అవి: 1) బిల్హణ మహాకవి విరచిత శ్లోకమయమగు విక్రమాంక దేవ చరిత్రము. 2) వీరనందకృత గద్య - చంద్రప్రభ చరిత్రము. 3) బాణ భట్టారక విరచిత హర్షచరిత్రము. (ఇందు పూర్వభాగము బాణభట్టారక చరిత్రము - ద్వితీయ భాగము హర్షచరిత్రము.) ఇందలి గద్యము చక్కని శైలిలో చిన్నయసూరి నీతిచంద్రికను బోలియుండి, నాతి కఠినమును, నాతి సులభమునునై, శ్రవణ సుభగత్వమునకు గీటురాయియై పండితజన రంజకమై యొప్పారుచున్నది. కవులు పద్యకావ్యములందువలెనే గద్యకావ్యములందును భావానువాద పద్ధతినే యనుసరించిరి.

# 1

శ్లోకములను వచనములోని కనువదించుటకు ఉదాహరణము : విక్ర మాంకదేవ చరితమునుండి - ఉదా -

శ్లో॥ కార్యతో యువరాజత్వే రాజసూను రవస్థితః।
సదిగ్విజయ మవ్యాజ- వీరః స్మర ఇవా కరోత్॥.

శ్లో॥ అభజ్యన్త గజై స్తస్య - లీలయా మలయద్రుమాః।
సమం కేరళ కాన్తానాం - చూర్ణకుంతల వల్లిభిః॥.

శ్లో॥ మదస్తంబేరమై స్తస్య - మలయే నిర్ద్రుమీకృతే।
మన్యే చన్దన వాయూనా మభూ ద్దుర్భిక్ష మక్షయమ్॥.

శ్లో॥ చందనస్యంది డిణ్డీర చ్ఛలేన మలయాచలః।
పిండం శ్రీఖండ వృక్షాణాం పరోక్షా మివాకరోత్॥.

శ్లో॥ సాన్ద్ర చన్ద్ర ననిష్యన్ద పఙ్క్తిలై స్తస్యవారణైః
క్షణమౌర్వాగ్ని సన్తాపః ప్రవిశ్య శమితోంబుధేః॥.

(విక్రమాంక. 4 సర్గ. 1 - 5 శ్లో.)

అనువాదము

పేరునకు సోమభూపాలుఁడు యువరాజయినను క్రియచేత యువరాజైన విక్రమాదిత్య భూపాలుఁడు మన్మథునివలె దిగ్విజయము నాచరించెను. అతని యేనుఁగులు కేరళకాంతల చూర్ణకుంతలములతోఁగూడ మలయపర్వతమునందలి చందన వృక్షములను బాడుచేయఁ దత్కాలమున లోకులకు మలయ వాయువు కరవయ్యెను. మలయపర్వతము చచ్చిపోయిన శ్రీఖండ వృక్షములకుఁ జందన ద్రవఫేన మను నెపమునఁ బిండప్రదాన మాచరించుచున్నట్లుండెను. చందన కంపముచేఁ బంకిలములైన యతని యేనుఁగు లీదుఁలాడుచు సముద్రమునకు క్షణ కాలము బడబాగ్ని సంతాపమును బోగొట్టినవి; చందన ద్రవముతోఁ బ్రవహించు చున్న నదులుగూడ దర్తకు శీత లో ఁ ద ర మ ల గా ఁ ఁ ఁ వి.' (ఁ ఁ ర్థా. ఁ ( ఁ ట )

## 2

సంస్కృతగద్యకు ఆంధ్రవచనానువాదము- హర్షచరిత్రమునుండి యుదాహరణము:—

"ఆ జగామ చ మధుమాస ఇవ సురభిగంధవహః। హంస ఇవ కృత మృణాలధృతిః, శిఖండీవ ఘనప్రీత్యున్ముఖః, మలయానిల ఇవాహిత సరసచందన ధవలతనులతోత్కంపః, కృష్యమాణ ఇవ కృతతరకచ గ్రహేణ గ్రహపతినా, ప్రేర్యమాణ ఇవ కందర్పోద్దీపన దక్షేణ దక్షిణానిలేన, ఉహ్యమాన ఇవోత్కలికా బహులేన రతిరసేన, పరిమల సంపాతినా మధుపపటలేన పటేనేవ నీలేనాచ్ఛాదితాఙ్గ యష్టిః, అంతః స్ఫురతా మత్తమదన కరికర్ణ శఙ్ఖాయమానేన ప్రతిమేందునా ప్రథమ సమాగమ విలాసవిలక్ష స్మితేనేవ ధవలీక్రియమాణైక కపోలోదరో మాలతీ ద్వితీయో దధీచః॥ ఆగత్య చ హృదయగత దయితానూపురరవ మిశ్ర యేవ హంసగద్గదయా గిరా కృతసంభాషణో యథామన్మథః సమాజ్ఞాపయతి యథా యౌవనముపదిశతి, యథానురాగః శిక్షయతి; యథా విదగ్ధతాధ్యాపయతి, తథాతామభిరామాం రామామరమత్।ఉపజాత విస్రంభా చాత్మాన మకథయదస్య సరస్వతీ। తయాతు సర్వమేకం దివసమివానయత్సంవత్సరమధికమ్"

—ప్రథమోచ్ఛ్వాసః 38 - 39 పు.

అనువాదము

"తరువాత మధుమాసమువోలె సురభిగంధము వహించి, హంసవోలిక మృణాళధారియై, నెమలిలాగున ఘనప్రీతినున్ముఖుండై, మలయవాయువు చందంబున నాహిత సరసచందన ధవళిత తనులతోత్కంపుఁడై చంద్రుండు కరంబులఁ గచగ్రహముఁ గావించి తీసికొని వచ్చినట్లు, కందర్పోద్దీపకుండగు మలయవాయువుచేఁ బ్రేరేపింపఁబడిన ట్లుత్కళికా బహుళంబగు శృంగార రసము మోసికొని తీసికొనివచ్చినట్లు బయలుదేఱి, శరీర సౌరభ్యాణమునకై మూసురు తసల విసరంబు నెపంబున నీలపటము శరీరమునిండఁ గప్పుకొని, ప్రథమ సమాగమ వైలక్ష్యంబునఁ బొడమిన చిఱునగవుచేఁ దెల్లవడినదో యనునట్లు వర్ణింపఁదగిన కపోల తలంబునఁ బ్రతిఫలించిన చంద్రబింబము లోపలనున్న వెదవింటి వాని పట్టపుదేఁగు చెవిసంకువు ననుకరింప దధీచుండు సనుదెంచె. వచ్చి హృదయమునందున్న సరస్వతి కాలియందెల చప్పుడు కలియుటచేతంబోలె

రాయంచవల్కుల ననువదించు కంఠస్వరంబున గద్గదిక దోఁప మాటలాడి మన్మథుఁ డాజ్ఞాపించినట్లు యౌవన ముపదేశించిన వగిది, ననురాగము శిక్షించిన లాగున, వైదగ్ధ్యము చదువు చెప్పిన చొప్పున అభిరామమైన ఆ రామను సంతోష పెట్టెను. సరస్వతియు నతనియందు విశ్వాసముంచి తన యాత్మ నతనికి సమర్పించెను. పరస్పరానురాగ సంతుష్ట హృదయులగు దంపతుల కొక్క సంవత్సర మొక్కదినమువలె గతించెను.'' (హర్ష. ప్ర. 27-28 పు.)

పద్యగద్య కావ్యములందును, నాటకములందును విశిష్టమైన వైవిధ్యము గలిగిన కృతులను తెనుఁగించి ఆంధ్రసారస్వతమును సంపద్పూరిత మొనర్చుటయే గాక, తెలుఁగువారికి సంస్కృత సాహిత్య సౌందర్యమును వెలార్చి, వానిని తెలుఁగుటియందనముతో ననుభూత మొనర్చి కీర్తి వడసినారు తి. వేం. కవులు. ఆంధ్రదేశమునందీ యనువాద కావ్యములు కళాశాలల స్థాయిలో పఠన పాఠనములలో నున్నవి. తెలుఁగున చిన్నయ్యసూరి తరువాత రసవంతమైన గ్రాంథిక శైలిని చక్కగా నడపి కావ్యములకు కావ్యములనే అనువదించిన మనీషులు తిరుపతి వేంకట కవులు. వారి శైలి చిన్నయసూరి శైలికన్న కొంత సారళ్యము వహించినది. అది వీరేశలింగముగారి ప్రభావము. ఇట్లు వారి యనువాద కావ్యములు ప్రవాహవేగము గలిగి శ్రవణ సుభగత్వముతో మూలముకన్న నెందును దీసిపోక, అనువాద భ్రాంతి కల్పింపక, రసవంతములై యొప్పుచున్నవనుటలో విప్రతిపత్తి లేదు. ఈ కావ్యములు ''పండితాపండితసంభావ్య''ములు కావలెననెడి తి.వేం. కవుల లక్ష్యము చరితార్థమైనది!

# ఉపసంహారము

తిరుపతి వేంకటకవుల కవిత ప్రాచీన కవితకు భరతవాక్యమనియు, నవీన కవితకు నాందీవాక్య మనియు ప్రసిద్ధిగాంచినది. అనఁగా ప్రాచీన కవిత వారితో ముగిసినదనియు, నవీన కవిత వారితో నారంభమైనదనియు స్థూలమైన అర్థము. పై ప్రసిద్ధ వాక్యములో చమత్కారమైన అర్థప్రతీతి కలదు. వారి కవిత ఒకవైపు భరతవాక్యముగను, ఒకవైపు నాందీవాక్యముగను ఉన్నదట. లోకమున సామాన్యముగా భరతవాక్యమైన విషయము నాందిగా నుండజాలదు. ఇచ్చట వాచ్యార్థము బాధితమగుచున్నది. ఇఁక లక్ష్యవ్యంగ్యముల నాశ్రయించి, గుణ ప్రాధాన్య వివక్షతో సన్వయము కుదుర్పవలెను. భరతవాక్యము విశ్వశ్రేయో రూపమై పూర్వకావ్యార్థసంపుటి కొకసమన్వయసంసిద్ధిని ధ్వనింపఁజేయుచుండును. నాందీవాక్యము ఆశీర్నమస్క్రియారూపమై భావికావ్యార్థముల సంపుటిని తన యందు వ్యంగ్యముగా భాసింపఁజేయుచుండును. ఇట్టి దృష్టితో నన్వయించుచో నీ జంటకవుల కవిత్వమునందు ప్రాచీన ప్రసిద్ధ కవిత్వ మర్యాదలన్నియు నొక విశిష్ట సమన్వయము పొంది యిందొదిగి నిలిచినవనియు, భావికాల కవితామర్యాదలు ఇందు బీజప్రాయముగా నాటఁబడియుండి మంగళారంభమును సూచించుచున్నవనియు తాత్పర్యము కాఁగలదు. మఱియు ప్రాచీన కవిత్వమునందు గోచరించు ధారాళమైన ప్రవాహశైలి, సౌకుమార్యముతోకూడిన ప్రసన్నత, అర్థపుష్టి అనెడి లక్షణములు తిరుపతి వేంకటకవులయందు సమకాలీనులు సాధింపలేని విశిష్ట స్వాతంత్ర్య భావములతో ప్రజాశక్తిని పుంజించుకొని సిడిబుగ్గవలె పునరావిర్భవించి సారస్వతరంగము నావరించినవి.

''వానలోఁ దడియనివారు మద్గురువధాన మృదూక్తిమరందధారలో గడుగనివారు మాకెచట కానఁగరారిఁ దెల్గునాఁడునన్'' అని ప్రశంసించిన విశ్వనాథవారి వాక్కులో సమకాలీన కవులపైబడిన కవుల కవితాప్రభావము వర్ణితమైనది. అవధానకళ, మృదూక్తి, మరందమాధుర్యము, అవిచ్ఛిన్నధార, కల్మష క్షాళనము అన్నవియే వారి కవితా లక్షణములట! వానలోఁ దడియనివాఁడు లోకమునఁ గానఁబడని యట్లే ఆ కవుల కవిత్వధారలో మునుఁగనివాఁడే తెలుఁగు

నాఁట లేఁడట! ప్రజాహృదయములందు కవుల కవితకుఁ గట్టఁబడిన పట్టమును నుట్టంకించు వాక్యములియ్యవి.

''జగద్ధితమగునట్లుగను'', ''ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగను'', "అలకించిన సొగసు కోర్కెలు వచ్చునట్లును'', ''విరిపొట్లము విప్పినట్లును" వ్యంగ్య రస భావములు గుబాళించునట్లుగను, ''రసాభ్యుదయోల్లాసి'' యగు సాహిత్యమును సృజింప ''మహా కవిత్వ దీక్షావిధి" నొందినవారు తిరుపతి వేంకట కవులు. కవిత్రయ కవిత్వము వారి కొజ్జబంతి. వారితోపాటు మరికొందఱు ప్రాచీన కవుల ప్రభావము వీరిపైఁబడినది. నిరంకుశులైన ఆ జంటకవులా ప్రభావమును తమ స్వాతంత్ర్య శక్తితో జీర్ణించుకొని వినూత్న వ్యక్తిత్వమును ప్రకటించిరి. ఆ వ్యక్తిత్వమే సమకాలీనులకు ఒక నూత్న చైతన్యశక్తిగా గోచరించినది. నాఁటికి నేఁటికి దాని మహత్తుకు తిరుగులేదు!

'కవిబ్రహ్మ'వలె తిరుపతి వేంకట కవులు కావ్యకర్తలే కాక కావ్యభర్తలునై కవి లోక భక్తి నీరాజనములకుఁ బాత్రులైరి. పింగళి కాటూరుల సౌందరనందము, సర్వా శేషయ్యగారి సుదర్శనోపాఖ్యానము శశికళా స్వయంవరము మొదలైనవి వారిని వరించిన కావ్యకన్యలు.

తిరుపతి వేంకట కవులను చూచి దేశమున కవులు శత సంఖ్యలలో అవధానకళను చేపట్టి అవధాని బిరుదాంకితులై వారి ప్రతిబింబ సౌభాగ్యము సాధించిరి. అవధానములను వారికన్న వేగముగా చేసినవారు, అధిక చమత్కారములను ప్రదర్శించినవారు వారి తర్వాత కనవత్తురు కాని, వారివలె శాస్త్ర పాండిత్య ప్రాభవముతో, వాదులలో జయ వ్రతము లు పొంది, సభారంజకముగా గీర్వాణాంధ్రములలో నవధానము నడపినవారును, వారివలె తోర్తోర బహుళ సాహిత్య ప్రక్రియల నిర్వహించినవారును కానరారు.

తి. వేం. కవుల భారత నాటకములు పెక్కురు కవులకు సంపూర్ణ భారత నాటకములు రచించుట కుత్తేజము కల్పించినవి. వారి బుద్ధచరిత్రము బుద్ధదేవుని జీవిత చరిత్రము నితివృత్తముగా గైకొన్న పెక్కు కావ్యములకు మార్గదర్శకమైనది. వారి జాతకచర్య పద్యాత్మక స్వీయచరిత్రలకు త్రోవచూపినది. వారి జీవిత రస ఘట్టములు దర్శించి భావించిన సమకాలీనులకు కవిత్వముపై రక్తి కల్గినది;

నవ్యతపై భక్తి కుదిరినది; కలము పట్టు శక్తి కలిగినది, తెలుఁగు కవితకు బంధ విముక్తి సిద్ధించినది! మరొక శతాబ్దము జీవించు శక్తి యేర్పడినది!

తి.వేం. కవుల కవిత్వ వ్యక్తిత్వ ప్రభావము భావకవిత్వ యుగకవులపైఁ బ్రస్ఫుటముగాఁ బొడగట్టుచున్నది. ఆకాశ పురాణాదుల రూపమున నొక సంగ్రహ కథా వస్తువును లఘు కావ్యముగా రచించు వైఖరి అష్టావధాన ప్రక్రియయందును, ఒక నిర్దిష్టమైన అంశముపై గిలిగింతలువెట్టు చమత్కారభావములతో సంగ్రహము, రసవంతమునైన కావ్యఖండికలను సృజించుతీరు వారి శతావధాన ప్రక్రియయందును పొడగట్టి, తరువాతి కవుల కొక్రొత్తత్రోవను ప్రసాదించెను. వానిలో నిబద్ధమైన కవితాశైలి సహజభావావేశ సరళావిష్కారమున కువయుక్తమగు ధారామాధుర్య స్వరూపము నందించినది. తి. వేం కవులు తమ కావ్య ప్రక్రియలన్నిందియందును బ్రస్ఫుటముగా బ్రపంచించిన ఆత్మాశ్రయ వస్తు శిల్పము భావికవులకు స్వీయభావానుభూతిని ఆత్మనాయకమైన కవితగా చెప్పుటకు బ్రోత్సహించినది. దీనికిఁదోడు ఆంగ్లసాహిత్య పరిచయముచేఁగల్గిన నూతన భావోత్తేజనమును తమ కవితాకృతులలోఁ బ్రవేశపెట్టి ప్రయోగాత్మకముగా కావ్యరచనమొనరించెడి నిర్భయస్వాతంత్ర్యము వీరి సహజ ప్రవృత్తి నుండి కవులు గ్రహించిరి. ఇట్టి స్వాతంత్ర్య ప్రవృత్తికి వీరేశలింగము పంతులుగారు సూత్రధారులుకాగా - తిరుపతి వేంకటకవులు స్థాపకులై, సామాజికులలో నున్ముఖీకరణము నిర్వహించిరి.

తెలుఁగులో భావకవిత్వమునఁ బైలక్షణములన్నియుఁ బ్రతిబింబించినవి. లఘుకావ్యములు, ఖండకావ్యములు, ఆత్మాశ్రయ కవిత్వము, వాస్తవికవాదము మొ॥ వాని బాహ్యాకృతులు కొన్ని పాశ్చాత్య సాహిత్య ప్రభావముద్రితములైయున్నను అంతరాకృతులన్నియు తి. వేం. కవుల విశిష్ట కవిత్వప్రసాద వ్యక్తిత్వము నందగించుకొని అవతరించినవే! అట్టి కవితాప్రసాదమును భక్తిమై సేవించిన భావ కవితాయుగ ప్రముఖ కవులు తిరుపతి వేంకటేశ్వరులకు కృతజ్ఞతాంజలులఁ బట్టి వేనోళ్ళఁ గీర్తించియున్నారు. అట్టివానిలోఁ గొన్నిటి నిందు పొందుపరిచి, నా గ్రంథమునకు మంగళాంతము నందగించెదను :

ఉ. "భారత సంహితన్ జదివి భాగవతమ్ము పఠించుకొంచు నో
రూర వరూధినీ ప్రణయమో, కలభాషిణి చిత్రవృత్తమో
సారె పఠించు నీ తెలుఁగుజాతికి గ్రొంజవులూరు నీదు నిం
గారపు గబ్బమున్ శ్రవణపందన మయ్యెగదా కవిప్రభూ!"

మ. "అవనీపాల సభాంతరమ్ముల నసూర్యంపశ్యయై పండిత
ప్రవరుల్ చర్విత చర్వణక్రియల నావర్తింపఁగాఁ జేయు నృ
త్య వినోదమ్మును జూపు మా తెలుఁగు కన్యన్ బల్లకీమీఁద ద్రి
ప్పవె దిగ్విభుల నీవు నైకవిధ నైపథ్య ప్రదానమ్ములన్."

—కాటూరి వేంకటేశ్వరరావు.

చ. "తెలుఁగు జగాన నేఁడు గడిదేరిన బాలకవీంద్రులెల్ల మీ
పలుకుల పందిటన్ జిరుగుపట్టిన మొగ్గలు మీ పథాన కౌ
శలమున నూగిపోయిన దిశావలయమ్ము ప్రసన్నబుద్ధిమై
పలగొని మీ కొసంగెదు సుపాయనముల్ గొనుమయ్య సత్కవీ!"

మ. "మదమం ద్రిప్పని యాంధ్ర పుత్రకులదీమా నీ కళాసృష్టిలో
నుడికారమ్మున బట్టువడ్డ దనుకొందున్ భాషకున్ గ్రొత్తపో
కడ శిక్షించిన కింకవీంద్రగజశిక్షా దక్ష హర్యక్ష నీ
నడుగుల్ మెట్టినచోట బుట్టెడి కవిత్వావేశ బీజావళుల్."

—గుఱ్ఱము జాషువాకవి.

ఉ॥ "ప్రాక్తన శైలికిన్ భరతవాక్యము నాంది వినూత్న శైలికిన్
సూక్తి బహుశ్రుతుల్ పలుకుచుందురు మీ కవితన్ గుఱించి ర్వ
త్రోక్తము లార్షసూత్రముల పోల్కి పఠించెద రంధ్రభారతీ
భక్తులు పూర్వపుణ్య విభవ వ్యయలబ్ధము లేతదర్థముల్."

—ఏటుకూరి వేంకట నరసయ్య.

క. "మాటలు పెక్కేలా తొలి
నాటి కవిబ్రహ్మ తిక్కనప్రభుఁ డివో
నేటి కవిబ్రహ్మవు నీ
నాటిన మల్లియలు తెల్గునాటి కవీంద్రుల్."

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

ఓం తత్సత్

## అనుబంధం

# తిరుపతి వేంకటకవుల కవితావైభవం*

## 1

"శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్నఁ
గరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
'నంది కొండయ దండనంబు' మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
'నల్లేరుపై బండి నడక' మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
షడ్రసోపేత భోజనము మాకు
వ్యర్థ మగు వాదము లొనర్చు నట్టివారి
దంబ మణగించు టాపోశనంబు మాకు
దానరాధేయ! కవిసముదాయగేయ!
పండిత విధేయ! రామభూపాలరాయ!"

తిరుపతి వేంకట కవులు గద్వాలను మొదట దర్శించినప్పు డాభూపాలునితో చెప్పిన పద్య మిది ఆ జంట కవుల కవితా ప్రాభవం గుబాళించే సీసపద్య మిది. వారికి శతఘంట కవనమంటే అరచేతిలోనున్న ఉసిరిక పండువంటిది. కష్టమైన అష్టావధానం నంది కొండయను దండించినంత తేలిక పని. ఆశుధారా కవిత్వం నల్లేరు మీద బండి నడకలాగా అవలీలగా సాగే కవితాహేల. సత్కావ్య రచనం చేయటం షడ్రసోపేతభోజనంలాగా పాండితీప్రాభవాలను పసందైన కవిత్వంలో రుచి చూపించే సదవకాశం. వ్యర్థమైన వాదాలుచేసే వారి దంబ మణగించటం

---

* యువభారతి ప్రచురణ సం. 52 (1977 జనవరి 2 వ తేదీ)

ఆపోశన మెత్తినట్టే వారికి. అవధాన కవిత్వం, ఆశు కవిత్వం, కావ్య కవిత్వం, వివాద కవిత్వం తిరుపతి వేంకట కవులకు వెన్నతో పెట్టిన విద్యలు.

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలని కవిత్వాన్ని నాల్గు విధాలుగా వింగడించారు ప్రాచీనులు. అందులో ఆశు కవిత వేగంగా చెప్పే కవిత. దాని శాఖయే అవధాన కవిత. అచ్చమైన ఆవేశంతో నిరాడంబరంగా, రమణీయంగా, ధారావాహినిగా చెప్పే కవిత్వం ఆశు కవిత్వం. వేమనపద్యా లందుకు చక్కని ఉదాహరణలు. అవధాన ప్రక్రియలో ఆశు కవిత గడుసు పోకడలు పోయింది, ఏకపాద, త్రిపాద, కఠినప్రాస, విషమ సమస్యా పూర్తులు, వ్యస్తాక్షరీ సంఘటిత పద్యాలూ, నిషేధాక్షర రచనా చమత్కృతి సహితాలూ, ఆకాశ పురాణాలూ. ఇవన్నీ అవధాన కళవలన ఆశువున కబ్బిన విశేష లక్షణాలు. అవి ఎంత అవరోధాలో అంత అలంకారాలు. ఎన్ని అవరోధాలూ, నియమాలూ ఉన్నా వేగంగా సాగటమే ఆశువు కున్న విశేషం. దాని నొక సాహిత్య కళగా పోషించారు గీర్వాణాంధ్ర కవులు. అందులోనూ ఆంధ్ర కవులు. ఆశు కవిత్వం చెప్పిన కవు లెందరో ఉన్నారు తెలుగులో. వారిలో తి. వేం. కవులకు ప్రత్యేక స్థానం ఉంది జంటకవులుగా ఆశువును మొదటిసారి నిర్వహించింది వారే జాతికి కవితా చైతన్యాన్ని ఆశుకవిత్వంతో కలిగించింది వారే.

అవధానం ఒక సాహితీ క్రీడ. చిత్తైకాగ్రతను అవధాన మంటారు. అది ప్రధానంగా అష్టావధాన మనీ, శతావధాన మనీ, సహస్రావధాన మనీ మూడు విధాలుగా కనపడుతుంది అందులో శతావధానాన్ని గూర్చి ఆ కవులే ఇలా లక్షణం చెప్పారు:

> 'తత్ర న్మానవ మానసాదృత తమం వృత్తం తథా వస్తు చ
> స్వీకృత్య ప్రథమం శతాయ సరయం తత్పాద మేకం వదేత్
> భూయఃస్తై ర్నచ బోధితః క్రమవశాత్పాద త్రయం కీర్తయే
> దేవన్నామ శతావధాన మదచే త్పద్యాని సంకీర్తయేత్.'

శతావధానంలో నూరుగురు పృచ్ఛకులుంటారు. ఒక్కొక్క పృచ్ఛకుడూ తన యిచ్ఛవచ్చిన విషయాన్ని నిర్దేశించిన వృత్తంలో తెలుగులో కాని సంస్కృతంలో గానీ చెప్పమని అవధానిని ప్రశ్నిస్తాడు. అవధాని ఆ పద్యంలో ఒక పాదము ముందు చెపుతాడు అలాగే నూరుగురూ అడుగుతారు. అందరికీ మొదటి పాదం

చెప్పుతూ వెళ్లుతాడు. ఆ తరువాత క్రమంగా రెండవ, మూడవ, నాల్గవ పాదాలు ఒక్కొక్కసారిగా మూడుసార్లు వరుసలు పూర్తిచేసి నూరు పద్యాల రచనా ముగించి వేస్తాడు. చివరకు ఆ నూరు పద్యాలనూ ధారణతో సభలో చదువుతాడు. ఈలోగా పృచ్ఛకులు వరుస సంఖ్య మార్చికూర్చున్నా వారి వారి సమస్యలు వారికే చెప్పాలి. వరుస తప్పించి పద్యా లడిగినా వాటిని అడిగినట్లు చదవాలి. నూరు మందికి సంబంధించింది శతావధానమైతే, వేయిమంది పృచ్ఛకులకు సమాధానం చెప్పేది సహస్రావధానం. ఏ అవధానమైనా చివరిదాకా చేయుటమే కష్టం. అందులో జంట కవులు ఒక్కొక్క చరణం చొప్పున చెపుతూ చేయటం మరీ కష్టం. ఇదే ఇంత కష్టమైతే అష్టావధానం చేయటం మరీ కష్టం. అష్టావధాన లక్షణం చెప్పిన మాలిక చూడండి :

"అరయఁగ మే మొనర్పఁ గల మష్టవధానము, దాని రీతి నే
ర్పఱచి వచింతు; మెట్లనినఁ బండిత సమ్మతిగాఁ గవిత్వ మెం
ద ఱడిగిరేని యందఱకుఁ దప్పులు చొప్పడకుండ నాంధ్ర మం
దు రహిని దేవభాషను సుదుష్కర కల్పన లొప్పఁజెప్పి, యెం
దరయినఁగాని కష్టపు విధమ్మున నెన్నఁడినైనఁ గాని య
క్కరము లొసంగి రేని యవి గైకొని తప్పక చెప్పి, యంత దో
క రయము మీఱ లౌకిక ప్రకారముగా వచించువారి కు
త్తరము లొసంగి, మీఁదను ముదంబలరన్ జదరంగ మాడి, కొం
దఱకు గురుత్వమూని పఠనమ్ములఁ జెప్పి, పురాణగాథలన్
దుర మొనరన్ బఠింపఁగఁగ నెమరొక్కట యర్థము చెప్పి, పుష్పముల్
గరమును వీపుపై విడువఁగా సరిగా గణియించి, ఘంటికల్
నెఱయఁగఁ గొట్ట వానిని గణించి, నిషేధ మొనర్చినట్టి య
క్కఱములు మాని పద్యములు గల్పన చేసి మనోహరమ్ముగా
విరచన సేయ నేర్తుము......."

అష్టావధానంలో ఎనిమిదిమంది పృచ్ఛకు లుంటారు. వారందరికీ ఒకేసారి అవధాని సమాధానం చెప్పాలి. వారు అవధాని ఏకాగ్రతను భగ్నం చేయటానికి యత్నిస్తారు. అవధాని అవధానాన్ని నిర్వహిస్తాడు. అందులో ఉండే అష్టాంగాలివి- 1. పండితు లడిగిన అంశంపై గీర్వాణాంధ్రాలలో కవిత్వం చెప్పటం. 2. వ్యస్తాక్షరి. 3. లౌకిక ప్రసంగం లేదా అప్రస్తుత ప్రశంస. 4. చతురంగ

ఖేలనం. 5. కావ్యపాఠం. 6. పురాణకథనం 7 పుష్పాలను గాని ఘంటికా నాదాలను గాని గణించటం. 8. నిషిద్ధాక్షరి. ప్రథమాంగంలో సమస్యాపూరణం, కల్పన వర్ణనల్లో ఏదైనా ఉండవచ్చు. ఎనిమిదిమందీ కవితలనే కోరవచ్చునని కొందరంటారు. అప్పు డవధాని ఒక్కొక్క చరణం చొప్పున అందరి సమస్యలకూ పద్యాలు పూరించాలి చతురంగ ఖేలనంలో కొందరు చీట్లపేక ఆడతారు. పుష్ప గణనానికి బదులు గణితవైద్య జ్యోతిషాది శాస్త్రాంశాలను కొందరు గ్రహిస్తారు. కొందరు దత్తపది నిర్వహిస్తారు. పురాణ కథనానికి బదులు ఆకాశపురాణాన్ని చెపుతారు కొందరు. ఏవి ఎలా మారినా ఎనిమిది అంగాలు అష్టావధానాని కుంటాయి.

శతావధాన అష్టావధానాల్లో అందరినీ ఆకర్షించేది సమస్యాపూరణం. ఆ తరువాత నిషిద్ధాక్షరి. అవి నిర్వహించటానికి భాషా పాటవం, లోకజ్ఞానం. నవనవోన్మేషమైన ప్రతిభా ఉండాలి. అర్థ సమన్వయం లేని ఒక పద్యపాదమిస్తే దాని కర్థసమన్వయం కుదిరేటట్లుగాపద్యపాదాలను పూరించటం సమస్యాపూరణం. తిరుపతి వేంకటకవు లవధానాల్లో ఎన్నో సమస్యలను అత్యద్భుతంగా పూరించారు. మచ్చు కొకటి రెండు :

సమస్య : "సతి సతిఁ గలయంగఁ బుత్ర సంతతి కలిగెన్."

పూరణం : అతి కుతుకం బలరారఁగ
జతురత మెఱయంగ మదనశాస్త్ర విధమునన్
పితరం బగు తన సౌధవ
సతి సతిఁ గలయంగఁ బుత్రసంతతి కలిగెన్.

సమస్య : "సంధ్యావందన మాచరింప వలదా చొక్కతి బంధమ్ములన్?"

పూరణం : వింధ్యాద్రిప్రతి నొప్పు బల్ కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పఁగ లేక వెఱ్ఱివలె నేలా మంచి యీ రాతిరిన్
వంధ్యం జేసెదు; కాముకేళి యనఁగా బాండిత్యమా? లేక నీ
సంధ్యావందనమా? చరింపవలదా చొక్కతి బంధంబులన్?

సమస్య : "సరసునివైపు వీపు నల దాన మొగం బటు గోడవైపు."

పూరణం : సరసునివైపు వీపు నల దానమొగం బటు గోడవైపు, నా
సరసుఁడు కేలు దాపు నల దానయుఁ జన్నులఁ జేయి మోపు, నా

సరసుఁడు కోర్కెఁ జూపు నల దాన దొరం దొరలోనఁ దోపు, నీ
వరుసనె తెల్లవారె నొకవైఖరి కొక్కని కొక్క వేశ్యతోన."

అడిగెడి వాడికంటె అవధాని ఆరురెట్లు రసికుడుగా ఉండాలి. అవధానం తెలుగునాట అవతరించి అభివృద్ధి చెందిన సాహిత్యకళ. దానికి శరత్పూర్తిమ ఆ జంటకవుల అవధాన మహిమ.

## 2

గంగాధరుఁడు నీ మగండని సర్వాంగ
వేషధరుండు నీ పెన్మి టనియె
నెద్దు నెక్కును నీదు నెమ్మిగాఁ డని సర్వ
గ్రద్ద నెక్కును నీ మగండ టనియె
వల్లకా డిల్లు నీ వల్లభున కనఁగ
నదిసంద్ర మిల్లు నీ నాథున కనె
నాట్యంబు సేయు నీ నాయకుం డన సంగఁ
గావించు వెన్క నీ కాంతు డనియె
ముష్టి కెక్కడి కేగె నీ యిష్టుఁ డనియె
బలిముఖంబున కేఁగె నో లలన! యనియె
నిట్టు లన్యోన్య మర్మంబు లెంచుకొనెడు
సర్వమంగళాంబోధికన్యలఁ బ్రస్తుతింతు.

1910 లో బందరు హిందూ హైస్కూలులో జరిగిన శతావధానంలో లక్ష్మీపార్వతుల సంవాదం చిత్రించిన పద్యమిది. ఆశువుగా చెప్పిన ఈ పద్యంలో సంభాషణ సజీవంగా నర్మగర్భంగా, పరస్పరాక్షేపపూర్వకంగా, స్త్రీ ప్రకృతి సహజంగా సాగింది; కూర్చుండి పనిపెట్టి వ్రాసినా ఏ పద్యానికీ తీసిపోనట్లు కుదిరింది. అర్థం వివరించవలసిన అవసరంలేని సారళ్యం, ఆలోచనలో అమృతాన్ని వర్షించే అర్థగాంభీర్యం కవితలో నీరక్షీరంగా కలిసిపోయి రాజిస్తున్నాయి. ఇందులో స్వారస్య మెంత ఉందో చమత్కార మంత ఉంది. వాకోవాక్య శిల్పంతో పాటు వాక్యవక్రత రాణించింది. ఇలాంటి పద్యాలు వారి అవధానాలలో కోకొల్లలు. హరిహరుని వర్ణనం అచ్చతెనుగులో సాగింది :

"తాల్చె నెవ్వాఁడు కెందమ్మిదండంబోలె, నెదుటొమ్ముపై నిరు లిచ్చు దాన
మ్రింగె నెవ్వాఁడు నేరెడిపండు చందాన, కడలిలోఁ బుట్టిన కాఱువిసము
పూనె నెవ్వాఁడు వెన్నముద్ద కుద్దిగ గేలఁ దెల్లసందుల నించు నల్లసంకు
నానె నెవ్వాఁడు మల్లెయలరుగుత్తుం పేరు, పోల్కిగా మెడనిండఁ బుస్కదండ
వేవెలుంగుల దొరయను రేవెలుంగు, నెవనికన్నులు నిప్పద న్నెవని నెక్క
దట్టి మున్నిటి యల్లుఁడు; నట్టిమంచు కొండయల్లుడు మీకుఁ గోర్కులనొసంగు."

ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క మూర్తి తెలుగు తీయదనంతో కన్నుల ముందు ప్రత్యక్షమై అద్వైతసిద్ధిని అనుభూతి కందిస్తుంది. తిక్కన్న హరిహర నాథుడు తిరుపతి వేంకట కవుల్లో తేటగా దర్శనమిస్తాడు.

శతావధానం సామాన్యంగా నాలుగురోజులు పడుతుంది. కాలపరిమితి మొత్తానికి పదునారు గంటలనుండి ఇరువదినాలుగు గంటలుంటుంది. శతావధాన ప్రక్రియలో మనకు అద్భుతాన్ని కలిగించే కొన్ని అంశాలను గమనిద్దాం: 1. అవధానం పూర్తయ్యేంతవరకూ వర్ణనాదులు అవధానికి మరపుకు రాకుండటం 2. ఏదైనా అంశం స్ఫురించకపోతే అవధాని ఇష్టదేవతా ప్రార్థనారూపంగా ఒక ఆశుపద్యాన్ని చదివి దానిని జ్ఞాపకం చేసుకోవడం. 3. అవధానం నిర్వహిస్తూ చమత్కారాలనూ, ఛలోక్తులనూ అవధాని పద్యాలలో గుప్పించి సభను రంజింప జేస్తూ ఉండటం. అవధానం చేసేవారి కెంత కష్టమో వినేవారి కంత ఆహ్లాదం.

ఒకసారి గద్వాలలో అసూయపరులైన వందితులు శతావధానం రామూ చేయగలమని పంతంపట్టి పూర్తిచేయలేక భంగపడినారు. ఆ తరువాత తి. వేం. కవులు శతావధానం ప్రారంభించి ఆంజనేయ ప్రార్థనం చేస్తూ అశక్తులైన అవధానులను అధిక్షేపం చేశారు:

"నాలుగామడ దాట నా నేర్చు, మీఁదఁ నా - చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
ఎన్మిదామడ దాట నే నేర్తు, మీఁద నా - చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
పదియామ డైన నేఁ బరతెంతు, మీఁద నా - చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
పంద్రెండయిన నాదుపని గాని, మీఁద నా - చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
ఇట్లు పల్కుచు నున్న కపీశ్వరులు శిరములు వంపంగ శతయోజనముల వార్థి
దాఁటి వచ్చిన నిన్నెన్నఁ దరమె మాకు, నాంజనేయ కవిధ్యేయ యప్రమేయ!"

అన్యాపదేశ హాస్యప్రసంగానికి ఈ పద్యం చక్కని ఉదాహరణం. శత యోజనాల వార్ధివంటిదే శతావధానం. దానిని దాటటంలో ఉన్న సాహసం సర్కసులా అనిపిస్తుంది ఆధునికులకు. శతావధానాన్ని సర్కసుతో పోల్చి చెప్పారు కవులు:

"తిరుపతి వ్యాఘ్రమై బయలుదేరిన శిష్యులు గున్నయేన్గులై
వరలఁగ దేరగాఁ దగినవారలు బెబ్బులిపిల్లలెల్ల మా
ర్తురు కపికుర్కురమ్ములయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరితే
సరిగ శతావధానమను సర్కను చూచితివమ్మ శాంకరీ!"

సర్కసు శారీరక పరిశ్రమ. శతావధానం మానసిక పరిశ్రమ. ఒకటి అహ్లాదాన్ని కలిగిస్తే మరొకటి ఆనందాన్ని వర్షిస్తుంది; రెండూ అద్భుతానికి ఆలవాలాలే!

3

దోస మటంచు చెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుబాసలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా
రోసము గల్గినం గవివరుల్ మము గెల్వుఁడు; గెల్చిరేని యీ
మీసము తీసి మీపదసమీపమునం దం లుంచి మ్రొక్కమే?

శ్రోత్రియులైన తిరుపతి వేంకటకవులకు మీస ముండటం దోషంకాదా అని ఒక గడుసరి ప్రశ్నిస్తే తి. వేం. కవు లిచ్చిన వీరోచితమైన సమాధానం. ఈ పద్యం మీసాలున్న తెలుగువారు మోజుపడి చదువుకొనే మనోజ్ఞమైన పద్యం. సంస్కృతాంధ్ర కవిత్వాల్లో సవ్యసాచులు తి. వేం. కవులు. సవాలుచేసినా సగర్వంగా ప్రతిజ్ఞను నిలుపుకొన్న ప్రజ్ఞానిధులు. సాహంకారంగా చెప్పుకొన్న మాట నైనా సహజాలంకారంగా సాగించుకొన్న ప్రతిభామూర్తులు తి. వేం. కవులు.

అవధానాల్లో పృచ్ఛకులు అవధానుల నెన్నో విధాలుగా పరీక్షిస్తారు. శాస్త్ర విజ్ఞానాన్ని పరీక్షించేవారు కొందరు, జటిలసమస్యల నిచ్చి తికమక పెట్టే వారు కొందరు, అల్పసమస్యల నిచ్చి కల్పనను పరీక్షించేవారు కొందరు. ఈ చివరివారి చిల్లర ప్రశ్నలు ఎంత చిలిపిగా ఉంటాయో అంత చమత్కారాన్ని కలిగిస్తాయి. వారు వేసే ప్రశ్నల స్వరూపస్వభావా లిలా ఉంటాయి: పకోడిమీద

చంపకమాలా వృత్తం. పచ్చిమిరపకాయమీద సీసపద్యం, కిరసనాయిల్‌మీద స్రగ్ధరావృత్తం, చీపురుపురక మీద కందపద్యం, పొడుముకన్న చుట్టసయమనే అంశంమీద సీసపద్యం, మీసాల వలని నష్టాలపై సీసపద్యం, పొడుముమీద సీసపద్యం, పకోడిమీద ఉత్సాహవృత్తం, సూదిమీద ఉత్పలమాలావృత్తం, నశ్యం మీద శార్దూలవిక్రీడితం, గ్రామఫోన్‌మీద మందాక్రాంతావృత్తం, నూపురంమీద స్రగ్ధరావృత్తం, చెదపురుగుమీద శార్దూలం, నల్లిమీద కందం, దోమకాలుమీద మహాస్రగ్ధరావృత్తం, బిల్లపెంకుమీద సీసం, రెల్లుపూతమీద అచ్చ తెలుగులో మందాక్రాంతం, కంటిపాపమీద విచకలితావృత్తం, కొత్తగా ముండమోసిన జవ్వని యేడుపును గూర్చి సీసం, బిడాలంమీద మందాక్రాంతం, చీపురుముల్లుపై సీసం. ఇలా ఉంటాయి సమస్యలు. సమస్య లీజంటకవులకు సరససల్లాపాలుగా ఉండేవి. నవ్వేరూ పృచ్ఛకులనూ, ప్రేక్షకులనూ కవ్విస్తూ అవధానాన్ని అమోఘంగా నిర్వహించేవారు. వస్తువు నీరసమైనా కవుల ఉక్తి విశేషంలో ఊపిరిపోసికొని ఉజ్జ్వలంగా భాసించేది. మచ్చుకు పకోడిమీద చెప్పిన ఉత్సాహవృత్తం చూడండి:

''సెనగపిండి ఉల్లిపాయ చిన్న మిర్పకాయలుం
జొనిపి యందు నల్ల మింత చొనిపి ముద్ద చేసినన్
అనలతప్తమైన నేతియందు వైచి వేచినం
జను పకోడి యనెడి పేరఁ జక్కనైన భాద్యమై"

అవధానాల్లో ప్రశ్నలన్నీ వలచబారినవే అయిఉండవు. ప్రతిభను పట్టి పరీక్షించే ప్రశ్నలు గూడా ఉండేవి. బందరులో సంధ్యారాగవర్ణనం చేయమన్నా డొక పృచ్ఛకుడు.

''వారుణీకామినీ ఫాలభాగంబునఁ- బొల్పొందు కుంకుమపూఁత యనఁగఁ
జక్రవాకీమనస్సరసిజంబునఁ జొరఁ - బారు సంతాపాగ్నివార మనఁగ
నస్తాద్రిపై నేగు నరణుఁ దర్ధము వెట్ట -నేగు పద్మిని యనురాగ మనఁగ
కాలమాయావిచేఁగాల్చి పెట్టినగుడుస్సురదయోమయముతాకటకులనఁగ
సంజకెంజాయ చెన్నారె సర్వభూసు - రాధికులు సంధ్యవార్చగా నాపగాస
మీపములకేగి యుత్సాహ మింపుగొల్ప-మెల్లమెల్లనఁ జీకటు లెల్లెందుకొనఁగ.

భావనా రమణీయంగా సాగిన ఈ ప్రకృతి వర్ణనం ప్రబంధ వర్ణనలను జ్ఞప్తికి తెస్తుంది. ఆశుకవితలో కూడ కావ్య కవితా గౌరవాన్ని కాపాడిన కవులు తి.వేం. కవులు.

"ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటి కెన్ని పె
ద్దతనము గాంచి చిత్రమును దన్పునొ, మే మవధాన సంగత
స్థితి గని యాశుగా రచన చేసిన పద్యములందుఁ జూచినన్
శతమున కన్ని పద్యములు చక్కగనుండు నసంశయంబుగన్'

మహాకవుల మాటలే మనోజ్ఞ కల్పకాలు - ఇక పద్యాలు హృద్యశిల్ప నందనాలు.

4

చదువగా వలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగా వలె విద్యలెల్లఁ
జూడగా వలె రాజమూర్ధామణులసభల్
పొందగా వలె మహాభోగములను
తిరుగగా వలె దేశదేశాల వెంబడిఁ
బడవలె పదరానిపాటు లెల్ల
వినఁగావలెను పూర్వవిద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస
కవులు కవులన్న మాత్రాన కవులుగారు
ఎంత భారమ్ము గలదొ కవీశ్వరులకు
నెఱుఁగకుందురె మీవంటి నృపతిమణులు
శ్రీమదానంద గజపతి క్షితితలేంద్ర!

'విద్వత్కవయః కవయః కేవలకవయః కపయః' అని ప్రాచీనోక్తి. కవులకు ప్రతిభ యెంత ముఖ్యమో శాస్త్రవ్యుత్పత్తి, లోకజ్ఞానం అంత ముఖ్య మని తి.వేం కవులు చెపుతున్నారు. వ్యాకరణం చదివితే శబ్దంమీద అధికారం వస్తుంది. ప్రాచీన కవి ప్రయోగాల్లో, జనప్రయోగాల్లో సాధుర్యాసాధుత్వ వివేచనం కలుగుతుంది. తి.వేం కవులు ప్రాచీన సాహిత్యాన్నంతా ఆపోశనపట్టిన అగస్త్యులు. ప్రయోగాలకు ప్రమాణం చూపే పాండిత్యం వారికి జిహ్వాగ్రం మీద ఉండేది. వాదాల్లో, పండిత సభల్లో వారి కా ప్రజ్ఞ ప్రాణతుల్యంగా నిలిచేది. శుష్క శాస్త్రపాండిత్యమే కాకుండా ప్రయోగం ప్రయోజనవంతంగా ఉండాలనీ, శాస్త్రానికి సహకారంగా లోకజ్ఞానంకూడా ఉండాలనీ తి.వేం. కవులు భావించే

వారు. అందువల్ల 'ర'కూ బండిరాకూ యతిప్రాసలు చెల్లరాదనే చాదస్తాలు వారి కుండేవి కావు. అన్యదేశ్యాలను ధారాళంగా గ్రహించే తెగువ వారికుండేది. దేశ కాలాలనుబట్టి భాషాలక్షణాంగి మారటం సహజమని నమ్మిన విశాల హృదయు లాకవులు. 'ఏ కలెక్టరుకు లేదింత వర్కానుభంగి, నుత్తరములును బ్రత్యుత్త రములు' అని నిరాఘాటంగా వాడినా రాంగ్లేయపదాలను. పదప్రయోగంలో వారి దృష్టి ఔచిత్యాన్ని ఒరవడిగా పెట్టుకొని నడిచేది.

నిల్వయున్న నీరులాగా కవి ఒకేచోట ఉండిపోతే అతని బుద్ధి వికసించదు. వివిధ దేశాలు చూడాలి; వివిధ వర్గాలతో చర్చలు జరపాలి; నానా రాజ సందర్శనం చేయాలి; కష్టసుఖా లనుభవించాలి. అప్పుడుకాని కవి లోకజ్ఞుడు కాడు; విద్యలు సానపట్టిన కత్తుల్లా పదను తేలవు. శ్రీనాథ కవిసార్వ భౌముడూ తి.వేం. కవులూ దేశాలు తిరిగారు, ఆస్థానాల్లో ఉన్న పండితుల్ని ఓడించారు. సన్మానాలు పొందారు; తమ జీవితాన్ని కవితా జైత్రయాత్రగా గడిపారు.

ఏనుగు నెక్కినాము ధరణీంద్రులు గొల్వగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములం గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్టక నివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగనినారము నీవలనన్ సరస్వతీ!

తిరుపతి వేంకట కవుల సాహిత్య యాత్రలు తెలుగులో సజీవ సాహిత్య చైతన్యాన్ని రేకెత్తించాయి. తెలుగు జీవితంలో కవిత్వం జీవనాడిగా స్పందిం చింది. పుంభావసరస్వతీ మూర్తులుగా దేశం వారిని కీర్తించింది. వారి కవిత ఒక తరాన్నే ఉత్తేజితపరచింది. అది తరతరాల కవితాఫలాన్ని పండించింది.

## 5

విను మొకమాట చెప్పెదము వీనుల కింపుగ; నెల్లవారలన్
గని వినుతింపఁబోము పదిగంపలకెంపు లొసంగుఁ గాక లే
దని వినుతింప మానము రసాధికులన్, గవితామతల్లికిన్
ధనము ప్రధానమా రసికతాసుఖతల్ ప్రధానమా?

మొగల్తుర్తిరాజును దర్శించినప్పుడు చెప్పిన పద్యమిది. రసికులైన ప్రభువుఁకు కవితా ప్రాభవాన్ని చూపించి సన్మానా లందారు తి. వేం. కవులు.

నాడు సంస్థానాధీశులకొలువుల్లో సంస్కృతాంధ్ర పండితులూ కవులూ పోషింప బడుతుండేవారు. తి.వేం. కవు లాయాసంస్థానాలను దర్శించినప్పుడు ఆ పండితుల సభల్లో తమ అవధాన కవితాపాగల్భ్యాన్ని ప్రకటించి పండితకవిసన్మానాలను పొందుతుండేవారు.

సంస్థానాధీశుల్లో సాహిత్యప్రియులూ ఉన్నారు సంస్కారరహితులూ ఉన్నారు. రసికులూ ఉన్నారు, భోగులూ ఉన్నారు. వదాన్యులూ ఉన్నారు, పిసినారులూ ఉన్నారు. తి. వేం. కవులు సంస్కారం లేని రాజులకు సాహితీ సౌగంధ్యాన్ని చవిచూపించి సాహిత్యపోషణకు ప్రేరేపించేవారు; సహజసాహితీ సారవివేకులైన ప్రభువుల్ని తమ కవితామృతరుచుల నందించి పునీతులను చేసే వారు. సాధ్యమైనంతవరకు సరసులైన రాజులనే దర్శించారు. సౌమ్యంగా అభినం దించారు. మన్నించకపోతే మెత్తగా మందలించారు. పెడచెవిన బెడితే ఫెళ్ళున చెంపపెట్టు పెట్టినట్లు అధిక్షేపించారు. సుముఖులైతే గుణకీర్తనం చేశారు. మ్రొక్కితే ఆశీస్సు లందించారు. గౌరవించి కోరుకున్నచో కృతుల నంకిత మిచ్చారు. రాజులదగ్గరికి వెళ్ళినప్పుడు కవులు యాచకులుగా వెళ్ళలేదు. కవి రాజులుగానే వెళ్ళారు. మీ రంగంలో మీ రెంతో మా రంగంలో మే మంత అంటూ సమానస్కంధాలో సమావేశమయ్యేవారు. వేంకటగిరి ప్రభువును దర్శించినప్పుడు -

"పరదేశ సంపాదనరతి మీకు నరేంద్ర! పరదేశ సంపాదనరతి మాకు;
లసదుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర! లసదుత్తమపదాభిలాష మాకు;
సకలనుత్యశ్లోకసక్తి మీకు నరేంద్ర! సకలనుత్యశ్లోకసక్తి మాకు;
మనుమార్గవర్తనంబనువుమీకు నరేంద్ర! మనుమార్గవర్తనంబనువు మాకు;
మీకు రాజపదము మాకును గవిరాజ - పదము కలది కెందుఁ గొదువ లేదు;
కాన సామ్య మిచ్చి మానించు టొప్పదే - ముద్దుకృష్ణ యాచ భూవరేణ్య!

శ్లిష్టపదాలలో సామ్యాన్ని సాధించే చమత్కార ముంది ఈ పద్యంలో. రాజులకు అన్యదేశాల నాక్రమించే ప్రీతి, పెద్ద పెద్ద పదవులను అభిలాష, పొందాలనే జనులందరూ పొగిడే కీర్తిని వాంఛించటం, మనుధర్మ శాస్త్రాన్ని గుణంగా నడుచుకొనే నేర్పూ సహజంగా ఉన్నట్లే కవిరాజులకు ఇతరదేశాలలో సంపాదనం చేయాలనీ, సార్థకాలైన పదాలను కవితలో వాడాలనీ, అందరూ విని

మెచ్చుకొనే శ్లోకాలనూ, పద్యాలనూ వినిపించాలనీ, చిరకాలం లోకంలో నిలిచే కావ్యరచనామార్గాన్ని అనుసరించాలనీ అభిలాష ఉండటం సహజం.

తిరుపతి వేంకటకవులు దర్శించిన ఆస్థానానికి వారికవితలో అక్షయమైన స్థానం లభించినది; వారిని సన్మానించిన రాజప్రశస్తి జయపతాకలా చిరకాలం సాహితీలోకంలో రెపరెపలాడుతుంది. వారి నానారాజ సందర్శనం సమకాలీన సాంస్థానాధిపతుల కల్పిన అక్షరాభిషేకం!

## 6

కఠినమ్ములగు రాళ్ళు కలపి కట్టిన రామ
భజనాలయమ్ములే పడక లాయెఁ
దాకిన మాత్రానఁ దనువు కట్టుగఁ జేయఁ
జాలిన చన్నీట స్నాన మాయె
నుడికియు నుడకని కడువేడిమెతుకులే
యాకొన్నకడుపున కద్దమాయె
ప్రభు విచ్చె వేనూటపదియాఱు లనునట్టి
స్వప్నమ్ములే ధనార్జనము లాయె
వీని నన్నిటి గోపాలవిభుఁడు దీర్చె
మరల నీలాదికష్టముల్ మాకు దూర
తరములై యుండఁజేయు మిత్రతిని గీర్తి
సాంద్ర! శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప!

ఒక్కొక్క ఆస్థానంలో రాజదర్శనంకోసం ఎన్నోనాళ్ళు వేచియుండవలసి వచ్చేది. వేచివేచి విసిగివేసారి కవులు రాజుకు పద్యాలలో అర్జీలు పంపేవారు. ఒక్కొక్కసారి ఒకటి రెండు అర్జీలు పంపుకుంటేతప్ప సభ పెట్టించటమో, సన్మానం చేయటమో జరిగేదికాదు. వెంకటగిరి ప్రభువుకు పెట్టుకున్న రెండవ అర్జీలోని పద్యం ఇది. అర్జీలకు గూడ సాహిత్య గౌరవాన్ని కల్పించిన దర్జా తి. వేం. కవుల కవిత కల్పింది!

అర్జీలు పారనిచోట నిందాస్తుతి రూపమైన నిష్ఠురాలు వినవించేవి. ఆత్మకూరు రాజా కృతిగొని సన్మానించనందుకు వ్యంగ్యోక్తులతో సున్నితంగా అధిక్షేపించారు :

"నీమీద కృతిచెప్పి నిను నుతించిన కృష్ణమాచార్యవరుఁడు సన్న్యాసి యయ్యె
నీదు సంస్థానపండితుఁడైన యల శ్రీని వాసార్యవరుఁడు ప్రవాసి యయ్యె
నీ గాయకుఁడనంచు జోగిమై రాఘవాచార్యుఁ డూరూర యాచనకుఁ దిరిగె
నీ కింవేల్పైన యాహర్మతిస్వామి-యదవిగుట్టల నంగలార్పఁ దొడఁగె
వెతిగియును నీకుఁ గృతినిచ్చు గురుమనీషులరయఁ దిరుపతి వేంకటేశ్వరులెకాక
నీదులోప మొక్కంతయునులేదు నమ్ము-మాత్మకూరుపురీరాజ! యతులతేజ!"
తమయందు నిరసనభావాన్ని ప్రకటించిన విశాఖపట్టణం శ్రీ గోడే గజపతిరావు మీద చెప్పిన పద్యం ఆ రాజుకీర్తిచంద్రునిలో ఆచంద్రార్కం నిలిచిపోయేమచ్చ.

"సంగరశక్తిలేచు వ్యవసాయము సేయుట సున్న సంతలో
నంగడి వైచి యమ్ము టది యంతకు మున్నె వాంఛకి ముష్టికిం
బొంగు బజాన వైచుకొని పోయెద మెచ్చుదికేని ముష్టి చెం
బుం గొని పెట్టు మొక్కఁడి యమోఘ మిదే గజదంతిరాణ్ణృపా!"

తిట్టైనా, దీవనైనా వారి వాక్కుల్లో వారిదు బుండేంతవరకూ నిలచిపోయేదని ఆ రాజుల కాఁడు తెలుసునో తెలియదోగాని చరిత్రమాత్రం దాన్ని చెరిగిపోకుండా రక్షిస్తోంది. తిట్టు మచ్చైనా వారి సాహిత్యంలో నిలిచిన ఆ రాజచంద్రులకు అలం కారంగానే సహృదయులు భావిస్తారు.

## 7

ముద్దుముద్దుగఁ జెప్పఁబూనితిమా పన్నె
    లాఁడి తీయనిమోవి లంచ మిచ్చుఁ,
గతినమ్ముగాఁ జెప్పఁ గడఁగితిమా ప్రౌఢ
    కాంత వక్షోజముల్ కాన్క నొసఁగుఁ,
దీక్షరీతిని జెప్పఁ దెరకొంటిమా వాలు
    గంటి లేఁజూపు సుంక మ్మొసంగు
మిశ్రరీతిని జెప్ప మేకొంటిమా బోఁటి
    బిగువుకౌఁగిలి పన్నుఁ బెట్టి తీరు

నాశుధారా కవిత్వమ్ము నందుకొంటి
మేని అభిసారికయు దండ మిచ్చి తీరు
నాంధ్రగీర్వాణభాషలయందు మాకు
ధీరతపండితలోప! గద్వాలభూప!

కవిత కోమలియైన వనిత లాంటిది. కవితలో వనితలో సమానగుణాలు కలిగిన కవితాంశాలను పేర్కొనటమే ఈ పద్యంలో ఉన్న చమత్కారం. ముక్కు తిమ్మన్నలాగా ముద్దుముద్దుగా కవిత చెప్పితే వనిత తియనిమోవియే బహుమతికి తగింది గుణసామ్యంవల్ల. అలాగే ఓజోగుణభూయిష్ఠమైన కవితలోని కాఠిన్యం శ్రీనాథుడు చెప్పినట్లుగా ప్రౌఢావక్షోజకాఠిన్యానికే సరితూగేది. వాడియైన మాటలతో చెప్పే కవిత్వం వాల్కంటిచూపుల తైక్ష్ణ్యాన్ని పోలివుంటుంది. మిశ్రరీతిలో మార్దవకాఠిన్యతైక్ష్ణ్యాల మిశ్రమం ఉంటుంది. అది వలపుకత్తె బిగికౌగిలిలాగా ఉంటుం దనటంలో వాదుండదు. ఆఖ కవితకు అభిసారిక గుణాన్ని సామ్యంగా భావించటం కవుల భావుకత్వానికి నిదర్శనం.

తి.వేం. కవులు సరసులైన రాజులను సమ్మానించేవిధం ముద్దు ముద్దుగా ఉంటుంది. ఆనందగజపతి రాజును కవితతో గౌరవించిన విధం చూడండి—

"ఎందరఁ జూచెనేని వరియింపదు మా కవితాకుమారి క
న్నందుకు దేశముల్ తిరుగు టబ్బెను సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల! నీదు సుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూచెఁ గావునఁ దటాలునఁ దీనిఁ బరిగ్రహింపుమా!"

ఆత్మకూరు జమీందారును ఆప్యాయతతో సెలవడగటం కూడా ముద్దుగానే ఉంటుంది—

'వేసవి దగ్గరాయె మిము వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బరవాస మొనర్చుట భారమాయె; మా
కోసము తల్లిదండ్రు లిదిగో యని చూచుటాయె; వి
శ్వాస మెలర్పవే సెల వొసంగినఁ బోయెదమయ్య భూవరా!'

కఠినమైన శైలికి—

"పటు ఝంఝానిల ధోరణీ రణగణ ప్రాగ్భారనున్నాటవీ
తట శాఖావటలాంతరుద్గత నితాంతస్ఫార ఘోరాగ్నిరు
ష్టుటనాదూపిత భస్మసాత్కృతకుదుట్కాండదంబుతో వహ్నికిన్
ఘటియింపం దలపెట్టినారుగద సఖ్యమ్మర్యచూడామణుల్."

తిక్షరకు-

'ఒక నూతే యన నేమి లెక్క? వినుఁడో హో! పండిత శ్రేష్ఠులా
ర! కడున్ వేగమె వేయుమందికయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
శుకవిత్వం బొనరింప నేరుతుము శ్రీశూలిప్రియామానసీ
యకటాక్షమ్మునఁ దగ్గకాలమును మా కర్పించి కూర్చున్నచోన్.'

మిశ్రరీతిక-

'ఒకదాయ వికచాంబుజకదాకచికదాక - చకితాచదాష్మనుజన్ము లొప్ప
నొకదంత మతిచండిమకరండనలజాండ - మండనపండితోద్దండు లొప్ప
నొకవక్ర శుకతజ్ఞనకనాకుజనకనా - కకపీంద్రసమకవి ప్రకర మొప్ప
నొకచోట సకలవాగ్విలసన ప్రకుళల - ద్వందిమాగధజనుల్ వఱలుచుండ
నిండు పేరోలగమ్మున నుండు నిన్నుఁ - బందువుగఁ జూచు భాగ్యమ్ము
పండె మాకు
నిపుడు, శ్రీరాజగోపాల కృష్ణయాచ - భూవబహదర్! మహారాజ!
భూరితేజ!'

భావాన్ని బట్టి రసం, రసాన్ని బట్టి వృత్తి, దాన్ని బట్టి రీతి గుణం పద్యాల్లో పల్లవిస్తుంటాయి. తి.వేం. కవుల కవితాగుణం మౌలికంగా ప్రసాదం. సారళ్యం దాని స్వభావం.

## 8

స్థైర్యము లేని చిత్త, మవధాన మెఱుంగని సత్కవిత్వ, మౌ
దార్యము లేని హస్తము, యథార్థత లేని రసజ్ఞ, మంచిమా
ధుర్యము లేని గానము, మృదుత్వము లేని వచఃప్రసంగ మై
శ్వర్యము లేని భోగము, నసారము లియ్యవి దంతిభూవరా!

ఆశువులో సూక్తులు వెలయటం వరదలో వజ్రాలు దొరకటం వంటిది. 'వాసనలేని పూవు బుధవర్గము లేని పురంబు'- అన్న మూసలో సాగిం దీపద్యం. పెద్దల సుద్దుల్లో ఈ పద్యం కూడా పెద్దరికం చేస్తున్న దీనాటికి. ప్రజల నాల్కలపై పదికాలాల పాటు నిలిచే పద్యాలే సూక్తులు. కాచి వడపోసిన అనుభవసారాలు, పూచి వికసించిన విజ్ఞాన సుమాలు ఈ సూక్తి పద్యాలు. ఇటువంటివి తి.వేం. కవుల రచనల్లో కోకొల్లలు. మచ్చుకు కొన్ని :

'మూలము లేని టీక సుమపుంజసమృద్ధము గాని శయ్య వా
చాలత లేని పందిరియు సంతతిలేని గృహంబు మంచి తాం
బూలము లేని భోజనము ముద్దులు గుల్కెడి కన్నెమిన్నతో
మేళన లేని జవ్వనము మే లగునే? కవిరాజశేఖరా!'

'నిదురఁ బోగొట్టుఁ గ్రమముగా నెత్తి కెక్కుఁ
గలుషత ఘటించుఁ గుండయుఁ గట్టియుఁ దన
చేతి కానగూర్చునది గానఁజెప్ప నగునె
వేశ్యకును నశ్యమునకును భేద మిలను!'

'పాపిష్ఠ రాజులపాలి దయ్యము సం - ధ్యావందనమునకు బావగారు
పరదేశ సంచారకరణమ్మునకు రైలు - జపతపమ్ముల కెల్ల సవతితల్లి
ముక్తికాంతాసంగమునకుఁ దారుపుఁగత్తె - సద్యశోవ్యాప్తికిఁ జాటుదవ్వు
ఆనందమునకు దివ్యాంగనా సంగంబు - రాజసంబునకు గారాలకూచి

భాగ్యభోగ్యమ్ములకు నెల్లఁబట్టుఁగొమ్మ - యఖిలవైతృత్వములకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణరసాయనంబు - కవిత యిట్టిదె యనఁజెప్పఁగాఁ దరంబె?'

'తన కెంత తెలివి కలిగినఁ
దనకార్యము పట్లఁ దానె తగుదునునుట యొ
ప్పని పని; యోగ్యత గలిగిన
తన మిత్రుల నడుగు టొప్పుఁ దగవరి కెందున్' -శ్రవణానందం

దూరమునందు నున్న యెదఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొక యించుకయున్ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును దగ్గఱైన యా
పూరుషమోము గన్గొనినఁ బోవు నదెంతటి ప్రౌఢకేనియున్ -పాణిగృహీత

మార్దవము నాగరకతయు మాటనేర్పు
లేనివారింట నధికారమూనుకంటె
మార్దవము నాగరకతయు మాటనేరు
పున్నవారింట దాసురాలై యుంట మేలు -బిడాలోపాఖ్యానం

## 9

అత్తతోఁ బోరాట మంది పోయినయట్టి
జామాత తనుఁ దాన సఖ్యపడియె
భార్యతోడ విరోధపడి పోయిన మగండు
మగుడ భార్యను బ్రతిమాలుకొనియె
సన్న్యసించుటకు నిశ్చయ మందిన విరాగి
రాగాంధుఁడై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థమై దూరగతుఁడైన సంసారి
తత్క్షణమ్మున నూరిదారి పట్టె
బ్రహ్మచారులు పెండ్లికై పాట్లఁబడిరి
వేశ్యమాతలతోడను స్నిగ్రహించి
నట్టివిటులెల్ల సద్దాని ననుసరించి
రహహ! యేమందు నవ్వసంతాగమమున.

తిరుపతి వేంకటకవుల స్వతంత్రకావ్యాల్లో శ్రవణానందానికి అపార ప్రశస్తి ఉంది దానికి కారణాలు ప్రధానంగా మూడు. 1. అందులోని శృంగారం 2. అందులోని కవిత. 3. అందులోని వస్తువు వేంకటశాస్త్రిగారి జీవితంలో తారసిల్లిన ఒక మధుర సన్నివేశ మాధారంగా జనించిన కావ్యం. మధుసూదను డనే కవికీ, బాలామణి యనే వేశ్యకూ మధ్య ప్రణయం ఈ కావ్యానికి జీవం. బాలామణి మధుసూదనుని పొందు కోరి చివరకు సాధిస్తుంది. కాని, కాలాంతరంలో ఆమె మనస్సు అన్యపురుషగత మౌతుంది. ఒక మిత్రునివలన బాలామణి చంచల వృత్తి నెఱింగి మధుసూదనుడు మనసు మరల్చుకొని గార్హస్థ్యజీవితాన్ని గ్రహిస్తాడు. వేశ్య కవిని మోహించిన శృంగారఘట్టాలు, వాటిని నిర్వహించ టంలో కవులుచూపించిన నేర్పు, అందులో జాలువారిన వారి కవితామాధుర్యం శ్రవణానందం. ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొన్నది. ఆ అభిమానం ఎంతదూరం వెళ్ళిందంటే.

"ఒక శ్రవణానందమ్మున
ఒక పద్యమునందుఁ గల్గు నొకపాదమునం
దొకయక్కరమున కొసఁగిరి
సకలమ్మగు రత్నగర్భ చాలునె తూఁపన్!"

(రామడుగుల సీతారామశాస్త్రి)

అని భావించేవరకు వెళ్ళింది. అటువంటి కావ్యంలో వసంతర్తు ప్రభావాన్ని వర్ణిస్తూ రతిభావోద్దీపనాన్ని కల్పించేవర్ణన మిది. మానవప్రవృత్తిపై కాలప్రభా దాన్ని వ్యంగ్య సుందరంగా చిత్రించిన పద్య మిది.

మధుసూదనుడు వేశ్యకు లొంగిపోయిన ఘట్టం తెలుగువారు గుట్టుగా నైనా, మిత్రుల మధ్యలోనైనా ప్రవరాఖ్యునికి జరిగిన పరాజయంలా వర్ణించి చెప్పకోవటం వింటూంటాం. అందులోనూ ఈ పద్యం అందరినీ ఆకర్షించేది:

"గుట్టు చెడెన్, దశావిదగ గుండెలు జల్లనె మై చెమర్చె ని
ట్టట్టు వడంకె హస్తములు, నన్యముఁ జెప్పట కోపడాయె, నా
పట్టున నాళుకుం దయినఁ బల్కఁగలాఁడె మఱొక్క మాట! లేఁ
దట్టి జితేంద్రియుండు ప్రవరాఖ్యఁడు దక్క మఱొక్కడెక్కఁన్."

శృంగార భావాలతో శ్రోతల నాకర్షించినా శ్రవణానందం లోకాని కొక సందేశాన్ని ఇచ్చింది. సమస్య సమకాలీనమైంది.

"వెలచెలులన్ వివేకు లగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు, వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు జనంగనబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగరాదు, దీనికిన్
సొలసినవారి కెల్ల మధుసూదనుదుర్గతి రాకతీరునే."

ఉపరంజనంతోపాటు ఉపదేశాన్ని నిర్వహించేవి తిరుపతి వేంకటకవుల శృంగారకావ్యాలు. వానిలో నెన్నదగిన జంట శ్రవణానందం, పాణిగృహీత.

## 10

"నాతిచరామి" యన్న వచనార్థ మెఱుంగునొ లేదొ! యమ్మురా
రాతి వతించి యచ్చోటిరమ్మున హస్తము పెట్టి బిట్టు ప్రే
మాతిశయమ్మునన్ గురువరానుమతిం బదియారువేలపై
చేతులఁ దక్కు భార్యలఁ ద్యజింపఁదలంచెనొ లక్షణార్థమై.

పదియారువేల భార్యలకు భర్త శ్రీకృష్ణుడు. ప్రతి కన్యనూ 'నాతిచరామి' అని ప్రతిజ్ఞ చేసి పరిణయమాడాడు. లక్షణాపరిణయంలో కూడ ఆమెను అలాగే పరిణయమాడాడు. నిజాని కక్కడ వాచ్యార్థానుపపత్తి ఏర్పడుతుంది. లక్ష్యార్థాన్ని చెప్పకోవలసి వచ్చింది. లక్షణా వివాహానికి సార్థకమైన వర్ణన మిది. లక్షణను

మత్స్యయంత్రం కొట్టి గెలుచుకొన్నారు కృష్ణుడు స్వయంవరానికి ముందే విసుకలి జరిగింది, విరహం ముదిరింది, రాయబారాలు సాగాయి. లక్షణాదేవి అందం సలక్షణంగా ఉండాలని కవులు వర్ణించారు. యౌవనోదయం నుంచి సంయోగంవరకూ ఉత్పత్తి వికాసదశావరిణామాన్ని సాక్షాత్తూ దర్శించినట్లుగా వివరించారు. వివరాలలోలోకి పోకుండా, రసికులు రహస్యంగా చదువుకునే ఒక పద్యం ఉదాహరిస్తే చాలనుకుంటాను.

"పరివేషమ్ములు గట్టి పూగళకల ప్రాయమ్ములై యంత బం
గరుగోలీల నతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ముల మీరి గట్టిపడి విన్నాణంపుఁ బల్కుప్పలై
పరిమాణింప నశక్యమై యెసఁగె నప్పద్మాక్షివక్షోజముల్".

ఏలామాహాత్మ్యం, గోదేవి, పతివ్రత, శివభక్తి, బొబ్బిలిపట్టాభిషేకం, సుఖజీవి, సుశీల, పూర్వహరిశ్చంద్రచరిత్రం మొదలైన కావ్యాలన్నిట్లో లక్షణా పరిణయం మూడాశ్వాసాల కావ్యమైనా మొదట చెప్పదగింది. ఆశుకవిత్వంలో అవతరించిన ఆణిముత్యం!

## 11

అదిగో ద్వారక! యాలమంద లవిగో! నందందుఁ గోరాడు; న
య్యదియే కోట, యదే యగడ్త; యవె రథ్యల్, వారలే యాదవుల్
యదుసింహుండు వసించు మేడ యదిగో! నాలానదంతావళా
భ్యుదయంబై పరమందురాంతరతురంగోచ్ఛ్రంశమై పర్వెడున్.

తాను వెళ్తున్న ఊరు కనపడంగానే తెలుగువాడినోట అప్రయత్నంగా అదిగో ద్వారక! అన్న పద్యపాదం పల్లవిలా సాగుతుంది. తి. వేం. కవుల పాండవోద్యోగనాటక ప్రభావమది. కొత్తగా బావగారు వస్తే 'బావా! యెప్పుడు వచ్చితీవు' అని పలకరిస్తారు తెలుగువారు. అదీ ఆ నాటక ప్రభావమే. ఏ ఉద్యమాన్నైనా చేపట్టి ముందుకు సాగుతుంటే 'జెండాపై కపిరాజు' అన్న పద్యం అలవోకగా ఆంధ్రునినోట ఆవిర్భవిస్తుంది. విషాద సన్నివేశంలో "చచ్చిరి సోదరుల్ సుతులు" అన్నపద్యం గుండెగొంతుకలో ప్రతిధ్వనిస్తుంది. "ఎక్కడి నుండి రాక?" "ఉన్నది పుష్టిమానవుల కోయదుభూషణ; యాలజాలికిన్ తిన్నని పుష్టి" "నిదురపోచుంటివో" "సేవాధర్మము సూతధర్మము" "చెల్లియొ చెల్లకో"

"సంతోషంబున సంధి సేయుదురె". ఈ పద్యచరణాల మొదళ్లు తెలుగువారి నిత్య జీవితంలో ఆయాసందర్భాల్లో సంభాషణచాతుర్యానికి చిగుళ్ళుగా నిలుస్తుంటాయి. ఎవరైనా శాంతమూర్తి ఏదోకారణంతో ఆగ్రహిస్తే "అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముడజాతశత్రుడే అలిగిననాడు" అని అనుయాయులు వ్యాఖ్యానిస్తారు. తెలుగువారి జీవితంలో ఇంతగా పెనవేసుకొనిపోయి మాటలలో, జాతీయాల్లో నానుడుల్లా, సామెతల్లా పద్యాలు ప్రతిధ్వనించటం గమనిస్తే తి. వేం. కవుల భారతనాటకాల కెంత ప్రజాదరం ఉందో బోధపడుతుంది.

తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి-అన్న సామెత తెలుగులో ప్రసిద్ధం. కవిత్రయం భారతాన్ని శ్రవ్యకావ్యంగా వ్రాసి తెలుగుభాషా జీవితానికి వన్నె పెట్టారు. ఆ కవిద్వయం భారతాన్ని దృశ్యకావ్యాలుగా వ్రాసి తెలుగు సంభాషణ జీవితానికి పర్వం చేకూర్చారు. భారతంలోని పద్యాలు పండితుల నలరింప జేస్తే,భారత నాటకాలలోని పద్యాలు పండితపామరులనందరినీ పరవశింపజేశాయి. ఆంధ్ర నాటక రంగంమీద ఆధునిక ప్రక్రియ లెన్ని వచ్చినా తి. వేం. కవుల పాండవోద్యోగాలుమాత్రం పాతపడిపోలేదు. వచనంలో నాటకం వర్ధిల్లుతున్నా, జంటకవుల పద్యనాటకాలకు వార్ధక్యం రాలేదు.

తి. వేం. కవులు భారతకథను ఆరునాటకాలుగా రచించారు. అవి : 1.పాండవ జననం, 2 పాండవ రాజసూయం, 3.పాండవ వనవాసం, 4. పాండవోద్యోగం, 5. పాండవ విజయం, 6. పాండవాశ్వమేధం. వాటిలో పాండవోద్యోగ విజయాలకు సాటిలేని ప్రశస్తి ఉంది. ఆ రెండు నాటకాలనూ కలిపి కొన్నిరంగాలను తగ్గించి, కురుక్షేత్రమనే పేరుతో కొన్ని నాటకసమాజాలాడుతుంటాయి. ఆంధ్రదేశంలో ఈ నాటకం ప్రదర్శించని పల్లెపట్టు కూడ లేదు. రంగంమీద పద్యం పాడి రక్తి కట్టించే ప్రతి నటుడూ అందులో ఒక పాత్ర వేసి ధన్యుడైనా ననుకుంటాడు. ఆ నాటక ప్రయోగాలకే అంకితమైన నాటకసమాజాలున్నాయి. కృష్ణుడుగా, అర్జునుడుగా, ధర్మరాజుగా, దుర్యోధనుడుగా, కర్ణుడుగా, అశ్వత్థామగా - ఇలా ఎన్నో పాత్రలను అభినయించటంలో ప్రావీణ్యాన్ని సంపాదించిన ప్రసిద్ధ నటు లున్నారు ఎన్నో కుటుంబాల కవి భుక్తిని ప్రసాదిస్తున్నాయి. ఎన్నోతరాలకవి రక్తిని ప్రసాదిస్తున్నాయి. నాటకప్రయోగ ప్రదర్శనల్లో ప్రజాదరాన్ని చూరగొన్న నాటకాలలో నాయకమణులు పాండవోద్యోగ విజయాలు.

పాండవోద్యోగనాటక ప్రదర్శనం అర్జునపాత్ర ప్రవేశంతో ప్రారంభ మౌతుంది. శ్రీకృష్ణసహాయవిశాగాంకం ప్రథమాంకం. 'అదిగో ద్వారక!' అన్న పద్యం అర్జున పాత్రధారికి ప్రథమ ప్రయోగంలాంటిది. ఆ పద్యంలో పాత్ర భక్తిభావాని కెంత రమణీయకల్పనం ఉందో, అంత ప్రయోగకళాసౌలభ్యముంది. మాట్లాడుతున్నట్లుగానే ఉండి మనసును ఆకట్టుకొనే లక్షణం తి. వేం. కవుల నాటక పద్యాలలో నాణెమైన గుణం!

ముందు పద్యరచనాశిల్పాన్ని చూద్దాం. నరుడు నారాయణభక్తుడు. నారాయణుడు వసించే నగరం ద్వారక. అన్నగారి పనుపుమీద ఆహవంలో సహాయం కోసం ఆ యదుకులాలంకారాన్ని ప్రార్థించటానికి వస్తున్నాడు పార్థుడు. ద్వారకను అల్లంత దూరంలో చూడంగానే ఉల్లం పొంగిపోతుంది కిరీటికి. ఆనందోత్సాహంతో 'అదిగో ద్వారక!' అని హర్షాన్ని ప్రకటిస్తాడు. ఆలమందలు గోపాలుని ధనం. ఎక్కడ ధర్మం హెచ్చుగా ఉంటుందో అక్కడ గోధనం కోకొల్లలుగా నిలుస్తుంది. శ్రీకృష్ణుని ధర్మచరిత్రానికి ఆలమందలు సజీవవ్యాఖ్యానాలు కోట ప్రభుత్వానికి చిహ్నం. అగడ్తలు రక్షకు మారుపేరు. యాదవవీరులరాజ్యరమ కవి రెండూ స్థిరమైన సంకేతాలు. వాటిని స్మరించటంతో శ్రీకృష్ణుని రక్ష కిరీటి చిత్తంలో మెరుస్తుంది. రథ్యలు యాదవరథసైన్యాన్ని స్ఫురింపచేస్తాయి. యాదవులు శ్రీకృష్ణుని బలగాన్ని వెలుగులోకి తెస్తారు. శ్రీకృష్ణుడు యదుసింహుడు. సింహశబ్దం శ్రేష్ఠవాచకానికి పరాకాష్ఠ. అతని దుష్టశిక్షణ అందులో దోబూచులాడుతుంది. ఆయన మేడ చేరటానికి దీర్ఘంగా ఉన్న గజశాలలూ, అశ్వశాలలూ దాటాలి. ఆ శాలలు శ్రీకృష్ణుని సైన్యవిస్తారాన్నే కాక సామంత బాహుళ్యాన్ని కూడా ధ్వనింప చేస్తున్నాయి. అంచెలంచెలుగా చూస్తున్న అంశాలను చిన్నచిన్న వాక్యాలలో చిత్రించటం ఒక శిల్పం అర్జునుని భక్తి పారవశ్యాల కవి వరాకలు. 'ఆలానదంతావళాభ్యుదయంబై పరమందురాంతర తురంగోచ్చండమై పర్వెడున్' అన్న దీర్ఘ సమాసం శ్రీకృష్ణుని బలసంపదను ప్రకృష్టంగా ప్రదర్శిస్తుంది. పద్యాన్ని పాడుతున్న పాత్రకు రాగ ప్రస్తారానికి రాచబాట చూపిస్తుంది. గజాశ్వశాల లెంత పొడుగ్గా ఉన్నా వాటిని శాసించే సింహం అన్నిటికంటే అగ్రస్థానంలో ఉండటం విశేషం.

పద్యాన్ని రచనాశిల్పంకోసమే వ్రాయటం నాటకరచనా ప్రయోజనం కాదు. అది ప్రయోగంలో ప్రయోజనాత్మకంగా ఉండాలి. అర్జునపాత్ర రంగం మీద ఒకవైపునుండి ప్రవేశిస్తుంది. మరోవైపున నిష్క్రమించాలి. ఈ సన్ని వేశంలో కవులు నాలుగు పద్యాలను రచించారు. అవి 'ద్రుపదుని పంపునన్' 'అదిగో ద్వారక' 'మనకన్న మున్ను' 'అరవిందాక్షుడు' అనేవి. వీటిలో పాత్ర గతికి తోడ్పడేది రెండో పద్యమే. ఎలాగంటే. 'అదిగో ద్వారక!' అని కొంత పరిక్రమించాలి. క్రమంగా ఆలమందలను, తోటను అగడ్తను, రథ్యలను, యాదవులనూ గమనిస్తున్నట్లు ముందుకు సాగుతూ చివరకు యదుసింహుని అంతఃపురాన్ని అందుకోవాలి. ఆ అభినయానికి ఈ పద్యంలో ఆధారముంది. చాలమంది నటులు ఈ పద్యాన్ని ఒకేచోట నిలబడి చదవటం నేను చూచాను. ఒకానొక తెలుగుచలన చిత్రంలో రథంమీద వస్తున్న అర్జునుడు రథాన్ని ఆపి పద్యం చదివి ముందుకు పోవటం చూచాను. ప్రయోగవిజ్ఞానం లోపించిన ప్రదర్శన లవి. అభినయానికి అవకాశం ఉన్నా అర్థంచేసుకోలేని అప్రౌఢిమకు అది చిహ్నం. ఏమైనా తిరుపతి వేంకటకవుల నాటకపద్యాల్లో పద్యరచనా శిల్పంతో పాటు ప్రయోగశిల్పం కూడా ఉంటుంది; అదే వారి నాటక ప్రయోగ విజయానికి ప్రధాన సూత్రం.

మొదటి అంకంలో ముచ్చటగా కనపడేవి మూడు పాత్రలు. వారి స్వరూప స్వభావాలను ప్రత్యక్షీకరించేటట్లు పద్యాలూ, సంభాషణలూ, సన్నివేశాలూ సాగుతాయి. ప్రయోక్తల ప్రజ్ఞ ఈ ప్రథమాంకంలోనే పరీక్షింపబడుతుంది.

## 12, 13

ఎక్కడినుండి రాక యిట? కెల్లరునున్ సుఖులే కదా? యశో
భాక్కులు నీదు నన్నలును భవ్య మనస్కులు నీదు తమ్ములున్
జక్కఁగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కఁగ నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా!
బావా! యెప్పుడు వచ్చి తీవు? సుఖులే భ్రాతల్ సుతుల్ చుట్టముల్
నీ వాల్లభ్యము పట్టు కర్ణుఁడును మన్నీలున్ సుఖోపేతులే?
మీవంశోన్నతిఁ గోరు భీష్ముఁడును మీ మేల్గోరు ద్రోణాదిభూ
దేవుల్ సేమముమై నెసంగుదురె? నీ తేజంబు హెచ్చించుచున్.

ప్రథమాంకంలో శ్రీకృష్ణుడు ప్రప్రథమంగా పాత్రలతో ముచ్చటించే పద్యాలివి. ఇంతకు ముందున్న 'నాయనుంగుచెలి' అన్న పద్యం స్వగతం. జగన్నాటక సూత్రధారి కపటనిద్రలో నుండి లేచి పాత్రల స్వభావాల కనుగుణంగా ప్రసంగిస్తూ భారత నాటక పాత్రల స్వభావాలను కుశల ప్రశ్నల్లో కౌశల్యంతో సూచిస్తాడు. పాదాలవద్ద నున్న పార్థుణ్ణి పలకరించే తీరు వేరు. శీర్షం దగ్గర ఠీవిగా కూర్చున్న సుయోధనునితో మాటలాడే విధం వేరు. పాండవ పక్షపాతి - కాదు - ధర్మపక్షపాతి - అన్న అర్జునుని వ్యాఖ్యానానికి అప్పుడే వ్యాకృతి మొదలౌతుంది. పార్థుని అన్నలు యశోభాక్కు లట, తమ్ములు భవ్యమనస్కులట! వృకోదరుడు భుజశాలియట; అన్నగారి ఆజ్ఞవలన శాంతునిగా చేస్తున్నాడట! పాండవ గుణప్రశస్తి దుర్యోధనునికి గునపాల్లా పనిచేయాలి; భీముని భుజబల ప్రసక్తి సుయోధనునికి ప్రాణాంతక మనిపించాలి. పార్థుని కిటిరు కుశలం, రారాజు కిటిరు కులిశం.

ఇక దుర్యోధనుణ్ణి పలకరించే తీరు విచిత్రం 'బావా!' అనటంలో పైకి తోచేది బాంధవ్యం; లోన వినిపించేది పరిహాసం. 'ఎప్పుడు వచ్చితివి?' అంటంలో 'నీయంతటి అభిమాని ఇక్కడికి వచ్చి ఇంత సేపు పడిగాపులు పడవలసిన దుస్థితి ఏమి వచ్చిందన్నది' కాకుధ్వని. ఇక దుర్యోధనుని తమ్ములకు,సుతులకు చెప్పదగిన విశేషణాలే లేవు. 'నీ వాల్లభ్యము' అన్న పదాన్ని వాడి కర్ణుణ్ణి, మన్నీలనూ సేవకులుగా భావించటమే కాకుండా స్త్రీజనతుల్యులుగా భావించిన వైఖరిని ప్రకటించాడు గోవిందుడు. వారు నీ ప్రభుత్వానికి బరాబరులు పలికే వారే కాని, నీ మేలు కోరేవారు కారని వ్యంగ్యం. 'సుఖులే', 'సుఖోపేతులే' అన్నప్పుడు వారిభోగవాంఛ బలీయంగా వినపడింది. ఇక భీష్మద్రోణులో - వారి కంటె భిన్నులు ఒకరు వంశోన్నతిని కోరేవారు; మరొకరు మేలు కోరేవారు. 'వారు క్షేమమా?' అని అడిగినప్పుడు దుర్యోధనుని దూర్తత్వం ధ్వనిస్తుంది. వారు క్షేమంగా ఉంటే నీ తేజం హెచ్చవుతుందని కొసమెరుపు హితవు. వినే వాడి కివి కుశలప్రశ్నలా- కశాపాతాలా? అన్నట్లుంటాయి.

శ్రీకృష్ణుని బలవిభాగం ఒక మంత్రజాలం. తెలిసినవాడి కది దివ్యబోధ. తెలియనివాడి కది శ్రీకృష్ణుడు పద్ద చిత్రమైన బాధ! తెలిసిన అర్జునుడు తర్వాన్ని దాటురాడు. తెలుగువా రాపద్యాలను విని భక్తితన్మయు లౌరాడు.

"నందకుమార! యుద్ధమున నా రథమందు వసించుమయ్య? మ
ధ్యందిన భానుమండలవిధంబున నీదగుకల్మిఁ జేసి నా
స్యందన మొప్పు గాక! రిపుసంతతి తేజము దప్పుగాక! నీ
వెందును నాయుధమ్ము దరి కేగమి కొప్పదుఁ గాక కేశవా!
'సారథి యంట! వేదములసారము శౌరి; తదంఘ్రిభక్తి చె
న్నారెడు క్రీడి తా రథికుఁ డౌనట! చిందము విల్లుఁ దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగిన వంట! యస్త్రవి
స్తారగురుల్ శివాదు లట! సంగరమం దెవఁ డాగఁజాలెడున్.'

పాండవ విజయం పార్థసారథి పదంలోనే ప్రతిష్ఠితమైంది. పార్థునికి స్వార్థంతోపాటు తీర్థంకూడా లభించింది. అమూలకాలైన ఈ పద్య భావాలు ఆంధ్రుల హృదయ నికేతనాలు!

## 14

అలుగను బిడ్డ లేద్వ నృపులాఁముల్లోఁ గదతేఱి కెల్ల చు
ట్టాలును రూపుమాయ కకటా! యిల దక్కునె? దక్కనిత్తురే?
చాలును రాజ్యభాగము; ప్రజల్ సుఖియించిన నాకుఁ జాలు; నేఁ
జాలక కాదు సూవె! తినఁజాలను నెత్తురుకూడు మాధవా!

మహాభారతంలో ధర్మజుడు 'మెత్తనిపులి.' ఇతరులు తనయందు తప్పు లేదనేంతవరకూ మెత్తగా ఉంటాడు. ఆపైన పులిలా విరుచుకపడతాడు. ఉద్యోగ పర్వంలో ధర్మరాజు తన ప్రయత్నంలో ధర్మాన్నీ రాజనీతినీ నిపుణంగా మేళవిస్తాడు. తప్పు కౌరవులదైనా తనంతట తాను యుద్ధం ప్రకటించకూడదు. కౌరవుల క్రౌర్యాన్ని బట్టబయలు చేయాలి, వారి మీద సామదానభేదోపాయాలు ప్రయోగించాలి. అవి విఫలమైన వనిపించాలి. అప్పుడు దండోపాయాన్ని ధర్మబద్ధంగా సాగించాలి. ఈ ప్రయోజనం సాధించటానికి శ్రీకృష్ణుని రాయబారం నీతిసాధనం.

ధర్మజుడు పై పద్యంలో శాంతి పాఠాన్ని చదువుతున్నాడు. బంధునాశం జరక్కుండా రాజ్యభాగమిస్తే చాలంటాడు. ప్రజలు సుఖంగా జీవించటాని కది చక్కని మార్గమంటాడు. అతడు శాంతి కోరటం సమరసామర్థ్యం లేక కాదు;

నెత్తురు కూడు తినలేక. శాంతికాముకు లైన మరిమంతు లందరికీ ఈ మాట సమ్మోహనాస్త్రంలా పనిచేస్తుంది. కౌరవులు సంధి కంగీకరించరేమోనని శ్రీకృష్ణుడు అనుమానం బైటపడరాదు. అది అధర్మరాజుకు తెలియందికాదు. ఆ పితామహ కుంభసంభవ కృపాచార్య ప్రముఖులకు ధర్మజాని ధర్మనీతి తెలియాలి. వారి హృదయాలు అతనిపట్ల ఆర్ద్రం కావాలి. దుర్యోధనుని దుష్టవర్తనాన్ని ఖండించాలి. అది భావి విజయానికి అనుకూలమైన అంతరధర్మంగా పరిణమించాలి. సంధి నిజంగా సంధికోసం కాదు. స్వప్రయోజనం కోసం!

'ఇంతకు సంధిమాట వినసీ వినకుండఁగసీ మనంబు ని
శ్చింత మగున్, జనంబు మనసేమమె కోరుదు, రెల్లవారు నిం
దింతురు వారి నిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁ గీర్తి, సా
మంతనృపాలు రందఱకు మా వ్యవసాయము తేటతెల్లమౌ.'

జనులు పాండవ వ్యవసాయాన్ని తెలిసి కీర్తించటమే సంధిప్రయోజనం. పాండవులకు చేతగాక సంధిని కోరటం లేదు; పగరకు బ్రతికే అవకాశమిచ్చేందుకు సంధి యత్నం చేయటం. ఆ ధీమా ధర్మజాని వాక్యాల్లో మర్మగర్భితంగా ఉంది.

సౌబలేయలు సంధి కిష్టపడిరేని
అన్నదమ్ముల మేము నూటైదుగురము
పాడిమెయి నిష్టపడరేని వారు నూరు
గురె సహోదరు; రే మైదుగురము కృష్ణ!

ఉద్యోగపర్వం తిక్కన కవితాశక్తికి, రాజనీతి పాండిత్యానికి, సంవాద శిల్పానికి పెట్టింది పేరు. ఆయన రచించిన పద్యాలు పండితుల ముఖపద్మాల్లో పరిమళాలను నింపుకొంటున్నవి. అదే మట్టాన్ని చేపట్టి ఆంధ్రులను ఆకర్షించే పద్యాలు వ్రాసి ప్రజామోదాన్ని పొందటం తిరుపతి వేంకటకవుల ప్రతిభకు ప్రత్యక్ష తార్కాణం!

## 15

నిదుర వోచుంటివో? లేక బెదరి వల్కు-
చుంటివో? కాక నీవు తొల్లింటి భీమ
సేనుఁడవె కావొ? యెన్నఁ డీచెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె.

శ్రీకృష్ణుడు భీముని రెచ్చగొట్టటం పాండవోద్యోగద్వితీయాంకంలో ఒక హాస్య రౌద్ర రస సన్నివేశం. భీము డెంత బలవంతుడో అంత అమాయకుడు. అన్నమాటకు కట్టుబడి శాంతి సందేశాన్ని పలికిన శుకరాజం. భీముడికి కోప మలంకారమైనట్లు శాంతం కాదు. పాండవుల్లో పురుషకారాని కతడు ప్రతీక. శ్రీకృష్ణుడు భీముడు బెదరినట్లున్నాడని పరాచకమాడుతాడు. భీము డాహేళనకు ప్రళయాగ్నిగా ప్రజ్వరిల్లుతాడు. గొల్లవాడని కృష్ణున్ని గేలిచేస్తాడు. 'ఓయీ, వరాలిప్రాయానభిజ్ఞ! యుద్ధమునకే బెదరితినో అన్నగారి యానతికే బెదరితినో తెలిసికొనలేక పోయితివి.

'అంబుధులింకు గాక ప్రళయాంతము వచ్చిన వచ్చుఁగాక లో
కంబులు సూర్యచంద్రు లడఁగం దలక్రిందగుఁగాక గొప్పక
ష్టంబులు మూఁడుఁగాక పెనుసంపద పెంపరుఁగాక యెట్టికృ
త్యంబుల నెందునే నడుగుదాటరు పాండవు లన్న మాటకున్.'

పాండవసమైక్యతకు భీముని పలుకులు పతాకలు. పాండవపక్షం అన్న మాటను జవదాటదు. పాండవుల్లో వీరు లెంద రున్నా వారిది ఒకేమాట, ఒకేబాట. కౌరవుల్లో ఒక్కొక్కరి దొక్కమాట, ప్రతివారిదీ ప్రత్యేకమైన బాట ఈ వైవి ధ్యాన్ని ప్రదర్శించేవే ద్వితీయ తృతీయాంకాలు.

వీరం రౌద్రంతో కలిసి ప్రకాశిస్తుంది; బలపడుతుంది. వీరానికి ధర్మం ప్రాణం. పాండవేతివృత్తంలో ధర్మజుఁడు ప్రాణం, భీముడు బలం, అర్జునుడు శక్తి, శ్రీకృష్ణుడు యుక్తి.

## 16

సేవాధర్మము సూతధర్మమును రాశీభూతమై యొప్ప వా
దా వాత్సల్యముఁ జూపెఁ గర్ణుఁ డిటు మాత్సర్యంబు మీ కేల? రా
జేవేళ న్నిము గోరునో యనికి నాఁడే పొందు పోరాద, లే
దా, వర్ణింపుడు కర్ణుదావువటకో యత్యంతమో యుద్ధమున్.

శ్రీకృష్ణుడు కౌరవసభలో ప్రయోగించిన భేదోపాయ మిది. భీష్మద్రోణ కృపాశ్వత్థామలు ధర్మజుని సంధియత్నాన్ని సమర్థించి సుయోధనుని గర్హి స్తారు గ్రుడ్డిరాజా గోడమీది పిల్లవాటంగా వ్యవహరిస్తాడు. కర్ణుడు దుర్యోధనుణ్ణి

సమర్థించి భీష్మద్రోణ కృపాశ్వత్థామలను తేలికపరుస్తాడు. అశ్వత్థామ అగ్గి పిడుగై అర్కజునితో వాదులాడుతాడు. కురువృద్ధులను యుద్ధానికి వెళ్ళవద్దని చెప్పి సభనుండి వెడలిపోబోతాడు. రంగం రక్తి కడుతుంది. సమయం చూచి శ్రీకృష్ణుడు చిచ్చు రగిలిస్తాడు కర్ణుడు సేవకుడు, సూతపుత్రుడు కావటంచేత రాజును సమర్థించటమే ఆయన సహజధర్మం. భీష్ముడు అటువంటివారు కారు. స్వయంశక్తి సంపన్నులు. కర్ణునిబలంమీద రారాజుకు ప్రబల విశ్వాసం. కురుక్షేత్రసంగ్రామం కర్ణుని తలమీదుగా సాగాలన్నది ఆయన కోరిక. కర్ణుడు చచ్చేంతవరకూ యుద్ధానికి వెళ్ళవద్దని వృద్ధులకు సలహా యిచ్చాడు శ్రీకృష్ణుడు. దూరంగా ఉండటంకంటే అసలు యుద్ధానికే దూరంగా ఉండటం మంచిదంటాడు. ఇది భేదోపాయానికి చక్కని బీజం. కృష్ణుడు సంధిలోనుంచే సమరాన్ని సృష్టించాడు. తృతీయాంకంలో నాటకం రక్తి కట్టాలంటే ప్రతి పాత్రా ప్రధాన పాత్ర నిర్వహించాలి. వాక్కలహాన్ని నాటకీయం చేయటంలో తిరుపతి వేంకటకవుల ప్రయోగవిజ్ఞానం అప్రతిమానం. 'కదనము సేయ వచ్చిరని కంది', 'విలయాంభోదరాంబుధారావిసరమువలె', 'ఐదూళ్ళిచ్చిన చాలు', 'రాధేయుండును నేను', 'భరతకులంబు పేరు నిలుపంగదరా', 'కలనీ నీరక్షీరములభాతి', 'పరులం దూఱఁగనేల', 'అర్ధవసప్తకం బొకటియై', 'ఎన్నడు జన్మించితిమో', 'పాండవ పక్షపాతము భవన్మతమున్ ఘటిలించెఁ గాక' 'చచ్చెదమో! రిపువీరుల ద్రచ్చెదమో', 'కోపజ్వాల రగుల్చ బోకుము దయాకూపార', 'అనికిందోడుగు మంచుఁ గోర దగదే యాచార్యుడు?' మొదలైన పద్యాలు ఈ ప్రధానరంగాన్ని అలంకరించే మణిదీపాలు.

## 17-20

చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైచి రందఱుం
దొల్లి, గతించె, నేఁడు నను దూతగఁ బంపిరి సంధి సేయ, నీ
పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపఁగఁ బొందుఁ జేసెదో?
యెల్లి రణంబుఁ గూర్చెదవొ? యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!
అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాఁడు సాగరము లన్నియు నేకము గాకపోవు, క
ర్ణులు పదివేవు రైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకులఁ గావు మెల్లరన్.

జెండాపైఁ గపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబుం గొని తోలు స్యందనముమీఁద న్నారి సారింపుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గుణుఁడు మూఁకం జెండుచున్నప్పు డొ
క్కండు న్నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ! సంధింపఁగన్.
సంతోషంబున సంధి సేయుదురె? వస్త్రం బూడ్చుచో ద్రౌపదీ
కాంతం జూచిననాఁడు చేసిన ప్రతిజ్ఞల్ దీర్ప భీముండు నీ
పొంత న్నీసహజన్ముఱొమ్ము రుధిరమ్మున్ ద్రావునాడైన ని
శ్చింతం దద్గదయుం ద్వదూరుయుగమున్ ఛేదించునాఁడేనియున్.

అభిజ్ఞాన శాకుంతలంలో శ్లోకచతుష్టయంలాగా పాండవోద్యోగంలో ఈ పద్యచతుష్టయం ప్రశస్తి గాంచింది. తెలుగుదేశంలో పశులకాపరులనుండి పండితప్రకాండులవరకూ ఈ పద్యాలను మక్కువతో చదువుతుంటారు. సారవంతమైన భావాలను సరళశైలిలో చెప్పే తిరుపతి వేంకటకవుల సామర్థ్యానికి శిఖరప్రాయాలీపద్యాలు. ఈ పద్యాలు ప్రజారంజకంగా చదివిన శ్రీకృష్ణపాత్రధారియే తెలుగు వారికి గౌరవపాత్రుడు. ఈ పద్యగానంలో ఒక్కొక్క శ్రీకృష్ణపాత్రధారి ఒకొక్కబాణీ ప్రవేశపెట్టాడు. నచ్చిన బాణీకి ప్రజావాణి పట్టాభిషేకం చేసింది, మెచ్చిన శ్రీకృష్ణపాత్రధారులకు బంగారు కిరీటాలను బహుమతులుగా నిచ్చింది.

'బావా! నీ కౌల్యకూటము క్రమముగా రణకూట మగుచున్నది. పదుగురుండగనే నా చెప్పఁబోవు పల్కులు గూడ నాలింపుము' అని మొదలుపెట్టే శ్రీకృష్ణుని నాల్గు పద్యాల్లో చతుర్విధోపాయ చాతుర్యం చెంగలిస్తుంది. 'చెల్లియొ చెల్లకో' అన్న జాతీయ ప్రయోగం పద్యంలోని ఎత్తుగడకు ప్రాణం పోస్తూనే చిత్రవిచిత్రమైన అర్థాలను సమర్పిస్తుంది. చెల్లి కౌరవులు ఎగ్గు చేశారు, చెల్లక పాండవు లనుభవించారని ఒక అర్థం. కౌరవుల కార్యాలు ధర్మదృష్టికి చెల్లునో చెల్లవో అది విజ్ఞులు విచారించవలసిన విషయమని హెచ్చరిక మరో అర్థం. చెల్లుట అంటే సమర్థులగుట అని మరో అర్థం. పాండవు లీయెగ్గులు సమర్థులై సైచినారో అసమర్థులై సైచినారో గమనింపుడని మరో అర్థం. ఈ చర్చచేస్తే కౌరవుల దుర్ణయం లోకానికి తెల్లమౌతుంది. సరే, అదంతా గతించిన విషయం. గతజలసేతుబంధనం. ఎందుకంటారా- ఇదుగో, నన్ను పంపారు సంధికై దూతగా. సంధి చేస్తే గతమంతా క్షంతవ్య మౌతుంది. ఇందులో సామం ఉంది. సంధి సందేశంలో ధర్మజుని అభిమతం వ్యక్తమైంది. ఆయన యుద్ధం వల్ల కలిగే బంధునాశనాన్ని

వారించ మంటున్నారు. దానివల్ల లాభం పిల్లలు, పాపలు, ప్రజలు శాంతిగా బ్రతకటం. ఈ లాభాన్ని చూపించి దానోపాయాన్ని ప్రయోగించాడు. సంధియా? సమరమా? తేల్చి చెప్పమని సుయోధనుణ్ణి సూటిగా ప్రశ్నించాడు కృష్ణుడు. సమస్యను వివరించటం, సామంగా సదుపాయాన్ని సూచించటం, సంధి లాభాలను సర్వజన సమ్మతంగా వెలయించటం, పరిష్కారాన్ని సూటిగా ప్రశ్నించటం ఈ పద్య చరణాల్లో వరుసగా ప్రదర్శించిన వాక్యార్థ విన్యాసం!

సుయోధనుడు సంధిని తిరస్కరించటానికి సంధి సందేశం పంపిన ధర్మజుని సామర్థ్యాన్ని శంకించటం బలమైన కారణం కావచ్చు పరాక్రమవంతులు పగవారి వద్దకు రాయబారిని పంపరని సుయోధనుని ఆధిక్షేపం దానికి సమాధానంగా అజాత శత్రుడు అలిగితే కలిగే అనర్థాన్ని పద్యార్థంలో విస్తరించి చెప్పారు శ్రీకృష్ణుడు. సాదు రేగితే తంపోలాన గాని నిలవ దన్నాడు. దుర్యోధనుని దురహంకారానికి కర్ణుని ప్రగల్భం అండగా నిలిచింది. కర్ణులు పదివేవురైనను కదనరంగంలో కన్నుమూస్తారు జాగ్రత్త! అని హెచ్చరించాడు. కర్ణ పరాక్రమాన్ని కించ పరచటం లోగుట్టు తెలిసినవారికి లోతు లందని భేదోపాయం. లోకులు విపన్ను లనటంలో రారాజు స్వార్థానికి అమాయక ప్రజ ఎంత మారణహోమం కాబో తున్నదో ఎత్తిచూపటం. 'నా పలుకులు విశ్వసింపు' మనటంలో కురుపాండవ పక్షాలలో తన కున్న గౌరవాన్ని తన పరమాత్మ తత్త్వాన్ని వ్యంగ్యం చేసిన ట్లయింది. దూర్తునికి భయంపెట్టి భక్తిని నేర్పే ప్రబోధ శిల్పం ఈ పద్యంలోని ప్రతి మాటలో ప్రతిధ్వనిస్తోంది. మొదటి పద్యం ఎంత మెత్తగా ఉందో రెండవ పద్యం అంత గట్టిగా ఉంది.

యుద్ధం జరిగితే ఏమౌతుంది? తరువాతి ప్రశ్న. 'జెండాపై కపిరాజు' అనటంతోనే రణరంగం కన్నుల ముందు ఉదయిస్తుంది. పార్థసారథి ఫల్గుణ పరాక్రమాన్ని ప్రకటిస్తున్నా డీ పద్యంలో. శ్రీకృష్ణుడు ప్రళయకాల మేఘం. ఫల్గుణుడు పరులపాలిట పిడుగుల వర్షం. ఫల్గుణ శబ్ద ప్రయోగంతో ఈ రూపం చూపకుండానే మనోనేత్రానికి గోచరిస్తుంది. ఈ పద్యంలో ఫల్గుణ సాక్షాత్కా రాన్ని అంచెలంచెలుగా ప్రదర్శించటం వర్ణన కౌశలం. దుర్యోధనుడు రేపు యుద్ధంలో అర్జును డాహవరంగానికి వస్తుంటే మొదట దూరంగా చూసేది జెండా, ఆపైన కపిధ్వజం, ఆ తరువాత తెల్లని గుర్రాల పరుగు, ఆవెనుక నొగలుపై కూర్చున్న శౌరి రూపం, ఆయన దండాన్ని గొని స్యందనాన్ని

తోలటం, ఆమీద గాండీవస్ఫూర్తి, దానిని సాటించే ఫల్గుణమూర్తి. ఈ క్రమ విన్యాసం పగర గుండెలలో సింహస్వప్నంగా భాసిస్తుంది. చక్రిని ముందుంచు కొన్న కిరీటి శత్రువుల మూకలను చెండాడుతాడు. మూక శబ్దంలో కౌరవుల అశిక్షితత్వం ధ్వని. తనవారు ధరణిపై కూలుతుంటే దుర్యోధనునికి మిగిలేది మోహం. ఈ చిత్రం ప్రధానంగా కర్ణు నుద్దేశించి కూడా రూపొందించబడింది; కర్ణుని చావు ఫల్గుణుని చేతుల్లో ఉంది. అతడు నేలకొరిగితే రారాజుకు మిగిలేది రోదనమేనని ధ్వని. నీ కర్ణుణ్ణి కాపాడుకొనేందుకైనా కదనయత్నం మాను మని సుయోధనున కిచ్చిన వ్యంగ్య సూచన!

కర్ణుడు కూలిన మరునాడు కురునాథునిగతి యేమిటి? భీముడు దుశ్శాసన దుర్యోధనులను చంపుతానని భీకరంగా కురుసభలో ప్రతిజ్ఞ చేశాడు. దానిని పాటించి తీరుతాడు. దానితో కౌరవవధ కరుణాంత మౌతుంది. ఈ విషాదాంతం చూడక మునుపే "సంతోషంబున సంధి సేయుదురె?" అని సాభిప్రాయంగా ప్రశ్నించాడు శ్రీకృష్ణుడు. ద్రౌపది కొనర్చిన అవమానం దుర్భరమైంది. 'అత్యు త్కటైః పుణ్యపాపైః ఫలేవ ఇహముచ్యతే' అన్న న్యాయాన్నిబట్టి పాప ఫలాన్ని ఇహంలో అనుభవింపక తీరదు. పై రెండు పద్యాల్లో మూడు భయాలను క్రమంగా చెప్పారు. ఒకటి యుద్ధభయం, రెండు పాపభయం, మూడు ప్రాణ భయం. ఈ మూడింటినీ ముందుగానే చెప్పినా తెలుసుకోలేని మూఢుడు సుయో ధనుడని దాటి చెప్పాడు కృష్ణుడు. మూడవ, నాల్గవ పద్యాల్లో కోదండ బాహు దండ ప్రయోగ విశేషాలు వర్ణించాడు. ఒకదాంట్లో వీరం, వేరొకదాంట్లో రౌద్రం ప్రదర్శించాడు. ఒకదానివలన మొక్కకు మోసమన్నారు. వేరొకదాని వల్ల మూలానికే మోసమన్నాడు. ఒక పద్యంలోని వాడిదనం రెండవదానిలో వేడిదనంగా మారింది.

పద్యంలో అర్థవిశేష మలా ఉంటితే వాటి యెత్తుగడలు, గతిలో వాటి సత్తువలు, ప్రాసల్లో అనుప్రాసల్లో వాటి విన్యాసాలూ, సంబుద్ధుల్లో ఉన్న వక్ర తలూ, వాక్య వక్రతలో భాసించే అధిక్షేపాలూ శ్రీకృష్ణపాత్రాభినయానికి చేరవను కలిగించే నాట్యసూత్రాలు. మూడు పద్యాల్లో వరుసగా సుయోధనుడు కౌరవేశ్వరుడుగా, రాజరాజుగా, కురుక్ష్మానాథుడుగా పిలువబడి నాల్గవ పద్యంలో నామరూపాల్లేకుండా మిగిలి పోతాడు రారాజపతనాన్ని రమణీయంగా చిత్రించిన పద్యరాజా లీపద్యాలు!

పలికింది నాలుగు పద్యాలైనా భారతాన్నంతా ధ్వనింపజేశాడు పరమా త్ముడు. విశ్వరూపాన్ని చూపించే ఈ అంకం తి.వేం. కవుల నాటక రచనకే విశ్వరూపం. భారత నాటకాల్లో పిటికున్న ప్రశస్తి 'నభూతో నభవిష్యతి.'

## 21

మన మాపార్థులవంకకుం జనదు కర్మం బెట్టిదో! సారె చె
ప్పిన లాభం బిఁక లేదు, కీర్తికయి పృథ్వీనాయకుల్ పోరి చ
చ్చినఁ జాని, మ్మిది భారతావనికి సుశ్రీ దెచ్చి దృష్టాంతమై
చనుఁగా కెల్లెడ మేటి సత్కవుల వాదాశుద్ధికిన్ మూలమై.

కర్ణుడు శ్రీకృష్ణునితో మనసు విప్పి చెప్పుకొనిన మాటలివి. కర్ణుడు లేనిది భారతం లేదు. అతడు అపూర్వ విషాదాంత నాయకుడు. అతని జన్మం విచిత్రం, అది ఒక దేవ రహస్యం. ఆ రహస్యం బహిఃప్రాణమైన దుర్యోధనునికి తెలియదు. పగవారైన పాండవులకు తెలియదు కుంతికి తెలుసు. శ్రీకృష్ణునికి తెలుసు. లోకానికి వారు చెప్పలేదు; కర్ణునికి తెలియదు. కాని, పఠితలమైన మన కందరికీ తెలుసు. తెలిసి చేయగలిగింది సానుభూతి ప్రకటించటమే.

కుమారాస్త్ర విద్యాప్రదర్శనంలో కర్ణుడు-కులప్రసక్తి వచ్చినప్పు డాతడు క్రుంగిపోతాడు. రారాజాతని నాదుకొని అంగరాజును చేస్తాడు. సుయోధనుణ్ణి సింహాసనం మీద నిలుపుతానని కర్ణుడు శపథం చేస్తాడు. అప్పటినుండి సేవా ధర్మం మొదలౌతుంది కిరీటిని మించేది కీర్తికోసం కర్ణుడు బతికాడు. పడరాని పాట్లకు, శాపాలకు గురి అయ్యాడు. వాటిని బయటకు చెప్పుకోలేదు. వాంఛను వీడలేదు. దానవీరుడై కవచకుండలాలను వదలుకున్నాడు. శక్తిని నమ్ముకొని శౌరి చేత వచింతుడైనాడు. లోకానికంతా వెలుగునిచ్చే సూర్యుని సుతుడైనా అతని బ్రతుకులో సగభాగం చీకటిలో చిక్కిపోయింది. గర్భంలో బడబాగ్నిని నిలుపుకున్న పారావారం కర్ణుడు; విషాదవీరుడు!

మహాభారతకథకు కర్ణుడు కన్నుమూయందే ముగింపులేదు: అతడుండగా రారాజుకు చావులేదు; ధర్మరాజుకు విజయం లేదు; కథకు ప్రగతి లేదు; ఒక వేళ అతనికంటే దుర్యోధనుడే ముందు చచ్చిపోతే అతడు బ్రతికి ఫలం లేదు, ధర్మరాజుకు రాజ్యలబ్ధి లేదు, ఇన్ని లేములకు కలిమి కలిగించినవాడు కర్ణుడు. అందువల్ల భారతంలో అతడు కీలకం.

కర్ణునికి కథ యెలా ముగుస్తుందో తెలుసు. ధర్మజుడు రాజు కావాలని అతని తలంపు. కౌంతేయుడని తెలిసినా సేవాధర్మం కౌరవపక్షాన్నే ఆశ్రయింప జేసింది. పాండవులు అయిదుగురే. వారిలో అర్జునుడు పోతే కర్ణుడు. కర్ణుడు పోతే అతనికి కీర్తి, పాండవులకు రాజ్యప్రాప్తి. పరమాత్ముని యెదుట మనసు విప్పి చెప్పాడు. పునర్దర్శనం రణరంగంలో, లేకపోతే వీరస్వర్గంలో అనిచెప్పి

నిష్క్రమిస్తాడు. తల్లిచేసిన తప్పు కొడుకు తల వాలిందాకా తరిమి కొట్టింది. అతని విషాదవీరగాథ కవివాక్కుకు కమనీయ కరుణగాథ!

## 22

చతురంబో ధివరీతమైన ధరణి న్నాసింతు వీ వంచు న
మ్మితి నీరీతిగ దిక్కుమాలి రణభూమిం గూలితే? కేశవ
ప్రతిరూపం బగు నీ పరాక్రమము వ్యర్థం బాయనే? పోర నా
కుతుకం బంతయు వీటి బుచ్చితివిగా? కుట్టా! జగన్మోహనా!

పాండవ విజయంలో వీర మెంత పొంగులు వారుతుందో శోక మంత స్రోతస్వినిలా సాగుతుంది. భీష్మద్రోణాదులు కూలటం ఒకవైపు; ఘటోత్కచాభిమన్యులు కూలటం మరొకవైపు. పాండవపుత్రుల్లో పరాక్రమవంతు లీయిరువురూ. వారిద్దరూ బ్రతికి ఉంటే వారిని నసుయించటానికి వారిజాక్షుడు మరో అవతారం ఎత్తవలసివచ్చేది. అందువల్ల శ్రీకృష్ణుడు సందట్లో సమారాధన కావించాడు. ఘటోత్కచుడు మాయాబలకోవిదుడు. కర్ణుని శక్తిని హరించి ఆ ఘటికుడు కన్నుమూశాడు! అభిమన్యుడు అభినవ కేశవుడు. అపర కిరీటి. తండ్రులపరువు కాపాడటానికి తమ్మిపూవువ్యూహంలో తలదూర్చాడు. పెదతండ్రులు కోరటమే బ్రతుకు కొక్క పెద్దపండుగ అనుకున్నాడు. అతని అదృష్టానికి సైంధవు దడ్డపడ్డాడు. పలువురు కురువీరు లధర్మయుద్ధానికి తలపడ్డారు. సింహంలా వీరవిహారం చేశాడు. వీరుడుగా కన్నుమూశాడు.

తెలుగువారు తమ పౌరుషాన్ని అభిమన్యునిలో చూచుకుంటారు. ఆ తర్వాత బాలచంద్రునిలో పాడుకుంటారు. పుత్రశోకం ధర్మజునిలో నిబ్బరంగా నిండుకొంటుంది. పార్థునిలో కట్టలుతెంచుకొని ప్రవహిస్తుంది. కరుణారసకాసారం అభిమన్యుని వధఘట్టం!

## 23

ఆఱునెలోఁతు నీడికొల నక్కట! పూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి ఱేకులు తొంబదితొమ్మి; దిప్పు డా
నీరజమందుఁ దా మిగులఁనే యొకఱే: కటు లుండెబో, యలం
కారము లౌనె యాకొలనుగాని సరోజముగాని భూమికిన్?

పాండవ విజయ సప్తమాంకంలో భావికథార్థ సూచకమైన చూళిక యిది. కురువంశ మొక లోతు తెలియని కొలను. అందులో పూచిం దొక శతపత్ర కమలం. విధిప్రేరణవేత ఆ పద్మంలో తొంబదితొమ్మిది రేకులు రాలిపోయాయి. ఇక మిగిలిం దొకటే ఒక రేకు. అది కూడా నిలుస్తుందా? నిలిచినా ఆ పూవు కది అందమా? ఆ కొలను నేల కందమా? అని పద్యభావం. తమ్ముల నందరినీ కోల్పోయి ద్వైపాయనహ్రదంలో దాక్కొన్న దుర్యోధనుని భావిజీవితపరిణామాన్ని ధ్వనించే పద్య మిది. వ్యంగ్యాన్ని వాచ్యంచేయటం కావ్యపరిమళాన్ని కలుషితం చేయటం.

## 24

చచ్చిరి సోదరుల్, సుతులు చచ్చిరి, చచ్చిరి రాజులెల్ల, రీ
కచ్చకు మూలకంద మగు కర్ణుఁడు మామయుఁ జచ్చె; రీగతిం
బచ్చని కొంప మాపితివి బాపురె! కౌరవనాథ! నీ సగం
బిచ్చెద జీవితేచ్ఛ గలదేని బయల్పడుమయ్య గ్రక్కునన్.

శ్మశానంగా మారిన సమర రంగాన్ని ధర్మజుడు ధ్వనింపజేశాడు పచ్చని కుటుంబానికి చిచ్చుపెట్టినవారందరూ చచ్చినట్లు సూచించాడు. చిటారుకొమ్మన చివురులాగా రారాజు మిగిలి ఉన్నాడు. దాన్ని బ్రతికిస్తానంటున్నాడు ధర్మరాజు. బ్రతకదలిస్తే గంగలో నుండి బైటపడ మన్నాడు సుయోధనుణ్ణి. దాక్కోటమే రాజుకు దరిద్రమైన చావు. దేహి అనటం మరీ దీనమైన చావు. ఈ రెండుచావులు చచ్చినదానికంటె వీరోచితమైన చావు మేలు. దుర్యోధనుని అభిమానం అప్పటికి చావలేదు. భీమునితో యుద్ధం చేసి కొనమెరుపు మెరసి ఆరిపోయాడు. ధర్మానికి తొడలు విరుగగొట్టాలని చూచిన ధీరుడు తానే తొడలు విరిగి పడిపోయాడు.

'చచ్చుట' అనే క్రియ తెలుగువారు తరచుగా నానార్థాల్లో వాడతారు. ముమ్మాటికీ చచ్చిరని మూడుసార్లు ఆ క్రియను వాడిన ఈ పద్యం తెలుగువారికి బాగా నచ్చింది!

## 25

గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గ
ర్ణాట సీతారాము సాటిఁ జేసి
తోడికలార్థులౌ దూర్వహ్న తెల్విఁ కీ
ర్తిఁ వహించి కలహమ్ముఁ సలుపుచుండ్రు

ఎవ్వఁ డెన్నఁడు బాల మెలమి విప్పఁకయె
వ్యాకరణ పాండిత్య ప్రకర్ష మూనె
నొరుఁడు నచ్చని నాదు గరువంబు సడలింప
జాలె నెవ్వని మనీషాబలంబు
ఎవఁడు నాకెక్కు డయ్యు నాయెడఁ గార
బాంతరమ్మున గురుభావ మంతరంగ
మునకె కాక వెలికిఁగూడ గనఁగఁ జేసె,
నట్టి తిరుపతి కవి దివి కరిగె నకట!

తిరుపతి శాస్త్రిగారు దివంగతులైనప్పుడు 'దివాకరాస్తమయ' మనే పేర వేంకటశాస్త్రిగారు స్మృతి కవితను వెలయించారు. మిత్రవియోగశోకాని కది అమరోదాహరణం. వేంకటశాస్త్రిగారికంటె వయస్సులో తిరుపతిశాస్త్రిగారు చిన్న అయినా పాండిత్యంలో మిన్న. అవధానాల్లో తిరుపతికవి శాస్త్రవ్యుత్పత్తినీ, వేంకటశాస్త్రిగారు సమయస్ఫూర్తినీ ప్రదర్శించి విజయాలు సాధించేవారు. జంట కవుల అవధాన కవితా విహంగానికి ఒక రెక్క విరిగిపోయింది.

తిరుపతి శాస్త్రిగారికి వేంకటశాస్త్రి పట్ల ఎంత స్నేహమో అంత భక్తి! నరసరావుపేట శతావధానంలో తిరుపతిశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారిని గురుమూర్తిగా కీర్తించారు

వితతాత్మీయ శతావధాన కవితా విద్యాపయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృతరసప్రీతాఖిలాంధ్రక్షమా
భృత రజ్యద్రసికావతంసకృతసంవందిస్తోత్రమాలావిభూ
షితు మా వేంకటశాస్త్రి నేఁ గొలిచెదన్ శిష్యస్వరూపమ్మునన్.

ఈ పద్యం వెనుక నున్న పరమార్థాన్ని వేంకటశాస్త్రిగారు దివాకరాస్తమయంలో ఇలా చెప్పారు. "బుద్ధికి రెండుశక్తులు కలవు, అందొకటి గ్రహణశక్తి, రెండవది ధారణాశక్తి. గ్రహణశక్తిలోఁ దిరుపతికి వేంకటేశ్వరుఁ డించుకలొచ్చు, కావుననే గురువుగారు శాస్త్రాధ్యయనకాలంలోఁ దిరుపతిశాస్త్రి నెక్కుడు మెచ్చుకొనినారు. ధారణశక్తిలోనో - వేంకటేశ్వరునికి తిరుపతిశాస్త్రి ఇంచుక లొచ్చు. వీరిరువురకుఁ బ్రధాన విద్య యగు శతావధానమున కీధారణయే ముఖ్య మగుటచే వేంకటశాస్త్రి నతఁడు కొనియాడవలసి వచ్చె ననునది యిందలి రహస్యము.'

## 26

కవనార్థం బుదయించితిన్ సుకవితాకార్యంబె నావృత్తి యా
కవ మర్దాన దరింతుఁ దద్భవము నా భాగ్యంబు సర్వంబు, మృ
త్యువుచే దాన జయించితిన్ రుజ జయింతున్ దానిచే నట్టి నా
కవనంబున్ గురుఁ జేసి లెక్క సుపదే కా దాడ వా దాడెదన్.

తి.వేం. కవుల వివాద సాహిత్యం తెలుగునాట దుమారాన్ని రేపింది. వీరిని విమర్శించిన వారిని వీరు ప్రతి విమర్శించారు. వేంకట రామకృష్ణకవులతో సాగిన వివాదం 'గీరతం'గా అవతరించింది. కొప్పరపు కవులతోడి వాదం 'గుంటూరుసీమ'గా వెలువడింది. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారితోనైన వాదం 'జయంతి'గా రూపొందింది. వివాదంలో వీరావేశం, అధిక్షేపం వినటానికి చెవులకు విందు చేస్తాయి. మచ్చుకు రెండుపద్యాలు:

చుక్కలు రాల లేదు రవిసోములపోకడ మారలేదు న
ల్దిక్కులు గూలలేదు జలధిజ్వలనం బుబుకంగ లేదు వే
దక్కట రామకృష్ణకవు లర్భకు లేగతి చేయనేర్తు రా
ధిక్కృతవైరి వేంకట సుధీకవిశాలికి శృంగభంగమున్!
గారెల పిండివంటకయి కాంతుఁడు కాంతను బ్రచ్చ చేయ నా
సారసనేత్ర త్రేలొకటి చయ్యనఁజూపి యిదొక్క టున్న దా
ధార మటన్న సామెతగ ధార యొకించుక గల్గు మాత్రనే
వీ రవధానపుంగృతికి వీరిదులై ప్రయతింతు రక్కటా? - గీరతము.

వివాదాలను పురస్కరించుకొని అన్యాపదేశకావ్యాలు వ్రాశారు తి. వేం. కవులు. ఈ అధిక్షేప సాహిత్య ఘట్టం కవులజీవిత భారతంలో యుద్ధపంచకం లాంటిది. వాదుల్లో విజయాలను సాధించి 'కింకవీంద్రఘటాపంచాననులై' వాసి కెక్కారు. కవిత్వ పాండిత్య మానవీరాలకు ప్రమాణాలు తి.వేం. కవుల వివాద పద్య కావ్యాలు.

## 27

నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాసం బొనరించు నట్టిపని నాచేఁ గాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఱిగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె? యంబా! దేవి! కామేశ్వరీ!

తి వేం. కవుల్లో వేంకటశాస్త్రిగారి పద్య మిది. వారు దేవ్యుపాసకులు. వారికి దేవి ఇలవేల్పు. ఆమెకు సరి యొసర్పనిది వారి సరస్వతి ముందడుగు వేసేదికాదు. వారు దేవీకటాక్ష లబ్ధకవితా ప్రభావులు. వార్ధక్యంలో రాజదర్శనాలు మానేశారు. క్షీరసాగర గృహంలో భగవదుపాసనం చేస్తూ కవితా వ్యాసంగాన్ని నడిపారు. తిరుపతి శాస్త్రిగారు పోలవరం జమీందారు నాశ్రయించి ఉన్నారు గాని, వేంకటశాస్త్రిగారు రాజాంసంది సన్మానాలు కోరారు గాని, ఆశ్రయాన్ని మాత్రం అర్థించ లేదు. అది ఆయన స్వతంత్ర ప్రవృత్తికి సంకేతం.

## 28

ఏ దినమునందుఁ గవిత యొకింత లేని
నే లిఖింపనొ? వ్రాకుత్తు నిజము నాదు
నాదినము దుర్దినంబు సమ్మోద మిడదు
కవు లెఱుంగుదు నా వార్ధకమ్ము విధము.

వేంకట శాస్త్రిగారి శరీరానికి వార్ధక్యం వచ్చింది కాని కవితకు గాదు. కన్ను మూసేంతవరకూ కవితాగానాన్ని చేస్తూనే ఉన్నారు సన్మానాలు పొందుతునే ఉన్నారు. సాహితీజగత్తును మకుటంలేని మహారాజులా పాలిస్తూనే ఉన్నారు. మహా కవులైన శిష్యుల్ని సాహితీ కుటుంబ సభ్యులుగా లాలిస్తూనే ఉన్నారు. ఆయన నాటిన మొక్కలు ఒక యుగాన్ని పూచి ఫలించాయి.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 1950లో - వికృతినామ సంవత్సరంలో - శివరాత్రి పుణ్యదివసాన శివపంచాక్షరి జపిస్తూ శివసాయుజ్యాన్ని పొందారు. తెలుగుజాతి కన్నులు చెమ్మగిల్లాయి. ఆయన స్వర్గానికి పోయినా తి.వేం. కవుల సాహితీవైభవం తెలుగువారికి వెలలేని నిధిగా నిలిచిపోయింది. నేటికీ పాండవోద్యోగం బ్రతికే ఉంది అవధాన కవితలు. ఆశుకవితలు అమరంగా నిలిచే ఉన్నాయి. కావ్యాలు రసికులచేత గానం చేయబడుతూనే ఉన్నాయి తెలుగు పద్యంలో తేటదనం తిరుపతి వేంకట కవుల పేరితో చిరస్థాయిగా నిలిచిపోయింది.

జంట కవులు స్వర్గంలో కూడా శతావధాన సభలు జరుపుతుంటారని ఆంధ్రుల విశ్వాసం. అందుకు పింగళి లక్ష్మీకాంతంగారి ప్రశస్తి ప్రమాణం:

'ఆంధ్ర కవితా జగద్గురు దమరపురికిఁ
దరలిపోయెను శిష్యసంతతుల విడచి
సహజ గీర్వాణ వాణీ ప్రసక్తులైన
దేవతలు చెప్పఁగల రింక తెలుఁగుకవిత!'

'మఱల తిరుపతి వేంకటేశ్వరులజంట
కలిసె ముప్పదియేండ్ల పైకాలమునకు
సాగఁగల దింక దిక్పాలసభలయందు
అద్భుతావహ శతవధానాంధ్రకవిత!'



# కొన్ని ముఖ్యమైన సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 6 | 4 | ఆది | అది |
| 11 | 13 | మహిమా | మహిమ |
| 17 | 24 | మృదులిలిత | మృదులలిత |
| | 26 | పద్యషూ | పద్యమూ |
| 19 | 23 | పులకిరించినవి | పులకించినవి |
| 23 | 12 | జాల్పడు | పొల్పడు |
| 24 | 16 | వ్యంగము | వ్యంగ్యము |
| 26 | 4 | తనను | తనచే |
| | 7 | ఉ॥ | చ॥ |
| 27 | 16 | సామన్య | సామాన్య |
| 28 | 5 | శృంగార | శృంగారము |
| | 12 | శూద్రకుదు | శూద్రకుడు |
| 29 | 18 | ప్రయోజనవంతముగా | ప్రయోజనకరముగా |
| 32 | 8 | చింత్రించుచున్న | చిత్రించుచున్న |
| 44 | 8 | విశ్వనాధుని | జగన్నాథ పండితుని |
| 47 | 2 | శాశించు | శాసించు |
| 50 | 2 | తెచ్చించి | వెచ్చించి |
| | 13 | అట్టిడి | అట్టిది |
| 52 | 18 | మని | మవి |
| 54 | 20 | రాజవిలాపకర్త | రాజగోపాలవిలాసకర్త |
| 55 | 17 | మేఖ | మేఘ |
| 58 | 1 | రాగాముసు | రాగముసు |
| | 8 | చమత్కృలు' | చమత్కృతులు |
| | 24 | పరేణ్యా· : . . . | పరేణ్య |

| | | | |
|---|---|---|---|
| 64 | 17 | సంబుధ్యంత | సంబుద్ధ్యంత |
| 72 | 23 | గాయకుండు ముగ్గలోక్క | గాయకుండును ముగ్గురొాక్క |
| | 25 | దుర్భరసుగు | దుర్భరమగు |
| 79 | 3 | బ్రిన్సిపాలు | ప్రిన్సిపాలు |
| | 16 | పూర్తిం దవిలించుట | పూర్తిచేయుట |
| 84 | 5 | కారకారపత్రి | కాకరపత్రి |
| 87 | 15 | దోసమటంబెరిగియును | దోసమటంచెరిగియుచు |
| 87 | 25 | శ్రీమచుబయ | శ్రీమదుభయ |
| 89 | 7 | దెల్లు | దెగ్లు |
| 91 | 20 | సంస్కృతీ | సంస్కృతి |
| 94 | 9 | సంగ్రహణమైనది | సంగ్రహమైనది |
| 94 | 20 | శివరాత్రుపవాసము | శివరాత్ర్యుపవాసము |
| | 13 | మునఁదారకుఁ | మున దారకు |
| 108 | 26 | కమండలము | కమండలువు |
| 114 | 2 | సాధకబాధములను | సాధకబాధకములను |
| 116 | 18 | అదహ | అందు |
| 121 | 13 | సర్వముము | సర్వమును |
| 123 | 15 | తనకున్ | తమకున్ |
| 126 | 3 | సాప్రార్థనం | నా ప్రార్థనం |
| 127 | 14 | స్మతుల | స్తుతుల |
| 149 | 19 | నిరాటంకము | నిరాతంకము |
| 159 | 22 | ప్రయత్యము | ప్రయత్నము |
| 177 | 7 | కథా | కథ |
| 179 | 1 | దోకో | దోద |
| | 17 | సజీవముతో | సజీవముగా |
| 181 | 12 | రోద్ర | రౌద్ర |
| 185 | 15 | దుర్వాసశాపము | దుర్వాసునిశాపము |
| 188 | 14 | ఉ॥ | చ॥ |
| | 15 | నిరోధమొనర్ప | నిరోధము నొనర్ప |
| 208 | 26 | దేవతోకమనం | దేవలోకమునం |

| | | | |
|---|---|---|---|
| 240 | 19 | అనె | ఆనె |
| 267 | 23 | యుత్కఠా | యుత్కంఠా |
| 210 | 21 | సుసాంఢ | సుసాంఢ |
| 214 | 15 | సచప | సపర |
| 234 | 14 | డాహమ్ములో | డాహపమ్ములో |
| 245 | 14 | గలితుఁడయ్యె | గళితుఁడయ్యె |
| 247 | 21 | నయ్యజాలామణి | నయ్యబలామణి |
| 256 | 17 | కసకవరగాంగవాలోలు | కనవరతాంగనాజనలోలు |
| 262 | 18 | పెజిగినవి | పెరిగినవి |
| | 19 | ప్రసురింపబడినవి | ప్రచురింపబడినవి |
| 266 | 4 | ఉ॥ | చ॥ |
| 272 | 14 | ప్రాపములోని | గ్రామములోని |
| 301 | 26 | ప్రాణిగృణీత | పాణిగృహీత |
| 304 | 24 | సుఖద | సఖుద |
| 316 | 18 | బాణమ్ములు గౌరవించు | బాణమ్ములను గౌరవించు |
| 334 | 14 | బలగూడె | జలగూడె |
| 335 | 8 | మాటిఖు. | మాటలు |
| 341 | 16 | దృష్టమె | దృష్ఠమె |
| 348 | 22 | బ్రతుకుజాటి | బ్రతుకుబాటి |
| 351 | 7 | వార్ధకము | వార్ధకము |
| | 19 | రామణీయకతను | రామణీయకమును |
| 554 | 19 | ఆశియాజ్యోతి | ఆసియాజ్యోతి |
| 355 | 22 | గూడిపూడు | గూడియాడు |
| 356 | 4 | రవ్వమును | రవ్వయును |
| 357 | 16 | పీరనందకృత | పీరనందికృత |
| 360 | 8 | తెనుగించి....సంపర్భరిత | తెనిఁగించి....సంపద్భరిత |
| 363 | 9 | వివష్య | వివష |
| 369 | 8 | నెమ్మికాఁదని | నెమ్మికాదని |

| | | | |
|---|---|---|---|
| 370 | 3 | సండుల | సంచుల |
| | 5 | దొరయసు..... నిప్పుచన్నె పనినెప్పు | దొరయును..నిప్పుకన్నె పని చెప్పు |
| 371 | 7 | పితకేసరిగ | పితకేసరిగ |
| 378 | 7 | మిశ్రమం | మిశ్రం |
| | 12 | ఎందరఁ | ఎందఱఁ |
| | 20 | ఙదిగోయని | ఙదిగో నదిగోనని |
| 381 | 11 | నిగ్రహించి | విగ్రహించి |
| | 27 | ఒక | నొక |
| 392 | 3 | ఫల్గుణుఁడు | ఫల్గునుఁడు |
| | 17 | కౌల్యకూటము | కౌల్యహూటము |
| 393 | 15 | అమాయక | అమాయిక |
| | 22,24, 26,28 | ఫల్గుణ | ఫల్గున |
| 394 | 1,6 | ఫల్గుణ | ఫల్గున |
| 397 | 28 | తోడికలార్థులో | తోడికలార్థులే |
| 399 | 26 | ఇలవేల్పు | ఇలువేల్పు |
| 400 | 3 | నాడు | నాకు |

